# సుబోధ



రచయిత : త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

## శ్రీ.శ్రీ.శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు





# సుబోధ


<u>రచయిత</u>

**త్రిమత ఏకైక గురువు**

**ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, (88) దశ అష్టాధిక గ్రంథకర్త**

**ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త**

## శ్రీ.శ్రీ.శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు









<u>ప్రచురించిన వారు</u>

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd in 1978 - Regd.No.: 168/2004)




త్రైత శకము–38 ఆరవ ముద్రణ : మార్చి–2017

ప్రతులు : 1000 **వెల : 175 /-**

02 "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఇందూ సాంప్రదాయములు.
03) ఇందుత్వమును కాపాడుదాం.
04) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
05) హిందూమతములో కులవివక్ష.
06) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
07) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
08) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
09) ఏ మతములో ఎంత మతద్వేషము?
10) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
11) దైవగ్రంథములో సత్యాసత్య విచక్షణ.
12) దేవుని రాకకు ఇది సమయము కాదా!
13) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
14) దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు.
15) ప్రతిమ × విగ్రహ-దైవము × దైయ్యము.
16) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
17) హేతువాద ప్రశ్నలు-సత్యవాద జవాబులు.
18) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
19) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
20) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.
21) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
22) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
23) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
24) స్వర్గము ఇంద్రలోకమా! నరకము యమరాజ్యమా!!
25) మూడు దైవ గ్రంథములు-మూడు ప్రథమ వాక్యములు.

26) తీర్పు.
27) గుత్తా.
28) ప్రబోధ.
29) సుబోధ.
30) ఆదిత్య.
31) సమాధి.
32) తల్లి తండ్రి.
33) గీటురాయి.
34) త్రైతారాధన.
35) ధర్మచక్రము.
36) ప్రసిద్ధి బోధ.
37) కర్మ పత్రము.
38) నీకు నా లేఖ.
39) ఒక్కడే ఇద్దరు.
40) దేవుని ముద్ర.
41) భావము-భాష.
42) కథల జ్ఞానము.
43) సత్యాన్వేషి కథ.
44) సిలువ దేవుడా?
45) ఆత్మలింగార్థము.
46) ప్రాథమిక జ్ఞానము.
47) విశ్వ విద్యాలయము.
48) జీహాద్ అంటే యుద్ధమా?
49) జనన మరణ సిద్ధాంతము.
50) మతాతీత దేవుని మార్గము.
51) దేవుని చిహ్నము.
52) మతము-పథము.
53) ద్రావిడ బ్రాహ్మణ.
54) ప్రవక్తలు ఎవరు?
55) ధర్మశాస్త్రము ఏది?
56) దేవుని గుర్తు-963.
57) ఇందువు క్రైస్తవుడా?
58) నాస్తికులు-ఆస్తికులు.
59) ప్రబోధ తరంగాలు.
60) గీతా పరిచయము.
61) త్రైత సిద్ధాంతము.
62) వార్తకుడు-వర్తకుడు.
63) ధర్మము-అధర్మము.
64) తత్త్వముల జ్ఞానము.
65) మరణ రహస్యము.
66) పునర్జన్మ రహస్యము.
67) గురు ప్రార్థనామంజరి.
68) సామెతల జ్ఞానము.
69) పొడుపు కథల జ్ఞానము.
70) ఏది నిజమైన జ్ఞానము?
71) నిగూఢ తత్త్వార్థ బోధిని.
72) దేవాలయ రహస్యములు.
73) ప్రబోధానందం నాటికలు.
74) హేతువాదము-ప్రతివాదము.
75) మత మార్పిడి దైవద్రోహము.

76) నాది లోచన-నీది ఆలోచన.
77) ధ్యానము-ప్రార్థన-నమాజ్.
78) సాయిబాబా దేవుడా! కాదా?
79) లు అంటే ఏమిటి? (తెలుగు).
80) చెట్టుముందా! విత్తుముందా?
81) గీతం-గీత (పాటల జ్ఞానము).
82) మరణము తర్వాత జీవితము.
83) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.
84) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
85) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
86) ఒక మాట మూడు గ్రంథములు.
87) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
88) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
89) మానవత్వము.
90) సుప్రసిద్ధి బోధ.
91) రూపము మారిన గీత.
92) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
93) యోహాను చెప్పిన జ్ఞానము.
94) రాజకీయము×రాజకీయము.
95) ఉగ్రవాదము స్వర్గము కొరకే.
96) ఒక వ్యక్తిలో రెండు కోణములు.
97) అంతిమ దైవగ్రంథములో వజ్ర వాక్యములు.
98) మధ్యమ దైవగ్రంథములో జ్ఞాన వాక్యములు.

**భాషలో పాండిత్యమును విడిచి,**

**భావములో పాండిత్యమును చూచువాడు నిజమైన జ్ఞాని.**

*DVD'S* 

01. గుర్తింపబడనివాడు గురువు.
02. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
03. ద్వితీయుడు-అద్వితీయుడు.
04. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
05. మాయకుడు-అమాయకుడు.
06. తల్లి తండ్రి-గురువు దైవము.
07. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
08. మతములలో పవిత్రయుద్ధము.
09. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
10. దేశం మోసం-దేహం మోహం.
11. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
12. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
13. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
14. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
15. మాయ మర్మము- ఆత్మ ధర్మము.
16. బయటి సమాజం-లోపలి సమాజం.
17. దేవుని జ్ఞానము-మాయ మహత్యము.
18. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
19. సహజ మరణం- తాత్కాలిక మరణం.
20. మేఘం ఒకభూతం- రోగం ఒకభూతం.
21. కర్మ లేని కృష్ణుడు-కర్మ ఉన్న కృష్ణుడు.
22. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం).
23. శ్రీకృష్ణుడు చనిపోయాడా? చంపబడ్డాడా?
24. అంతిమ గ్రంథములో ప్రథమ వాక్యములు.
25. ఇచ్ఛాధీన కార్యములు-అనిచ్ఛాధీన కార్యములు.
26. టక్కుటమారా, ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.

27. ఆత్మ.
28. తాత.
29. తల్లి.
30. భయం.
31. ఆత్మపని.
32. బట్టతల.
33. యాదవ్.
34. జ్ఞానశక్తి.
35. సమాధి.
36. 6-3=6.
37. సంతకము.
38. ప్రభు-ప్రజ.
39. త్రైతశకము.
40. తోలేవాడు.
41. తల్లి తండ్రి.
42. నటించే ఆత్మ.
43. సంచిత కర్మ.
44. గురు చిహ్నాం.
45. ఆస్తి-దోస్తి.
46. వెలుగుబంటు.
47. ధర్మచక్రము.
48. దైవగ్రంథము.
49. భక్తి-శ్రద్ధలు.
50. పురుషోత్తమ.
51. మతద్వేషము.
52. గ్రాహిత శక్తి
53. ఆడించే ఆత్మ.
54. ఏది శాస్త్రము?
55. భగవంతుడు.
56. ఏది ధర్మము?
57. గురుపౌర్ణమి.
58. శ్రీకృష్ణాష్టమి.
59. గోరు-గురు.
60. దశ-దిశలు.
61. మాట-మందు.
52. సృష్ఠి-సృష్ఠికర్త.
63. కలియుగము.
64. సేవా శాతము.
65. ప్రకృతి-వికృతి.
66. పైత్యం-సైత్యం.
67. నైజం-సహజం.
68. భక్తి-భయము.
69. సాంప్రదాయము.
70. అదురు-బెదురు.
71. నీ వెనుక వాడు.
72. శవము-శివము.
73. శైవము-వైష్ణవము.
74. ధర్మము-అధర్మము.
75. ద్రావిడులు-ఆర్యులు.
76. కాయ-పండు-కాయ.
77. యుగము-యోగము.
78. దేవునికి మతమున్నదా?

79. కర్మ మర్మము.
80. పుట్టుట-గిట్టుట.
81. ఏకత-ఏకాగ్రత.
82. చమత్కార ఆత్మ.
83. నిదర్శ - నిరూప.
84. గురువు ఎవరు?
85. త్రైత సిద్ధాంతము.
86. స్త్రీ / పు - లింగము.
87. జీర్ణ+ఆశయము.
88. శ్రీకృష్ణుడు ఎవరు?
89. ఆట-దోబూచులాట.
90. ప్రజలు-మానవులు.
91. దంతము-అంతము.
92. మతము-పథము.
93. ఏడు ఆకాశములు.
94. అర్థము-అపార్థము.
95. మూడు గ్రంథములు.
96. గ్రంథము - బోధ.
97 ప్రభువు-ప్రభుత్వం.
98. జ్ఞానము-విజ్ఞానము.
99. వార-మాస-వత్సర.
100. భూతం-మహాభూతం.
101. సేకూవలి-కూలిసేవా.
102. ఆత్మకు వెంట్రుక గుర్తు.
103. కోడిపుంజు-పాదరసము.
104. ఇందూ మహాసముద్రము.
105. శ్రీకృష్ణజన్మ మధుర.
106. అధర్మ ఆరాధనలు.
107. పుస్తకము-గ్రంథము.
108. హరికాలు-హరచేయి.
109. పుట్టగోసి-మొలత్రాడు.
110. 1 2 3 గురుపౌర్ణమి.
111. క్షమించరాని పాపము.
112. మరణము-శరీరము.
113. దివ్యఖురాన్-హదీసు.
114. ఇందువు-హిందువు.
115. సుఖము-ఆనందము.
116. కాలజ్ఞాన వాక్యములు.
117. భౌతికము-అభౌతికము.
118. దేవుని ఆజ్ఞ-మరణము.
119. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
120. చంద్రాకారము (బట్టతల).
121. జ్ఞానము కబ్జా అయ్యింది!
122. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
123. మత సామరస్యం.
124. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.



## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి (ప్రెసిడెంట్)**
ధర్మవరం, అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968, 92900 12413, 94406 01136

**టి. సూర్యనారాయణ (సూర్య మీ సేవా)**
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9885250967

**ఇందూ ధరణి జనరల్ స్టోర్స్**
(పి. శివరామ్ ప్రసాద్)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9030057963, 9063504963

**బి. ఆదిశేషయ్య (టీచర్) (ప్రెసిడెంట్)**
గుత్తి, అనంతపురం జిల్లా
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ (ప్ర.సభ్యుడు)**
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర (ప్రెసిడెంట్)**
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**పి. నాగయ్య (ప్ర.సభ్యుడు)**
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక (Head Office)**
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం,
Cell:94910 40963, 90329 63963, 98485 90172.

**డి. గోపికృష్ణ**
హుజురాబాద్, కరీంనగర్ జిల్లా, T.S
Cell : 9989202003, 9542061601

**కె.వెంకటేశ్వర్లు (ప్ర.సభ్యుడు)**
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు (టీచర్) (ప్రెసిడెంట్)**
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్ (వైస్ ప్రెసిడెంట్)**
కుప్పం, చిత్తూరు జిల్లా. Cell : 96527 55110

**డి. బాలాజీ (వైస్ ప్రెసిడెంట్)**
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు (ప్రెసిడెంట్)**
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**టి.వి. రమణ (ప్రెసిడెంట్)**
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

**P.M.H నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా).
Cell : 9440490963

**P. రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, బస్స్టాండు రోడ్
కోయిలకుంట్ల (మం), కర్నూలు (జిల్లా)
Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు (ప్రెసిడెంట్)** MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 9440615064, 9246770277.

**అనమల మహేశ్వర్ (ప్రెసిడెంట్)**
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు (ప్రెసిడెంట్)**
ఏటుకూరు రోడ్, దర్గామాన్యం,
గుంటూరు (జిల్లా).
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి (ప్రెసిడెంట్)**
నరసరావుపేట, గుంటూరు (జిల్లా).
Cell : 9989204097, 9505904097

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం (జిల్లా).
Cell :9849883261, 8142853311, 8187084516

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా).
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్ (ప్రెసిడెంట్)**
భీమవరం వన్టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్ (ప్ర.సభ్యుడు)**
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు),
భీమిలి (మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు (టీచర్) (ప్రెసిడెంట్)**
అశోక్నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252, 9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**చెల్లారపు అప్పల నాయుడు**
చెల్లారపు వలస (గ్రా),
బొబ్బిలి (మం), విజయనగరం జిల్లా.
Cell:9494853773, 8465860706

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505989898, 9505768181

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట, మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815, 9440655409, 9701261165

**యం. మురళి** (Cell : 97057 16469)
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ, మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**జి. సాయిశంకర్ శ్రేష్ఠి** (టీచర్)
అచ్చంపేట, మహబూబ్ నగర్ (జి)
Cell : 9948947630, 9640717574

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
భువనగిరి టౌన్, నల్గొండ జిల్లా.
Cell:9948060838, 9704885964, 9848741703

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్
పటేల్ నగర్, 3వ క్రాస్ హొస్పేట,
బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 714 9696, +1(210) 527 3436

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

# విషయ సూచిక

# సృష్టి రహస్యము

జగతి లేకముందు పరమాత్మ స్త్రీ కాదు, పురుషుడు కాదు. ఏదీకాని పరమాత్మ జగతిని సృష్టించదలచుకొని, స్త్రీ తత్త్వము కల్గిన ప్రకృతిని తయారు చేశాడు. దానికుండవలసిన లక్షణములను, ఉండవలసిన పద్ధతులను అన్నిటిని నిర్ణయించాడు. ప్రకృతి స్త్రీ స్వరూపమైనది కావున దానికంటే పూర్తి విలక్షణముగా నిలిచాడు, ఆ లక్షణమే పురుషుడు. తనకు ప్రకృతి, ప్రకృతికి తాను పూర్తి వ్యతిరిక్తదిశలలో ఉండునట్లు తలచిన పరమాత్మ, ఇద్దరూ సమవుద్దీలుగా ఉన్నపుడే తాను ఆడు ఆట రసవత్తరముగా ఉండునని, తనకు సమానముగా ప్రకృతికి అధికారములిచ్చాడు. ప్రకృతి పరమాత్మకు విరుద్ధమే కానీ శత్రువుకాదు. పరమాత్మ ప్రకృతి చేతిలో విరుద్ధతను ఎదుర్కొనుట సహజమే అయినా ఒకరికొకరు శత్రువులుకారు. ఒకప్పుడు ప్రకృతిని పుట్టించిన పరమాత్మ తిరిగి ఒకప్పుడు తనయందే లీనము చేసుకొని, ప్రకృతిని లేకుండా చేయును. ప్రకృతిని పుట్టించినవాడు, పోషించువాడు, తిరిగి లేకుండా చేయువాడు పరమాత్మ. పుట్టించిన తండ్రిగా, భరించు భర్తగా, నశింపజేయు కాలుడుగా ప్రకృతికి అన్నీ తానైయుండి, ప్రకృతిలోని శక్తిగా కూడా తానై ఉన్నాడు. ఎంతో విశాలముగా నున్నవాడు కొంత విశాలమైన ప్రకృతిని తయారుచేసి, జగతి అను ఆటను ఆడుచున్నాడు. ఈ ఆటలో ఏదీకాని పరమాత్మ పురుషుని వేషధారియైపోయాడు. జగతి నాటకము ప్రకారము పరమాత్మ పురుషుడు. నాటకమునకు అతీతముగా చూస్తే స్త్రీ పురుషుడు ఏదీకానివాడు. ప్రకృతిని పంచభూతములుగా చేసి ప్రపంచము అన్నాము. ప్రపంచమును సృష్టించిన పరమాత్మ చావు, పుట్టుకలు గల జగతిని సృష్టించదలచుకొన్నాడు. పుట్టుక చావులు గల జీవరాసులను సృష్టించి ప్రపంచములో జగతిని నిర్మించాడు. **'జ'** అనగ పుట్టునది **'గతి'** అనగ చావునదని, జగతి అనగ పుట్టుక చావులు గలదని తెలియునట్లు జీవసముదాయమునకు **"జగతి"** అని పేరు పెట్టారు. ప్రకృతియను ప్రపంచమును తయారు చేసిన పరమాత్మ దానిలో జగతి అను జీవరాసులను తయారు చేశాడు. ప్రకృతి పురుషులు సమానమైన వారుకాగా, అనగా ప్రపంచము పరమాత్మ సమానమైన వారు కాగా తర్వాత ప్రత్యేకముగ పుట్టి వచ్చినది జగతి. ఇప్పటికి

పరమాత్మ, ప్రపంచమును జగతిని రెండిటినీ సృష్టించాడు. తనతో కలుపుకుంటే మూడవుతాయి. మొదట ఏదీకాని పరమాత్మ ప్రకృతిని తయారు చేసి తాను పురుషుడై ప్రకృతిని భార్యగా చేసుకొని, తాను భర్తగా ఉంటూ జగతి అను ప్రత్యేకమైన సంతానమును తయారు చేశాడు. ఈ వావివరుసలు లేకుండా చూస్తే, ఏదీకాని పరమాత్మ తననుండి మూడు భాగములను సృష్టించాడు, అవియే ప్రకృతి, పురుషుడు, జగతి. ప్రకృతి స్త్రీయని, పరమాత్మ పురుషుడని, జగతి నపుంసకుడని తలచవలెను. మధ్యలో ఉన్న నపుంసకుని ఇటు ప్రకృతి తన వైపు లాగుకొనడము, అటు పరమాత్మ తన వైపు లాగుకొనడము ముఖ్యమైన ఆట. ఆటకంటూ ఒక పద్ధతి ఉంటుంది. ఆట పద్ధతులను నిర్ణయించి ఆటను పెట్టిన పరమాత్మ తాను అన్నిటికి సృష్టికర్త, పెద్ద అయినప్పటికీ తాను నిర్ణయించిన పద్ధతుల ప్రకారము ఆట ఆడుచున్నాడు. ఈ ఆటకు మిగతా ఆటలవలె కొంత కాల నిర్ణయమున్నది. ఫుట్‌బాల్ ఆటకు ఒకటిన్నర గంట, క్రికెట్ ఆటకు యాభై ఓవర్లు అన్నట్లు, జగతి అను ఆటకు వేయియుగములు లేక 108 కోట్ల సంవత్సరములు పరిమితి ఉన్నది. తర్వాత కొంత విరామము ఆ తర్వాత ఆట సాగడము జరుగుచున్నది. ఆట సమయము 108 కోట్ల సంవత్సరములు. విరామము కూడా అంతే సమయము.

ఏదీ కానివాడు, ఫలానా అని ఎవరి చేత చెప్పబడనివాడు, మొదట ప్రపంచమును తర్వాత జగతిని తయారు చేశాడు కదా! ప్రకృతిని తయారుచేసి తాను పురుషుడనను గుర్తింపు తెచ్చుకొన్నాడు. తాను పురుషుడై, తన బీజమును భరించి గర్భము దాల్చు ప్రకృతిని ఐదు భాగములు చేశాడు. అటువంటి ప్రకృతినే పంచభూతములని, ప్రపంచమని అంటున్నాము. తన చేతనే తయారు కాబడిన జగతిని మూడు భాగములుగా విభజించాడు. జీవరూపమైన జగతిని జీవాత్మయని, ఆత్మయని, పరమాత్మయని మూడు విధములుగా చెప్పవచ్చును. జీవాత్మను, ఆత్మను తయారు చేసి తాను పరమాత్మనను గుర్తింపు తెచ్చుకొన్నాడు. ప్రకృతి ప్రక్కన పురుషుడుగా, ఆత్మల ప్రక్కన పరమాత్మగా చెప్పబడుచున్నాడు. ప్రకృతి ఉన్నపుడు ఆత్మలు ఉన్నపుడు మాత్రమే పురుషుడు, అప్పుడే పరమాత్మ అని

పిలుచుటకు ఆధారమున్నది. అవి లేకుంటే ఆయనను ఏమని చెప్పుటకు వీలుకాదు. ఏది కానివాడు ప్రపంచముతో పురుషుడని, ఆత్మలతో పరమాత్మని పిలువబడుచున్నాడని అర్థమైందనుకొంటాము. ప్రకృతి పురుషులకు పుట్టినది జీవసముదాయమైన జగతి. జగతిలో కూడా తల్లిదండ్రులైన ప్రకృతి పురుషుల లక్షణములుండునట్లు పరమాత్మ చేత అమర్చబడినది.

ప్రకృతిలో పురుషునికంటే విరుద్ధ లక్షణములున్నట్లు అమరిక గలదు. జగతిలో మాత్రము ప్రకృతి పురుషుల రెండిటి లక్షణములు మిళితమై ఉన్నవి. జీవరూపమైన జగత్తులో ఒకటి పరమాత్మ సంబంధిత జీవాత్మ ఆత్మలు, మరియు రెండు ప్రకృతి సంబంధిత శరీరములు గుణములు గలవు. అంతేకాక దేవుడున్నాడను నమ్మకము ఆత్మ పరముగ, లేడను దేవునికి వ్యతిరేఖత ప్రకృతి పరముగ రెండు గలవు. జగతిగా ఉన్న మానవులలో ప్రకృతి పురుషుల లక్షణములుండి ప్రకృతి పురుషులిలా కలరని తెలుపు నిమిత్తము ప్రకృతికి ప్రతి రూపముగా స్త్రీ శరీరములు, పరమాత్మకు ప్రతి రూపముగా పురుషుని శరీరములు తయారైనవి, ప్రకృతి పరమాత్మలేకాక జగత్తు కూడ కలదని తెలియునట్లు జగత్తుకు ప్రతి రూపముగా నపుంసకులు కూడ తయారైనారు. స్త్రీలు, పురుషులు, నపుంసకులు ముగ్గురు ప్రకృతి, పరమాత్మ, జగతికి ప్రతిరూపములై ఉన్నారు. ప్రకృతి = స్త్రీ, జగతి = నపుంసకుడు, పరమాత్మ = పురుషుడు (మగాడు). పుట్టిన ప్రకృతికి ఆడవారిని, జగత్తుకు గొజ్జేవారిని, పరమాత్మగ ఉన్నవానికి మగవారిని గుర్తింపుగా పెట్టి తన సృష్ఠి ఇలా ఉందని అందరికి తెలియునట్లు చేశాడు. అంతేకాక పరమాత్మ ప్రకృతి యొక్క రెండిటి చేతనే జగత్తు పుట్టినదని తెలియునట్లు ఆడ మగకు సంతానము పుట్టునట్లు చేశాడు. అందరికీ కనిపించు తల్లి, తండ్రి, సంతానము యొక్క అర్థము ఆదియందు సృష్ఠి విధానమని తెలియాలి. అన్నిటియందు బుద్ధిని ఉపయోగించు మానవుడు స్త్రీకి భిన్నముగనున్న పురుషున్ని గురించి గానీ, వారికి కల్గు సంతానమును గురించి గానీ ఎందుకిలా ఉన్నదని ఏమాత్రము యోచించడము లేదు. ఆధ్యాత్మిక విద్యలో అక్షరాభ్యాసమైన సృష్ఠి రహస్యమును తెలియకపోతే ఆధ్యాత్మికమే తెలియక పోవును.

ఇది ఒక ఆటయని, దేవునికి ప్రకృతికి మధ్యన జరిగే శత్రుత్వరహిత పోరాటమని తెలియాలి. ప్రకృతి పరమాత్మల ఆటలో జీవున్ని ఎవరివైపు వారు లాగుకొనుటకు చూస్తుందురు. పరమాత్మ తన జ్ఞానమును బోధించి తనవైపు వచ్చునట్లు చేసుకోవడము తన ఆటలో కర్తవ్యము కాగా, ప్రకృతి తన ఆయుధములైన గుణములతో మనిషికి తీరిక ఓపిక లేకుండా చేసి, దేవుని గురించి యోచించు అవకాశమే మానవునికి లేకుండా చేయుచున్నది. అందరినీ వారివారి పనులలో ఇరికించి, ధ్యాస ఆ పనుల మీదికి మళ్ళించి ఆశ చేత, దానికి అనుబంధ గుణముల చేత మనిషిని దేవుని వైపు పోకుండా చేయుచున్నది. సృష్టిలో పరమాత్మకు ప్రకృతికి మధ్య జరిగే అతిపెద్ద ఈ ఆటకు పేరు లేదు. ప్రకృతి మాయరూపములో తనను ఎవరు గుర్తించలేనట్లు ఆడుచు అందరినీ తనవైపు లాగుకొనుచున్నది. జగత్తులో ఎవడయిన దేవుని ధ్యాసకల్గినా, దేవుని గూర్చి తెలుసుకోవాలని ప్రయత్నించినా, వాని మీద మాయ (ప్రకృతి) ప్రత్యేకముగ దృష్టి సారించి, వానిని కూడ తన బుట్టలో వేసుకొంటున్నది. దేవుడు, మాయ యొక్క పోరాటమునందు ప్రస్తుత కాలములో మాయకే ఎక్కువ బలమున్నట్లు దానివైపే 99 శాతము మనుషులున్నట్లు తెలియుచున్నది. ఇటువంటి సందర్భములలో దేవుని ఓటమి తప్పదేమోననిపించు సమయములో, పరమాత్మ కూడ తాను బాగా ఆడి గెలిచేదానికి ప్రయత్నించాలి కదా! అందువలన ఆయన ప్రయత్నములో భాగముగా మనిషిగా మనుషుల మధ్యలోకి వచ్చి, తనను గూర్చి తానే చెప్పుకొని, తనవైపు మళ్ళించుకోవడానికి ప్రయత్నించును. ఆట అనగా గెలుపు ఓటమిల మధ్య సాగే పోరాటము కదా! ముందే చెప్పుకొన్నాము ఇది శత్రుత్వరహిత యుద్ధమని. ఈ పోరాటములో ఎవరి వ్యూహము వారిది. మనిషిలోనే మాయ, దేవుడు ఇద్దరూ ఉండినప్పటికీ వారి విషయము మనిషికి తెలియకున్నది. అందువలన మనిషి దేవున్ని గానీ, మాయను గానీ గుర్తించ లేకున్నాడు. తను ఎటువైపు ఉన్నానని కూడా తెలియదు. తమకు తెలియకున్నా మాయ చేతిలో చిక్కిన మనుషులను దానినుండి విడిపించాలని దేవుడు కూడ ప్రయత్నించుచుండును. ఆ ప్రయత్నములోనే పరమాత్మ భగవంతునిగా భూమి

మీద పుట్టవలసి వస్తున్నది. కాని ఆట నియమముల ప్రకారము తాను పరమాత్మయని మనుషులకు తెలియకూడదు. తెలియకుండానే తాను మనిషిలాగే పరమాత్మను గూర్చి తానే చెప్పవలసి వస్తున్నది. తన విషయమును తానే చెప్పుచున్నప్పటికీ, తన ధర్మములను తానే పునరుద్ధరించుచున్నప్పటికీ, మాయ తాను కూడ తన వ్యూహము ప్రకారము వచ్చి, భగవంతున్ని మనుషులలో అధమునిగా, అజ్ఞానిగా చూపుచున్నది. ఆయన మాటలు అధర్మములనీ, తమవే నిజమైన ధర్మములనీ, బోధించునట్లు గురువులనే తయారుచేసి పెట్టింది. మాయయే స్వయముగా గురువులు, స్వాముల రూపములో భగవంతునికి పోటీగా వస్తున్నది. తన తియ్యటి మాటలను దైవజ్ఞానముగా వర్ణించి, దేవునిజ్ఞానమును నమ్మనట్లు, తాను చెప్పు జ్ఞానమునే నమ్మునట్లు చేయుచున్నది. ఏవి దేవుని ధర్మములో తెలియనట్లు తాను కూడ పరమాత్మ, మోక్షము, జ్ఞానము, సాధన అను పదములుపయోగించి చెప్పుచూనే తన ధర్మములను మానవులకు అంటించుచున్నది. మాయ యొక్క ధర్మముల ముందు దేవుని ధర్మములను గుర్తింపు లేనట్లు చేయుచున్నది. దేవునివైపు పోవాలనుకొన్నవానికి ఏవి ధర్మములో, ఏవి అధర్మములో తెలియనట్లు చేసి, ఎవరు ఏమి చెప్పినా నమ్మునట్లు చేయుచున్నది. మాయ, దేవుడు ఎవరు అవతరించినా వారి ఉనికిని చెప్పుకోకూడదన్నది ఆట యొక్క నియమము. పరమాత్మ భూమి మీద భగవంతునిగా అవతరించి, తాను పరమాత్మనని చెప్పుకోలేని నియమము ప్రకారము, ప్రకృతి కూడా భూమిమీద జన్మించి తాను మాయనని చెప్పుకోదు. మాయ మనిషిగా అవతరించిన నేను భగవంతుడనని చెప్పుకోవచ్చు. ఆ సూత్రము ప్రకారము మానవులకు తానే భగవంతుడనని తెలియచేస్తూ, ఎన్నో మహత్యములు చూపుచూ, భూమి మీద ఎందరో స్వాములుగా మాయ అవతరిస్తున్నది. పరమాత్మ భూమిమీద ఒక్కచోట భగవంతునిగా అవతరించితే, ప్రకృతి భూమిమీద ఎందరినో భగవంతుడను పేరుతో తయారు చేయుచున్నది. తన ధర్మములను తెలుపుటకు పరమాత్మ ఒక చోట పుట్టి తాను భగవంతుడనని గుర్తింపు లేకుండ ఉంటే, మాయ మాత్రము ఆయన జన్మకు ముందునుంచే, ఎందరినో భగవంతుడను

పేరుకల్గిన వారిని తయారుచేసి, వారి మాటనే వినునట్లు, నిజమైన భగవంతుడు చెప్పిన మాటలను విననట్లు చేయుచున్నది. ఎవరి ప్రయత్నము వారిదన్నట్లు మాయ పని మాయ, దేవుని పని దేవుడు చేసుకొంటు పోవుచున్నారు. మాయ ఎల్లపుడు గుణముల రూపములో మనిషి శరీరములో ఉండగా, దేవుడు కూడ ఆత్మ రూపముగా గలడు. మాయ, పరమాత్మలు భూమిమీద మనుషుల రూపములో వస్తారనుకొన్నాము కదా! అట్లు వచ్చువారు ఏ శరీరములు ధరించి వస్తారని తెలియవలసి ఉన్నది. మాయ భూమిమీద పురుష శరీరము ధరించి భగవంతునిగా, అట్లే స్త్రీ శరీరము ధరించి భగవతిగ వచ్చుచున్నది. పరమాత్మ మాత్రము పురుష శరీరము ధరించి వచ్చుచున్నాడు. పరమాత్మ వాస్తవానికి పురుషుడే, కావున పురుష శరీరము మాత్రము ధరించుచున్నాడు. ప్రకృతి స్త్రీయే కావున స్త్రీ శరీరము ధరించుచున్నది. అలాగే తాను కూడ పురుషుడనే అని మభ్యపెట్టుటకు పురుష శరీరము కూడా ధరించుచున్నది. భగవతి భగవంతులలో ఎవరు నిజమైన భగవంతుడో అర్థము కాకుండా పోవుచున్నది. మొత్తానికి భగవంతుడు పురుషునిగానే జన్మించునని తెలియాలి.

# శ్రీ కృష్ణాష్టమి

విశ్వమంతా నిండి ఎవరి ఊహకు అందని పరమాత్మ, ఒక శరీరమును ధరించి వచ్చినపుడు, ఆ శరీరమును భగవంతుడు అంటాము. అట్టి జన్మయే శ్రీకృష్ణుని జన్మగా తెలియాలి. శ్రీకృష్ణుడు సాధారణమైన మనిషి కాదు. ఆయన అందరివలె శరీరము ధరించి, అందరివలె సామాణ్యునిగా నటించి, మానవాళికి తన జీవితమే గొప్ప ప్రబోధముగ చేసి, సామాణ్యునివలె వెళ్లిపోయిన పరమాత్మ. శ్రీకృష్ణుడెవరైనది స్వయముగా తెలుసుకొన్నవాడు ఒకే ఒక భీష్ముడు. ఆయనెవరైనది కృష్ణుడు స్వయముగా చెప్పితే తెలుసుకొన్నది ఒకే ఒక అర్జునుడు.

ఆత్మ యొక్క ధర్మములను తెలుపు నిమిత్తము, అధర్మములు చెలరేగి నపుడంతా వస్తానని చెప్పిపోయిన ఆ కృష్ణరూపుడు, ఎపుడు వచ్చినా తన

జీవితమంతా మానవుల మార్గదర్శకత కొరకు క్రమబద్ధము చేసుకొని, తన ధర్మములను తెలియజెప్పి పోవునని తెలియాలి. ఆ విధముగా వచ్చిన శ్రీకృష్ణ జన్మయందు తన పాదములతో నిలబడి, ఆ పాదములకు తాను ధరించిన శంఖు చక్రములకు, అట్లే శిరస్సున ధరించిన నెమలి పింఛమునకు, పెదవులతో ఊదుచున్న మురళికి మరియు ఆయన శరీర ఛాయకు ఎంతో సారాంశమైన అర్థములుగలవని ముందే తెలుపుకొన్నాము. ఇపుడు ఆయన పుట్టిన దినమైన 'శ్రీకృష్ణాష్టమి'ని గురించి తెలుసుకొందాము.

అమావాస్య నుండి పౌర్ణమికి 15 రోజులు, అట్లే పౌర్ణమి నుండి అమావాస్యకు 15 రోజులుండుట అందరికీ తెలిసిన విషయమే. శ్రీకృష్ణుడు పౌర్ణమి నుండి అమావాస్యకు గల 15 దినములందు మధ్యలో గల అష్టమి దినమునందు జన్మించాడు. 15 దినములలో పాఢ్యమి నుండి సప్తమి వరకు 7 దినములు, మధ్యలో అష్టమి, తర్వాత నవమి నుండి అమావాస్య వరకు 7 దినములు గలవు. 7+1+7 = 15 పదిహేను రెండు సమాన భాగములు చేయవలయునంటే 7 మరియు 7 దినములుగ విభజించగ ఒకటి శేషము మిగులును. ఆ ఒక్క దినము అష్టమిగా గుర్తించి అష్టమికి ముందు 7 దినములుగా, వెనుక 7 దినములుగా గుర్తించుకోవలయును. శ్రీకృష్ణుడు మధ్య దినమైన అష్టమియందే పుట్టుటకు విశేషమైన అర్థము గలదు. అదేమనగా!

భగవంతుడైన శ్రీకృష్ణుడు జ్ఞానమునకు, అజ్ఞానమునకు సంధిలాంటి వాడు. అజ్ఞానము నుండి జ్ఞానమునకు, జ్ఞానము నుండి అజ్ఞానమునకు పోవుటకు ఆయన కేంద్రములాంటివాడు. ఎందరో జ్ఞానులు సహితము ఆయన తన జీవితములో నడుచుకొన్న పద్ధతులు ఆచరణలు చూచి, చెప్పిన గీత అంతా బాగుగానే ఉంది కాని ఆయన ఆచరణ మాకు నచ్చలేదు. నడవడిక ముఖ్యము కదా! లోపల గుణములు బట్టియే కదా ఎవరైనా ఆచరించేది, ఆయన ఎన్ని చెప్పినప్పటికీ శ్రీకృష్ణుడు చేసిన పనులను బట్టి చూస్తే, బోధలు చెప్పినంత గొప్పవాడుకాదని తెలుస్తుందని అంటున్నారంటే వారికున్న జ్ఞానము నిష్ప్రయోజన

మన్నమాట. శ్రీకృష్ణుడేమి చెప్పినాడో వారు అర్థము చేసుకోలేదన్నమాట. అటువంటపుడు శ్రీకృష్ణుడు చెప్పిన అసలైన జ్ఞానము వేరు విధముగా అర్థమై నడవడికకు భిన్నముగ తోచినపుడు వారు శ్రీకృష్ణునికి భిన్నముగా పోగలరు. శ్రీకృష్ణుడు జ్ఞానకేంద్రమైనపుడు, ఆయనకు భిన్నముగా పోవువారు అజ్ఞానము వైపు పోవుచున్నారనే తెలియాలి. అట్లే శ్రీకృష్ణుని చూచి ఆయన చెప్పినది, చేయునది, చేయించునది అంతా ఒకటేనని తెలిసినవారు జ్ఞానమువైపు సాగిపోగలరు. ఆయనను చూచి ఉన్న చోటునుండి కొందరు జ్ఞానము వైపుకు, కొందరు అజ్ఞానము వైపుకు పోవుచున్నారు. కావున శ్రీకృష్ణుడు అటు జ్ఞానమునకు, ఇటు అజ్ఞానమునకు మధ్యగలవాడని తెలియునట్లు అష్టమిరోజునే ఎంచుకొని పుట్టాడు. శ్రీకృష్ణుడు బహుళపక్ష అష్టమి రోజే ఎందుకు పుట్టాలి. శుక్లపక్ష అష్టమియందు ఎందుకు పుట్టలేదు? దానికి కారణమేమై ఉండవచ్చునను సంశయము కొందరికి రావచ్చును. దానికి మా సమాధానమేమనగా!

జ్ఞాన బోధలలో చంద్రున్ని జ్ఞానచిహ్నముగా చెప్పిన సందర్భములు గలవు. గీతయందు 'యోగులకు మరుజన్మ ఉంటే జ్ఞానవికాసము కల్గి పుట్టుదురని' చెప్పుటయందు చంద్రతేజస్సు కల్గిపుట్టుదురని జ్ఞాన వికాసమును చంద్రుని వెన్నెలతో పోల్చి చెప్పారు. అందువల్ల వెలుగైన పౌర్ణమిని జ్ఞానముగా, చీకటిమయమైన అమావాస్యను అజ్ఞానముగా సులభముగ పోల్చుకోవచ్చును. పరమాత్మ జ్ఞానయుతుడై ఉండి, అజ్ఞానయుతమైన ప్రపంచములోనికి వచ్చి పుట్టాడు. కావున జ్ఞానచిహ్నమైన పౌర్ణమి నుండి చీకటిమయమై పోవుచూ చివరకు అమావాస్యగా మారు బహుళ పక్షమిలో పుట్టాడు. అట్లు పుట్టిన ఆయన అటు జ్ఞానియో, ఇటు అజ్ఞానియో ఎవరికి అర్థముకానట్లు, జ్ఞానము అజ్ఞానము రెండూ నాలోనే ఉన్నాయన్నట్లు మరియు **జ్ఞానమునకు అజ్ఞానమునకు నేనే మార్గమును, నేనే ద్వారమును అన్నట్లు** మధ్యలో అష్టమి రోజున పుట్టాడు. పౌర్ణమి గడచిపోయిన తర్వాత వచ్చు అష్టమి రోజున పుట్టాడు. కావున జ్ఞానప్రకాశవంతమైన పరము నుండి అజ్ఞాన అంధకారమైన ప్రపంచములోనికి వచ్చాడని తెలియాలి. ఈ విధముగా ఆయన పుట్టిన దినమునందు కూడ

ఎంతో విశేషమైన అర్థమిమిడి ఉన్నది. కావున ఆయన పుట్టిన దినమును మహాపర్వదినముగా భావించి ఆ దినమును 'శ్రీకృష్ణాష్టమి' అని పేరు పెట్టి పూజించుకొంటున్నాము.

శ్రీకృష్ణాష్టమి కొందరు చేయుచున్నారు. కాని ఆ దిన విశేషమేమిటని పైన మనము చెప్పుకొన్నట్లు ఎవరూ విశధీకరించుకోలేదు. కావున మీకు తెలిసిన ఈ విధానమును మిగతా వారికి కూడ తెల్పి శ్రీకృష్ణుని జన్మే గొప్పదని, ఆయనే దేవదేవుడైన పరమాత్మ అని తెలియునట్లు చేయాలి. కృష్ణాష్టమి తర్వాత పది దినములకు వచ్చు వినాయక చవితికంటే ముందు వచ్చు అష్టమే గొప్పదని తెలియునట్లు చేయాలి. సామాజిక అర్థముతో కూడుకొన్నది వినాయకచవితి, ఆధ్యాత్మిక అర్థముతో కూడుకొన్నది కృష్ణాష్టమి అని తెలియునట్లు చేయాలి.

# పురుషార్థములు

కొన్ని పనుల ఎడల తమకు తెలియకనే పుణ్యానికి లేకపోయె, పురుషార్థమునకు లేకపోయెననియో, లేక పుణ్యానికా పురుషార్థానికా ఈ పని చేయడమని అనుచుందురు. ఒక పనిలో ఎటువంటి ఫలితము కనిపించనపుడు బహుశ కొందరు వివరము తెలియకున్నను ఈ మాట అనడము పరిపాటిగా ఉన్నది. ఈ కాలములో అక్కడక్కడ అరుదుగ వినిపిస్తున్నప్పటికీ పూర్వ కాలము ఎక్కువగా అనెడివారు. ఇంకా పూర్వకాలము పుణ్యమంటే ఏమిటి? పురుషార్థమంటే ఏమిటి? అని తెలిసి అనెడివారు. వారి మూలాన ఈ వాక్యము ఇప్పటికీ అక్కడక్కడ మిగిలి ఉన్నది. ఇపుడు ఈ వాక్యమును గురించి తెలుసుకోవలసిన అవసరము మనకున్నది.

పుణ్యము, పాపము అనునవి బహుశ అందరూ వినియేయుందురు. మనము చేయు ప్రతి పనిలోను కంటికి కనిపించు ఫలితము, కంటికి కనిపించని ఫలితమని రెండు విధములుగా ఫలితమున్నది. కంటికి కనిపించునదిగా ఉన్న

ఫలితము ధనమో, వస్తువో ఏదో ఒకటి లేక అన్ని ఉండవచ్చును, కానీ కంటికి కనిపించని ఫలితము పాపము లేక పుణ్యము ఏదో ఒకటి మాత్రముండును. మంచి పని చేస్తే పుణ్యము, చెడ్డ పని చేస్తే పాపము తప్పక లభించును. అందువలన ఒక పని చేసినపుడు ఇటు లాభము రాక, అటు పుణ్యము రాక పోయినపుడు, పుణ్యానికి లేకపోయె పురుషార్థమునకు లేకపోయెనని అనెడివారు. చేసిన పని మంచిదైనపుడు లాభము కానీ, నష్టము కానీ వచ్చినప్పటికీ కంటికి కనిపించని ఫలితము మాత్రము పుణ్యమే వస్తుంది. పుణ్యమొచ్చుట వలన మనకేమి మంచిది? పాపమొచ్చుట వలన మనకేమి చెడ్డదని? కొందరికి తెలియకపోతే దానికి మా వివరమేమనగా! పుణ్యము వచ్చుట వలన అది మన కర్మచక్రములో రికార్డయిపోయి, తర్వాత వచ్చు జన్మలలో ఏదో ఒక జన్మ యందు వరుసకొచ్చినపుడు సుఖసంతోషములతో అనుభవమునకొచ్చును. అట్లే పాపము కష్టదుఃఖ రూపములతో అనుభవమునకొచ్చును. ఇక పురుషార్థములంటే ఏవి? వాటి వివరమేమనగా!

ధర్మార్థ కామమోక్షములనునవి పురుషార్థములని చాలా గ్రంథములలో ఉన్నది. మరియు చాలామంది స్వాములు చెప్పుచున్నారు. దీని విషయము చెప్పుకొనుటకు ముందు ఇటువంటి వాక్యమే ఇంకొకటున్నది. అది 'తల్లి తండ్రి, గురువు దైవము' అను వాక్యము. ఈ వాక్యమును మొదట పెద్దలు ఏ ఉద్దేశ్యముతో, ఏ వరుసలో అన్నారో ఆ వరుస ఈ వాక్యములో ఇప్పటికీ ఉన్నది. ఈ వాక్యము కాలక్రమమున ఏమాత్రము మారిపోకుండ పూర్వము ఆదిలో పెద్దలు చెప్పినట్లే నిలిచి ఉన్నది. తల్లి తండ్రి, గురువు దైవమను వాక్యము చెడనిదై అక్కడక్కడా వినిపిస్తూ ఉన్నప్పటికీ దానియొక్క అర్థము వివరము చాలామందికి తెలియకుండా పోయినది. దీనిఅర్థమెవరికీ తెలియదు. అందరికీ తెలుసును కదా!యని కొందరు సులభముగా అర్థము చెప్పువారు గలరు. వారు చెప్పు వివరమేమంటే మొదట తల్లిని నమస్కరించాలి, తర్వాత తండ్రిని నమస్కరించాలి. వీరిరువురు అయిన తర్వాత గురువును నమస్కరించి ఆ తర్వాత దైవమును నమస్కరించాలని పూర్వము పెద్దలు తల్లి తండ్రీ, గురువు దైవమన్నారని అనుచుందురు.

పూర్వపు వాక్యము చెడకున్నను దాని భావము పూర్తి చెడి పోయినదని మేమంటున్నాము కాని నిజభావమేమనిన ఈ వాక్యము ఒకటే అయినప్పటికీ రెండు పదములుగా పలుకబడునట్లు పెద్దలుంచారు. అది ఈ విధముగ తల్లి తండ్రీ, గురువు దైవము. ఇంకనూ వివరముగా **'తల్లి తండ్రి, గురువు దైవము'** అని ఉండెడిది. దీని ప్రకారము ప్రతి ఒక్కరికి తండ్రి ఎవరన్న రహస్యము వాని తల్లికి మాత్రమే తెలుసును, తల్లి ద్వారానే తండ్రి తెలియబడును. అందువలన తల్లి తండ్రి అన్నారు. ఈ విధముగనే దైవము ఎవరన్న విషయము గురువుకు మాత్రమే తెలియును. అందువలన గురువు దైవము అన్నారు. తల్లి వలన తండ్రి, గురువు వలన దైవము తెలియబడునను ఉద్ధేశ్యముతో ఆదిలోని పెద్దలు తల్లి తండ్రి, గురువు దైవమన్నారు. తల్లి తండ్రి, గురువు దైవమన్న మాటవరుస మారక అట్లే నేటికిని ఉన్నను దాని భావము మాత్రము పూర్తి చెడిపోయి తల్లిని ముందు, తండ్రిని వెనుక తర్వాత గురువును, ఆ తర్వాత దైవమును పూజించాలని చెప్పు సాంప్రదాయమేర్పడి పోయినది. యోచించని వారంతా అదే నిజమని నమ్మినారు.

తల్లి తండ్రి, గురువు దైవమను మాటలోని భావము చెడి పోయినప్పటికీ వాక్యము యొక్క వరుస మారలేదు. కాని పురుషార్థములను మాటలో వాక్యము యొక్క వరుస పూర్తి మారిపోయి, భావము అడవిపాలైపోయినది. నేడు మనమనుకొనుచున్న ధర్మార్థ కామమోక్షములు సత్యమైన పురుషార్థముల వాక్యము కాదు.

ఎందుకనగా ఈ వాక్యము కూడ తల్లి తండ్రి, గురువు దైవమన్నట్లే తయారైన వాక్యము. ధర్మము వలన అర్థము (ధనము), కామము వలన మోక్షము అన్నట్లు ఇప్పటి ధర్మార్థ కామమోక్షము అను పురుషార్థమున్నది. **ధర్మము వలన మోక్షము వస్తుంది, కాని ధనము రాదు. అట్లే కామము (ఆశ) వలన ధనము వస్తుంది, కాని మోక్షము రాదు.** వక్రమార్గము పట్టించిన వారు ఎలా పట్టించినా, ఇది ఏమి అని యోచించనివారుండుట వలన ఆ వక్రవాక్యము

పూర్తి ప్రచారమై కూర్చొన్నది. పురుషార్థము యొక్క సక్రమమైన వాక్యము **"కామార్థ ధర్మమోక్షము".** కామము (ఆశ) వలన ధనము (అర్థము), ధర్మము వలన మోక్షము వచ్చును. కావున కామ అర్థ, ధర్మ మోక్షమని ఆదిలో వివరము తెలిసి అనెడివారు.

**ధర్మము వలన ధనము, కామము వలన మోక్షము ఎప్పటికీ రాదు.** కావున ధర్మార్థకామమోక్షములను పురుషార్థములని అనకూడదు. ఆశ వలన ధనము, ధర్మము వలన మోక్షమను వాటిని పురుషార్థములని ఎందుకు పేరు పెట్టారనగా! పురుష అనగా బ్రహ్మవిద్యానుసారము బయట మగవారైన ఆడవారైన వారిలో ఉన్న జీవాత్మ పరమాత్మ సంబంధమైనది, కావున దానిని **'పురుష'** అను శబ్దముతోనే పిలిచారు. ఏ జీవునకైన అను అర్థము పురుష అను శబ్దములోనే ఇమిడి ఉన్నది. కావున ప్రతి జీవరాశికి బ్రతికి ఉన్నపుడు ధనమెట్లు అవసరమో, మరణించిన తర్వాత మోక్షమట్లు అవసరము. బ్రతికినపుడు ధనము రూపాయి అయితే మరణించిన తర్వాత ధనము మోక్షము. అందరు ప్రాపంచిక ధనము మీదే లగ్నమైనారు. కాని పరమార్థ ధనమైన మోక్షము మీద శ్రద్ధ పూనడము లేదు.

ప్రతి మానవునకు మోక్షమనునది అవసరమనీ, అదియే ప్రతి పురుషునికి నిజమైన ధనమనియు తెల్పుచూ, అది ఎట్లు లభ్యమౌతుందని అర్థమగుటకు ప్రపంచ ధనము సంపాదించుటకు ఆశ ఎట్లు అవసరమో అట్లే పరమార్థ ధనమగు మోక్షము సంపాదించుటకు ధర్మమట్లు అవసరమని తెల్పుచు ఉదాహరణకు కామార్థ అని, నిజమునకు ధర్మ మోక్షములని పూర్వమన్నారు. ఈ విధముగనే బ్రతికినపుడు తండ్రి ఎవరని తెలుసుకొనుట ఎంత ముఖ్యమో, దైవమెవరని తెలుసుకొనుట కూడ అంతే ముఖ్యమని తెలుపుచు, తండ్రిని ఎవరి సహాయముతో తెలుసుకోవాలో తెల్పుచు, ఉదాహరణగ తల్లి తండ్రియని, నిజముగ గురువు దైవమని చెప్పారు. దైవమునెలా తెలుసుకోవాలనుటకు తల్లి తండ్రి, గురువు దైవమని, మోక్షమెలా పొందాలనుటకు కామార్థ, ధర్మ మోక్షములని ఆదిలోని వారు పెట్టిన వాక్యములివి. పురుషార్థములనునవి ఒక్క కామార్థ-ధర్మ

మోక్షములనునవే కాక, తల్లి తండ్రి–గురువు దైవములను వాక్యము కూడ అనుబంధమైనదని తెలియాలి.

| | | | | |
|---|---|---|---|---|
| **తల్లి** | **తండ్రి,** | **గురువు** | **దైవము** | **పురుషార్థములు** |
| **కామ** | **అర్థ,** | **ధర్మ** | **మోక్షము** | |

ఇంకనూ వీటి వరుసయందు ఆదిలోని పెద్దలు తెల్పినదేమనగా!

**తల్లి --> తండ్రి గురువు --> దైవము**

| **తల్లి** | **తండ్రి** | **గురువు** | **దైవము** |
|---|---|---|---|
| ↓ | ↓ | ↓ | ↓ |
| **ఆశను** | **ధనము** | **ధర్మమును** | **మోక్షము** |

తల్లి చిన్న తనము నుండి ఆ వస్తువు ఈ వస్తువు ఇచ్చి, ఇది దాచిపెట్టుకో అది దాచిపెట్టుకో అని చెప్పుచు ఆశను నేర్పుతుంది. కావున తల్లి వలన ఆశ లభ్యమౌతుంది. తండ్రి ధనమును సంపాదించేది నేర్పి తన ధనమును పంచియిస్తాడు. కావున తండ్రి వలన ధనము తెలియును. అట్లే గురువు ఇది జ్ఞానము ఇది అజ్ఞానమని నేర్పి ధర్మము తెలియజేయును. కనుక గురువు వలన ధర్మము తెలియును. ఆ విధముగనే మనము తెలుసుకొన్న దైవమును బట్టి మోక్షముండును. అందువలన తల్లిని బట్టి ఆశ–తండ్రిని బట్టి ఆస్తి, గురువును బట్టి ధర్మము–దైవమును బట్టి మోక్షమని కూడ తెలుసుకోవచ్చును. పూజించెడి దైవము సాకారముగ భగవంతుడు, నిరాకారముగ ఆత్మకాని ఎడల వానికి మోక్షము లభ్యమవ్వదు. అట్లే నమ్మిన గురువు పరమార్థ జ్ఞానము తెలుపువాడు కాక, చెట్టుకు పుట్టకు మ్రొక్కించి భజనలు చేయించువాడైతే వానికి ధర్మము ఏదో తెలియదు. తండ్రికి ఆస్తి లేకపోతే నీకు ఏమీరాదు. ఆస్తి ఉన్న తండ్రియైతేనే నీకు ధనము లభ్యమవ్వగలదు. ఇక తల్లి లేకపోయిన ఆశను అందరు సులభముగా నేర్చుకొనుచున్నారు. కావున దానిని గురించి చింతించ వలసినది లేదు. ముఖ్యమైనది ధర్మము, మోక్షము కావున వాటి కొరకు కారణమైన గురువు, దైవములను తెలుసుకొందాము. వీరిలో ముందు తెలుసుకోవలసినది గురువునే, కావున కాలము వృథా చేయకుండా జాగ్రత్తగా ధర్మము తెలిసిన మరియు తెలిపెడు గురువును ఎన్నుకొందాము.

# జీవాత్మ - ఆత్మ - పరమాత్మ

ప్రకృతి పురుషులన్నవి రెండే మొత్తము సృష్టికి మూలము. వాటి ఆది ఎవరికి తెలియదు. అయినప్పటికి గీతయందు చెప్పిన సారాంశమును బట్టి ప్రకృతి, పురుషులనువారున్నారనీ, ప్రకృతి స్త్రీ స్వరూపమైనదని, దానివలననే సమస్త జీవరాసుల శరీరములు తయారగుచున్నవని తెలియుచున్నది. ప్రకృతి జనితమైన శరీరములకు కదలిక శక్తినిచ్చు పరమాత్మ సర్వజీవరాసులకు తండ్రియని, శరీర నిర్మితము చేసిన ప్రకృతి తల్లియని తెలియబడినది. దీనినిబట్టి మొత్తము సృష్టినంతటిని రెండు భాగములుగ చెప్పవచ్చును. ఒకటి పరమాత్మ, రెండవది ప్రకృతి. వీటి మినహా మరేదియు లేదు. వీటిలో ప్రకృతి ఐదు భాగములుగ, పరమాత్మ మూడుభాగములుగ విభజింపబడినది. ప్రకృతి ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి అను ఐదు భాగములుగ ఉండగ, పురుషుడు అనునది జీవాత్మ, ఆత్మ, పరమాత్మలను మూడుభాగములుగ ఉన్నది. ప్రకృతిలోని భాగములు స్థూలకన్నులకు కనిపించునవి, కావున అందరికి తెలిసినట్లే ఉన్నవి. కాని పురుషసంబంధమైన జీవాత్మ, ఆత్మ, పరమాత్మలు కంటికి కనిపించునవి కావు. అవి కేవలము జ్ఞానచక్షువుకు మాత్రమే తెలియును. అందువలన వీటి వివరము ఇంతవరకు చాలామందికి తెలియదనియే చెప్పవచ్చును. ఎవరినైనా అడిగితే జీవుడు, దేవుడు అను రెండు పదములే మాకు తెలుసును కాని మూడున్నాయని తెలియదంటున్నారు. ముగ్గురు పురుషుల సవివరము భగవద్గీతయందు పురుషోత్తమప్రాప్తి యోగమను అధ్యాయములో 16,17 శ్లోకములో కూడ చెప్పబడినది. అయినప్పటికి అక్కడ బోధకులందరు వాటిని వివరించక కప్పదాటు వేశారు. మరి కొందరు మూడు చెప్పాలను ఉద్ధేశ్యముతో

ఒకటి శరీరము, రెండు జీవుడు, మూడు దేవుడన్నారు. ఇంకా కొందరు అక్కడ చెప్పిన క్షరాక్షర పురుషోత్తముల గూర్చి వివరిస్తు క్షరమంటే నాశనమగునది శరీరము, అక్షరమంటే నాశనము కానిది జీవాత్మ, పురుషోత్తముడంటే దేవుడని కూడ చెప్పారు. పురుషుల వివరములో ప్రకృతియైన శరీరమును తీసుకోవడము పూర్తి తప్పు. ప్రకృతిని ఏమాత్రము తీసుకోకుండా కేవలం ఒక్క పురుషులను మాత్రము వివరించుకోవడము సరియగును. అట్లు కాక స్త్రీ సంబంధమైన అనగా ప్రకృతి సంబంధమైన శరీరమును కలిపి అర్థము చెప్పి వ్రాసిన భగవద్గీతలు చాలా ఉన్నాయి. ఇటువంటి తప్పు దారిలో నుండి బయటపడాలంటే పురుషుల వివరము తెలియాలి. పురుషుడు (దేవుడు) కంటికి కనిపించువాడు కాడు, ప్రకృతి కంటికి కనిపించునది. కంటికి కనిపించని దానిని మూడు భాగములుగ విభజించుకోవాలి. అటువంటి విభజనలో కంటికి కనిపించు ప్రకృతిని కలుపుకోవడము అధర్మము. ఈ అధర్మమునే పెద్దపెద్ద భగవద్గీతలయందు వ్రాయబడినది. భక్తితో వాటిని చదివిన ప్రజలు అంతేనేమోననుకొనుచున్నారు. అందువలన ఎందరో అధర్మమునే అర్థము చేసుకొను అవకాశము గలదు. అట్లు కాకుండుటకు ఇపుడు ముగ్గురు పురుషుల వివరము తెలుసుకోవాలి.

ప్రకృతికి మినహా ఉన్న ఏదో అతీతమైన శక్తిని పురుషుడన్నాము. ఆ పురుషున్ని భగవద్గీతయందు మూడు భాగములుగ విభజిస్తు **క్షరుడు, అక్షరుడు, పురుషోత్తముడని** శ్లోకములందు చెప్పారు. క్షరుడనగా నాశనమగువాడని అర్థము. ఇక్కడ నాశనమగుట అంటేనే చాలామంది నాశనమగునది శరీరమే కదా, జీవాత్మ నాశనము కాదు కదా, అని పురుషున్ని వదలి ప్రకృతియైన శరీరమును తీసుకొన్నారు. జీవాత్మ

కూడా నాశనమగునదేనని వారికి తెలియకపోయినది. జీవాత్మ శరీరములను వదలి వేరు శరీరములకు పోయినపుడు శరీరములు మాత్రమే నశిస్తున్నవి. జీవాత్మ నాశనము కాక మరియొక శరీరమును ప్రవేశించుట నిజమే. ఏదో ఒక రోజు జీవాత్మ జ్ఞానము తెలిసినవాడై, పరమాత్మయందు ఐక్యమైన రోజు జీవాత్మయను వాడు ఇక పుట్టడు కదా! కావున ఆ దినము వాడు నాశనము చెందినట్లే, జీవపదము పూర్తి నాశనమైన తర్వాతే మోక్షము చెందును. అనేక జన్మల పిదప మోక్షము చెందు దినమందు జీవాత్మ నాశనము చెందువాడే, కనుక వానిని క్షరుడని అర్థము చేసుకోవాలి. అక్షరుడను వాడు అనగా నాశనము కానివాడు ఆత్మ. ఆత్మ అనువాడు ఎప్పటికి నాశనము కానివాడు, ఆత్మ సర్వజీవరాసుల శరీరములందు ఏకముగ ఉంటూ, ఒక జీవాత్మ నాశనము చెందినప్పటికి మిగతా జీవాత్మలనాధారము చేసుకొని ఉన్నది. ఎప్పటికి నాశనము కానిది కావున ఆత్మను అక్షరుడనవచ్చును. క్షర పురుషుడైన జీవాత్మయుకాక, అక్షర పురుషుడైన ఆత్మయు కాక వీటి రెండిటికంటే వేరుగ ఉత్తమునిగ ఉన్న వానిని పురుషోత్తముడన్నారు. పురుషోత్తముడంటే ఇద్దరి పురుషులకంటే ఉత్తమమైనవాడని అర్థము, కాని అది ఒక పేరుకాదు. అలాగే మూడవ పురుషుడైన వానిని పరమాత్మ అనడము కూడ ఒక పేరుగాదు. అక్షరుడైన ఆత్మకంటే వేరుగ ఉన్న వానిని పరమాత్మ అంటున్నాము. పర అనగ వేరు అని అర్థము, పరమాత్మ అనగ ఆత్మకంటే వేరుగ ఉన్నదని అర్థము.

క్షర అక్షర పురుషోత్తముల వివరము ఇపుడు చెప్పుకొన్నాము. వీటిని గురించి ఇంకా తెలుసుకోవాలనుకొన్నపుడు క్షరుడైన జీవాత్మ ఎక్కడ నివశిస్తున్నాడు. అట్లే అక్షరుడు పురుషోత్తములు ఎక్కడున్నారు?

వారి పని ఏమి? ఎందు నిమిత్తము ఉన్నారు? వారి ఆకారమేమిటి? అన్నవి ప్రశ్నలై నిలుచును. వాటికి జవాబులు తెలుసుకుంటే జీవాత్మకు ఆకారమున్నదని చెప్పుచున్నాము. జీవాత్మకు ఆకారమున్నదనుమాట ఇదే మొదటిసారి వినుచున్నారు, కావున బహుశ మీకందరికి ఆశ్చర్యమై ఉంటుంది. కేవలమొక్క జీవాత్మకే కాక ఆత్మకు కూడ అవధి ఉన్నదని మేమంటే మరీ ఆశ్చర్యమైన మాటయే కదా! ఆశ్చర్యమైనప్పటికి నిజముగ జీవాత్మకు, ఆత్మకు అవధి ఆకారములున్నవి. కాని పరమాత్మ అను దానికి మాత్రము ఏ ఆకారము ఏ అవధి లేదు. మొదటి రెండవ పురుషులైన వారికి జీవాత్మయని, అని ఆత్మయని పేర్లున్నవి కావున వాటికి ఆకారములున్నవి. మూడవదైన పరమాత్మకు (ఆత్మకంటే వేరైన దానికి) పేరు లేదు. **రూపముంటే నామము, నామముంటే రూపము** ఉండునను సూత్రము ప్రకారము మొదటి రెండు ఆత్మలకు పేర్లున్నవి, కావున వాటికి అవధి గల ఆకారము ఉన్నదని చెప్పవచ్చును. పరమాత్మకు పేరులేదు, కావున దానికి అవధి ఆకారము లేదు. ఈ మాట విన్నపుడు కొందరికి కొన్ని అనుమానములు రావచ్చును. వారిలా అడుగవచ్చును ప్రకృతి మాత్రమే కంటికి కనిపించునది, పురుషులు కంటికి కనిపించరని ముందే మీరు చెప్పారుగా అలా కనిపించని పురుషులకెలా ఆకారము ఉందని చెప్పగల్గుచున్నారు అని అడుగవచ్చును. వాస్తవమే ప్రకృతి మాత్రమే కంటికగుపించును, పురుషులు కేవలమొక్క జ్ఞాననేత్రమునకు మాత్రమే అగుపించుదురని తెలుపుచున్నాము.

జీవాత్మయైన మొదటి పురుషునకు మరియు రెండవ పురుషుడైన ఆత్మకు నివాసస్థానమున్నది. అందువలన వారి నివాస స్థానపరిధిని బట్టి వారి ఆకారమును ఊహించవచ్చును. మూడవ పురుషుడైన

పరమాత్మకు నివాసపరిధి లేదు అంతటా వ్యాపించినవాడు, కావున ఆ మూడవ పురుషునకు ఆకారము లేదు. అంతేకాక ఈ ముగ్గరి పురుషులకు యోగశాస్త్రానురీత్యా శాస్త్రబద్ధమైన సూత్రములు గలవు. వాటిలో ఒకటి **జీవాత్మ అనగా ఒక్క శరీరమందు మాత్రమే నివశించునది.** ఈ సూత్రము ప్రకారము యోచిస్తే ప్రపంచములో ఎన్నిశరీరములు గలవో వాటన్నిటి యందు అన్ని జీవాత్మలు గలవు. అనగా ఒక్కొక్క శరీరమందు ఒక్కొక్క జీవాత్మగలదని తెలియుచున్నది. ఎన్నో శరీరములందు ఎన్నో జీవాత్మలు వేరువేరుగ ఉన్నందువలననే వాటినన్నిటిని భగవద్గీతయందు సర్వ జీవరాసులని చెప్పబడియున్నది. ఈ విధముగ ఒక్క శరీరమందు నివశించు దానిని జీవాత్మ అనుచున్నాము. జీవాత్మ శరీరమందు తలమధ్య భాగములో గుణముల మధ్యన గల బుద్ధి, చిత్తము, అహము అనువాటి ఆవరణములో మధ్యన ఉన్నది. జీవాత్మ సుఖదుఃఖములననుభవిస్తూ శరీరమందు నివశిస్తున్నది. కావున దాని స్వరూపమును జ్ఞాననేత్రులు గుర్తించగలరు. ఇదే విషయమును భగవద్గీతయందు పురుషోత్తమప్రాప్తి యోగమను అధ్యాయము 10వ శ్లో॥ ఈ క్రింది విధముగా చెప్పబడినది.

శ్లో॥ ఉత్క్రామన్తం స్థితం వాపి భుంజానం వా గుణాన్వితమ్ !
విమూఢా నానుపశ్యన్తి పశ్యన్తి జ్ఞానచక్షుషః !!

**భావము** :- జీవాత్మ గుణమయుడై శరీరమందు నివశించుచు సుఖ దుఃఖములననుభవించుచుండును. ఈ విషయము మూఢులకు ఏమాత్రము తెలియదు. జ్ఞాననేత్రులు మాత్రము చూడగల్గుదురు. గీతయందు భగవంతుడు పల్కినట్లు జీవాత్మ ఆత్మల స్వరూపము జ్ఞాననేత్రమున్న వారికే తెలియును.

అలా జ్ఞాననేత్రులు జీవాత్మ, ఆత్మలను చూడగల్గినప్పటికి కేవలము జీవాత్మ ఆకారమును మాత్రము బయటికి చెప్పగలరు. జీవాత్మ చిన్నది కావున దాని స్వరూపమును బయటికి చూపగల్గుచున్నారు మరియు చెప్పగలుగుచున్నారు. జీవాత్మ ఆకారము బుద్ధి, చిత్తము, అహమను మూడు పొరల మధ్యన చిక్కుకున్న ఖాళీ స్థలము కావున దానికొక ఆకారమేర్పడినది. జీవాత్మ ఆకారమిలా ఉన్నది.




పైన ఉన్న పటములో జీవాత్మ ఆకారము ఖాళీగ ఉన్న శూణ్యమైతే దాని చుట్టూ ఉన్న పొర బుద్ధి, ఆ తర్వాత ఉన్నది చిత్తము, మూడవ బయటిపొర అహము. ఈ చిత్రము ద్వారా కంటికి తెలియని, జ్ఞాననేత్రమునకు మాత్రమే అగుపడు జీవుడే కాక బుద్ధి, చిత్తము, అహము యొక్క ఆకారములు కూడ తెలిసిపోయినవి. అన్ని జీవుల ఆకారమొక్కటే అయినా వాటి చుట్టూ ఉన్న పొరల మందము ఒక్కొక్కరికి ఒక్కొక్క విధముగ ఉండును. జీవుని ప్రక్కనే గల బుద్ధిపొర ఒకరికి మందముగ, ఒకరికి పలుచనగ ఉండవచ్చును. పలుచనగ ఉన్న పొర చాలా చురుకుదనము కల్గి మంచి యోచన చేయునదై ఉండును. మందమైన పొర చురుకుదనములేక యోచనా తీవ్రతలేక ఉండును. అందువలననే

వీనిది మందబుద్ధి కావున తెలివి తక్కువవాడనీ, వీనిది పదునైన బుద్ధియనీ, పలుచని బుద్ధియనీ కనుక తెలివిగలవాడని అనుచుందుము. ఇలా పూర్వము జీవునిస్థితి, బుద్ధిస్థితి తెలిసినవారు అనెడివారు. ఆ మాటలు నేటికిని ఉన్నను, అనెడివారు జీవునిస్థితి, బుద్ధిస్థితి తెలిసిన వారు అనడము లేదు, తెలియనివారే అంటున్నారు. ఇక ఆత్మ విషయము తెలుసుకొందాము.

ఒక్కొక్క శరీరములో ఒక్కొక్క జీవాత్మయుండగా, అన్ని శరీరములలోను ఒకే విధమైన ఆత్మగలదు. అన్ని శరీరములలోని ఆత్మ ఒక్కటే అయినా అది అన్ని శరీరములలో విడివిడిగా ఉన్నది. ఎన్ని జీవ శరీరములున్నవో వాటి అన్నిటియందునూ ఆత్మ వేరువేరుగా ఉండి, జీవుని కర్మప్రకారము వేరువేరు పనులు చేయుచున్నది. ఆత్మ అనునది ఒక చైతన్యశక్తి అని చెప్పవచ్చును. అలా ఎందుకు చెప్పుచున్నామనగా! శరీరములో ఉంటూ ఆ శరీరమును లోపలా బయటా కదలించి పని చేయించుచున్నది. కదలిక శక్తిగాయున్నది కావున ఆత్మను చైతన్యము అంటున్నాము. వేరువేరు శరీరములలో వేరుగా వేరుగా పనిచేయుట వలన ఆత్మను వేరువేరు భాగములుగా చెప్పుకొంటున్నాము. ముఖ్యముగా గమనించవలసినదేమంటే జగతిలో ఉన్నది ఒకే ఆత్మ అయినా అది వేరువేరు జీవ శరీరములందు నివసిస్తూ, వేరువేరు పనులు చేయడము వలన వేరువేరు ఆత్మలుగా పరిగణించబడుచున్నది. అందువలన ఒక్కొక్క జీవాత్మకు శరీరములో తోడుగా ఒక్కొక్క ఆత్మగలదని చెప్పవచ్చును. ఉదాహరణకు ఒక ఊరిలో వేయిమంది మనుషులున్నారనుకొందాము, అలాగే 50 కుక్కలున్నాయి, 500 కోళ్లున్నాయి, మిగతా క్రిమి కీటకములన్ని ఒక లక్ష ఉన్నాయి. అప్పటికి ఆ ఊరిలో మొత్తము జీవ శరీరములన్నీ 1,10,550 అని చెప్పవచ్చును. ఒక్కొక్క జీవునికి ఒక్కొక్క ఆత్మను

లెక్కించితే మొత్తము జీవాత్మలతో పాటు ఆత్మలు కూడ 1,10,550 అనియే చెప్పవచ్చును. వాస్తవానికి ఆత్మ ఒక్కటే అయినా శరీరములను బట్టీ, అందులోని జీవుళ్ళ కర్మనుబట్టీ, ఆత్మ వేరువేరుగా లెక్కించబడు చున్నది. ఈ విధముగా ఆత్మ ఏకమే అయినా ఒక వస్తువు వేరువేరు అద్దములలో వేరువేరుగా కనిపిస్తున్నట్లు ఒకే ఆత్మ వేరువేరు శరీరములలో వేరు ఆత్మలుగా తెలియుచున్నది. దీనివలన జీవునితో పాటు ఆత్మ కూటస్థునిగా ఉన్నాడని భగవద్గీతలో పురుషోత్తమప్రాప్తి యోగమునందు 16వ శ్లోకములో భగవంతుడే చెప్పాడు. జీవాత్మ నాశనమైనా ఆత్మ నాశనము కాదని, జీవాత్మ క్షరుడైతే ఆత్మ అక్షరుడనీ, అదే శ్లోకములో చెప్పియున్నారు. శ్లోకము ప్రకారము ఒక శరీములోని జీవుడు సంపూర్ణుడు, కాబట్టి వాడు నాశనమైనా ఒక శరీరములోని ఆత్మ అసంపూర్ణుడు, కాబట్టి ఆత్మ నాశనము కాదని తెలియుచున్నది. జీవుని కర్మప్రకారము శరీరమును నడిపించి, జీవుని చేత కర్మను అనుభవింపజేయడము ఆత్మయొక్క పని. కర్మ అయిపోయినపుడు జీవున్ని తనలో కలుపుకొని తాను పరమాత్మలో కలిసిపోయి జీవున్ని పరమాత్మలో కలపడము ఆత్మయొక్క కర్తవ్యము. జీవున్ని పరమాత్మలో అనుసంధానము చేసిన తర్వాత ఆత్మ అదృశ్యమైపోయి తాను అక్షరునిగానే ఉండును.

ఒక జీవాత్మకు తోడుగాయున్న ఆత్మ భాగము లేక ఆత్మ ఆ జీవుడు ఎన్ని జన్మలెత్తినా వాని వెంటనేయుండి వాని కర్మను అనుభవింప జేయుచుండును. ఆ జీవుడు తన ప్రక్కనున్న, తన వెంటనున్న, తనకు అన్ని పనులు చేసిపెట్టుచున్న ఆత్మను తెలుసుకొని, ఆ తర్వాత పరమాత్మను చేరాలనుకొంటే వాని కర్మ అయిపోయినపుడు వానిని పరమాత్మలోనికి కలుపును. ఈ పద్ధతి ప్రకారమే ఆత్మ ఇపుడు మన శరీరములో కూడా

ఉన్నది. నీ శరీరములో నీ ఆత్మ ఉండగా, నా శరీరములో నా ఆత్మ ఉన్నది. నీ ఆత్మ నా ఆత్మా రెండూ ఒకటే, అయినా నీ కర్మప్రకారము నీ ఆత్మా, నా కర్మప్రకారము నా ఆత్మా శరీరములలో పని చేయుచుండును. కర్మను అనుభవించడము జీవాత్మయొక్క పని అయితే కర్మను తూచ తప్పక ఆచరించడము ఆత్మయొక్క పని. దీనినిబట్టి ఆచరించువాడు వేరూ, అనుభవించువాడు వేరనీ, ఆచరించువాడు నీ ఆత్మ అయితే అనుభవించువాడు నీవేనని తెలుసుకో. అంతేకాక ఆత్మ నీ గుణాలతో నీ భావాలతో సంబంధము లేకుండ కేవలము కర్మతో మాత్రము సంబంధము పెట్టుకొనియున్నది. జగతిలో ఒక మనిషి చేయు అతి చిన్న పని మొదలుకొని అతి పెద్ద పని వరకు ఆ మనిషిలోని ఆత్మే చేయుచున్నది. కానీ ఆ మనిషిలోని జీవాత్మ మాత్రము పండ్రెండు గుణాల భావములతో కూడుకొన్నవాడై అన్నీ పనులను తానే చేయు చున్నానని తలచుచుండును. జీవుడు ఏ మనుకొనినా ఆత్మ మాత్రము తన పనిని తాను చేస్తూనే పోవుచుండును. ఇది శరీరములో ఆత్మ యొక్క విధానమని తెలిసితే అదే ఆధ్యాత్మికమగును.

ఇక పరమాత్మ విషయానికి వస్తే జీవాత్మకూ ఆత్మకు ఉన్నట్లు పరమాత్మకు ఆకారముండదు. జీవాత్మ ఆత్మ రెండు పేర్లు కల్గియున్నవి. పరమాత్మకు పేరులేదు, ఆకారము లేదు. పరమాత్మ అనునది పేరుకాదు. ఆత్మకంటే వేరుగాయున్నదను అర్థముతో పర+ఆత్మ = పరమాత్మ అంటున్నాము. పరమాత్మ (దేవుడు) కు పని కూడ లేదు. అందువలన రూప,నామ,క్రియలు లేనివాడు దేవుడని చెప్పవచ్చును. ప్రస్తుతానికి పరమాత్మ ఆకారమును గురించి మాట్లాడితే ఆయన ప్రకృతియంతయు అణువణువున వ్యాపించియున్నాడు. జీవాత్మ శరీరములో ఒక్కచోట

ఉండగా, ఆత్మ శరీరమంతా వ్యాపించియుండగా, పరమాత్మ శరీరము లోపలా, శరీరము బయటా వ్యాపించియున్నది. విశ్వమంతా వ్యాపించి యున్న పరమాత్మకు ప్రత్యేకమైన రూపములేదు, కావున పరమాత్మను విశ్వరూపుడన్నారు. విశ్వరూపమంటే ఒక రూపము కానిదని అర్థము. సూర్య నక్షత్రగోళములలో కూడ వ్యాపించిన పరమాత్మయే మన శరీరములో కూడ వ్యాపించియున్నాడని తెలియవలెను. పరమాత్మకు పరిదిలేదు, కావున దానిని ఏమాత్రము చెప్పలేము.

1. జీవాత్మ ఒక్క శరీరమందు ఉన్నది.
(శరీరాంతర్యామి) **క్షరుడు.**

2. ఆత్మ అన్ని శరీరములందు వ్యాపించి ఉన్నది.
(సర్వశరీరాంతర్యామి) **అక్షరుడు.**

3. పరమాత్మ అన్ని శరీరముల లోపల బయట వ్యాపించి ఉన్నది.
(సర్వాంతర్యామి) **పురుషోత్తముడు.**

# దానము - ధర్మము

దానము, ధర్మము అనునవి అందరము విన్న పదములే. దాన ధర్మము చేయండను జంట పదములను వినుటకూడ సహజమే. ఇక్కడ మనము ముఖ్యముగ తెలుసుకోవలసింది దానమంటే ఏమిటి? దాన ధర్మమను జంటపదము ఎందుకున్నదను విషయము. దానమను పదము క్రొత్తదికాదు, అందులో ఏ పెద్ద రహస్యము లేదు. దానమంటే తన వద్ద ఉన్నదానిని ఉధారముగా ఇతరులకివ్వడము. ప్రతిఫలము తీసుకోకుండ

ఉచితరీతిన ఇవ్వడము దానమని మనకు తెలిసిన విషయమే. ఇవ్వడము ఒక వ్యక్తికి ధనధాన్యమైనకావచ్చు లేక ఏ వస్తువులైనకావచ్చు. కాని ఇక్కడ ముఖ్యముగా వచ్చిన సమస్య ఏమిటంటే! **దానమడిగేవాడు ధర్మము చేయండని అడగడము, దానము ఇచ్చినవాడు ధర్మము చేశాననడము.** దానమునకు ధర్మమునకు తేడా లేనట్లు దానమే ధర్మమనునట్లు దీనిని బట్టి తెలియుచున్నది. కానీ శాస్త్రబద్దముగ ధర్మమనగ దైవసిద్ధాంతములను తెల్పునదని, భగవద్గీతయందు తెల్పినవన్ని ధర్మములని ఉన్నది. దానమనగ అనుభవరీత్య మనకు తెలిసినది, ఒక పదార్థమును మరియొకరికి ఇవ్వడము. అటువంటపుడు దానము, ధర్మము వేరువేరు అర్థములలో ఇమిడి ఉన్నదని సులభముగ తెలిసిపోవుచున్నది.

నేడు దానమును దానమని పలుకక, ధర్మమని పలుకుట చాలా చోట్ల ఉన్న విషయము. ఉదాహరణకు పదిమంది భక్తులకు అను కూలముగ ఉండునట్లు ఒక దేవాలయమునకు ఫ్యాన్‌ను దానముగ ఇచ్చి దానిమీద పలానావారు ఇచ్చారను గుర్తుగ వారి పేరును వ్రాయడము ఉన్న విషయమే. అక్కడ వెంకయ్య అనువారు ఇచ్చారనుకుందాము. వెంకయ్య దానమని ఫ్యాన్ మీద వ్రాయడము లేదు. వెంకయ్య ధర్మమని వ్రాసియుండును. ఇట్లు అనేక దానములు కనపడినా అవి ఇచ్చిన వారి పేరు మీద ధర్మమని కనిపించుట నేటి కాలములో సహజము. దానము ధర్మము సూత్రప్రాయముగ వేరు వేరైనపుడు, దానము చేసి ధర్మము చేశామనుకోవడము ఒక పొరపాటేనని తెలియుచున్నది. దీనిని జ్ఞానరీత్య శాస్త్రబద్ధముగ తెలుసుకోవడము ఎంతైనా అవసరము. ఇక్కడ పాఠకులకు ఒక మనవి. మా వ్రాతలు ఒకరిని విమర్శించవలయునను ఉద్దేశ్యముతో వ్రాయుచున్నవని మాత్రము అనుకోవద్దండి. తెలియని సత్యమును

తెలియచెప్పవలయునను తపన తప్ప మరియేమి లేదని గ్రహించుదురని కోరుచున్నాము. అన్వేషణా దృష్టితో ముందుకు చదవండి.

ఇట్లు అనేక విధముల దానధర్మములకు భేదములున్నవి. అన్ని విధముల దానముకంటే ధర్మమే గొప్పగ ఉన్నది. అందువలన తెలిసిన పెద్దలు దానమునకంటే ధర్మమే శ్రేష్ఠమైనదని తెలిసి **"ధర్మం శరణం గచ్ఛామి"** అన్నారు కాని దానం శరణం గచ్ఛామి అనలేదు. ఇన్ని తేడాలుండుట వలన దానమును ధర్మముగ పోల్చుకోకూడదు. ఇచ్చిన దానము మీద పలానా వారి ధర్మమని వ్రాయకూడదు.

ఇతరులకిచ్చు దానమును సహితము ఈ దానమునకు వీడు తగునా! తగడా!! అని యోచించి పాత్రాపాత్ర దానము చేయమన్నారు పెద్దలు. దానము మూడు విధములుగ విభజించి తామస, రాజస, సాత్త్విక దానములని కూడ గీతయందు చెప్పారు. దానము ఏ విధముగ చేసినా పాపమో లేక పుణ్యమో సంభవించి జన్మలే కలుగజేయును. దానము ఒక గుణమైన దానివలన, దానికి జరుగుపని వలన అగ్నికి పొగ సహజమన్నట్లు, కార్యమునకు కర్మ సహజముగ వచ్చుచుండును. తీసుకొనువాడు తగునా తగడా అని తెలియవలయునంటే, వానివెంట మనము తిరుగవలసి వస్తుంది. అది జరుగనిపని కావున ఎదుటి వాని విషయము తెలియనపుడు, వానికి దానము చేయవలసి వచ్చినపుడు, దాని వలన కర్మ అంటకుండుటకు ధర్మబద్ధముగ చేయమన్నారు. అట్లు చేయుట వలన కర్మ అంటదు. ధర్మబద్ధమనగ ఎలాంటిదను అనుమానము మనకు కలుగవచ్చును. దానగుణము వలన జరుగు కార్యము కర్మ కారణము చేతనే జరుగుచున్నదని జీవాత్మ అయిన తాను

దీనికి కారణముకానని సత్యము తెలిసి, అహంకారమును అణచివేసి ఇవ్వడమే ధర్మబద్ధమైన పని. ఈ ధర్మము ప్రకారము ఏ దానము జరిగినా, ఏ కార్యము జరిగినా అందులోని కర్మ అంటదని గీతలోని కర్మయోగ సిద్ధాంతము తెలియజేస్తున్నవి.

దానము చేయువారందరు కర్మయోగ సిద్ధాంతములను తెలిసిన జ్ఞానులు కావలయునంటే అదీ కష్టమే. ధాతలందరు కర్మయోగ సిద్ధాంతములను ఆచరించలేరు. అటువంటపుడు దానము చేసేది మానుకోవాలా? అను సంశయమేర్పడును. అట్లు మానుకోవలసిన పని ఏమి లేదు. దానికి ఒక ఉపాయము తెల్పుచు మన పెద్దలు దాన ధర్మ అను జంటపదములను ఉపయోగించారు. దీనిలో అర్థమేమంటే నీవు దానము చేస్తే ధర్మబద్ధముగ చేయి. లేకపోతే ధర్మము కొరకు చేయి అని తెల్పుచు దానధర్మములన్నారు. ధర్మబద్ధముగ అంటే దేవుడు తెల్పిన కర్మయోగ సిద్ధాంతము తెలిసిన జ్ఞానులై ఉండాలి. అట్లు కానపుడు ధర్మముకొరకు అన్నారు. ధర్మముకొరకు అంటే ఎలాగ అని కూడ అనుమానము రావచ్చును. దానికి సమాధానమేమనగా! ప్రపంచ సంబంధము కాకుండ, దేవుడు తెల్పిన విధానములకు ఉపయోగించుటకు ఇవ్వబడిన దానిని ధర్మముకొరకని అర్థము. దేవుడు తెల్పిన జ్ఞానము కొరకు, ఆ జ్ఞానము అందరికి తెలియుట కొరకు, జ్ఞానము నశించి పోకుండ ఉండుటకొరకు, తగిన విధనముగ చేయు దానమును దేవుని ధర్మము కొరకు చేసినదని తెలియుచున్నది.

| దానము | ధర్మము |
|---|---|
| 1. ఒకరికిచ్చునది. ఇచ్చినది ఏదైన తీసుకొన్న వాని దగ్గర కొంత కాలమునకు తరిగి పోగలదు. | 1. ఒకరికి తెల్పునది. తెల్పిన విషయము శాశ్వతముగ నిలిచి పోవును. |
| 2. ధన, కనక, వస్తు వాహన రూపముతోయుండవచ్చును. | 2. ఆత్మ సంబంధ విషయము మాత్రముగనే ఉండును. |
| 3. చేయువారు ప్రపంచ ధనికులై ఉందురు. | 3. తెలుపువారు జ్ఞానధనులై ఉందురు. |
| 4. చేయుట వలన క్రొత్త కర్మ సంభవించును. | 4. ఆచరించడము వలన ఉన్న కర్మ నశించి పోవును. |
| 5. చేయుట వలన ప్రపంచములో కీర్తిప్రతిష్ఠలేర్పడును. | 5. ఆచరించుట వలన ప్రపంచము నకతీతమైన మోక్షమేర్పడును. |
| 6. చేసిన దానము వలన తీసుకొన్న వానికి కష్టనష్టాలు కలుగవచ్చు లేక సుఖ సౌఖ్యములు కలుగవచ్చును. | 6. తెలుసుకొన్నవానికి సుఖదుఃముల నుండి బయట పడు విధానము కలుగును. |
| 7. ఆశ అను గుణమునకు వ్యతిరిక్తమైనది. | 7. గుణము కాదు, దేవుని తెల్పు శాసనము. |

ఈ విషయమై భగవద్గీతయందు భక్తియోగమను అధ్యాయమున 10 శ్లోకములో నీవు ఏ సాధన చేయలేకపోయినప్పటికీ, యోగివి జ్ఞానివి

కాకపోయినప్పటికీ, పరమాత్మ సన్నిధానము చేరుమార్గము తెల్పుచు నా జ్ఞానములో సాధనలో నీవు అసమర్థుడవు అయినప్పటికి నాకోసము నీవు పనిచేయుము. నా కొరకు కర్మలాచరించుట వలన నీకు మోక్షము తప్పక కల్గును. 'అభ్యాసేప్య అసమర్థోసి మత్కర్మ పరమోభవ! మదర్థమపి కర్మాణి కుర్వన్సిద్ధి మవాప్స్యసి' అని అన్నాడు. ఇక్కడ దేవుని పని ఏమి అని తెలిసితే కదా! మనము ఆయన పనిని చేయగల్గుదుమని యోచన కూడ రావచ్చును, దానికి మా జవాబు ఏమనగా! దేవుని ధర్మములు నశించకుండ దేవుని ధర్మములు అందరికి తెలియునట్లు మనము చేయుటయే ఆయన పనిని మనము చేసినట్లు. ఏ అవకాశము లేనివాడు ఈ విధముగనైన నావద్దకు చేరవచ్చునన్నపుడు, జ్ఞానము తెలియనివాడు యోగికానివాడు సహితము దానము చేయునపుడు, ఆ దానము దేవుని పని అయిన ధర్మ ప్రచారమునకే వినియోగింపబడునట్లు చేయడము దైవసాన్నిధ్యమునకు మార్గమగును. అందువలననే పెద్దలు నీవు చేసే దానము ధర్మము కొరకు ఉండవలయునని ఆ మాట మరచి పోకుండునట్లు దానధర్మము చేయండని చెప్పారు.

ఈనాడు దానమంటే ఏమిటో? ధర్మమంటే ఏమిటో? తెలియని వారు దానమును ధర్మముగ, ధర్మమును దానముగ కలగూరగంప చేసుకొని కూర్చున్నారు. ఈ చిక్కు విడిపోవాలంటే దానధర్మ జంటపదములకర్థము తెలియాలి. ధర్మము అనగా న్యాయమని కూడ అనుకొనుట గలదు. కాని ధర్మము వేరు, న్యాయము వేరు, దానము వేరని తెలిసినపుడే అన్ని కార్యముల వివరము తెలిసి జ్ఞానులము కాగలము. ఇప్పటినుండైన మీరు దానము చేయు ప్రతి పైసా ధర్మమునకు వినియోగింపబడునట్లు చూడండి. మీ దానము ప్రపంచమునకు ఉపయోగపడకూడదు.

పరమాత్మసేవకు ఉపయోగపడాలి. అందువలన గ్రుడ్డిగ ఇచ్చు దానములను మాని, దానమునకు ధర్మమను పదమును జోడించినట్లు ప్రతిది ధర్మము కొరకే వినియోగించండి, అపుడే ఏ కర్మ రాదు. దానధర్మము కలిగిన జీవితము ధన్యము.

**1) ఒకరికి ఇచ్చునది దానము**
**2) ఒకరికి తెల్పునది ధర్మము**
} రెండు మిళితమైనపుడే దాన ధర్మమగును.



# ధర్మాన్ని రక్షించండి ధర్మమే మిమ్ములను రక్షించుతుంది

ధర్మాన్ని రక్షించితే ధర్మమే మిమ్ములను రక్షించుతుందని పెద్దలు చెప్పుచున్నారు. ధర్మమంటే ఏమిటని తెలిసినపుడు కదా! మేము దానిని రక్షించేదని కొందరడుగుచున్నారు. ధర్మమనునది పలానాయని సూచించుటలో చాలా గ్రంథములు ఉన్నవి. ఆ గ్రంథముల వలన తెలుసుకొన్నవి ధర్మములా కాదా! అను ప్రశ్న కూడ మానవునియందు ఉద్భవించినది. ఈ విధముగా ఈ దినము మానవునిలో ధర్మమంటే ఏమిటో తెలియని స్థితి ఏర్పడినది. దీనినే భగవద్గీతయందు **'ధర్మగ్లాని'** అని భగవంతుడన్నాడు.

మానవునికి ధర్మములు తెలియనపుడు ధర్మగ్లాని ఏర్పడుతుందనీ, ధర్మముల స్థానములో అధర్మములు తిష్ఠవేస్తాయనీ, తెలిసిన మన పెద్దలు ధర్మములు మానవునియందు చెరగని విధముగ ఉండవలయునని యోచించి, ధర్మములను మన కట్టు బొట్టు ఆచరణలయందు కూడ

చొప్పించి ఉంచారు. పెద్దలు చేసిన ఈ అమోఘమైన యోచన చాలా ప్రశంస నీయమైనది. ఇందూధర్మ సత్ సాంప్రదాయము హిందువులలో నేటికిని నిలిచి ఉన్నది. కాలక్రమేపి మానవునియందు అజ్ఞానము పెరిగి నేటి మన సత్ సాంప్రదాయములోని సారాంశమైన ధర్మముల విలువ తెలియక పోయినది. అటువంటి పరిస్థితులలో హిందూజాతిలోని వారు తమ సాంప్రదాయమునే తాము ఆచరించలేకపోతున్నారు. అసలు ధర్మమంటే ఏమిటో తెలియకున్నారు.

కొన్ని గ్రామాలకు పోయి చూస్తే ధర్మమంటే ఏమిటో, అధర్మమంటే ఏమిటో తెలియని వారు, జ్ఞానమంటే ఎటువంటిదో, అజ్ఞానమంటే ఏమిటో తెలియని వారున్నారు. మరీ చెప్పవలయునంటే నేను హిందూ మతస్తుడనని కూడ తెలియనివారున్నారు. మతము పేరడిగితే కులము పేరు చెప్పేవారున్నారు. దీనినిబట్టి చూస్తే మతధర్మములు తెలియక పోవడము వలన నేడు అధర్మములు చెలరేగి ఉన్నాయనడములో అనుమానము లేదు.

ఇటువంటి సందర్భములో గురువులు, పీఠాధిపతులు, ధర్మములు తెలిసినవారు ధర్మములను గురించి బోధించవలసిందే. అటువంటి బోధలో **'ధర్మాన్ని రక్షించండి ధర్మమే నిన్ను రక్షించుతుంది'**యని విన్నవారు తన్ను తాను రక్షించుకోలేని ధర్మము మమ్ములనెట్లు రక్షించునని హిందువులే అనడము జరుగుచున్నది. ఇతర మతస్థులు కూడ మానవుని చేత రక్షింపబడు ధర్మము మానవున్ని రక్షించుతుందా? అని విమర్శించడము జరుగుచున్నది. ఈ విధముగ ధర్మము తెలియనివారు కొందరైతే, ఏది ధర్మమో తెలియనివారు కొందరున్నారు.

హిందూధర్మ ప్రచార నిమిత్తమే మేమున్నామని తెలియజెప్పు వారు భజనలు చేయడము, హరికథలు చెప్పించడము, పురాణములు బోధించడము, దానములు చేయడము, వ్రతములు ఆచరింపజేయడము ధర్మములని ప్రకటించుచున్నారు. ఇవి ధర్మములని నమ్మినవారు కొందరైతే నమ్మనివారు కొందరున్నారు. వీటన్నిటిని బట్టి చూస్తే ధర్మములు ఏవియని అందరికి అనుమానము రాక తప్పదు.

అనుమానము వచ్చుటకు బలమైన కారణమున్నది. అది ఏమనగా! హిందూ మతగ్రంథమని చెప్పుకొను గీతయందు చెప్పబడినవన్ని ధర్మములే. ధర్మసంస్థాపనకే నేనొచ్చానని భగవంతుడు ప్రకటించాడు. అందులో తెలియజెప్పిన ధర్మములనుబట్టి చూస్తే భజనలు, హరికథలు, పురాణములు, వ్రతములు ధర్మములుకావని తెలియుచున్నది. అందువలన ధర్మయుతమైన బ్రహ్మవిద్యా శాస్త్రములోని మాట నమ్మాలా? లేక ఇపుడు కొందరు ప్రచారము చేయుమాటలు నమ్మాలా? అను సందిగ్ధావస్థలో మానవుడున్నాడు. గీత ధర్మములను నమ్మితే పెద్దల మాటలు విడువ వలసిందే లేక పెద్దల మాటలు నమ్మితే గీతమాటను విడువవలసిందే. ఏది సత్యమో ఏది అసత్యమో నిర్ణయించలేని స్థితిలో మానవుడున్నాడు.

ధర్మములకు ముప్పు కల్గినపుడు, అవి తెలియకపోయినపుడు నేనే వచ్చి వాటిని తెలియబరచి వాటిని రక్షించుతానని దేవుడు గీతయందు చెప్పాడు. దీనిని బట్టి ధర్మములనునవి ఏవో దేవునికొక్కనికే తెలుసు. ఆయనే వాటిని రక్షింపగలడని పూర్తిగ తెలియుచున్నది. అటువంటపుడు మానవుడు ధర్మములను రక్షించుననడము హాస్యాస్పదము. మానవుడు ధర్మములను ఆచరించవలయునని దేవుడు చెప్పాడు. మానవునికి ధర్మములేవో తెలియక వాటిని ఆచరించలేని సమయములో దేవుడే

పుట్టివచ్చి ధర్మములు తెలిపిపోతానని తెలిపాడు. దేవుడు తెలిపిన ధర్మములను ఆచరించితే ధర్మముల వలన కర్మ నుండి జీవుడు రక్షింపబడి ముక్తుడై దేవున్ని చేరగలడు.

ధర్మములను మానవుడు రక్షించలేడు. మానవుడు ధర్మములను ఆచరించడమే కర్తవ్యము. ధర్మములను నీవు ఆచరించుటవలన ధర్మములు నిన్ను కర్మనుండి రక్షించగలవనుట సత్యమైనమాట.

ధర్మములను నీవు ఎలా రక్షించగలవు? ధర్మములు నిన్ను ఏమిటినుండి రక్షణచేయునని అడిగిన జవాబు చెప్పలేక 'ధర్మోరక్షతి రక్షితః' అనుమాట చెప్పడము ధర్మవిరుద్దము. గీతలోని దేవుని మాటను కించపరచడమే కాని వేరుకాదు. అధర్మములను ప్రోత్సహించడమే అవుతుంది. ఏ మాటను పల్కిన హేతుబద్ధముగ పల్కినపుడు హేతువాదుల నోరు మూయించవచ్చును. నాస్తికులను నాస్తి చేయవచ్చును. అట్లు కాక హేతువులేని శాస్త్రవిరుద్ధమైన మాట వలన హేతువాదులు, నాస్తిక వాదులు ప్రబలిపోరా! ధర్మగ్లాని ఏర్పడదా! ధర్మము తెలియని వారు కొందరు మమ్ములను విమర్శించవచ్చును. సహేతుకముగ మాట్లాడిన ఏ మాటకైన మేము జవాబు చెప్పగలము. క్రమమంటు లేక ఇష్ట మొచ్చినట్లు మాట్లాడు వారికి మేము ఏ జవాబు చెప్పలేము, చెప్పము. ఇంతవరకూ చెప్పిన తర్వాత ధర్మమంటే ఏమిటో చెప్పకపోతే బాగుండదు, కావున ధర్మమును గూర్చి చెప్పడమేమనగా! దేవుని సాన్నిధ్యమునకు జీవుని చేర్చుటకు గల శాసనములే ధర్మములు. అవి ఏవో భగవద్గీతలో దేవుడే తెల్పాడు.

మానవుని చేత ధర్మము రక్షింపబడేటట్లయితే పరమాత్మ భగవంతునిగ పుట్టనవసరము లేదు. ధర్మరక్షణ కోసము దేవుడే అవతరించుచున్నాడు. కావున నీవు ధర్మాన్ని రక్షించలేవు. అందువలన

**'నీవు ధర్మాన్ని ఆచరించు, అది నిన్ను రక్షించుతుంది'.**

# రుద్రాక్ష

రుద్రము అనగ నాశనము. రుద్రభూమి అనగ శరీరములు నాశనమగు భూమి, అనగ స్మశానము. రుద్రుడనగ రుద్రభూమియందు సంచరించువాడు (శివుడు) అని అర్థము. రుద్రభూమియందు భూత, ప్రేత, పిశాచములు, యక్ష, కిన్నెర, కింపురుష, గరుడ, గంధర్వ, గ్రహాలు అనేకములు నివశించుచుండును. వాటన్నిటికి రుద్రుడు అధిపతి. ఆ రుద్రుడు ధరించిన పూసలను రుద్రాక్షలని అనుచుందురు. ఆ రుద్రాక్షలను మనము ధరించుట వలన పిశాచ గణముల బాధలుండవని పూర్వము అనుకొనెడివారు. రుద్రాక్షలను పిశాచగణములు రుద్రునితో సమానముగ చూచుకొనునని పూర్వము అనుకొనెడివారు. రక్షణ నిమిత్తము రుద్రుని పేరుతో ధరించు కాయ రుద్రాక్ష, కావున వానిని రుద్రాక్ష అనుచున్నారు. ఒక యంత్రమును (తావెత్తును) ధరించుటను కూడ రక్ష కట్టుకొనుట అని అనుచుందురు. తావెత్తులు కట్టుకొనుట కూడ పిశాచగణపీడల నివారణకేనని అందరికి తెలుసు. అటువంటి రక్షణ నిమిత్తమే పూర్వము రుద్రాక్షను కూడ కట్టుకొనెడివారు. అందువలన దానిని **రుద్ర రక్ష** అని కూడ విడదీసి చెప్పెడివారు. అది ఉండుట వలన రుద్రుడే తమ వద్ద ఉండి రక్షణ నిచ్చునని ధైర్యముకల్గి ఉండెడివారు. పూర్వము పిశాచ

బాధలు కలవారు మరియు వాటికి భయపడువారు కట్టుకొనెడివారు. కాలము గడుచుకొలది భావనలు మారిపోయినాయి. శివుడు ధరించాడు కదాయని శివభక్తులు ధరించను మొదలు పెట్టారు. చివరకు వేదాంతులు, స్వాములు ధరించను మొదలు పెట్టారు. వీరందరిని చూచిన మానవుడు రుద్రాక్ష పిశాచగణనిమిత్తమని తెలియక, రుద్రాక్షలు ధరించిన వారికి మ్రొక్కను మొదలు పెట్టాడు. ఈ విధముగ రుద్రాక్ష అర్థము ఏనాడో మారిపోయినది.

రుద్రాక్షలు వేసుకొనుట వలన ఇంకా కొన్ని శరీర ఆరోగ్యములు కూడ చేకూరును. అన్నిటికంటే ముఖ్యముగా దయ్యాల బాధల భయమునకే వాటిని వాడవచ్చును. దయ్యములకు భయపడువారు వాడినా పరవాలేదు. కాని జ్ఞానమున్నవారు కూడ రుద్రాక్షలు వాడుట ఆశ్చర్యముగనున్నది. ఒకరు వేశారు కదా! అని ఇంకొకరు వేసుకొనుచున్నారు. కాని నిజముగా తెలిసివేసుకొనడము లేదు.

# గురువు - బోధకుడు

"చేసుకొన్న వారికి చేసుకొన్నంత" అను నానుడి కలదు. మనము ఏది చేస్తే దానికి తగినంత ఫలితముండునని పెద్దలన్నారు. అది వాస్తవమే అయినప్పటికి చాలామంది దానిని విస్మరించడము ఆశ్చర్యము. సాధారణ మనుషులు తాము చేస్తున్న దానికి ఫలితమును మరిచిపోయినా పరవాలేదు. జ్ఞానులైన వారు కూడ అటువంటి స్థితికి దిగజారడము మంచిది కాదు. ఉదాహరణకు ఒక గురువు తన శిష్యులకు అపూర్వ జ్ఞానము తెల్పి దానిప్రకారము నడుచుకొమ్మని చెప్పుచుండెను. ఆ విధముగ గురువు

చెప్పుచుపోగ శిష్యులు వినుచుపోవుచుండిరి. ఒక దినము గురువుగారు శిష్యులను పిలిచి ఈ దినము వంటకు కట్టెలు కావాలని వాటిని తెచ్చిపెట్టమని చెప్పారు. ఆ మాటవిన్న శిష్యులు కొందరు కట్టెల కోసము అడవికి బయలుదేరారు. మార్గ మధ్యములో ఒకరితో ఒకరు మాట్లాడు సందర్భములో ఇలా ప్రశ్న జవాబుల రూపములో వారి సంభాషణ జరిగింది.

ప్ర) జ్ఞానమైతే మనము వినవచ్చును, గాని ఈ పనులు చెప్పడమేమిటి?

జ) గురువు చెప్పినది వినాలి కదా!

ప్ర) వినాలి, వినడము వరకు బాగానేవుంది. పనులు చెప్పడము బాగుండదు కదా?

జ) వినడమంటే చెవులతో వినడమే కాదు. చెప్పింది చేయడము కూడ వినడమే అగును.

ప్ర) నాకు వినే ఓపిక ఉన్నది, కాని చేసే ఓపిక లేదే?

జ) చెప్పింది చేసినపుడే సేవ చేసినట్లగును కదా!

ప్ర) సేవంటే గురువుగారి కాల్లు ఒత్తడము, విసరడము, (విసనకర్రలతో విసరడము) అవుతుంది. కాని కష్టపడి కట్టెలు తేవడమేమిటి?

జ) గురువుగారి జ్ఞానమునకు మనము బాకీపడివుంటాము. ఏది చెప్పితే అది చేయడము వలన గురువుగారి ఋణము తీరినట్లగును.

ప్ర) నోటితో చెప్పిన మాటలకు బాకీపడినట్టగునా! ఆయన డబ్బిచ్చాడ బాకీపడేదానికి?

జ) జ్ఞానము డబ్బుకంటే విలువైనది. దానిని డబ్బుతో పోల్చకూడదు.

ప్ర) అపుడపుడు ఇంటి దగ్గర పని విడిచిపోయి వింటున్నాము కదా!

దానివలన మనకు వచ్చే ఆదాయము పోతుంది, కాని ఆయనదేమి పోతుంది?

జ) జ్ఞానము మనకవసరము. దాని కోసము మనము వస్తున్నాము. ఎప్పుడో ఒకప్పుడొచ్చి కొద్దిసేపు వినిపోవు మనము పనిపోయింది, లాభము పోయింది అంటే, ప్రతి దినము మనవలె వచ్చు వారెందరికో జ్ఞానబోధ చేయుటలో కాలము గడుపు ఆయనకు కూడ ప్రపంచ పనులు నిలిచిపోయినట్లే కదా! ఆయన కూడ మనవలె నాపనులు పోతాయనుకొంటే మనకు జ్ఞానము తెలిసేదేనా!

ప్ర) జ్ఞానము చెప్పితే ఆయనకే పుణ్యము వస్తుంది కదా!

జ) వింటే మనకు ఏదో వస్తుందని ఎందుకనుకోకూడదు. మనకేమో డబ్బు పోతుందనేది, ఆయనకేమో పుణ్యమొస్తుందనేది. ఇదెక్కడి నీతి.

ప్ర) సరే ఆయన మనకు జ్ఞానము తెలియజేయడము వలన ఆయన కాలము వృథా అనుచున్నావు. మనము ఇలా పని చేసి పెట్టేదానికంటే మనకు తోచిన డబ్బు ఇచ్చి సహాయపడవచ్చును కదా! దాని వలన ఆయన అవసరాలు కూడ తీరును కదా!

జ) ఇది చాలా పొరపాటైన మాట. మనకు తోచింది ఇచ్చే దానికి ఆయనేమి బిక్షగాడు కాదు. మనకంటే ఉన్నత స్థానములో ఉన్న గురువు. **గురు సాక్షాత్ పరబ్రహ్మ** అన్న మనమే అలా అనకూడదు. పై స్థానములో ఉన్న గురువుకు మనమేమిచ్చిన తీరునది కాదు. అందువలన ఇవ్వడమనేది కాక చేతనైనంత చేయడము కూడ కర్తవ్యమే. గురువు యొక్క ఋణము అంత సులభముగ తీరునది కాదు. అందువలన పూర్వము పెద్దలు తమకున్న సర్వము గురువుదే అన్నారు.

ప్ర) ప్రపంచములో ఎందరో గురువులున్నారు, వారిలో నిజమైన గురువెవరో తెలిస్తే నీవన్నట్లు నడచుకోవచ్చును. ఇందరిలో నిజగురువుగ ఎవరని తెలియవచ్చును. ఎవరో వ్రాసిన గ్రంథము చదివి అందులోని విషయములు చెప్పువాడు గురువా? లేక స్వయముగ తెలిసినవాడు గురువా?

జ) ఎవరో వ్రాసినది, ఎవరో చెప్పినది అయిన విషయమును చెప్పువాడు కేవలము బోధకుడే అగును. గురువుకు బోధకునికి చాలా వ్యత్యాసమున్నది. గురువు ఎప్పటికి ఇతరులు చెప్పిన దానినీ, వ్రాసిన దానిని చెప్పడు. ఎవరికి తెలియని విషయమును చెప్పువాడు గురువు. గురువు చెప్పిన దానిని బోధించిన వారు బోధకులు. బోధకులు ఎందరైన తయారుకావచ్చును. కాని గురువు భూమిమీద ఒకడే ఉంటాడు. ఒక ఊరి నుంచి మరొక ఊరికి దారి ఏర్పరచి దానిని నిర్మించువాడు ఒకడైతే, ఆ దారిని చూపువారు, ఆ దారి వివరము తెలుపువారు ఎందరైన ఉండవచ్చును. వారు చూపిన దారివెంట మరెందరైన ప్రయాణించవచ్చు నడుచువానికంటే దారిని చూపువాడు గొప్ప. దారిని చూపువానికంటే మొదట దారిని కనుగొని నిర్మించినవాడు అందరికంటే గొప్ప. బయలుదేరు స్థలము ప్రపంచము లేక ప్రకృతికాగ, గమ్యము మోక్షము లేక దేవుడు. ప్రపంచము నుండి దేవుని వరకు చేరు మార్గమును మొదట కనుగొని దానిని శాస్త్రబద్ధముగ నిర్మించినవాడు గురువు. అలా నిర్మించిన దానిని గూర్చి ఎందరైన చెప్పవచ్చును. అలా చెప్పువారు బోధకులు. శాస్త్రబద్ధమైన సూత్రమును కనుగొనువాడు ఒకడే, కనుగొనిన సూత్రమును ఎందరైన చెప్పుకోవచ్చును. మరి ఎందరైన ఆచరించవచ్చును. ప్రపంచములో ఒక విషయమును కనుగొనువాడు ఒకడే. కనుగొన్న

వానిని శాస్త్రజ్ఞుడు, పరిశోధకుడు అంటారు. అదే విషయమును ఇతరులకు తెలియజేయువానిని బోధకుడు అంటారు. అట్లే ఆధ్యాత్మిక విద్యలో విషయమును శోధించి మొట్టమొదటగ తెలుపువాడు గురువు. తర్వాత దానిని ఎందరు తెలుపుచూపోయిన వారు కేవలము బోధకులు. బోధకులకు గురువులకు చాలా వ్యత్యాసమున్నప్పటికీ గుర్తుపట్టలేని స్థితిలో ప్రజలుండుట వలన, ఆధ్యాత్మికతకూ అసలైన గురువులకు సమాజములో విలువ లేకుండపోయినది.

ప్ర) మీ మాట ప్రకారమైతే గురువులే చాలా అరుదు. బోధకులే కోకొల్లలు అన్నమాట. అటులైన ప్రస్తుత కాలములో అంతా బోధకులే అవుతారు. గురువు రాష్ట్రానికొక్కడు కూడ దొరికేది అరుదే !

జ) రాష్ట్రానికీ కాదు, దేశానికీ కాదు, ప్రపంచానికంతటికి ఒకడు దొరకడము కూడ అరుదే.

ప్ర) అయితే ఇప్పుడు మన గురువు బోధకుడా లేక గురువా?

జ) ఆ విషయము స్వతహాగ ఎవరికి వారు తెలియదగినది. ఇంతకుముందే చెప్పానుగ, గురువుకు బోధకునికి చాలా వ్యత్యాసముంటుందని.

ప్ర) మా ఊరిలో ఒక వ్యక్తి వికరణ మహర్షి భక్తుడనని ఆయన బోధలే చెప్పుచు, కాషాయగుడ్డ కట్టుచు ఊరికి ఉత్తరాణ వంకగడ్డలో వికరణ మహర్షి పేరు మీద డబ్బు వసూలు చేసి ఆశ్రమము కూడ కట్టించాడు. అతనిని నేను గురువే అనుకొని ఉంటిని, కేవలము బోధకుడేనన్న మాట.

జ) నీ నోటితో నీవే చెప్పుచున్నావు కదా! ఆయన వికరణ మహర్షి

భక్తుడని, గురువు అనువాడు ఎప్పటికీ, ఏ స్వామికి భక్తుడుగ ఉండడు. ఆయన స్వయముగ పరమాత్మ మీదనే భక్తి శ్రద్ధ కల్గియుండును. కనపడని దేవతలకు, కనిపించే మనుషులకు భక్తుడుగ గురువు ఉండడు. ప్రపంచమునకంతటికి పెద్దయైనవాడు ఎవడు గలడో వానిని ఆరాధించు వాడే గురువు, మిగతావారు బోధకులు కావచ్చు.

ప్ర) అట్లయితే మన గురువుగారు కూడ శ్రీకృష్ణున్ని, గౌరవించి ఎక్కువగ వారి బోధ చెప్పుచుంటాడు కదా! ముందెపుడో పుట్టిపోయిన శ్రీకృష్ణుడు మనిషే కదా! మనుషులను గూర్చి చెప్పువాడు కావున ఈయన కూడ బోధకుడే అనవచ్చును.

జ) అట్లని అనుకుంటే నీవు పప్పులో కాలేసినట్లే.

ప్ర) నీవు చెప్పినట్లే కదా! నాదేమి పొరపాటున్నది.

జ) శ్రీకృష్ణుడు సామాణ్య మానవుడు కాదు. ప్రపంచమంతా వ్యాపించియున్న పరమాత్మ అంశయేనని తెలియుము. మానవ శరీరములోనికి వచ్చిన పరమాత్మ ప్రతిరూపమనుకో. వారిని గౌరవించడములో గురువుకు ఏలోటులేదు.

ప్ర) శ్రీకృష్ణుని బోధను బోధిస్తాడన్నావు కదా! అటువంటపుడు బోధకుడే కదా! గురువు కాడు కదా!

జ) నీ తలకు అన్ని వ్యతిరేఖ ఆలోచనలే వస్తుంటాయి. మన గురువు గురువు కాకపోవడమేమిటి! ఆయన చెప్పిన బోధలు అన్ని క్రొత్త విషయములే. అంతేకాక ఒకటికాదు రెండుకాదు వందల విషయములు ఎవరు చెప్పనివి చెప్పాడు. అంతెందుకు ఆయన ప్రతి వ్రాతలోనూ, ప్రతి బోధలోనూ క్రొత్తతనముంటుంది. ఇప్పుడు నీకు నేను చెప్పిన గురువు బోధకుల యొక్క తేడాను కూడ ఆయనే చెప్పాడు.

ఇది క్రొత్త విషయము కాదా! సర్వజీవరాసులు అతి ముఖ్యముగా తెలియవలసిన బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రముల గమణములు, ఆకారములు చెప్పినవాడు మనగురువు కాదా! ఇంతవరకు జీవునకు ఆకారమున్నదని, ఆత్మకు కూడ ఆకారమున్నదని, మనస్సుకు ఆకారమున్నదని చెప్పిన వారున్నారా? ఇలా ఎన్నో విషయములు తెల్పిన గురువును గ్రహించలేని నీ బుద్ధి చాలా మందమైనదని చెప్పవచ్చును. అంతటివాని దగ్గర చేరి పనులు చేయాలా అనుకోవడము నీ గ్రుడ్డితనానికి నిదర్శనము. ఆయన చెప్పాలేకాని చేయలేకపోవడము మన దురదృష్టము.

ప్ర) అయితే నాది తప్పే. నేను పొరపడినట్లే కదా?

జ) బయటికి చెప్పకపోయినా నీ అంతరంగమందు ఒప్పుకొన్నా పరవాలేదు.

ప్ర) నాదొక చిన్న ప్రశ్న, సజీవముగ ప్రస్తుతమున్న గురువు కాక పూర్వమెందరో గురువులుండెడివారుకదా! అట్టి గురువులలో ఒక గురువు యొక్క పటము పెట్టుకొని, అతనినే గురువుగ భావించుకొని, కొందరు గురువులుగ చలామణి అగుచున్నారు. వీరు ఏ తెగకు చెందిన వారు?

జ) ఫోటో పెట్టుకొని గురువులవడము చాలా సులభము. పూర్వపు గురువులు ఎటువంటివారైన వారి ఫోటో పెట్టుకోవడము వలన వీరు గురువులుకాలేరు. పూర్వపువారైన ఇప్పటివారైన గురువులగుదురో కాదో ముందు చెప్పిన సూత్రమునననుసరించి చెప్పవచ్చును. భూమిమీద మేము గురువులమని ఎందరైన అనవచ్చును. మనము మాత్రము చాలా జాగ్రత్తగ శిష్యులు కావాలి. నిజగురువు దొరుకుట కష్టము. దొరికిన శిష్యులుగ మెలగడము మరీ కష్టము. అందువలన నిజగురువు వద్ద తక్కువ శిష్యులే ఉంటారు.

ప్ర) నేడు గురువులు ఊరూరు తిరిగి ఉపదేశమిస్తూ పోతూ శిష్యుల సంఖ్యను పెంచుకొంటూవుంటే, నిజగురువు శిష్యులను తక్కువ చేసుకోవడమేమిటి?

జ) నిజగురువు తన శిష్యులను ఒకసారి ఉపదేశమిచ్చి విడిచి పెట్టడు. వారిని జ్ఞానులుగ చేయుటకు అనేక విధముల ప్రయత్నము చేయుచుండును. ఆ ప్రయత్నములో మాటి మాటికి మీలో అజ్ఞానము ఇంత మిగిలి ఉన్నదనునట్లు వారి తప్పులను బయటపడునట్లు చేయుచుండును. అందువలన ఆ శిక్షణకుకొందరు తట్టుకోలేక మధ్యలోనే జారుకొనుచుందురు. కావున శిష్యుల సంఖ్య తక్కువని చెప్పవచ్చును. వారికథ ఎటులైన ఉంటుంది కాని నీ పరిస్థితి ఏమిటి?

జ) నీవు చెప్పిన దానిని బట్టి చూస్తే నేను గురువు దగ్గర చాలా తప్పులు చేశాను. ఇక మీద నుంచి ఎటువంటి తప్పులు చేయకుండ ప్రవర్తిస్తానని అనుకొంటున్నాను. మంచిగ సేవ చేసుకొంటాను.

ఈ విధముగ ఆ ఇద్దరి శిష్యుల మధ్య సంభాషణ జరిగినది. ఈ సంభాషణను బట్టి ముఖ్యముగ తెలిసినదేమనగా గురువు, బోధకుల మధ్య వ్యత్యాసము తెలిసినది. అంతేకాక నిజగురువు దొరికినపుడు మాయకులోనుకాక, మనతలలోని గుణముల వెంటపోక, గురువునే అనుసరించవలెనని తెలియుచున్నది కదా!

# రోగము - యోగము

పుట్టిన ప్రతి జీవునికి అనుభవాల విషయమును గురించి చూస్తే మొత్తము మీద రెండు విధములైన అనుభవములున్నాయని తెలియుచున్నది.

ప్రకృతి సంబంధమైన ప్రపంచ విషయముల అనుభవములన్ని ఒక విధము. దైవసంబంధమైన ఆత్మానుభవము ఒక విధముగ విభజించుకోవచ్చును. ప్రకృతి సంబంధమైన అనుభవములన్నియు నిత్యము ప్రతి జీవుడు అనుభవిస్తూనే ఉన్నాడు. ఉదయము లేచింది మొదలు జరుగుచున్న ప్రతి కార్యము ప్రకృతికి సంబంధించిన అనుభవములుగానే ఉన్నవి. పరమాత్మ సంబంధమైన ఆత్మానుభవము జీవునికి ఒకే ఒక అనుభవము కాగ, ప్రకృతికి సంబంధించిన అనుభవములు లెక్కలేనన్ని ఉన్నవి. ఆత్మ యొక్క అనుభూతిని ఒకే ఒక్క బ్రహ్మయోగములో జీవుడు పొందుచున్నాడు. అందువలన జీవుడు పొందు దైవసంబంధమైన అనుభూతిని యోగము అను పేరుతో పిలుచుచున్నాము. జీవుడు పొందు రెండురకముల అనుభూతులలో ఒకటి యోగము అని తెలిసిపోయినది. సుఖదుఃఖము కాని అనుభూతియే యోగమని తెలియుచున్నది.

రెండవ రకమైన ప్రపంచ అనుభూతులను చూచిన ఎడల అవి అనేక విధములైన సుఖదుఃఖములతో కూడుకొని ఉన్నవి. సుఖ దుఃఖములను గురించి విశధీకరించుకొందాము. శరీరము లోపల మనస్సు ద్వార చింతచేయడమను బాధ కలదు. అలాగే శరీరములోని అవయవములకు స్వస్థతలేనపుడు బాధగ ఉండును. ఇక్కడ అందరికి తెలిసినట్లు మనస్సు ద్వార వచ్చు బాధను మనోరోగమనడము జరుగుచున్నది. అలాగే శరీరాంతర్గతముగ కలిగిన అనేక విధములైన అస్వస్థతలకు అనేక విధరోగములని కూడ అనుచున్నాము. దీనినిబట్టి చూచిన జీవుడు అనుభవించు వాటిని **'రోగము'** అంటున్నాము. పరమాత్మ సంబంధమైన సుఖదుఃఖములేని ఆత్మానుభూతిని **'యోగము'** అనియు ప్రకృతి సంబంధ అనుభవములను **'రోగము'** అనియు పిలుచుచున్నాము.

ఇలా జీవునికి గల రెండు అనుభవములలో ఒకటి **"రోగము"** రెండవది **"యోగము"** అని తెలిసిపోయినది.

ఇపుడు కొందరు ఒక ప్రశ్న అడుగవచ్చును. అదేమనగా! శరీరములో గల దుఃఖమయ అనుభవమును రోగము అనుట నిజమేగాని, సుఖమయ అనుభవమును రోగమని ఎక్కడ వినలేదే అని అడుగవచ్చును. దానికి సమాధానమేమనగా! ప్రత్యేకించి బాధలనే రోగములనడము సుఖములను రోగములనక పోవడము ప్రస్తుతము జరుగుచుండుట వాస్తవమే. నిజానికి పరిశీలించి చూచితే మనకు తెలియకనే సుఖాన్ని కూడ రోగమంటున్నాము. ప్రతి అవయవముయొక్క కష్టాన్ని రోగమనినపుడు అలాగే ప్రతి అవయవముయొక్క సుఖాన్ని ఏదో ఒకటనాలి కదా! అలా అనుటకు ఏదిలేదు. దానిని కూడ రోగమే అంటున్నాము. పూర్వము పెద్దలేమో సుఖదుఃఖములనెడి రెండు అనుభవములను రోగము అనుట వాస్తవమేననుటకు కొంత ఉదాహరణ కూడ గలదు. ఇపుడు ప్రస్తుత కాలములో కూడ సుఖములను అక్కడక్కడ రోగములనియే అందరు అనుట జ్ఞాపకము చేసుకొందాము. ఒకడు సంతోషముగ కూని రాగము తీస్తువుంటే వానికి కూనిరాగము తీసే రోగముంది అంటారు. ఒకడు ఉల్లాసముగ ఆడుకుంటూవుంటే వానిని పెద్దలు దండించునపుడు **'ఏమిరా ఎల్లపుడు నీకు ఆడుకునే రోగము తప్ప వేరే ఏది లేదా'** అని అంటుంటారు. అలాగే ఇతరుల అలవాట్లను గూర్చి చెప్పేటపుడు వాని అలవాటును రోగముగ వర్ణిస్తు ఒక్కొక్కనికి ఒక్కొక్క రోగముండనే ఉంది అంటుంటారు. వీటిని బట్టి చూడగ కేవలము దుఃఖములనే కాక సుఖములను కూడ రోగములనడము జరుగుచున్నది.

రోగము యొక్క వివరమేమిటని చూచినట్టయితే ఒక జీవునికి సంభవించు అనుభవముల ద్వార అసంతృప్తి, అసహనము, అశాంతి,

కలగడమే రోగమనబడుచున్నది. ఎపుడైతే జీవునకు శాంతి లేదో, అపుడే అసహనము ఏర్పడుతుంది. ఎపుడైతే సహించుకోలేని స్థితి (అసహనము) జీవునకున్నదో, అపుడే రోగమున్నదని తెలియుచున్నది. చాలామంది ప్రత్యేకించి పేర్లుకల్గిన కొన్ని అనుభవాలనే రోగములను కొన్నారు. మనోవ్యాధి రోగమను మాట మరచినారు. అశాంతి రోగమను మాట మరచారు. శరీరములోని అశాంతియనునది ఒక పెద్దరోగమని అది అనేక రకముల రోగాల కూడలియని చెప్పవచ్చును. అశాంతిని పరికించి చూచిన అనేక విధములైన రోగములుగ కన్పిస్తున్నది. అశాంతి అనునది కేవలము దుఃఖములలోనే కాక సుఖములలో కూడ ఉన్నది. ఈ మాట నిజమనుటకు ఎన్నో తార్కాణములు కూడ కలవు. నేడు సర్వసుఖములననుభవించు ధనికులు కూడ అశాంతికి గురై బాధ పడుచున్నారు. మూడుగుణములను వదలి గుణాతీతస్థానములోనున్న ఒక్క బ్రహ్మయోగి తప్ప ప్రపంచములో గుణసంబంధము గలవాడెవడైన, ఎంతటి ధనికుడైన, ఎంత సుఖవంతుడైన అశాంతి అనురోగముచే బాధపడుచున్నాడు. గుణములలో గల ఎవడుగాని నేను శాంతిగ ఉన్నానని చెప్పలేడు. ఎందుకనగ ప్రతి మనిషి, ప్రతి జీవుడు ఇటు యోగములో గాని, అటు రోగములోగాని ఉండితీరవలసిందే. యోగములో లేనివాడు రోగములోను, రోగములో లేనివాడు యోగములోను ఉండవలెను. యోగము తెలియనివాడు తప్పనిసరిగ రోగములో ఉన్నాడనియే చెప్పవచ్చును. ఈ సూత్రమును అనుసరించి ప్రతి జీవుడు పుట్టింది మొదలు రోగములో ఉంటున్నాడు. రోగము పీడనము గలదనీ, సుఖము దుఃఖములన్నిటిలోను ఒత్తిడి కల్గించుచునే ఉండునని, అటువంటి పీడనముగల పీడనుండి విడివడడమే విడుదల లేక ముక్తి అని తెలిసినవారు రోగమునుండి యోగమునకు మారవలెనని ప్రయత్నించుచుందురు.

రోగమునుండి యోగమునకు మారవలెనన్న, రోగమునకు మందు మరియు మందునిచ్చు వైద్యుడు అవసరము. మంచి వైద్యుడు దొరికి, వారి వద్ద మంచిమందు దొరికితే రోగమునయమై యోగమును పొందవచ్చును. ఈ విధానము తెలుపుటకే పూర్వము పెద్దలు జీవుడనుభవించు అన్ని అనుభవములను కలిపి **'భవరోగము'** అన్నారు. భవ అనగ నీ యొక్క అని అర్థము. భవరోగమనగ నీ రోగము అని అర్థము. ఏదో ఒక పేరు పెట్టుకొని ప్రపంచములో చలామణి అగుచున్న నీవు నీ యొక్క రోగమునకు లేక భవరోగమునకు బ్రహ్మజ్ఞానమే దివ్య ఔషధమని తెలియాలి. జ్ఞానమను ఔషధము మనకు అందించు వైద్యుడే యోగి లేక గురువు. రోగి యోగి చెంతచేరి రోగమునకు చికిత్స చేయించుకోవడము రోగియొక్క ముఖ్య కర్తవ్యము. చిన్నచిన్న రోగములకే డాక్టర్ల దగ్గర పెద్ద మొత్తము ఖర్చుపెట్టవలసివచ్చును. దానిని బట్టి చూస్తే మొత్తము భవరోగములకు వైద్యము చాలా విలువైనది. అందువలననే జ్ఞానము వెలకట్టలేనంత ఖరీదైనదని కొందరన్నారు. మానవునకున్నవన్ని రోగములేనని తెలుపుచు **రామజోగి మందు కొనరే** అని ఒక వేదాంతి పాటరూపముగ చెప్పారు.

యోగము ఒకటే అయితే రోగములు అనేక విధములుగ ఉన్నాయన్నాము. దాని ప్రకారము చూచినట్లయితే మనము నిత్యము రోగములనే అనుభవిస్తున్నాము. యోగము లేని కాలమంతయు రోగములోనే గడిపినట్లగును. నిత్యము సర్వవేళల సర్వరోగములు కల్గియున్న మనము రోగముల బాధ నుండి బయటపడునట్లు వాటిని గురించి ఆలోచించడము లేదు. ఎపుడైన ఒక రోగము శరీరమునకున్నదని డాక్టరు చెప్పినపుడు చాలా బాధపడుదుము, దానిని బాగుచేయించు

కొనుటకు ప్రయత్నిస్తాము. ఒక రోగమునకే ఎంతో స్పందించి బాగుచేయించుకొనుటకు ప్రయత్నించు మనము ఎన్నో రోగముల కూడలి మనలో ఉన్నప్పటికీ, వాటిని నిత్యము అనుభవిస్తున్నప్పటికీ, వాటి విషయము తెలియనివారమై ఉండినందువలన వాటిని గురించి ఆలోచించడములేదు. వాటినుండి బయటపడి రక్షణ పొందవలెనని ప్రయత్నించనూలేదు. భవరోగములనుండి రక్షణనిచ్చు రక్షకుని వెదకనూలేదు. ఇప్పటికైన జాగ్రత్తకల్గి నీవు రోగములో ఉన్నావో, యోగములో ఉన్నావో ఆలోచించి చూచుకొని రోగములో ఉన్నట్లయితే యోగములో ఉండుటకు ప్రయత్నించవలెనని, రోగమునుండి యోగము నకు మంచిదారి చూపు గురువును ఆశ్రయించవలెనని, ఔషధమునకు వెలచెల్లించి రోగమును మల్లించవలెనని తెలుపుచున్నాము.

# భగవంతుడు ఎవరు?

ఆదికర్త అయిన పరమాత్మ సర్వజగత్తుకంతటికి అధిపతియై సర్వమును తానే సృష్టించి, అవి అన్ని నడుచుటకు కావలసిన పద్ధతిని ఏర్పరిచాడు. తాను ఏర్పరచిన పద్ధతికి సమస్తము కట్టుబడి ఉండునట్లు చేశాడు. సర్వప్రపంచమునకు తానే సృష్టికర్త, అధిపతి అయినప్పటికి ప్రపంచముతో తాను ఏమాత్రము జోక్యము చేసుకోక, బంధము పెట్టుకోక తాను నిర్మించిన పద్ధతిచే నడుచునట్లు నిర్మాణము చేశాడు. తాను నిర్మించిన పద్ధతికి సమస్తము ఆధీనమై ఉండి, ఆ పద్ధతి ప్రకారమే నడుచుకొనుచున్నవి. ఈ లెక్క ప్రకారము సర్వప్రపంచమును ఆధీనపరచు కొని ఆడించుచున్నది స్వయముగా పరమాత్మగాదు, పరమాత్మచే నిర్మింపబడిన ప్రత్యేకమైన విధానము. ఆ విధానమునకు లేక పద్ధతికి

ముఖ్యమైన పేరు గలదు. దానినే **'మాయ'** అనుచున్నాము. మాయకు మరికొన్ని పేర్లు కలవు. ఏసుప్రభువు దానికి **సాతాన్ (షైతాన్)** అని పేరు పెట్టగ, ఇస్లాం ప్రవక్త **సైతాన్** అని పేరుతో పిలిచాడు.

మాయ పరమాత్మచే నిర్మింపబడి, ఆయన మొదట చెప్పిన ఆదేశానుసారము తన పనిని తాను చేస్తూపోతున్నది. ప్రపంచములో మాయకు లోబడనిది ఏదిలేదు. పుట్టినవన్నియు మాయకు లోబడి ఉన్నాయి. మాయకు లోబడనిది మాయనే పుట్టించిన పరమాత్మ ఒక్కటే. మాయ పద్ధతి ప్రకారము తన ఆధీనములో ఉండు వారిని సాధారణముగ నడిపించుచుండును. అలాకాక తనకు వ్యతిరేఖముగ నడువవలెననుకొను వారికి పూర్తి విరుద్ధముగ చేయుటకు ప్రయత్నించును. ప్రకృతిసిద్ధమైన జననము, మరణము నుండి తప్పించుకోవలెనను వారందరు మాయ ఆధీనము నుండి తప్పించుకోవలెననుకొనెడి వారే. కనుక మాయకు ముక్తికావలెనను వారు వ్యతిరిక్తులు, ముక్తి కావలెననువారు ప్రపంచాధినేత అయిన మాయను ఏమిచేయలేరు. కాని మాయ అనుకొంటే ఎవరినైన ఏమైన చేయగలదు. అట్లయిన మోక్షమును ఎవరు పొందలేరు కదాయను ప్రశ్న కూడ రాగలదు.

ఎవరు జయించలేని అతిబలమైన మాయను జయించి దాని ఆధీనము నుండి బయటపడుటకు పరమాత్మ ఒక ప్రత్యేకమైన విధానమును నిర్మించాడు, అవియే ధర్మములు (జ్ఞానము). పరమాత్మ ధర్మములను ఆచరించువారిని మాయ ఎంత ఆటంకపరిచిన దాని నుండి బయటపడి చివరకు పరమాత్మనే చేరగలరు. అలా ఆచరించుటకు పరమాత్మ ధర్మములు ఫలానా అని తెలియాలి కదా! అని కొందరడుగవచ్చును. దీనికి జవాబేమనగా! ప్రపంచసృష్టి ఆదిలో మాయను తయారు చేసిన

పరమాత్మ, మాయకు ప్రత్యర్థిగ ఉండునట్లు సూత్రబద్ధమైన జ్ఞానమును, ధర్మములను కూడ తయారు చేసి పెట్టాడు. మాయపని మాయకు, ధర్మముల పని ధర్మములకు నిర్మించి పెట్టాడు. అప్పటినుండి అవి రెండు వాటివాటి పనిని నిర్వర్తించుచునే ఉన్నవి. మాయ దానికి వ్యతిరిక్తమైన ధర్మములు ప్రపంచములోని జీవరాసులకొరకే నిర్మించినప్పటికి, జీవరాసులన్ని మాయ ఎడలనే ఎక్కువ ప్రభావిత మగుచున్నవి. ధర్మముల ప్రక్క చేరలేకపోవుచున్నవి. దేవుడు తనకిచ్చిన అధికారము వలన మాయ మానవులందరిని తనవైపుకు లాగుకొనుచున్నది. తన పక్షమే అందరికి మంచిగ కనిపించునట్లు చేయుచున్నది. దీనికి కారణము మాయ యొక్క ఫలితము ప్రత్యక్షముగ ఉన్నది. ధర్మముల యొక్క ఫలితము ప్రత్యక్షముగ లేదు. మాయ మరియు దానికి వ్యతిరిక్తమైన జ్ఞానము వాటివాటి ఉనికిని కోల్పోకుండ ఉండుటకు వాటి ప్రయత్నము అవి చేయుచునే ఉన్నవి. ఆ ప్రయత్నములలో మాయ తాను కూడా జ్ఞానమూ ధర్మములవలే నటిస్తూ, తన ప్రాబల్యమును పెంచుకొనుచున్నది. అలాగే జ్ఞానము కూడ మాయవలే నటిస్తు తన ప్రాబల్యమును పెంచుకోవాలని చూస్తున్నది. ఏదియేమైన ప్రపంచములో జ్ఞానముకంటే మాయ యొక్క ప్రాభల్యము అధికముగా ఉండుటకు ముఖ్యమైన కారణమొకటి కలదు. జ్ఞానమునకు ఒకవంతు బలముండగా, మాయకు వేయివంతులు బలమెక్కువ ఉండునట్లు ముందే నిర్ణయించబడి ఉన్నది. ఒకవంతు బలము కూడ జ్ఞానమునకు సరిగా లేదు. కనుక గీతలో భగవంతుడు మనుషులలో వేయింటికొకడు సిద్ధికొరకు ప్రయత్నించుట కూడ అరుదుగ ఉందురని తెలియచేశాడు.

భూమి మీద కొందరు గురువులుగా బయలుదేరి జ్ఞానము బోధించుట, ఉపదేశములు ఇచ్చుట జరుగుచున్న పనియే. మాయ

వారిమీదనే దృష్టిని సారించి వారిని మంచి జ్ఞానులుగ బయటికి కనిపించునట్లు చేసి, వారిని చాలామంది ఆశ్రయించునట్లు చేయుచుండును. అంతేకాక బోధించునదంతయు పరమాత్మ జ్ఞానము గానీ ధర్మముగానీ లేనన్నట్లు జాగ్రత్తపడి, జ్ఞానము దేవుడు అను పదములు ఉపయోగించుచునే, ఎంతో ఆకర్షణీయమైన బోధలు చేయించుచుండును. ఆ బోధలలో ఒక్క శాతము జ్ఞానముండగా, 99% మాయకు సంబంధించిన జ్ఞానమే ఇమిడి ఉండును. ఇది మాయకు సంబంధించిన జ్ఞానమని పరమాత్మలోనికి ఐక్యము చేయునది కాదని ఎవరు గుర్తించలేరు. అదియే మాయయొక్క గొప్పతనము. ఎంతో పెద్ద ఆధ్యాత్మిక గురువన్నప్పటికీ, స్వచ్ఛమైన ఆధ్యాత్మికమును బోధిస్తున్నప్పటికీ, వారియందు కూడ చివరకు 95% ధర్మములు లేని మాయ యొక్క బోధయే ఉండును. ఇలా కనిపించు గురువులలో కూడ ఉండి వారిచేతనే జ్ఞానమన్నట్లూ, ధర్మములన్నట్లూ అధర్మములను బోధిస్తుండుట వలన, దేవుని తెలుసుకోవాలనుకొనువారు కూడ మాయలోనే చిక్కుకొని పరమాత్మ వైపు ప్రయాణించలేకున్నారు. ఉన్న ప్రజలలో వేల సంఖ్యలో కొందరికి మాత్రమే జ్ఞానము మీద ఇచ్ఛ కలుగగా, వారిని కూడ మాయ గురువుల రూపములోయుండి బోధిస్తూనే తనవైపుకు లాగుకొనుచున్నది. కావున గీతయందు విజ్ఞానయోగములో మోక్షము కోరువారిలో చివరకు ఎవరోనన్ను తెలుసుకోగలిగేది అన్నాడు. మాయ అనేక స్థాయిలలో అనేక రకముల గురువులను ఆవహించి ఉండుట వలన జ్ఞానమును కోరువారు ఏదో ఒక గురువును ఆశ్రయించి మాయ ఆవరణములోనే చేరి పోవుచున్నారు. అందువలన నిజమైన పరమాత్మ జ్ఞానము దొరకాలంటే అనేక జన్మల సంస్కారముల వలననే లభించునని గీతయందన్నాడు. అనేక అంటే వందలుకావచ్చు లేక వేలుకావచ్చు

ఇక్కడ కొందరికొక అనుమానమురావచ్చును. అది ఏమనగా! గురువులనందరిని మాయ మభ్యపెట్టి భ్రమింపజేసి, తన బోధనే బోధిస్తున్నదన్నపుడు, ఎవరూ పరమాత్మ జ్ఞానము బోధించువారే లేనపుడు, అనేక జన్మల తర్వాతనయిన వారికి పరమాత్మ జ్ఞానము ఎట్లు లభించును? అని అడుగవచ్చును. దానికి మా సమాధానము, పరమాత్మ యొక్క జ్ఞాన ధర్మములను నూటికి నూరుపాల్లు బోధించు గురువులు భూమిమీద ఉంటే పరమాత్మ పుట్టవలసిన అవసరమే లేదు కదా! అలా తన ధర్మములు తెలిసి బోధించు వారు లేని దాని వలన తప్పక పరమాత్మయే స్వయముగ భూమిమీద భగవంతునిగ పుట్టి బోధించ వలసి వస్తున్నది. అందువలన ధర్మములకు గ్లాని ఏర్పడినపుడు నేను జన్మించి నాధర్మములను తెలియజేస్తానని గీతయందు దేవుడు చెప్పాడు.

ధర్మముల తరుపున పరమాత్మయే స్వయముగ గురువుగా ఉద్భవించి, తన దైవధర్మములను పూర్తిగ తెలుపుట వలన మాయకు ఇబ్బంది ఏర్పడి, గురువుల మీదనే తన పట్టు తప్పిపోవు పరిస్థితి ఏర్పడును. కనుక అటువంటి పరిస్థితి రాకుండా మాయకూడ స్వయముగా జన్మ ఎత్తి, భగవంతునికంటే గొప్పగ కనిపించి, తనే భగవంతుడనని పేరుగాంచు చుండును. మాయ అవతార భగవంతుని ముందర అసలైన పరమాత్మ ఆవతారము కూడ తక్కువగ ఉండును. అందువలన నిజమైన భగవంతుని జ్ఞానులు సహితము గుర్తించలేరు. కాని మాయ భగవంతుని అజ్ఞానులు సహితము గుర్తించగలరు. భూమి మీద ధర్మములు తెలియనపుడు, అనేక జన్మ సంస్కారపరులకు ధర్మములు అవసరమైనపుడు, వేల సం॥రాలకో లేక లక్షల సం॥రాలకో పరమాత్మ జన్మము ఎత్తవలసి వస్తున్నది. మాయ మాత్రము పరమాత్మ జన్మకు ముందు వెనుక

అవతారమెత్తడమే కాక, పరమాత్మ భగవంతునిగ జన్మించినపుడు తాను కూడ మూడు నాలుగుచోట్ల జన్మించి, అందరిని తనవైపు ఆకర్షించు కొనుటకు ప్రయత్నించును. పరమాత్మ భగవంతునిగా ఏ దేశములో పుట్టునో మాయకూడ అదే దేశములో పుట్టుచున్నది. పరమాత్మ ఏ ప్రదేశములో పుట్టునో, ఆ ప్రదేశమునకు చుట్టుప్రక్కల మూడు లేక నాలుగు జన్మలు కలిగి ఉండును. పరమాత్మ కేవలం జ్ఞానధర్మములనే బోధించగ, మాయకూడ ధర్మములు లేని ఆధ్యాత్మికమునే ఆకర్షణీయముగా చెప్పుచుండును. తినెడి ఆహారము రుచిగా ఉన్నను అందులో విటమిన్లు లేనట్లు మాయ బోధించునది నిజజ్ఞానమే అన్నట్లుండును, కాని అందులో ధర్మయుక్త జ్ఞానముండదు. మాయ ప్రపంచమునకే అధిపతియై ఉన్నది. కావున ప్రపంచములోని ఏ విషయమునైన తాననుకొన్నట్లు చేయగలదు. పరమాత్మ జన్మ కేవలము ధర్మములనే బోధించగ, మాయ తనది నిజమైన జ్ఞానమన్నట్లు బోధించడమేకాక ప్రపంచములోని ఏ అద్భుతమైన చేసి, దానిని దైవమహత్యమనుకొనునట్లు భ్రమింపచేయగలదు. బంగారును రాయిగా, రాతిని బంగారుగ చూపగలదు. ఉన్న వస్తువును లేకుండ పోవునట్లు, లేని వస్తువులను ఉండునట్లు చేయగలదు. రోగమును సృష్ఠించగలదు మరియు లేకుండ చేయగలదు. అమెరికాలో ఉండి ఇండియాలో, ఇండియాలో ఉండి అమెరికాలో కనిపించగలదు. చెప్పేది ధర్మములు కాకున్న అంతా ధర్మప్రచారమే చేయునట్లు తెలియగలదు. అన్నిటికి అధిపతియైన దానివలన ఎన్ని కోట్ల డబ్బునైన సృష్ఠించగలదు. ఎంతటి వారిచేతనైన పాదాభివందనము చేయించగలదు. తానే నిజదైవముగా ప్రత్యక్ష దైవముగా అందరిచేత అనిపించగలదు.

పరమాత్మ భూమి మీద భగవంతునిగ (గురువుగ) పుట్టితే తన ధర్మముల ప్రకారము తాను నడుచుకొనుచు, తన ధర్మములనే బోధించుట

తన పనియైన దాని వలన లక్షల సంఖ్యలోని మనుషులలో ఆయన బోధను ఒకరైన గుర్తించగలరను నమ్మకము లేదు. ఎవడైన గుర్తించి వానికి కొంత నమ్మకమేర్పడినప్పటికి వాని తలలోని మాయ ఏదో ఒక విధముగా దానిని వమ్ముచేయును. మాయనే సృష్ఠించిన పరమాత్మ మాయ ముందర తక్కువగా కనిపించడమేమిటని కొందరడుగవచ్చును. దానికి జవాబేమనగా! పరమాత్మ మాయకంటే ఎప్పటికి గొప్పవాడే. కాని పరమాత్మ భూమిమీద జన్మించి భగవంతుడైనపుడు మాత్రము మాయకంటే బలహీనుడే! అందువలన పరమాత్మయే స్వయముగ శ్రీకృష్ణునిగ పుట్టిన సమయములో ఆయనకు కూడ శత్రువులనేర్పరిచి కంసుని చేత తిట్టించడమే కాక అనేక సమయములలో అనేక ఇబ్బందుల పాలుచేసినది. జారునిగా, చోరునిగా చూపించింది. భూమి మీద మాయకంటే భగవంతుడు బలహీనుడుగాన ఇది నారాజ్యము కాదు, నారాజ్యము వేరుగనున్నది. నారాజ్యమునకు రాజును నేనే భగవంతుడు అన్నాడు. అంతేకాక ఇది జనన మరణములు గల స్థలము, దీనికి అధిపతి మాయ. జనన మరణములు లేని మరియొక స్థలము కలదు, అచటికి చేరండని అచట నేను తప్ప ఎవరులేరని కూడ చెప్పాడు.

మాయ కూడ భగవంతునివలె జన్మించుతున్నదంటున్నారు కదా! పరమాత్మ భగమునుంచి సజీవముగ బయటికి వస్తున్నాడు కావున ఆయనను భగవంతుడు అనవచ్చును. మాయ ఏ విధముగ జన్మ తీసుకొంటున్నది సాధారణ మానవులవలెనా లేక భగమునుండి వచ్చు భగవంతునిగనా? అని కొందరడుగవచ్చును దానికి మా వివరమేమనగా! మాయ భగవంతునివలె చలామణి అగును, కాని భగమునుండి సజీవముగ పుట్టలేదు, కావున భగవంతుడు కాదు. అట్లని సాధారణ మనుజులవలె

కూడ పుట్టలేదు. మాయ తల్లి గర్భములోపల నుండి కానీ, గర్భము బయట కానీ జన్మపొందలేదు. అటుకాక ఇటుకాక ఏ విధముగా జన్మించునదనిన భూమి మీద పరమాత్మ జన్మించు అవకాశము గల ప్రాంతమును మాయ ముందుగానే పసిగట్టగలదు. అటువంటి ప్రాంతమును తెలుసుకొన్న మాయ, ఆ ప్రాంతము చుట్టు ప్రక్కల గల సాధారణ మనుషులలో ఒకనిని గుర్తించి ఎన్నుకొని వానియందు కొంత కొంతగా ప్రవేశించి పూర్తిగా నిండుకొనును. అట్లువానియందు పూర్తిగా నిండుకొనుటకు ఆరునెలల నుండి సం॥ కాలమైన పట్టును. అలాపూర్తి ప్రవేశించిన వానినుండి తన పూర్తి స్థాయికార్యములు మొదలు పెట్టును. మాయ ప్రవేశించువాడు బీదవాడుకావచ్చును, యుక్తవయస్కుడు కావచ్చు లేక ముసలివాడుకావచ్చును. ఎవనియందు మాయ ప్రవేశించినా దానిని మాయ యొక్క జన్మ అనవచ్చును. మాయ ప్రవేశించిన వ్యక్తికి తనయందు మాయ పూర్తిస్థాయిలో ఉన్నదని ఏమాత్రము తెలియదు. అందువలన మొదట తన ద్వారా జరుగుకొన్ని మహత్యములు ఎలా జరిగినవో తనకే తెలియకుండును. తరువాత తనకేదో మహత్తుగలదనీ, తాను అందరివలే సామాణ్యుడుకాదనీ, తను ప్రత్యేకమైన మనిషినని అనుకొనును. ఇలా మాయ కొందరియందు ప్రవేశిస్తున్నది, కాని క్రొత్త శరీరములో జన్మించనూలేదు, పరమాత్మవలే పుట్టనూలేదు, కావున మాయ ఎప్పటికి భగవంతుడు కాదు. భగవంతునివలే కనిపించినప్పటికీ నిజముగా భగవంతుడు కాదని తెలియాలి.

ఇంకొక విచిత్రమేమిటంటే మాయ జన్మించితే రెండు మూడు చోట్లయినా లేక ఒకచోటైనా ఉండి, తన మహత్యమును నూటికి నూరుపాల్లు చూపగలదు. కాని పరమాత్మ జన్మించి భూమిమీద

ఉన్నప్పుడు శరీరములోని జీవునిగ, ఆత్మగ, పరమాత్మగ ఉంటూ, కొన్ని సమయములలో కేవలము సాధారణ జీవునిగ కష్టసుఖములను అనుభవిస్తుండును. కొన్ని సమయములలో మాత్రము ఆత్మగ అనుభవము లకు అతీతముగ ఉండును. ప్రత్యేకించి కొన్ని సమయములలో మాత్రము ఆదికర్త అయిన పరమాత్మగ ఉండగలడు. **భగవద్గీతలో శ్రీకృష్ణుడు జీవునిగ, ఆత్మగ, పరమాత్మగ మూడుస్థాయిలలో మాట్లాడినట్లు అర్థమగుచున్నది.**

పరమాత్మ జన్మలో ఉన్నప్పుడు జీవునిగ ఉన్న సమయములో మాయ హింసిస్తుంది, ఆత్మగ ఉన్న సమయములో ద్వేషిస్తుంది మరియు ధూషిస్తుంది, పరమాత్మగ ఉన్నప్పుడైతే ఆయన దగ్గర పూర్తి భక్తి వినయముకల్గి ఆయన మాట ప్రకారము నడుచుకుంటుంది. శ్రీకృష్ణ జన్మలో తామరాకు మీద నీరంటనట్లు కర్మ అంటకుండ ఉన్నానని జీవునిగ, శరీరములో అగ్నినై తిన్న ఆహారమును జీర్ణము చేయుచున్నానని ఆత్మగ, క్షయమును వృద్ధిని కల్గించు కాలుడను నేనేనని, ఎల్లలులేని విశ్వరూపమును నా అనుగ్రహమున నీకు చూపానని పరమాత్మగ మాట్లాడిన సందర్భములు గలవు. పరమాత్మ ఆధీనములోనున్న మాయ పరమాత్మ ఎడల మాత్రము పూర్తి భక్తిగా వినయముగా ఉంటూ, మిగతా వారి ఎడల తన కర్తవ్యమును తాను నిర్వర్తించుచున్నది. అంతేకాక జ్ఞానము, యోగము, ధర్మములకంటే అతీతునిగనున్న పరమాత్మను లేక భగవంతున్ని పూర్తి విశ్వసించి ఆరాధించువానిని మాయ ఏమియు చేయలేదు. వాడు పూర్తి అధిపతియైన పరమాత్మనే నేరుగ నమ్మినవాడు, కనుక మాయ వాని ఎడల ఏమి చేయలేదు. అట్టివాడు ఆ జన్మలోనే మోక్షము పొందవచ్చును. అందువలననే గీతయందు పరమాత్మ **మామేవ**

**యే ప్రపద్యన్తే మాయామేతాం తరంతితే'** ఎవరైతే నన్ను ఆరాధించుచున్నారో వారు మాయనుండి సులభముగ దాటి పోగలరన్నాడు. కావున మాయను తయారు చేసివుంచిన పరమాత్మనే ఆరాధించవలెను. అట్లు ఆరాధించని ఎడల జగతి మీద సర్వ హక్కులు కల్గిన మాయ, జగతిలో తానే నిజమైన దైవముగ కూడ కనిపిస్తుంది. పరమాత్మ విభూతులు ఎంత గొప్పవో, అంతకంటే గొప్పవిగ భూమిమీద మాయ యొక్క విభూతులు కనిపించును. మేము ఎంత చెప్పినప్పటికీ పరమాత్మ జ్ఞానము అనేక జన్మల సంస్కారము గలవారికే అర్థమగును. వారిలో ఇంకనూ సంస్కరింపబడిన వారికే భగవంతుడు అర్థమగును. ఎంత అర్థమైనప్పటికి నేనే గొప్పయను మాయ మాటలు వినని వారు అరుదుగా ఉందురు. గీత చివరిలో భగవంతుడు '**మన్మనాభవ మద్భక్తో మద్యాజీమాం నమస్కురు**' నన్నే నీ మనసులో గొప్పగ పెట్టుకొనుము, నాకే భక్తిగ ఉండుము, నన్నే నమస్కరించుము, నాయందే కలిసి పోవుదువనగా! మాయ కూడ నన్నే గొప్పగ పెట్టుకొనుము, నన్నే నమస్కరింపుము, నీకు ఏ కష్టములు రాకుండా ఏ లోటు లేకుండా చూస్తానంటుంది. ఏది వింటారో ఎటువైపు పోతారో మీ ఇష్టము.

# మనస్సుకు ఆకారమున్నదా?

మన శరీరములలో మనస్సు ఎంతో ప్రాముఖ్యమైనది. దానిని వేదాంతులు ఎన్నో రకాలుగ వర్ణించారు. మనస్సు దొరుకునది కాదని పాదరసముతో కొందరు పోల్చగ, వాయువేగము కలదని రెక్కలగుఱ్ఱముగ కొందరు పోల్చారు. మనస్సును బంధింపలేమని, వాయువును మూట గట్టుటతో సమానముగ మనస్సును బంధించుటను పోల్చగ, నీచమైన

యోచనలు చేయునదని పందిగ, చంచలమైనదని కుక్కగ, కోతిగ, లొంగనిది బలమైనదని ఏనుగుగ ఎందరో పోల్చిచెప్పారు. ఎన్ని విధముల చెప్పిన అవన్నియు పోలికలేగాని వాస్తవరూపములు గావు. ప్రకృతితో కూడిన ఆత్మ జీవాత్మలకే రూపమున్నపుడు ప్రకృతితో తయారైన మనస్సుకు ఆకారము తప్పక ఉండును. మనోరూపమును గూర్చి తెలుసుకొనుట అందరికి ఆవశ్యకతయే. ఆధ్యాత్మిక విద్యలో ఎంతో ప్రాధాన్యతగల మనస్సును గూర్చి ఇపుడు తెలుసుకొందాము.

మన శరీరములోని మనస్సు యొక్క పని ఏమనగా! అంతరేంద్రియ విషయములను బయటి ఇంద్రియములకు, బాహ్యేంద్రియ విషయములను లోపలి ఇంద్రియములకు తెలియజేయడము. అటు వంటపుడు మనస్సు లోపలి ఇంద్రియముల నుండి బయటి ఇంద్రియముల వరకు, బయటి ఇంద్రియముల నుండి లోపలి ఇంద్రియముల వరకు వ్యాపించి ఉన్నది. దీనినిబట్టి బయటి ఇంద్రియముల వరకు మనస్సు యొక్క చిత్రమును చిత్రీకరించుకొని చూచిన ఎడల శరీర ఆకృతియే మనస్సు కూడ పొందుచున్నది. శరీరమంతా వ్యాపించిన ఆత్మ శరీర ఆకృతిని పొందినట్లు, మనస్సు కూడ శరీర ఆకృతిని బోలియున్నది. దీనిని బట్టి శరీరములో ఆత్మ మరియు మనస్సు ఒకే ఆకృతినిబోలి ఉన్నవని తెలియుచున్నది.

శరీరమునకు నిద్ర మెలుకువలను స్థితులు మనస్సును బట్టి కలుగుచుండును. శరీరములోని జీవునకు గానీ, ఆత్మకు గానీ నిద్ర మెలుకువలు లేవు. ఆ రెండు ఎల్లపుడు ఒకే స్థితికల్గి ఉండును. మనస్సు మాత్రము నిద్ర మెలుకువగల్గి ఉన్నది. మనస్సు మెలుకువలో శరీరమంతా వ్యాపించి ఉండి శరీర ఆకృతిని బోలియుండును. నిద్రలో

అదే మాదిరి ఉండదు. మెలుకువలో శరీర ఆకృతిగల్గి ఆత్మవలె సమానముగానున్న మనస్సు, నిద్రలో ఆకృతిని కోల్పోయి ఒక బిందువుగ ఏర్పడుచున్నది. మెలుకువ వచ్చిన వెంటనే శరీరమంతా వ్యాపించి శరీర ఆకృతిని చెందుచున్నది. మెలుకువలో శరీర ఆకృతిగల్గిన మనస్సు తిరిగి నిద్రలో బిందువుగ మారుచున్నది. గోధుమపిండిని తడిపిముద్ద చేసినపుడు ఒక ఉండగ ఉండి చపాతిగ తిక్కినపుడు వెడల్పుగ మారినట్లు తిరిగి చపాతిగ తిక్కిన దానిని ముద్దగ కలిపితే ఉండగ తయారయినట్లు, మనస్సు ఒక బిందువుగ నిద్రలో ఉండి మెలుకువలో వెడల్పుగ వికసించుకొని శరీరమంతా వ్యాపించి శరీరాకృతినిబోలుచున్నది.

మెలుకువలో శరీరమంతా వ్యాపించిన మనస్సు నిద్రపోవునపుడు శరీర అవయవములనుండి ముడుచుకొనుటకు మొదలుపెట్టును. అలా మనస్సు ముడుచుకొనునపుడు చేతిలో వస్తువు జారిపోవడమో, కూర్చున్న పట్టు తప్పిపోవడమో జరుగుచుండును. కనుక నిద్రపూనువారు కూర్చున్నపుడు తూగడము జరుగుచుండును. అలాగే చేతి స్పర్శను గ్రహించక చేతివరకున్న మనస్సు ముడుచుకొనుచుండును. కనుక చేతిలో పట్టుకొన్న వస్తువు చేజారిపోవును. అలాగే నిద్రపూనునపుడు డ్రైవింగ్ చేయువాని యొక్క చూపును గ్రహించిన, అచట నుండి మనస్సు ముడుచుకొనుట వలన ముందేది ఉన్నది బుద్ధికి తెలియక పోవడము చేత ప్రమాదములు కూడ జరుగుచుండును. ఇలా నిద్రపోవుటకు మొదలు పెట్టునపుడు శరీరేంద్రియముల నుండి మనస్సు ముడుచుకొని తన స్వస్థానమైన బ్రహ్మనాడిలో గల మెదడునందున్న పిట్యూటరి గ్రంథి దగ్గర బిందువుగ (కుప్పగ) మారిపోవుచున్నది. అందువలన నిద్రపూను వారు తమతమ పనులు మాని పడుకొందురు. అలా కాకపోతే ఇంద్రియ

విషయములు లోపలికి చేరక చేయుచున్నపని చెడిపోవడము, ప్రమాదములు జరగడము కల్గును. నిద్రపూనిన వారి అవయవములు పనిచేయక పడియుండును. ఎందుకనగా లోపలి ఆజ్ఞలు ఇంద్రియములకు లేవు. అలాగే నిద్రలో బుద్ధి యోచనలు కూడ ఉండవు. ఎందుకనగ బయటి ఇంద్రియ విషయములు లోపలికిరావు. బయటి లోపలి అనుబంధము (కనెక్షన్)గ ఉన్న మనస్సు లేనపుడు బయటి లోపలి ఇంద్రియములకు పనిలేక విశ్రాంతి కల్గును, దానినే నిద్ర అందురు. మెలుకువలో మనస్సు తన కేంద్రమునుండి వికసించుకొని అన్ని ఇంద్రియముల వరకు ప్రాకి ఉండి, వాటి విషయములు లోపలికి, లోపలి విషయములు బయటికి తెలుపుచుండును. అన్ని భాగములకు మనస్సు ద్వార పని కల్గిన స్థితినే మెలుకువ అనుచున్నాము. ఇపుడు మనస్సుకు ఆకారమున్నదని అర్థమైందనుకొంటాము. ఇప్పటికి కొందరు అమోదించినా, కొందరు అర్థముకాక మనస్సుకు ఆకారములేదని వాధించుచుందురు. అటువంటి వారి బుద్ధి యొక్క ఆకారము మందముగ ఉన్నదని అనుకోగలము.

**గమనిక :-** కొందరి మనస్సు నిద్రలోనికి వేగముగా పోవును. కానీ మెలుకువలోనికి వారి మనస్సు ఆలస్యముగా వచ్చును. కొందరికి మనస్సు నిద్రలోనికి పోవునపుడు ఆలస్యముగా పోవును. కానీ అటువంటి వారికి వారి మనస్సు వేగముగా మెలుకువలోనికి వచ్చును.

# ఆత్మకు ఆకారమున్నదా?

ప్రతి జీవరాసి శరీరములోను జీవునితో పాటు ఆత్మ, పరమాత్మలు ఉన్నవి. పరమాత్మ శరీరముల లోపల బయట ఉండగ, ఆత్మ శరీరముల

లోపల మాత్రముండును. **శరీరములోని జీవాత్మ, ఆత్మలు మహా భూతములు కాగ, ప్రకృతిలోని ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి పంచభూతములై ఉన్నవి.** పంచభూతములతో ఏర్పడిన శరీరములో మహాభూతములు రెండు కలిసి నివశిస్తున్నవి. శరీరములో పరమాత్మ సంబంధమైన జీవాత్మ, ఆత్మలు (మహాభూతములు) రెండును మరియు ప్రకృతి సంబంధమైన ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి ఐదు భూతముల నిలయమే సర్వప్రపంచమంత నిండియున్న సర్వజీవరాసులని తెలియుచున్నది.

ప్రపంచములోని పంచభూతములకు ఆకారమున్నది. అలాగే శరీరము లోపలనున్న పంచభూతముల భాగములకు ఆకారమున్నది. ప్రపంచములోని ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి మనందరి దృష్టికి తెలియునవే. అలాగే శరీరములోపల గల పది బాహ్యేంద్రియములైన విషయజ్ఞానమును తెలుపు కన్ను, చెవి, ముక్కు, నాలుక, చర్మము, ఐదునూ, పనులు చేయు కాళ్లు, చేతులు, నోరు, గుదము, లింగము ఐదు కలిసి మొత్తము పది భాగములు పైకి కంటికి కనిపించునవిగ ఉన్నవి. శరీర శక్తులకు, పంచవాయువులకు ప్రధాన పాత్రలు నిర్వహించు **మనస్సు, బుద్ధి, చిత్తము, అహమునకు కూడ ఆకారములున్నవి.** ఇవి జ్ఞానదృష్ఠికి గోచరించునవై ఉన్నవి. ఇలాగ శరీరములోని 24 భాగములలో స్థూలమైనవి కంటిదృష్ఠికి, సూక్ష్మమైనవి జ్ఞానదృష్ఠికి తెలియుచున్నవి. ఈ విధముగ పంచభూతములకు ఆకారములున్నవని తెలియుచున్నవి.

మహాభూతములైన జీవాత్మ, ఆత్మలకు కూడ సూక్ష్మ ఆకారములు ఉన్నవని జ్ఞానదృష్ఠికి తెలియుచున్నది. ఒక విధముగ జీవాత్మ ఆత్మలకు

ఆకారముందనుట కొందరికి చాలా విచిత్రముగ, శుద్ధ అబద్దముగ తోచినప్పటికి ఇది నూటికి నూరుపాల్లు సత్యము. ఇపుడు శరీరములో అగ్రగామి అయిన ఆత్మకు ఆకారమెట్లున్నదో తెలుసుకొందాము. శరీరమునకు చైతన్యము నిచ్చునది ఆత్మ. శరీరము కదులుచున్నదంటే అది ఆత్మశక్తి చేతనే జరుగుచున్నది. అంతే కాదు మనస్సు తెలిపిన ఆజ్ఞప్రకారము కదిలే ఇచ్ఛాధీన కండరములైన చేతులు కాళ్లు గానీ, తెలియకుండానే కదిలెడి అనిచ్ఛాధీన కండరములైన గుండె, ఊపిరితిత్తులు, కనురెప్పలు మొదలగునవి గానీ ఆత్మ యొక్క చైతన్యము చేతనే కదులుచున్నవి. అసత్తు అయిన శరీరములో సత్తు అను పదార్థమై శరీరమునకు సత్తువనిచ్చునదై ఆత్మ ఉన్నది. శరీరములో ఎంత వరకు ఆత్మ వ్యాపించి ఉండి చైతన్యమై ఉన్నదని తెలుసుకొనిన ఆత్మ శరీరమంతా వ్యాపించి ఉన్నదని తెలియుచున్నది. శరీరమంతా అనగ చివరి అంచు అయిన చర్మము దానిమీద రోమములు వరకు వ్యాపించి ఉన్నది. అంతే కాక చేతి కాళ్ల వ్రేళ్ళకున్న గట్టి చర్మమైన గోర్లవరకు కూడ వ్యాపించి ఉన్నది. గోర్లు వెంట్రుకల వరకు వ్యాపించి ఉండుట వలననే వాటి వరకు స్పర్శ పెరుగుదల గలదు. ఆత్మ శరీములోపలంతయు మరియు బయట శరీర అంచువరకు వ్యాపించినందువలన, శరీరమంతటిని చిత్రించి ఆత్మ స్వరూపమును తెలుసుకోవచ్చును.

మనిషిలోగాని, జంతువులోగాని దేనిలోనైనగాని దాని శరీరము యొక్క ఆకృతియే దానిలోని ఆత్మ పొంది ఉన్నదని తెలియుచున్నది. దీని ప్రకారము చూచినట్లయితే, ఏ పాత్రలో ఉన్న నీటికి ఆ పాత్ర ఆకారమే వచ్చినట్లు ఏ శరీరములో ఉన్న ఆత్మకు ఆ శరీర ఆకృతియే ఉన్నది. ఈ సూత్రము ప్రకారము పొడవువాని శరీరములో పొడవు

ఆత్మ, పొట్టివాని శరీరములో పొట్టిఆత్మ గలదని చెప్పవచ్చును. శరీరము అంచు వరకు వ్యాపించిన దానివలన అందమైన శరీరములో అందమైన ఆకృతిగల ఆత్మ, అందహీన శరీరములో అందహీన ఆత్మ గలదని చెప్పవచ్చును.

ఆత్మకు ఆకారము లేదనువారు చాలామంది కలరు. అలా ఆకారము ఉంటే వేదాంతము వ్రాసిన పూర్వకాల పెద్దలు ఎప్పుడో వ్రాసి ఉండెడివారు కదా! వారికి తెలియనిది వీరికి తెలుసునాయని అడుగువారు కూడ ఉండవచ్చును. దానికి మా జవాబు ఏమనగా! పూర్వకాలములో పెద్దలు కనిపెట్టని రైళ్లు, బస్సులు, టీవీలు, రేడియోలు, కంప్యూటర్లు ఈ కాలము వారే కనిపెట్టారు కదా! అలాగే వారికి తెలియని జ్ఞానమును నేడు తెలియకూడదను సిద్ధాంతము లేదు కదా! ఇప్పటికీ సంశయమున్న వారికి నేనడుగు ప్రశ్నలకు జవాబులు వెదకండి. మా ప్రశ్నలే మీ సంశయములకు జవాబులగును.

1. ఆత్మ శరీరమంతా వ్యాపించి ఉన్నదా? లేదా?
2. పాత్రలో ఉన్న నీరు పాత్ర రూపం ధరిస్తుందా లేదా? అట్లే శరీరములో ఉన్న ఆత్మ శరీర రూపము ధరిస్తున్నదా లేదా?
3. పాత్రను బట్టి నీటి రూపమున్నట్లు, శరీరమును బట్టి ఆత్మకు రూపము ఉన్నదా లేదా?

చైతన్యముగ (సత్తుగ) ఉన్న ఆత్మ శరీరమంతా వ్యాపించి కదలిక నిచ్చునదై ఉండును. కాని కొందరిలో పూర్తి శరీరమంత వ్యాపించక, ఒక చేతి భుజము వరకు మాత్రము వ్యాపించి ఉండి, వాని చేయికి కదలికనివ్వదు. అపుడు వాడు చేయి ఉండి కుంటివాడిగ ఉండును. వానిచేయిని వాడు కదలించలేడు. వానిని అడిగిన నాచేయి సచ్చుపడి

పోయిందని అనును. పూర్వమయితే సత్తుపడి పోయిందని అనెడివారు. కాలక్రమమున **సత్తు సచ్చుగా** మారినదని తెలియవలెను. సత్తుయే ఆత్మని కూడ తెలియవలెను. చేయి ఉండి చేతిలో చైతన్యము లేని వాని యొక్క ఆత్మస్వరూపము చేయిలేని ఆకారమును పోలియుండును. శరీరమునకు చేయి ఉన్నను ఆత్మ ఆకారమునకు చేయిలేదు.

ఒక శరీరములోని అన్ని భాగములకు కదలికలున్నవి. కాని చేయికి మాత్రము స్పర్శలేదు. అతను ఏ వస్తువును తాకినది ఆ చేయికి తెలియదు. అలా స్పర్శ లేనపుడు ఆ శరీరములోని ఆత్మ ఆకార మెలాగున్నదని చూచిన అది శరీరమును పోలిన సంపూర్ణాకారము కలిగి ఉండును ఆ చేయికి కుంటు ఉండదు. ఎందుకనగా ఆత్మ చేయి వరకు వ్యాపించి కదిలించుచున్నది. అందులో లేనిది స్పర్శ అను తన్మాత్రగాని ఆత్మగాదు. కావున స్పర్శలేని చేయి ఉన్న శరీరములోనైనా వాటి శరీరభాగములు వాటివాటి పనిచేయకున్ననూ, ఆత్మ అక్కడ వరకు వ్యాపించి ఉండిన ఎడల ఆత్మ కుంటిదికాదు. బుద్ధి దానియొక్క పనిచేయని వానిని తిక్కవాడు అనవచ్చును. కన్ను దానియొక్క పనిచేయని వానిని గ్రుడ్డివాడనవచ్చును. చెవి పని చేయని వానిని చెవిటివాడు అనవచ్చును. తిక్కవానియందును, చెవిటివానియందును, గ్రుడ్డివాని యందును శరీరములో ఆత్మ అంతటా వ్యాపించి ఉన్నది. కనుక ఆత్మ గ్రుడ్డిది, చెవిటిది, తిక్కది కాదు, దానికి అంగలోపము లేదు. ఆత్మ వ్యాపింపని శరీరభాగములో మాత్రమే ఆత్మ ఆకృతి లేదు. అక్కడది అవిటిదే అగును. ప్రపంచములో పరమాత్మకు మాత్రము ఆకారము లేదు. శరీరములో చైతన్యమై ఉండి, జీవున్ని కదిలించు దైవస్వరూపమైన ఆత్మకు కూడ ఆకారమున్నదనీ, అందులోను కొన్ని శరీరములలో

శరీరమును బోలు అంగవైకల్యమైన ఆకారమును ఆత్మ కల్గియున్నదనీ, తెలియుట వలన ఆత్మ వివరమును తెలిసినట్లగును.

శిశు శరీరము పుట్టినపుడు అందులోని ఆత్మ ఆ శరీర ఆకృతినే బోలియుండి, అది పెరుగుచున్నకొలది ఆత్మయు పెరిగి పెద్దదగును. అలాగే శరీరములోని అన్నిటి పరిమాణము పెరుగును. ఒకే జన్మలో శరీరములోని మనస్సు పరిమాణము సందర్భానుసారముగా మారు చుండును. కాని ఆత్మ పరిమాణము సందర్భానుసారముగా మారదు. ఒక శరీరములో ఉన్నపుడు దాని ఆకారమునే ఆత్మ పొందియుండును. జీవుడు శరీరమును మారినపుడు జీవునితో పాటు ఆత్మయు శరీరమును మారి, జీవుడు ధరించిన శరీరమును చేరి, అచటి శరీరాకృతిని పొందుచున్నది. దీనిని బట్టి ఆత్మకు స్థిరముగ ఒకే రూపుండదనీ, జీవుడు జన్మలు మారినపుడు వానితో పాటు ఆత్మ శరీర ఆకృతిని పొందుచుండునని తెలియుచున్నది. శరీరములోని జీవాత్మ యొక్క పరిమాణము, కొలత శరీరము పెరుగుకొలది పెరుగుచుండును. కాని దాని ఆకృతి మారదు. మొదట ఏ ఆకృతి గలదో అదే ఆకృతి అన్ని జన్మలలో ఉండును. ఆత్మ మాత్రము అలాకాక ఒక్కొక్క జన్మలో ఒక్కో ఆకృతిని పొందుచు జీవుడు ధరించు శరీరమును బట్టి మారుచుండును.

# చందమామ

చంద్రున్ని చందమామ అని కొందరంటుంటారు. తల్లి చిన్న పిల్లవానికి అన్నము పెట్టు సమయములో, బుజ్జగించు సమయములో, సంధ్యవేళలో అదిగో చందమామ అని చూపెట్టి ఆడించుచుండును.

అందువలన చిన్నతనము నుండి చంద్రున్ని అందరు చందమామ అనియే పిలుతురు. **'చందమామ రావే జాబిల్లి రావే'...** అని పిల్లల బుజ్జగింపు పాటకూడా గలదు. పిల్లలే కాదు పెద్దలు కూడ చందమామ అనియే పిలుతురు. **'అందరికీ మామ చందమామ'** అను నానుడి కూడా గలదు. ఇలా చంద్రుడు చందమామగా అందరి మనసులలో నిలిచిపోవునట్లు మనపెద్దలు అలవాటు చేశారు.

చంద్రుడు నాకేమో **'మామ'** అయినపుడు నాభార్యకు చిన్నాన్నో పెదనాన్నో కావాలి కదా! అట్లే కొడుకుకు మామ అయినపుడు అమ్మకు తమ్ముడో, అన్నో కావాలి కదా! అట్లు ఎవరు వరుస ప్రకారము పిలువక అమ్మ, కొడుకు, భార్య, భర్త అందరూ చంద్రున్ని **'మామ'** అనుటలో ఆంతర్యమేమిటి! అన్నది ప్రశ్న. మన పెద్దలు ఏదో రహస్యము లేనిది చంద్రున్ని అందరికి మామను చేసి ఉండరు. ఆ **'చందమామ'** రహస్యమేమిటో తెలుసుకొందాము.

సకల జీవరాసులకు కదిలెడి వాటికి, కదలని వాటికి, ఏ రూపము ధరించిన వాటికైనా శరీరమును తయారు చేయు పంచ భూతములైన ప్రకృతియే తల్లి. ఆ శరీరములలో సూత్రధారియై, కదులుశక్తియై శరీరములను కదిలించి ఆడించు పరమాత్మయే తండ్రి. ఈ విషయము భగవద్గీత గుణత్రయవిభాగ యోగమను అధ్యాయములో మొదటనే చెప్పబడినది. ఒక శరీరమునకు తల్లి తండ్రి పైకి కనిపించువారున్నప్పటికీ మొత్తము ప్రపంచములోని శరీరముల కంతటికి కనిపించని తల్లిదండ్రులున్నారు. వారే ప్రకృతి, పరమాత్మలని తెలియాలి.

మానవునికి వేరువేరు జన్మలలో కనిపించెడి వేరువేరు తల్లిదండ్రులు ఉండవచ్చును, కాని అన్ని జన్మలకు శాశ్వతమైన తల్లిదండ్రులు ప్రకృతి పరమాత్మలని తెలియాలి.

సర్వులకు తండ్రియైన పరమాత్మ కనిపించకున్నాడు. తల్లియైన ప్రకృతి పంచభూతములుగా కనిపిస్తూనే ఉన్నది. ప్రకృతి, పురుషుల విషయమగు వివరము తెలియాలంటే దైవజ్ఞానమవసరము. జ్ఞానము వలననే ప్రకృతినిగానీ, పురుషుడైన పరమాత్మనుగానీ తెలియుటకు వీలగును. జ్ఞానము గురువుల వలన లభించును. గురువులు బోధించుట వలన వారి మాటలద్వారా జ్ఞానము శబ్దరూపమున శిష్యుని చెవులద్వారా లోపలికి చేరుచున్నది. శబ్దరూపమైన జ్ఞానము దైవమును తెలుసు కొనుటకు ఆధారమైనప్పటికి అది శబ్దరూపమై నీ వరకు చేరుచున్నది. శబ్దము ప్రకృతిలోనిదే కావున దైవమును తెలుపు జ్ఞానము కూడ ప్రకృతిని అనుసరించి పుట్టినదని తెలియాలి.

పరమాత్మ, ప్రకృతి ఆ తరువాతది జ్ఞానము. ప్రకృతిని అనుసరించి పుట్టినది జ్ఞానము. అనుజుడు అనగా అనుసరించి పుట్టినవాడు లేక సోదరుడని అర్థము. ప్రకృతిని అనుసరించి పుట్టిన జ్ఞానమునకు ప్రకృతిలో సోదరస్థానము కల్గినదని చెప్పవచ్చును. జ్ఞానమునకు చిహ్నముగ చంద్రున్ని బ్రహ్మవిద్యలోనూ, జ్యోతిష్యశాస్త్రము లోనూ చెప్పారు. కావున జ్ఞానము, చంద్రుడు ఒకటేనని తెలియాలి. మనిషి జాతకచక్రములో చంద్రుడనుకూలముగా ఉన్నపుడే జ్ఞానము కూడా లభించునని చెప్పుట గలదు.

జ్ఞానమునకు గుర్తుగ గుర్తింపబడిన చంద్రున్ని జ్ఞానము యొక్క విలువతోనే పోల్చుకోవాలి. జ్ఞానము ప్రకృతిననుసరించి శబ్దము ద్వారా పుట్టినదని చెప్పుకొన్నాము గదా! ప్రకృతికి, జ్ఞానము అనుజుడైనపుడు జ్ఞానచిహ్నమైన చంద్రుడు కూడ అనుజునితో (తోబుట్టినవానితో) సమానమే. అనగ చంద్రుడు ప్రకృతికి సోదర సమానుడని తెలియాలి.

భగవద్గీతలో **'సర్వ జీవులకు ప్రకృతి మాత, నేను తండ్రి'**నని దేవుడు తెలిపాడు. ఆ లెక్కప్రకారము మనకు మరియు ఇతరులకు శాశ్వత తండ్రి పరమాత్మ, శాశ్వత తల్లి ప్రకృతియగును. ఆ లెక్కప్రకారమే నీభార్యకు కూడ తండ్రి పరమాత్మ, తల్లి ప్రకృతియే. ఇక్కడ నీకు నీభార్యకే గాక అందరికీ ఒకటే వరుస వచ్చినది. ప్రకృతి అందరికి తల్లి అయినది. కానీ నీభార్యకు తల్లి అయినపుడు నీకు అత్తకాలేదు. అట్లే నీకు తల్లి అయినపుడు నీ భార్యకు అత్తకాలేదు. ఇద్దరికీ ఒకే తల్లి వరుసగనే వచ్చినది.

ఇక్కడ అసలు విషయానికొస్తాము. జ్ఞానచిహ్నమైన చంద్రుడు ప్రకృతికి సోదరుడైనపుడు వరుస ప్రకారము అమ్మసోదరుడు (తమ్ముడు) మేనమామ అయినట్లు, ప్రకృతికి సోదరుడైన చంద్రుడు వరుస ప్రకారము మనకు **'మేనమామ'** అగును. సర్వజీవులకు చంద్రుడు **'మేనమామ'** అగును. సర్వజీవులకు ప్రకృతి తల్లియైనపుడు సర్వజీవులకు **'చంద్రుడు'** మేనమామయే అగును. నీకు చంద్రుడు **'చందమామ'** అయితే నీ భార్యకు పెద్దనాన్న గాని, చిన్నాన్న గాని కాడు. నీ భార్యకు కూడ చందమామయే అగును. ఈ ప్రకారము అన్ని వరుసలు కలవారు ఒకే వరుసగ చంద్రున్ని **'చందమామ'** అంటున్నారు.

సాధారణముగ మనము పలుకుచున్న **'చందమామ'** అను మాట వెనుక ఎంతో జ్ఞానవివరము దాగి ఉన్నదని ఇపుడు తెలిసినది గదా!

# మామ

మామ అను రెండక్షరముల పదము అందరికి సుపరిచితమైనది. మామ అను పదము చంద్రునికి జోడించి చందమామ అంటున్నామనీ,

అలా చంద్రున్ని అందరూ మామ అని పిలువవలసిన విధానమును వివరముగా తెలుసుకొన్నాము. అలా చంద్రున్ని మామ అని పిలువడమే కాక ఇంటిలోని అమ్మ తమ్మున్నో, అమ్మ అన్ననో మామ అని పిలువడము కూడ జరుగుచున్నది. కొన్ని సందర్భములలో ఒక సామెతను కూడ అక్కడక్కడ కొందరనుట వినియేయుందుము. ఆ సామెత ఏదనగా! "అమ్మ పోయినా మేనమామ ఉండాలి" దీనిని ప్రపంచవివరముగా చెప్పుకొంటె, మనిషి మీద అత్యధికముగా ప్రేమకల్గినది తల్లియనీ, తర్వాత మేనమామయనీ, మామ తర్వాత తండ్రియని చెప్పుచుందురు. ఇది ప్రపంచవిధానములో భావముకాగా, ఆధ్యాత్మిక విధానములో మరియొక భావముండును. అదేమనగా! తల్లి అనగా ప్రకృతియనీ, మామ అనగా ఆత్మయనీ, తండ్రి అనగా పరమాత్మయనీ (దేవుడనీ) బ్రహ్మవిద్యలో భావము గలదు. ఈ భావము ప్రకారము ఎవడైన దేవున్ని చేరాలంటే ప్రకృతి (మాయ) మాతను వదలిపెట్టి, ఆత్మ ద్వారా ప్రయాణించి పరమాత్మను (దేవున్ని) చేరవలసియుంటుంది. ఇంకా వివరముగా చెప్పుకొంటే ప్రకృతి చేత తయారైన శరీరమును వదిలిపెట్టి తిరిగి దానిని ఆశ్రయించక పోవడమును ప్రకృతి మాతను వదలి పెట్టినట్లగును. అలాగే ఆత్మను వివరముగా తెలుసుకోవడము చేత ఆత్మజ్ఞానమను మార్గముద్వారా ప్రయాణించినట్లగును. చివరకు జననమరణ స్థితులను జీవాత్మ పొందక మోక్షమును పొందడమే దేవున్ని చేరినట్లగును. ఇక్కడ ఆత్మజ్ఞానమనినా, ఆత్మను తెలుసుకోవడమనినా ఆత్మ ద్వారా అనినా, ఒకటేనని గుర్తుంచు కోవలెను.

ప్రకృతి,ఆత్మ,పరమాత్మ అను ముగ్గురిని జీవునికి మాత, మామ, పితరులుగ ప్రపంచములో లెక్కించుకొనుచున్నాము. బయట ప్రపంచములో

ఒక మనిషికి బాహ్యముగా తల్లియున్నది, మామయున్నాడు, తండ్రి యున్నాడు. బాహ్యముగా కాకుండ అంతర్ముఖముగా ఒక జీవునికి శరీరరూపములో 10 భాగములు కనిపించునవిగా 15 భాగములు కనిపించనివిగా మాత అయిన ప్రకృతి ఉండగా, శరీరములో చైతన్యశక్తిగా మామ వరుసలోనున్న ఆత్మ ఉన్నాడు. శరీరము బయటా శరీరములోపల సాక్షిగా ఎవరికి తెలియకుండ అణువణువున వ్యాపించి తండ్రి అయిన పరమాత్మ ఉన్నాడు. ఒక జీవుడు శరీరములో నివసిస్తున్నపుడు ప్రకృతి అయిన మాతను వదలిపెట్టాలనీ, మాత అయిన ప్రకృతి జీవునిదికాదనీ, తల్లి అయిన ప్రకృతి శరీరమును కొంతకాలము పెంచి తర్వాత జీవుడు తనవాడుకాదన్నట్లు శరీరమును పెంచడమును వదిలివేయుచున్నదనీ తెలియుచున్నది. ఇదే విధముగా పిల్ల పక్షులు కొంత పెరిగిన తర్వాత తల్లి పక్షి వాటిని వదలివేయుచున్నది. దీనినిబట్టి తనదికానిది తల్లి (ప్రకృతి) అను వివరము జీవుడు తెలియవలెను. ఇదే అర్థముతోనే తల్లిని అమ్మ అంటున్నాము. గౌరవము అనగా మర్యాద అని అర్థముకదా! గౌరవము అను పదమునకు "అ" అను ఒక అక్షరమును చేర్చి అగౌరవము అంటే గౌరవము లేనిదని అర్థముకదా! అదే విధముగా "మా" అంటే నా అని అర్థము. మా ముందర "అ" పెట్టి అమా అంటే నాదికానిదని అర్థమొచ్చును కదా! దీనినిబట్టి నీదికానిది అమా అని తెలియుచున్నది. వ్రాయడములో అమ్మా అని వ్రాసినా వాస్తవ పదము అమానేనని తెలియవలెను. చాలామంది పిలువడము కూడ అమా అనే పిలుస్తున్నారని జ్ఞప్తికుంచుకోవలెను. అమ్మా అని ప్రతి నిత్యము మనము పలుకుచుండినా, అందులోని అర్థము మనకు తెలియదు. అమ్మా అను పదము యొక్క అర్థము ప్రకారము జీవునికి తల్లి అయిన ప్రకృతి (మాయ) చివరికి నీది కాదని తెలియుచున్నది. శరీరములో నివసిస్తున్న జీవునికి శరీరములోనే

ఉన్న ప్రకృతి తనదికాదని తెలిసినపుడు తనది ఏదో జీవుడు తెలుసు కోవలసిన అవసరమున్నది.

శరీరములో ప్రకృతి, ఆత్మ రెండే గలవు. పరమాత్మ శరీరములోపల శరీరము బయట విశాలముగా ఉన్నాడు. పరమాత్మ శరీరములో కొంత ఉండినా శరీరము బయటే ఎక్కువగా ఉన్నాడు, కాబట్టి ఆయనను శరీరములోనివానిగా లెక్కించుకోకూడదు. ఇకపోతే శరీరములో జీవునితో పాటు ఉన్నది ఆత్మ ఒక్కడేనని తెలియుచున్నది. శరీరములో జీవునితో పాటు ఇటు ప్రకృతి, అటు ఆత్మ రెండేగలవని అర్థమగుచున్నది. అందులో ఆధ్యాత్మికరీత్యా ప్రకృతి నీదికాదని తెలిసిపోయినది. ప్రకృతి తర్వాత ఉన్న ఆత్మ ఎల్లపుడు జీవునితోపాటు ఉంటున్నాడు. కావున జీవుడు నా ఆత్మని మాటల సందర్భములో చెప్పుచున్నాడు. ఆత్మ జీవునికి సంబంధించినదేనని తెలియునట్లు ఆత్మను మామ అను పదముతో పిలుస్తున్నాము. మామ అను పదము మొదట "మమ" అను పదముగా ఉండెడిది. కాలక్రమమున "మమ" అను రెండక్షరములలో ముందరున్న అక్షరమునకు దీర్ఘము ఏర్పడి "మామ" అయినది. "మమ" అను రెండక్షరముల పదము యొక్క అర్థము ఏమనిన మ అనగా "నా" అని మమ అనగా నాయొక్క అని అర్థమురాగలదు. మమ అనినా మామ అనినా రెండు నాది అనీ లేక నాయొక్క అని అర్థము రాగలదు. మామ అనగా నాది అను అర్థమును తెలియజేయుచున్నది కదా! జీవునికి నా అనువాడు ఎవడున్నాడని చూస్తే శరీరములోని ఆత్మ తప్ప ఎవరూలేరు. జీవుడు చచ్చినపుడుగానీ, పుట్టినపుడుగానీ వాని వెంటవచ్చువాడు ఒకే ఒక ఆత్మనే. అందువలన ఆత్మకు అర్థముతో కూడుకొన్నట్లు మామ అని పేరుపెట్టడము జరిగినది. మమ అను పదము ఒక సంస్కృత

భాషలోనేకాక అన్ని భాషలలోను అదే పదమున్నట్లు తెలియుచున్నది. జీవుని చేత మామ అను పిలిపించుకొను యోగ్యత ఒక ఆత్మకు మాత్రముందని తెలుసుకోవచ్చును. జ్ఞానము తెలియని అజ్ఞానులైనా మామ అను పదమును వాడుచుందురు, కానీ ఆ పదములోని అంతరార్థము తెలియదు. ఇప్పటికైనా అమ్మా అంటే నాది కానిదనీ, మామ అంటే నాది అని తెలుసుకోగలిగితే, నీ మామ అయిన ఆత్మద్వారా నీ తండ్రి అయిన పరమాత్మను సులభముగా తెలుసుకోగలవు. జీవుడు పురుషుడు, ప్రకృతి స్త్రీ అని ముందే తెలుసుకొన్నాము. పురుషుడైన జీవునికి పురుషులైన ఆత్మ, పరమాత్మలు ఎల్లపుడు తోడుందురని తెలియునట్లు "మా"ప్రక్కన "మ" పెట్టి "మామ" అనీ, "నా" ప్రక్కన "న" పెట్టి "నాన" అని "తా" ప్రక్కన "త" పెట్టి "తాత" అని పురుషులను పిలుస్తున్నాము. లేదు కాదు అనుటకు "అ" అక్షరము ఉపయోగిస్తామని తెలుసుకొన్నాము. ప్రకృతి (మాయ) నీది కాదన్నట్లు స్త్రీని పిలుచునపుడు "అ" అను అక్షరమును ఉపయోగించి "అమ్మా" "అత్త" "అవ్వ" అని పిలుస్తున్నాము. నానకు అమ్మ, మామకు అత్త, తాతకు అవ్వ అని ప్రత్యేక పదములుగా కల్గియున్నవని తెలియాలి. పురుషుడైన ఆత్మ, పరమాత్మ విషయములో మొదటగల అక్షరమే రెండవ అక్షరముగా ఉన్నది. నాన, మామ, తాత అని ఉండడము వలన జీవాత్మ వెనకలే కొంత తేడాతో ఆత్మ ఉన్నదని తెలియుచున్నది. స్త్రీతత్త్వమును తెలుపు ప్రకృతి విషయములో ఉచ్ఛరింపబడు పదములో "అ" అని ముందే చెప్పబడు చున్నది. అమ్మ, అత్త, అవ్వ అని ఉండడము వలన, ఆ తర్వాత ఉన్న అక్షరమునకు మ కు మ వత్తు, త కు త వత్తు, వ కు వ వత్తు ఉండడము వలన, వత్తి పలుకుచున్నందువలన కనిపించేది ప్రకృతి అనీ, ప్రకృతి జీవునిది కాదని అ కారమువలన తెలియుచున్నది. ముఖ్యముగా

మనము తెలుసుకోవలసినది మామను గురించే, కావున శరీరములోని ఆత్మను గురించి జీవాత్మ తెలుసుకొన్నపుడే ఆధ్యాత్మికతంటే ఏమిటో తెలియును.

## రాత్రి - పగలు

కాలము రెండు విధముల పేర్లుగ విభజింపబడినది. ఒకటి రాత్రి, రెండవది పగలు అని పిలుచుట అందరికి తెలిసినదే. ఈ రెండు రకముల రాత్రి పగలను కాలమును పరమాత్మ పరమైన రాత్రిపగలుగను, అట్లే ప్రకృతి పరమైన రాత్రి పగలుగాను రెండు రకములుగ కూడ విభజింపబడినది. పరమాత్మ పరమైన పగలు వెయ్యి యుగములు, రాత్రి వెయ్యి యుగములు అని భగవద్గీతలో చెప్పియున్నారు. పరమాత్మ పగలైన వెయ్యి యుగముల కాలములో ఈ ప్రపంచమంతా ఉన్నది. జీవరాసులు పుట్టుట, జీవనము సాగించుట చివరకు గిట్టుట సహజముగ జరుగుచున్నది. పరమాత్మ రాత్రి అయిన వెయ్యియుగముల కాలములో ప్రపంచము లేదూ, జీవరాసులు లేవు. అగ్ని, నీరు, భూమి, ఆకాశము, గాలి ఏమాత్రము లేవు. అది శూణ్యము కూడ కాదు. అదియేదో ఊహించికూడ చెప్పలేనిది. ఏ శాస్త్రవేత్త పరిశోధనకు కూడ అందనిది. భగవద్గీతలో వ్యక్తముకానిదని కూడ చెప్పారు.

రెండవదైన మనకు తెలిసిన ప్రకృతి పరమైన రాత్రిపగలు విషయానికొస్తే రాత్రి 12 గంటల కాలము, పగలు 12గంటల కాలము అందరికి తెలిసినదే. పగలు ప్రతి ఒక్కరు ఏదో ఒక పనిలో నిమగ్నము కావడము రకరకాల కార్యాచరణలతో ప్రపంచమంతా నిండిపోవడము జరుగుచున్నది. రాత్రికాలములో కార్యాచరణలను మాని నిద్రలోనికి

పోయి ఏమి తెలియనిస్థితిలో ఉండడము జరుగుచున్నది. పరమాత్మ యొక్క పగలు రాత్రికి, జీవరాసుల యొక్క పగలు రాత్రికి దగ్గర సంబంధ పోలికలున్నాయి. పరమాత్మ యొక్క పగలులో ప్రపంచము కనిపిస్తున్నది. జీవరాసుల యొక్క పరివర్తన పరిణామములు జరుగుచున్నవి. అట్లే జీవరాసుల పగలులో జీవునికి ప్రపంచము కనిపిస్తున్నది. మిగతా జీవుల స్థితిగతులు కనిపిస్తున్నవి. తన యొక్క స్థితిగతులు కూడ తెలియుచున్నవి. ఈ విధముగనే పరమాత్మ రాత్రిలో ప్రపంచము లేదు. జీవరాసులు లేవు. అట్లే జీవరాసుల రాత్రి (నిద్ర)లో ప్రపంచము ఉన్నా కనిపించదు. ఇక్కడొక ప్రశ్న ఉద్భవించవచ్చును. అదేమనగా! రాత్రి ఏమి తెలియదన్నారు కదా! మనము రాత్రిపూట మేల్కొన్నపుడు అంతా తెలియుచున్నది కదా! అటువంటపుడు రాత్రిపూట ఏమిలేదనుట ఎట్లు? దీనికి మా సమాధానము.

రాత్రి పగలు అనుమాట జీవరాసుల మొత్తమునకు తెల్పినది. సహజముగా రాత్రి నిద్రించుట, పగలు మేల్కొనుట జరుగుచున్నది. కావున జీవసముదాయమునకు చెప్పినదని తెలియాలి. రాత్రి కూడ ప్రపంచమున్నది నిద్రించునపుడు మాత్రము తెలియదు. అందువలననే ఉన్నా తెలియదని చెప్పాము. నిద్ర నుండి మేల్కొన్నపుడు మాత్రము తెలియును. నిద్రావస్థలో ఏమి తెలియదు. అట్లే బ్రహ్మ పగలులో ఉన్న ప్రపంచము బ్రహ్మరాత్రిలో లేదన్నారు. అక్కడ మనము లేము అంతా అవ్యక్తము అన్నారు. కాని ముక్తి పొందిన వానికి మనకు తెలియకున్నదేదో వానికి తెలియుచున్నది. బ్రహ్మరాత్రిలో జగత్తే లేదన్నారు. కాని ఏదో ఒకటి మిగిలిఉన్నది. సర్వమునకు కారణమైన అది ఏదో, ఆ మిగిలి ఉన్నదేదో, అవ్యక్తమునందు కూడా వ్యక్తముగా ఉన్నదేదో, ముక్తిపొందిన

వానికి మాత్రము తెలియును. అట్లే మన రాత్రికాలములో నిద్రలో ఏమి తెలియకున్నది. రాత్రి మెలుకువపొందినవాడు మిగతావారు చూడ కున్ననూ తాను ప్రపంచమునెట్లు చూచుచున్నాడో, అట్లే ప్రళయములో జీవరాసులన్ని తెలియని స్థితిలోనికి పోయినపుడు కూడా ఉన్నదానిని చూడగల్గువాడు ముక్తిపొందినవాడని తెలియాలి.

పగలు రాత్రి యొక్క విశిష్ఠత తెలుసుకొనునట్లు ఆ పేర్లను మనపెద్దలు కాలమునకు నామకరణము చేశారు. **'రాత్రి, పగలు'** అని పేరొందిన వాటిలో విశేషార్థము ఇమిడ్చినారు. ఆ విశేషార్థమేమిటో క్రింద చూద్దాము.

కాలమును భూతకాలము, వర్తమానకాలము మరియు భవిష్యత్తు కాలములని మూడు భాగములుగ చెప్పుకొనుచుండుట సహజము. జరిగిన కాలమును భూతకాలమని, జరుగుచున్న కాలమును వర్తమాన కాలమని, జరుగబోవు కాలమును భవిష్యత్తు కాలమని పెద్దలు తెలిపారు. ఈ మూడు కాలములను త్రికాలములనెడివారు. మనము మెలుకువగా ఉన్నపుడు మనకు జరిగినది తెలుసు, జరుగుచున్నది కూడా తెలుసు, తర్వాత ఏదో ఒకటి జరుగబోవునని కూడా తెలుసు. అదే నిద్రపోయినపుడు జరిగినది, జరుగుచున్నది, జరుగబోవునది ఏది తెలియదు. నిద్రాస్థితి అగమ్యగోచరమైనది. బ్రహ్మరాత్రి అయిన ప్రళయకాలములో ఏమి తెలియనట్లు నిద్రాస్థితిలో ఏమి తెలియదు. నిద్ర అన్నింటిని స్తంభింప చేయునది. సహజముగా ఇటువంటి నిద్ర రాత్రిసమయములోనే వచ్చును. కనుక దానిని మనము అర్థము చేసుకొనునట్లు ఆ కాలమునకు రాత్రి అని పేరుపెట్టడము జరిగినది. భూత, భవిష్యత్, వర్తమానములైన మూడుకాలములను **'త్రి'** అని ఆ మూడు సహజముగా జీవరాసులకు

లేని సమయమును **'రాత్రి'** అనుట జరుగుచున్నది. **'త్రి'** అనగా మూడు, **'రా'** అనగ రహితము, రహితమనగా లేనటువంటిదని అర్థము. **'రాత్రి'** అనగ మూడు కాలములు లేనిదని అర్థము. త్రి కాలములు లేనిది **'రాత్రి'**. త్రి గుణములు లేనిది **'రాత్రి'**. త్రి అవస్థలు లేనిది **'రాత్రి'**. ఇటువంటి విశిష్ఠార్థమునిచ్చు రాత్రి అనుపదము ముఖ్యమైన సంస్కృతభాషయందును, హిందీ, తెలుగు మరికొన్ని భాషలయందును భాషాభేదము లేకుండ **'రాత్రి'** అనియే ఉచ్ఛరింపబడుచున్నదని తెలియాలి. త్రిగుణ, త్రికాల, త్రి అవస్థలు లేని రాత్రీ అట్లే అన్నీ ఉన్న పగలూ అందరికీ తెలిసినవే.

రాత్రి అయిపోయిన వెంటనే పగలు ప్రారంభమగుచున్నది. ఆ మెలుకువ కాలములో ఆరు గుణములలోని మొదటిదైన **'ఆశ',** చివరిదైన **అసూయ (మత్సరము)** ఎక్కువగా పనిచేయుచున్నవి.

షట్ గుణవర్గమైన కామ, క్రోధ, లోభ, మోహ, మధ, మత్సరము అను ఆరు గుణములలో ప్రతిఒక్కరి జీవనవిధానము ఆశ లేనిది లేనేలేదని చెప్పవచ్చును. భగవద్గీతలో **'కామాత్ క్రోధోభి జాయతే'** అన్నట్లు ఆశవలన కోపము పుట్టుట సహజము. మానవుని జీవితములో మొదటిదైన కామము దానికి తోడు కోపము అట్లే చివరిదైన అసూయ తప్పనిసరిగా ఉన్నాయి. కామ, క్రోధ, అసూయ మూడు ఒక భాగముగను మిగత లోభ, మోహ, మధములు మూడు మరియొక భాగముగ చెప్పవచ్చును. లోభ,మోహ,మధములు అంత ప్రభావమైనవి కావు, గనుక అవి కొందరిలో పనిచేయుచుండును, కొందరిలో వాటి ప్రభావము అంతగా లేకుండును. లోభ, మోహ, మధములు లేని వారిలో కూడా ఆశ, కోపము, అసూయను మనము చూడవచ్చును. దీనినిబట్టి ఆరుగుణములలో కూడా మూడు ఎక్కువ ప్రభావమైనవి, మూడు అంతగా ప్రభావము లేనివిగా తెలియాలి.

ప్రభావమైన కామ, క్రోధ, అసూయ గుణములే ప్రతి మానవుని యందు పనిచేయుచున్నవి. కామము వలననే క్రోధము, క్రోధము వలననే అసూయ ఏర్పడుచున్నవి. ఆశ వలన చివరి పర్యవసానంగా శతృత్వము ఏర్పడుచున్నది. వీటి ప్రభావమున్న ప్రతి ఒక్కరికి చిన్న పెద్ద శత్రువులు ఉండనే ఉందురు. నీకు శత్రువులు లేకపోయినా, నీవు అజాత శత్రువైనప్పటికీ, నీవు వేరే వారికి శత్రువుగా ఉండవచ్చును. ధర్మరాజుకు శత్రువులు లేకున్ననూ దుర్యోధనునికి ధర్మరాజు శత్రువైనట్లు, గుణముల ప్రభావము చేత నీవు వారికో, వారు నీకో శత్రువులగుట సహజము. కామ, క్రోధ, మత్సరము అను గుణములచేత ప్రతి జీవితములోను శత్రుత్వము (పగలు) ఉండనే ఉన్నవి. కావున గుణముల ప్రభావము వలన ప్రారంభింపబడే మెలుకువ కాలమును **'పగలు'** అని పెద్దలు పేరిడినారు. పగ అనగా శత్రుత్వము ప్రతి జీవితము శత్రుత్వముతో కూడుకొని ఉన్నది. కావున జీవితకాలము అమలుపడు మెలుకువ 12 గంటలకాలమును **'పగలు'** అన్నారు. పగలుతో కూడుకొన్న మన జీవితములు దైవచింతన కలగాలంటే, గుణముల ప్రభావము తగ్గించు కోవాలని గుర్తు చేసుకొనునట్లు **'పగలు'** అనుపదముతో నామకరణము చేశారు. గుణముల వలననే పగలు ఏర్పడుచున్నదని మెలుకువ అయిన 12 గంటలకాలము గుణములకే సరిపోవుచున్నదని తెలుపు నిమిత్తమే **'పగలు'** అను పేరుపెట్టారు. పగలులో నిండిన గుణములు రాత్రిలో లేవు. కావున పగలు అజ్ఞాన సంబంధమైనదనీ, రాత్రి జ్ఞాన సంబంధమైనదనీ, అట్లే రాత్రి పరమాత్మ స్వరూపమైనదనీ, పగలు మాయ స్వరూపమైనదని పెద్దలు తెలిపారు. రాత్రిలో లేనివి పగలులో ఉన్నవి. కనిపించునది మాయ, కనిపించనిది దైవము. ఈ ప్రాతిపదిక మీద తెలియని రాత్రి-దైవము, తెలిసెడి పగలు-మాయ. జీవాత్మయైన మనము

తెలియని పరమాత్మలో మెలుకువలేనివారమై, తెలియబడుచున్న మాయలో మెలుకువ గలవారమై ఉన్నాము. అట్లుకాక తెలియబడని దైవములో కూడా మెలుకువ గలవారమై దైవత్వమేదో దాని అనుభూతి ఏమో తెలుసుకోవాలి. జ్ఞానము గల పెద్దలు ఎంతో అనుభవముతో యోచించి మనము జ్ఞానము తెలుసుకొని దైవమార్గములో నడవాలని విశేషార్థము నిచ్చునటుల కాలమునకు **'రాత్రి', 'పగలు'** అని పేర్లుపెట్టడము జరిగినది. వాటిని గురించి యోచించితే పగలు వదలి రాత్రిని చేరుటకు ప్రయత్నించగలరు. పగలు రాత్రి యొక్క తారతమ్యము ఏమిటో తెలియగలరు.

పరమాత్మ నుండి సమస్తము పుట్టినది, మరియు మాయ లేక గుణములు అన్నియూ పుట్టినవి. ప్రపంచము నుండి పరమాత్మ పుట్టలేదు. పరమాత్మ నుండియే ప్రపంచము పుట్టినది. మాయకు పేరొందిన పగలు, పరమాత్మకు మారుపేరైన రాత్రి నుండియే పుట్టినది. దైవము నుండి పుట్టినదే మాయ. మాయ నుండి దైవము పుట్టలేదు. దైవస్వరూపమైన రాత్రినుండి మాయస్వరూపమైన పగలు పుట్టినది. కావున పెద్దలు వరుసక్రమములో **'రాత్రి పగలు'** అన్నారు. **'రాత్రింబగళ్లు'** అనుట కూడ కలదు, కాని **'పగలు రాత్రిళ్ళు'** అనుట లేదు. దైవము నుండి పుట్టిన మనము పగలెంతకాలము గడిపినప్పటికి తిరిగి రాత్రిని చేరవలసిందే. నీవు ఎంతటివాడివైనా, ఎంత ధనికుడివైనా, పెద్ద పోలీసు ఆఫీసర్‌వైనా, రాజకీయనాయకుడివైనా తిరిగి తిరిగి నా వద్దకు రావలసిందేనను దైవసూచన ప్రకారము ప్రతి ఒక్కడు ఏ పనిచేయువాడైనా చివరికి నిద్రలోనికి జారుకుంటున్నాడు. ఎంత హుషారు కల్గినవాడైనా నిద్రలోనికి జారిపోవలసిందే. అంటే ఎవడైనా నా వద్దకు రావలసిందేనను

సూచన. తిరిగి ఉదయము మేల్కొనిన నిద్రపరిస్థితి ఎవరికి తెలియదు. నిద్రను తెలియనివాడు ప్రపంచపరముగా ఎంత తెలిసినవాడైనా ఏమీ తెలియనివాడనియే చెప్పబడును.

గుణముల ప్రభావము తెలిసి, వాటిలో మూడు ప్రభావమైనవని తెలిసి, వాటి పగలు తెలిసి, అట్లే త్రిరహితమైన రాత్రిని తెలిసి, అందులోని నిద్రను తెలిసి, నిద్రలో మెలుకువ గలవాడై రాత్రి సారాంశమును తెలిసినవాడు తానే దైవముగా మారిపోయి మోక్షము పొందును.

# జగద్గురువు

జగద్గురువను మాటను చాలామంది వినియే ఉంటారను కొంటాము. ఎందుకనగా ఇతర దేశములకంటే మనదేశములోనే జగద్గురువనువారు చాలామంది ఉన్నారు. "జగత్తు" అని అంటే ప్రపంచములోని జీవసముదాయమని అందరికి తెలిసిన మాటయే. ప్రపంచములోని కేవలం ఒక్కదేశమును మాత్రము జగత్తని అనము. కాని గురువుల వద్దకు వచ్చేటప్పటికి కేవలం ఒక్క దేశములోని గురువును కూడ జగత్‌గురువు అంటున్నాము. జగత్తంటే ప్రపంచములోని జీవులందరు అయినపుడు జగద్గురువంటే ప్రపంచములోని అందరికి గురువై ఉండాలి. అలాకాక ఇతర దేశములన్నిటికి సంబంధంకాక కేవలం ఒక్క దేశములోని గురువును జగద్గురువు అనుటలో ఎంతో ఆశ్చర్యమున్నది. నేడు ఒక దేశములోనే ఎక్కువమంది శిష్యులను కల్గిన గురువులను మాత్రమే జగద్గురువులు అంటున్నారు. తక్కువ శిష్యులున్న గురువులకు జగద్గురువులను పేరులేదు. అంటే శిష్యుల సంఖ్య ఎంత

ఎక్కువ ఉంటే అంత తొందరగా జగద్గురువై పోవచ్చున్నమాట. అందువలన కొందరు గురువులు అదేపనిగ ఊరు ఊరు తిరుగుచు, పిలిచి పిలిచి ఉపదేశమిస్తూ, శిష్యులను ఎక్కవగా చేర్చు కోవడములో పోటీపడుచున్నారు. గురువులనిపించుకొని కూడా జ్ఞానము చెప్పుట మావంతుకాదు శిష్యులను చేర్చుకోవడమే మాపని అన్నట్లు ఉపదేశ మిచ్చుటయే వారిపనైపోయినది. గురువులంటే జ్ఞానము చెప్పువారా లేక ఉపదేశమిచ్చువారా లేక జ్ఞానముచెప్పి ఉపదేశము ఇచ్చువారా ఎవరు గురువులను అనుమానము యోచించువారికి రాకమానదు. ఈ అనుమానములకు సమాధానములు దొరికినపుడు గురువులెవరో, జగద్గురువులెవరో తెలిసి ఎవరిని ఆశ్రయించవలెనో తెలియును. మోక్షము పొందాలంటే మానవుని ఎడల గురువు పాత్ర చాలా ముఖ్యమైనది. వారికి లభించిన గురువునుబట్టియే వాని మార్గముండును. కావున గురువులను గూర్చి పూర్తి తెలుసుకొన్నపుడు మార్గము కూడా సరియైనదే లభించగలదు. అందువలన ఇపుడు గురువులన్నవారందరిని పరిశీలిస్తాము.

మనదేశములో ఎందరో గురువులు గలరు. వారియందు కొందరు ఏదో ఒకపనిని కల్పించుకొని అనగా ఏదో ఒక కట్టడము కట్టించడము మొదలు పెట్టి, దానికోసము ఊరూర్లు తిరిగి ఉచిత చందాలు వసూలు చేయుటయందే లగ్నమై ఉంటారు. ఆ కట్టడము పూర్తియైన వెంటనే మరి ఏదో ఒకటి పెట్టుకోవడమో లేక పలానాపూజ, పలానా యజ్ఞము, పలానా పనియని ఉదయము లేచింది మొదలు సాయంకాలము వరకు, ఆ పనికోసము వసూల్లకోసము ఊర్లు తిరగడమే వారికి ముఖ్యకార్యముగ ఉండును.

మరికొందరు డ్రామా యాక్టర్లు రేట్లు పెట్టుకొన్నట్లు, నా ఉపన్యాసమునకు ఇంతరేటని పెట్టుకొని, ఆ రేటుప్రకారము ఉపన్యాసాలు చేయడమే వారి పని. డ్రామాయాక్టరు తన డైలాగులన్ని వరుసగ నేర్చుకొని డ్రామాలో చెప్పినట్లు, కొందరు గురువులన్నవారు కొన్ని పుస్తకములనే పూర్తి కంఠాపాటము చేసుకొని, వాటి ప్రకారము ఉపన్యాసములు గడగడ చెప్పి వారిడబ్బు వారు తీసుకొనిరావడము, వచ్చిన వెంటనే ఇంకో ఉపన్యాసమునకు పోవడము వీరి ముఖ్యమైన పని. నటుడు డ్రామాలో చెప్పిన నీతి ప్రకారము తన నిజజీవితములో నడుచుకోనట్లు, వీరి ఉపన్యాసములు నటుని డైలాగుల మాదిరే తమ జీవితములో ఉండవు. ఉపన్యాసాలే నాముఖ్యకార్యమని అనేక ఉపన్యాసములు చేసిన ఒక గురువును నంద్యాల వద్ద మేము కలిసి మీరు ఉపన్యాసములో చెప్పుమాటలకు మీ నిజ భావమునకు ఎంతో తేడాయున్నది. మీరు "దేవుడు లేడు దయ్యము లేదు" అంటున్నారేమిటి? దేవుడే లేడన్నపుడు గీతాయజ్ఞములని పేరుపెట్టి గీతను గూర్చి ఉపన్యసిస్తున్నారు కదా! దేవుడే లేడంటున్న మీరు మీ ఉపన్యాసములలో దేవుడున్నాడని దేవుని గూర్చి చెప్పుచున్నారు కదా! అని అడిగితే దానికి జవాబుగా "నాకు మాత్రము దేవుని మీద నమ్మకము లేదు. జ్ఞానము కావాలని ప్రజలు కోరుకొంటున్నారు. దానికి డబ్బు తీసుకొని వారికి నచ్చేటట్లు సరిపోవునట్లు చెప్పాను. వారికి జ్ఞానము కావాలి, నాకు డబ్బు కావాలి. వినేవారున్నారు కాబట్టి నేను అట్లు చెప్పుచున్నాను" అన్నాడు. వీరు కూడ కొందరి దృష్ఠిలో గురువులే.

ఇంకా బ్రతకలేక సన్న్యాసులైన వారు కొందరున్నారు. వారి దృష్ఠిలో సన్న్యాసత్వమే గొప్ప గురుత్వమనుకొన్నారు. తెల్లవన్నీ పాలు

నల్లవన్నీ బొగ్గులని నమ్మే ప్రజలు తెల్లని సున్నపునీల్లను పాలుగ, నల్లని ఇనుపముక్కలను బొగ్గులుగ నమ్మి, కాషాయగుడ్డలు వేసుకొన్న వారందరు గురువులే అని పొరపడుచున్నారు. కావున కాషాయగుడ్డల మాటున ఎందరో దొంగలు, ఎందరో మోసగాళ్ళు, ఎందరో హత్యలు చేసి పారిపోయి వచ్చినవారు ఉన్నారని తెలుసుకోలేకపోయారు. జ్ఞానము కల్గిన నిజమైన సన్న్యాసులు కొందరుండగ, అనుకూలాన్ని అవకాశాన్ని బట్టి కాషాయగుడ్డలు వేసుకొన్నవారు ఎందరో ఉన్నారు.

ఇలా ఎందరో గురువులుగ చలామణి అవుచుండగ, నేటి మనుజులు కూడ మేము శిష్యులమనిపించుకొంటే చాలని, మాకు ఒక గురువున్నాడంటే చాలని, ఏదో ఒక గురువును ఆశ్రయించి ఉపదేశము కావాలంటున్నారు. మాకు శిష్యులనువారుంటే చాలనుకొన్న గురువులు కూడ వెంటనే ఉపదేశమిచ్చి ఇప్పటినుండి నా వద్దకు తప్ప ఇక ఏ గురువు వద్దకు పోవద్దు, నా బోధలు తప్ప ఇక ఏ బోధలు వినవద్దు, నా పుస్తకములు తప్ప ఏ పుస్తకములు చదవవద్దని చెప్పి పంపుచున్నారు. వీరికి కావలసినది శిష్యులు, వారికి కావలసినది ఉపదేశము అను భావము తప్ప జ్ఞానమని కాని, ధర్మమని కాని, దైవమని కాని వారికి ఏమి తెలియదు.

ఇక జగద్గురువులను విషయమువద్దకు వస్తే, ఒక ఇంటిలో పుట్టినవానికి ఆ ఇంటిపేరు పరంపరగ వచ్చినట్లు, ఒక పీఠములో గల చిన్నవయసున్న వానిని కూడ జగద్గురువు అని పేరుపెట్టి పిలవడము జరుగుచున్నది. ఒక పీఠములో ఉన్న గురువులను జగద్గురువులనడము, ఆ పీఠములో గల జగద్గురువు చనిపోతూ ఇంకొక గురువును నిర్ణయిస్తే అతనిని జగద్గురువనడము జరుగుచున్నదంటే, జగద్గురువనేది

ఇంటిపేరున్నట్లు కొందరి గురువులకు కూడా ఉన్నది. మనుజులలో ఎవనికి పుట్టితే వాని ఇంటిపేరు (వంశముపేరు) పుట్టినవాడు చెప్పుకొన్నట్లు, గురువులలో కూడ ఇంటిపేరులాగ జగద్గురువు అనుపేరు వస్తున్నదంటే, తుపాకులు పట్టుకోకున్ననూ తుపాకులవారను ఇంటిపేరున్నట్లు జగత్తుకు గురువులు కాకున్ననూ ఆ పేరు తర్వాత గురువులకు వస్తున్నది. జగద్గురువులంటే అర్థమేమిటి? ఇంటిపేరులాగా కాకుండ నిజ జగద్గురువులెవరైనా ఉన్నారా? అని యోచిస్తే వివరమిలా ఉన్నది.

ఏదైనా తెలియని దానిని రహస్యమంటాము. రహస్యమను మాటను పూర్వము వాడుక భాషలో ఎక్కువగా **గుహ్యము** అనేవారు. గుహ్యమంటే రహస్యమని ఆనాడు ఈనాడు అర్థము గలదు. మానవునికి తెలియనిదంతా రహస్యమే కదా! మానవుడు పుట్టినపుడు తనకు ఏమి తెలియదు. తెలియని విషయములను వయస్సు వచ్చుకొలది ఇతరుల వలన తెలుసుకోగలుగుచున్నాడు. ఒక బడికి పోతాము, అక్కడ మనకు తెలియని అంకెలను అక్షరములను తెలుసుకొంటాము. అలా తెలుసుకోనంత వరకు అవి ఏమిటో ఏవో మనకు తెలియవు. ఆ తెలియని రహస్యములను బడిలో తెలిపిన వ్యక్తిని గురువు అంటున్నాము. గురువు అన్నపదము పూర్వమెలా వచ్చినదనగా! తెలియనిది గుహ్యమన్నాము కదా! **గుహ్యమును తెలుపువాడు కనుక గురువను పదము వచ్చినది.** గుహ్యమున్న ప్రతిచోట గురువు ఉండనే ఉండాలి లేకపోతే ఆ విషయము మనకు తెలియదు. తెలియని ప్రతి విషయమునకు గురువనువాడు అవసరము. అందువలన చదువుకొక గురువు, మెకానిక్ పనికొక గురువు, వైద్యమునకొక గురువు ఇట్లు ఎన్నోరకముల ప్రపంచ

విషయములలో ఎన్నోరకముల ప్రపంచ గురువులు మానవ జీవితముననున్నారు.

**మానవజీవితమున భగవద్గీతలో చెప్పినట్లు గుహ్యములలోకెల్లా గుహ్యమైనది బ్రహ్మవిద్య.** ప్రపంచ విద్యలలో తెలియని రహస్యములను తెలియబరుచు గురువులున్నట్లు, బ్రహ్మవిద్యలో కూడ తప్పనిసరిగ గురువుండాలి. లేకపోతే చాలా గుహ్యమైన బ్రహ్మవిద్య ఏమిటో తెలియక గుహ్యముగానే ఉండిపోవును. ఇటు ప్రపంచవిద్యలలోనూ అటు బ్రహ్మవిద్యలోనూ గుహ్యమును తెలియజేయువాడు (గుర్తు చేయువాడు) అనగ ఎరుక చేయువానిని పూర్వము **'గుర్తు'** అని పేరుపెట్టి పిలిచెడివారు. బ్రహ్మవిద్య గుర్తు తెలుపువాడు, బ్రహ్మవిద్య గుట్టు రట్టు చేయువాడు గురువను మాట ఎక్కడైనా వినడమో చదవడమో ఉంటుంది.

ముఖ్యవిషయమేమనగా! **'గుర్తు'** అను రెండక్షరముల పదము కొంతకాలమునకు **'ర్తు'** క్రింద తా వత్తు పోయి **'గురు'** అనుపదముగా మిగిలిపోయినది. గుర్తు అని నొక్కి చెప్పకుండా **'గురు'** అని సులభముగా పలుకుట వాడుకైపోయినది. ఆదిలో గుర్తు అని గుర్తింపబడిన పదము నేడు గురు అను పదముగా గుర్తింప (తెలియ) బడి ఉన్నదని గ్రహించాలి. గురువను పదమిలా వచ్చిందని ఈనాటి గురువులకే తెలియదు. కావున మిగతా ప్రజలకేమి తెలియును. అందువలన ఈ విషయము మీకు క్రొత్తదయినప్పటికీ అసత్యమనుకోకండి. మనకు అర్థముకానివన్ని అసత్యములనుకోకూడదు. ఒకప్పటి దృష్టి తగిలిందనుమాట నేడు జిష్ఠి తగిలిందని ఎలా అనగలుగుచున్నామో అలాగే గుర్తు అనుమాట గురు అనుమాటగా మిగిలిందని తెలియాలి. దీనిని బట్టి చూస్తే నేడు జగద్గురువు అన్నపదము ఆదిలో **'జగద్గుర్తు'** అన్న పదముగా ఉండెడిదని

తెలియాలి. ఈ విషయంలో మాకు తెలియనిది నీకెట్లు తెలుసునని ప్రశ్నించవద్దండి. కంటిని బట్టి చూపుంటుందనుకోండి.

చాలామంది శిష్యులున్నవారినో లేక పరంపరగనో జగద్గురు అనుట ఆదిలో లేదు. **జగత్తులోని సర్వజీవరాసులకు వర్తించు దైవజ్ఞానము ఎవరు తెలుపుచున్నారో వారినే జగద్గురువు అనెడివారు.** అలా తెలిపెడి వారికి శిష్యులుండవచ్చును లేకపోవచ్చును. వారికి శిష్యులను బట్టి లేక పీఠమును బట్టి ఆ పేరు రాలేదు. వారు తెలుపుచున్న బోధలను బట్టి వారికి ఆ పేరు వచ్చినది. ఆ విధముగ చెప్పితే శ్రీకృష్ణుడు జగద్గురువే. శ్రీకృష్ణుని జగద్గురువని ఎందరో మహర్షులు కూడ అన్నారు. ఆనాడు ఆయనకు శిష్యులే లేరు. కాని ఆయన చెప్పిన జ్ఞానము జగత్తులోని సర్వజీవరాసులకు వర్తించునది. కావున ఆయన జగద్గురువైనాడు. నేటి జగద్గురువులు మానవులను అందరిని సమానముగా చూడక ఒక మతము, ఒక కులము అని తెగలు చేసి వారికి ఆ బోధ, వీరికి ఈ బోధ, వారికి నియమము, వీరికి ఈ నియమమని మనుజులలోనే ఎన్నో చీలికలను పెట్టి, కులమతమను వర్గముల వ్యత్యాసము పెట్టి, కొందరిని త్రాకి మ్రొక్కించుకొనుచున్నారు, కొందరిని త్రాకకుండ దూరముగానుండి మ్రొక్కమనుచున్నారు. వారి దృష్ఠిలో తక్కువ కులమువారు భక్తితో పాలు తీసుకపోయిన పాత్ర మీద నీల్లు చల్లి తీసుకుంటున్నారు. వారి బోధలు సకల జీవరాసులకు వర్తించునవిగ ఏమాత్రము లేవు. అయినప్పటికి అటువంటివారు జగద్గురువులుగ పేరుగాంచడము, మనకు జగద్గురువు యొక్క అర్థము తెలియక పోవడమేనని తెలియుచున్నది. చైతన్యముగలిగిన ప్రతి జీవరాశికి సంబంధము గల బోధ ఎవడు తెల్పుచున్నాడో, ఆత్మ నివాసమున్న ప్రతి

జీవరాశికి గల కష్టసుఖ, పాపపుణ్య, సుగుణదుర్గుణ వ్యత్యాసముల స్థితిని ఎవడు తెల్పుచున్నాడో, జీవమయమైన జగత్తుకంతటికి వర్తించు సూత్రములు ఎవడు తెల్పుచున్నాడో, వాడే జగద్గురువని తెలియాలి. ఉదాహరణకు జీవునకు శరీరమే నివాసము అన్నప్పుడు, అది మానవులకే కాక జగత్తులోని సర్వజీవులకు వర్తించును. అటువంటి బోధ కృష్ణుడు బోధించిన భగవద్గీతయందు సంపూర్ణముగ ఉన్నది, కావున శ్రీకృష్ణుడు జగద్గురువైనాడు. జగత్తుయొక్క గుహ్యమును గుర్తుచేసినవాడు జగద్గుర్తు. అందరి భాషలో జగద్గురువు అనవచ్చును.

| | | |
|---|---|---|
| **గుర్తు** | **=** | **గురు** |
| **గురుతు** | **=** | **గురువు** |
| **జగద్గుర్తు** | **=** | **జగద్గురువు** |

# సమత - సామత - సామెత

మనము ప్రతి సంవత్సరము ఆగష్టు, సెప్టెంబరు మాసాలలో వచ్చు వినాయకుని పండుగను ఎంతో ఉత్సాహముతో జరుపుకుంటాము. ఈనాడు ఇందూ ప్రజలలో ఎంతో గాఢముగా నిలిచిపోయిన ఈ పండుగను గురించి ఇతర మతస్థుల విమర్శలు కూడా ఎన్నో గలవు. అటువంటి విమర్శకులు మా వద్దకు వచ్చి **'మీరు ఎంతో ఖచ్చితముగా సత్యమైన విషయములు తెలుపుచున్నారు గదా! అటువంటపుడు మీరు మా ప్రశ్నలకు సమాధానమిస్తారా'** అని అడిగారు. అందులకు సమాధాన ముగా మేము సత్యమైన జ్ఞానవిషయాలనే తెలుపుచు జీవితమును

సాగించాలను కొన్నాము. కావున మీప్రశ్నలకు జవాబులు నాకు తెలిసి ఉంటే తెలుపగలను, లేకపోతే నాకు తెలియదని చెప్పగలను అడగండి, అని తెలిపాము. అపుడు వారు అడిగిన మాటలిలా ఉన్నవి.

1) ఇందూమతములో విఘ్నేశ్వర పండుగ అని చేస్తున్నారు కదా! విఘ్నేశ్వరుడు అంటే విఘ్నములకధిపతియని కదా అర్థము. విఘ్నములంటే అడ్డంకులు ఆటంకములు అని కదా అర్థము, అటువంటి ఆటంకములకధిపతియై, ఆటంకములు కలుగజేయువానిని శత్రువుగ భావించి దూషించాలి, కాని పూజించడమెందుకు? చెడ్డ చేయువాడు బలమైనవాడైతే వానిని ఎవరు వ్యతిరేకించక పొగిడినట్లు, మీరు చేయు భక్తి కూడ విఘ్నేశ్వరుడు విఘ్నములు కలిగిస్తాడని భయపడి పూజచేయు చున్నట్లున్నది. కాని భక్తితో కాదని తెలియుచున్నది దీనికి మీరేమంటారు?

2) ఎంతో భక్తిగ, మరి ఎంతో ఖర్చుగ, ఎంతో అందముగ తయారుచేసుకొన్న విఘ్నేశ్వరుని ప్రతిమలకు మిగుల భక్తిగ పూజించుకొని, ముందురోజు చేసిన భక్తినంతటిని ఏటిలో కలిపి, విఘ్నేశ్వరుని నీటిలోనికి విసిరివేయడము మంచిదా? ఇక చాలు నీ సహవాసము అన్నట్లు వినాయకున్ని నీటిలోనికి త్రోసి చేతులు దులుపుకోవడము భక్తి అంటారా?

3) పదిరూపాయలు పెట్టి దైవజ్ఞానము తెలుపు పుస్తకము కొనుక్కోవడానికి బాధపడు వారిని మీరెందరినో చూచి ఉంటారు. అటువంటి వారు సహితము వేలు ఖర్చుపెట్టి వినాయక ప్రతిమలు చేసి వాటిని విరగగొట్టి వారి డబ్బును వృథా చేసుకొనుచున్నారు. కొందరు బలవంతముగ ప్రతిమల ఖర్చుకని ఇతరులతో డబ్బును వసూలు చేయుచున్నారు. ఇలా బలవంతముగ వసూలు చేయడము బలవంతపు భక్తి కాదా?

4) ఒకే రకముగ, ఒకే పద్ధతిగ, ఒకే విధముగ అవయవములు కల్గి పుట్టిన మనము, ఒకే దేవుని బిడ్డలమని మరచి, మతద్వేషములను పెంపొందింపజేసుకొను అధ్యాయములో వినాయక పండుగను ఉపయోగించుకొనుచున్నాము. జ్ఞానమును పొందిన యోగులుగ మీరెమంటారు?

ఈ విధముగ అడిగిన వారికి వినాయకపండుగ రహస్యము మేము చెప్పవలసి వచ్చినది. వారి ప్రశ్నలకు సరైన జవాబులు అందివ్వకపోతే, వారి హృదయములో వినాయక పండుగ మీద ఉన్న భావమును మార్చలేము. మనకు గొప్పదైన అడుగువారికి చిన్నదిగనే కన్పిస్తుంటుంది. కావున నిజార్థాన్ని చెప్పక తప్పదు. ప్రపంచ పుట్టుకలో మతములనునవి లేవు. దేవుళ్లను వారూ లేరు, దేవుడొక్కడను విషయము అందరి అవగాహనలోను ఉండెడిది. కొంతకాలమునకు అటువంటి అవగాహన మనుష్యులలో క్షీణింప మొదలిడినది. ఆ సమయమున తత్త్వవేత్తలైన మహాత్ములు కొందరు యోచించి, అజ్ఞాన బీజమును తీసివేయుటకు, దైవత్వమును గూర్చి ప్రచారము చేయబూనినారు. దేవునికి రూపములేదు కావున ముక్కు ముఖము లేని రాయిని (లింగమును) గుర్తుగా పెట్టి, దేవుడిట్లుంటాడని రూపము లేనివానిగా బోధించారు. ఆయనకు (దేవునికి) పేరులేదు కావున ఈశ్వరుడని పిలిచారు. ఈశ్వరుడనగా అధిపతియని అర్థమేకాని పేరుకాదు. ఇట్లు సర్వమునకు అధిపతియైన వాడొకడున్నాడని రూపములేని గుండును చూపించి, తెలియకుండ పోయిన దైవత్వమును గురించి ఆనాటి పెద్దలు తెలియజేశారు.

ఇట్లు జ్ఞానపరముగానే కాక, సంఘపరముగా కూడ మానవున్ని నడిపించుటకు ఆనాటి పెద్దలు కృషిచేశారు. ఈనాడు మనము సామెత

అను పదమును ఆనాడు **'సమత'** అనెడివారు. పెద్దలమాట మారనిదనీ, నిజమనీ, చెడనివాక్యమనీ చెప్పుటకు సమానముగా "పెద్దలమాట పెరుగన్నము మూట" అనుట నేటికి కలదు. పెద్దలమాటకు సమతగా పెరుగన్నపు మూటను వాడినారు. **సమత** అంటే సమానమని అర్థము. అట్లే **"చింత లేనమ్మకు సంతలో నిద్రవచ్చె"** అనుట కూడా గలదు. చింత లేనమ్మకు సంతలో నిద్రకు సమానముగా (సమతగా) పోల్చి చెప్పడమన్నమాట. ఇటువంటి సమత అనుపదము కొంతకాలమునకు పలుకడములో **'సామత'** గా మారినది. అట్లే మరి కొంతకాలమునకు సామత పోయి **'సామెత'** గా మారిపోయి నేడు మన ముందరున్నది. ఇటువంటి సామెతలను ఎన్నిటినో పూర్వము మానవుని సంఘపరముగా సక్రమముగా నడుపుటకు పెద్దలుంచారు. ఆ విధానము ప్రకారమే సమాజములోని ఒక చెడును తీసివేయడానికి సమాన పోలికతో సంఘములో బలహీనుని ఎలుకగా పోల్చి, బలవంతుని ఏనుగుగా పోల్చి చెప్పెడివారు. బలవంతుడు బలహీనునిపై పెత్తనము చెలాయించి పీడించడమును **"ఎలుకపై ఏనుగుస్వారి చేసినట్లు"** అని సామెతను అనెడివారు. ఇది సంఘవిద్రోహచర్య కావున ఇది మంచిదికాదనీ అందరికి తెలియునట్లు, నోటితో చెప్పడమే కాకుండా దృశ్యరూపముగా కంటికి కనిపించెడి కార్యక్రమముగా చూపించెడివారు. ఒక చిన్న ఎలుకనుంచి, దానిమీద పెద్ద ఏనుగును ఆసీనమైనట్లు చేసి, అది అందరికి తెలియునట్లు ఊరంత ఊరేగించి, చివరకు ఈ పద్ధతి మంచిది కాదన్నట్లు ఆ దృశ్యమును నాశనము చేసెడివారు. వారు ఆ దినము మట్టితో చేసిన బొమ్మలను అగ్నిలోవేసి కాలిస్తే ఇంకా గట్టిపడి చెక్కు చెదరకుంటాయని, నీటిలో అయితే పూర్తి కరిగిపోతాయని నీటిలో ముంచెడివారు. నీటిలోనికి వేసిన తర్వాత ఆ దృశ్యము తొందరగా

నాశనమగుటకు నీటిలో వేయకముందే ఆ బొమ్మకు కాళ్లు చేతులు విరగగొట్టి పూర్తి నీటిలో కలిసిపోయేటట్లు చేసెడివారు. ఇది ఆనాటి సంఘ సంస్కరణ నిమిత్తమైన ఆచరణ. ఈ కార్యము ప్రతి సంవత్సరము ఒక ఆచరణగా చేయడము నేటికి మిగిలి ఉన్నది. కానీ అర్థము మాత్రము తెలియకుండా పోయినది. ఒకరు చేస్తూ ఉంటే ఇంకొకరు ఆ ఆచరణ చేయడమే నేడు తెలిసిన విధానము, అంత తప్ప అర్థమును గూర్చి ఎవరూ ఆలోచించడము లేదు. ఒక మతస్థులు చేయుచున్న ఆచరణ పూర్వము గొప్పభావముతో పెట్టినదని ఆ మతస్థులకే తెలియనపుడు, ఇతర మతస్థులు అపార్థము చేసుకొవడములో తప్పులేదు. కాని నిజమైన అర్థమునూ ఆచరణనూ తీసుకొన్నపుడు అందులో విమర్శించునది ఏమీలేదు. ఎవరు విమర్శించలేరు, అసలైన అర్థము తెలిసినపుడు అన్ని మతస్థుల మద్దతు లభిస్తుంది.

నేను ముందే చెప్పానుగా పూర్వము మతము పేరు లేని ప్రజలకు దేవుడొక్కడను భావముండేదనీ, దేవునికి రూపము, పేరు లేదను గుర్తింపుకే రాతిలింగమును ఉంచినారనీ, అయినప్పటికి కాలక్రమమున ధర్మములు అధర్మములుగా మారునను గీతా వాక్యానుసారము, కొంతకాలమునకు మానవులలో అజ్ఞానవశమున ఏకత్వముపోయి, మేము మీరు అను గుంపులు బయలుదేరినవి. ఈ దినము రాజకీయ పార్టీలకు పేరున్నట్లు, ఆ దినము గుంపులుగ చీలిపోయిన వారికి కూడా పేర్లుండేవి. అట్లు కొంతకాలమునకు ఏర్పడినవే వైష్ణవులు, శైవులు. పూర్వము వైష్ణవులు శైవులు సాంప్రదాయములను ఏర్పరుచుకొని, ఇవి మా సాంప్రదాయములు అనుచు, వాటి భద్రత కొరకు కొన్ని పురాణములను వ్రాసి, అవి ప్రజలందరికీ తెలియునట్లు చేసీ, వారి సాంప్రదాయములను భద్రము

చేసుకొన్నారు. అటువంటి పురాణములలో శైవుల సంబంధమైన శివపురాణము పుట్టినది.

ఇట్లు శైవమేర్పడు రెండువేల సంవత్సరములకు ముందే సమాజపరముగా ఏనుగును ఎలుకను ఊరేగించి నీటిలో ముంచివేయు ఆచరణ గలదు. ఆ ఆచరణ చేస్తూ చేస్తూ పెద్దలు చనిపోతు రాగ, చిన్నలు వారిననుసరిస్తూ చేస్తూ చివరకు ఎందుకు ఈ కార్యక్రమము చేస్తున్నామనునది ఎవరికీ తెలియకుండా పోయినది. అర్థము ఇది అని తెలియక ఎంతోమంది కలిసి ఆనందముగా ఎలుకను ఏనుగునూ ఊరేగిస్తున్నాము. ఇదేదో గొప్ప భక్తికార్యమనుకొని ఆ ఏనుగాకారానికి మ్రొక్కను మొదలిడినారు. అట్లు శైవముద్భవించు దినములకే ఎలుక ఏనుగు బొమ్మను మ్రొక్కువారు గలరు. కనుక శైవులు శివపురాణములో ఎలుకకు ఏనుగుకు విశిష్టత కల్పించి, ఏనుగుతల కల్గినవాడు వినాయకుడనీ, పార్వతి కుమారుడనీ ఉన్న భక్తిని ఇంకొంత ఎక్కువగునట్లు మంచిపనియే చేశారు. ఉన్న భక్తిని ఎక్కువ చేయుటవలన ఏనుగు బొమ్మలు చేయువారు ఎక్కువైనారు. డబ్బు ఖర్చుపెట్టి పూజించువారు ఎక్కువైనారు, కానీ నీళ్లలో వేసి త్రొక్కే పూర్వ ఆచరణను మాన్పించలేక పోయినారు. ఈ విధానమును మాన్పించలేని పెద్దలు వినాయక నిమజ్జనమును నీటిలోనే చేయుచున్నామన్నారు. నిమజ్జనమనగా స్నానమని అర్థము కానీ విరగగొట్టడము, పూజించిన దేవున్ని కాలదన్నడము కాదని తెలియాలి. మీరడగిన మొదటిప్రశ్నలో విఘ్నము కలిగించు విఘ్నేశ్వరుని ధూషించాలి కానీ పూజించకూడదన్నారు కదా! అసలుకు విఘ్నేశ్వరున్ని ధూషించడానికి ఆయన మనకే విఘ్నము, ఏ చెడ్డచేయలేదు. అందువలన ధూషించవలసినదిలేదు. భక్తి కలిగి

విఘ్నేశ్వరుని పూజించడములో తప్పులేదు, కానీ పూజించినవానిని పూజించినట్లే ఉంచుకొని ఉంటే బాగుండేది. నీటిలో పారవేయడము మంచిది కాదు. ఒకమాటకొస్తే దానిని ధూషించుటకు పూజించుటకు కాక సంఘపరమైన అన్యాయమును బహిర్గతము చేయడానికి ఊరేగించు ఊరేగింపుయనీ, అట్లే దానిని లేకుండా చేయవలయునను ఉద్ధేశ్యమే ఆ బొమ్మను నీటిలోముంచి నాశనము చేయడమని అందరూ తెలియవలెను.

మీరడిగిన మరొక ప్రశ్న ప్రకారము బలవంతముగా డబ్బు వసూలుచేసి ఉత్సవము చేయడము పద్ధతికాదు. భక్తిలో కూడ అది బలవంతపు భక్తి అగును, కానీ మనస్ఫూర్తి భక్తికాదు. ఇష్టము లేకుండా ఇచ్చినవారు అడిగిన వారినే కాక, విఘ్నేశ్వరుని కూడ నిందించుటకు అవకాశముగలదు. అందువలన ఇంకొకరితో డబ్బు వసూలు చేయడము మంచిది కాదు.

**పూర్వకాలములో సమత అనుపదము సామతగా మారి చివరకు సామెతగా మారినట్లు, ఆ రోజు పెద్దలుంచిన సంఘసంస్కరణ పద్ధతియైన ఎలుక ఏనుగు ఊరేగింపు నేడు భక్తిపరముగా మారిపోయినది.** భావము మారినప్పటికీ ఆచరణ పూర్తిమారక పూర్వాచరణే చేయుటవలన కొందరిచేత విమర్శింపబడుచున్నది. ఆచరణను పూర్తి భక్తిపరముగా మార్చుకున్ననూ పరవాలేదు లేక ముందుమాదిరే సంఘపరముగా పెట్టుకొన్న పరవాలేదు. కానీ అటు ఇటు కాక చేయుచున్న పనికి అర్థము తెలియకపోవడము వలన ఇతర మతములచేత, చూచువారిచేత విమర్శింపబడు కార్యమైనది. వినాయకుని నిమజ్జన (స్నానము) అను పేరుతో చిన్నచిన్న బొమ్మలను నీటిలోనికి విసురుచుండుట చూస్తే

నిజముగా భక్తి అనిపించదు. సరదాగా చేయుచున్న పనిగా కన్పిస్తున్నది, కానీ పూర్తి భక్తిగా కనిపించుపనిగా తోచడము లేదు. ఊరేగింపులందామా కొన్ని చోట్ల పీర్లపండుగ మాదిరి త్రాగి చిందులు వేయడము, కట్టెసాములు చేస్తాపోవడము చూస్తే అల్లరి సాంప్రదాయము కాని అర్థసాంప్రదాయము కాదనిపిస్తుంది. కావున మేము చెప్పుమాటను అర్థము చేసుకొని మనది జ్ఞానపరమైన ఇందూమతమనీ, దీని పనులన్ని ఎంతో పవిత్రతతో కూడి ఉండవలయుననీ తెలిసి, వినాయక ఉత్సవమును పవిత్రముగా ఆచరించండి విమర్శలకులోను కానివ్వద్దండి.

# శరీరాంతర్గత యంత్రాంగము

(1) బుద్ధి కర్మానుసారిణి (తప్పు)

(2) చిత్తము కర్మానుసారిణి (ఒప్పు)

**ప్రశ్న** :- ప్రారబ్ధకర్మ సంచితకర్మ ఎట్లు దగ్ధమైపోవునో తెలిపినారు. ఆగామికకర్మ యొక్క విషయము తెలియకున్నది. దానిని ఎట్లు నివారించుకోవచ్చునో తెలుపమని కోరుచుంటిని.

**జవాబు** :- జ్ఞానాగ్ని వలన ప్రారబ్ధ సంచిత కర్మములు ఎట్లుపోవునది నీకు తెలిసిన విషయమే. ఆగామికకర్మ నివారణను తెలుసుకొనుట చాలా ముఖ్యము. ఎందుకనగా వర్తమానములో జరుగుచున్న పనిలో వచ్చు కర్మ ఆగామికము. కావున మొదట దీనినుండి తప్పించుకొనుట మంచిది. ఆగామికకర్మ నుండి తప్పించుకొన్నవారు సులభముగా సంచిత ప్రారబ్ధకర్మల నుండి తప్పించుకొనుటకు వీలగును. అందువలన కర్మ

నివారణ సిద్ధాంతములలో ఆగామికకర్మ నివారణ సిద్ధాంతము చాలా ముఖ్యమైనది. భగవద్గీతయందు కూడా ఆగామికకర్మ నివారణార్థమై పరమాత్మ భగవంతుని ద్వారా చాలా బోధ తెలిపినాడు. పరమాత్మ తన బోధలో కర్మను ఆగామిక, ప్రారబ్ధ, సంచిత అని విడదీయక అన్నింటిని కలిపి తెలుపుచూ పోయినాడు. భగవంతుడు తెలిపిన బోధలో కర్మను విపులముగా అర్థము చేసుకొను నిమిత్తము మనము సంచిత, ప్రారబ్ధ, ఆగామికకర్మలని విభజించుకొనుచున్నాము. ఆయన బోధలో ***'యథైధాంసి సమిద్ధోగ్నిః భస్మసాత్కురుతేర్జునా, జ్ఞానాగ్ని సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా'*** **'అగ్నియందు ఎన్నికట్టెలు వేసినా బూడిదగునట్లు, జ్ఞానాగ్నిలో సర్వకర్మలు బూడిదగును'.** అని కర్మనివారణార్థము ఒకే సూత్రమును తెలిపి కర్మ వివరములో ఒకచోట ప్రారబ్ధకర్మ నివారణ, ఒకచోట ఆగామికకర్మ నివారణ, ఒకచోట సంచితకర్మ నివారణ గురించి తెలిపాడు. మేము ముందు తెలిపిన **"ప్రబోధ"** గ్రంథమునందు పరమాత్మ సూత్రము ప్రకారము కర్మ నివారణ ఉన్నదని మాత్రము తెలిపాము. కాని కర్మను విడదీసి తెలుపలేదు. అందువలన ఇపుడు ఇందులో తెలుపుచున్నాము.

నిత్యజీవితములో చిన్నదికాని, పెద్దదికానీ ప్రతికార్యము ముందు చేసుకొన్న కర్మను అనుసరించి జరుగుచున్నది. ఒకడు వేరొకన్ని హత్య చేశాడనుకొనుము. ఆ హత్య జరుగుటకు కారణము వాని కర్మయే. ప్రారబ్ధములో వాడు హత్య గావింపబడునట్లుండుట వలన మరియు హత్యచేయువానికి హత్యచేయుకర్మ ఉండుట వలన ఆ కార్యము జరిగినది. చేయువాడు చేయించుకొనువాడు ఇద్దరు ఎవరి కర్మను వారు అనుభవించుచున్నారు. ఆ విధముగా ఇద్దరి కర్మ ఖర్చుయిపోవుచున్నది. తిరిగి క్రొత్తకర్మ వచ్చుననునది ఏమాత్రము ఉండకూడదు. ప్రతిజీవరాసి

కర్మను అనుభవించుటకు పుట్టుచున్నది, ఆ కర్మ అనుభవమునకు కార్యములు చేయుచున్నవి. చేయుచున్న కార్యములు కర్మననుసరించి మంచివి కావచ్చు లేక చెడ్డవి కావచ్చు. ఈ విధముగా జీవితాంత్యము వరకు కర్మ ఖర్చవుతూనే ఉన్నది. కాని క్రొత్త కర్మను జీవులు ఏమాత్రము చేయలేదు. ఆగామికకర్మయను క్రొత్తకర్మ వచ్చుటకు ఏమాత్రము వీలులేదు. ప్రతివిషయమును కర్మే ప్రేరేపించుచున్నది. కర్మే చేయించుచున్నది. జీవునకు ఏమాత్రము సంబంధములేదు. జీవుడు ఏ కార్యమునుగానీ స్వయముగా చేయలేదు. అందువలన క్రొత్తకర్మ వచ్చుటకు వీలులేదు.

ఉదాహరణకు ఒక హత్యాకార్యమును తీసుకొందాము. మల్లయ్య అనువాడు రామన్న అనువాని చేతిలో హత్య కావింపబడ్డాడు. ఇక్కడ కర్మకార్యరూపముగా ఎట్లు జరిగినదనగా! మల్లయ్య ఒంటరిగా పోవుట రామన్న దృష్టియందు పడినది. రామన్న కన్ను ఆ విషయమును మొదట సూర్యచంద్రనాడుల మీదనున్న మనస్సుకు తెలిపినది. మనస్సు మల్లయ్య పోవు విషయమును తలలోని జీవునికి బ్రహ్మనాడి ద్వారా తెలిపినది. అక్కడకు చేరిన విషయమును జీవుడు సాక్షిభూతునిగా చూచుచుండును. జీవునికి ప్రక్కనే పొరగాయున్న బుద్ధి వచ్చిన విషయాన్ని మొదట గ్రహించి ఆ విషయమును రెండువిధముల విడదీసి చెప్పును. వీనిని చంపివేసిన బాగుండునని బుద్ధి చెప్పును. మరియు వీనిని చంపిన వాని బంధువుల ద్వారా కష్టముండునని చెప్పును. ఎన్ని రోజులనుండియో కాచుకొన్నాను దొరికిన సమయమును వదలి వేయకూడదని చెప్పును. మరియు వీనిని చంపుట వలన డబ్బు కోర్టులకు చాలాఖర్చు అగునని చెప్పును. ఈ ప్రకారము బుద్ధి మంచిచెడులను,

లాభనష్టములను, కష్టసుఖములను రెండు విధముల వివముగా తెలియజేయును. అట్లు రెండు విధముల బుద్ధి తెలిపిన విషయమును ఏదో ఒకటి చేయమనో లేక చేయవద్దనో నిర్ణయించునది బుద్ధికి ప్రక్క పొర అయిన చిత్తము. చిత్తము తాను నిర్ణయించిన దానిని మనసుకు తెలుపుతుంది. మనస్సు చిత్తము తెలిపిన వార్తను కర్మేంద్రియములకు తెలియజేయును. కర్మేంద్రియములు ఆ కార్యమును చేయుచున్నవి. ఈ విధముగ జరిగిన హత్యాకార్యములో రామన్న అను జీవుడు ఎంత బాధ్యుడు అనిన ఏమాత్రము బాధ్యుడు కాడని చెప్పవచ్చును. ఎందుకనగా జరిగిన పనిలో జీవుడు సాక్షిగా చూస్తూవున్నాడు. అతని జ్ఞానేంద్రియములు, మనస్సు, బుద్ధి, చిత్తము, కర్మేంద్రియములే ఈ పనిలో పాత్రవహించినవి. జ్ఞానేంద్రియములే చూచి మనస్సుకు తెలుపగా, మనస్సు పైన కపాలములోని బుద్ధికి తెలుపగా, మంచిచెడ్డలను రెండుగ బుద్ధి విడదీసి చెప్పగా చిత్తము నిర్ణయించగ, కర్మేంద్రియములు పనిని చేసినవి, కానీ జీవుడు ఈ కార్యమునకు ఎంత మాత్రము బాధ్యుడు కాడు. అందువలన జరిగిన హత్యలోని పాపము జీవునికి సంబంధము లేదు. అట్లని నిత్యము జరిగే మంచిచెడ్డపనులలో పుణ్యపాపములు లేవా, వాటిని జీవరాసులు పొందడము లేదా అంటే! జీవులు పాపపుణ్యములు పొందుచున్నవనే చెప్పవచ్చును. పాతకర్మను అనుభవించుచూ క్రొత్తకర్మను పొందుచున్నవి. అందువలన ఎడ తెగని జన్మలు కలుగుచున్నవి. జరిగేపనిలో సంబంధములేని క్రొత్తకర్మ జీవునికి ఏ విధముగా అంటుచున్నదనగా!

బుద్ధి విమర్శించిన విషయములను చిత్తము నిర్ణయించగా కార్యము జరుగుచున్నది. జరిగే పనులకు చిత్తమే కారణము. చిత్తము

హత్య చేయమనే ఎందుకు నిర్ణయించినది? చేయకూడదని నిర్ణయించ కూడదా? అంటే కర్మననుసరించి చిత్తము నిర్ణయించును. చనిపోయే కర్మ వానికున్నపుడు, చంపే కర్మ వీనికున్నపుడు ఆ కర్మే ఆ విధముగా చిత్తముచేత నిర్ణయింపచేస్తుంది. ఆ విధముగా జరిగిన పనిని చిత్తము ప్రక్కనున్న అహము ఈ పని నీవలననే జరిగినది, నీవు లేకున్న ఈ పని జరుగదు, నీవే ఈ పనికి యజమానివి అని ప్రక్కనున్న జీవునికి చెప్పుచుండును. జరిగినపనిలో తాను ఏమాత్రము సంబంధము లేని జీవుడు అహంకారము చెప్పు మాటలు విని, దానితో ఏకీభవించి అనగా అహంకారముతో కూడుకొని ఈ పనిని నేనే చేశాను అని అనుకొనును. అహంకారము వలన నేను అని అనుకొనుట వలన క్రొత్త కర్మ సంభవించుచున్నది. అజ్ఞానము వలన జీవుడు నేననుకొనుట సంభవించుచున్నది. నేడు జీవరాసులన్ని అజ్ఞానదశలో ఉన్నవి కావున కర్మ ప్రతి కార్యములోను పొందుచున్నారు. అజ్ఞానమును వీడినవాడు జరుగుచున్న కార్యములో తాను ఏమాత్రము బాధ్యుడుకాదని ప్రతిపని అంతఃకరణములు, జ్ఞాన, కర్మేంద్రియములు చేయుచున్నవని తెలుసుకొన్న వాడు, అహంకారము మాట వినని వాడు క్రొత్తకర్మను ఏమాత్రము పొందడు. అందువలన గీతయందు *'యస్యనాహంకృతో భావో బుద్ధిర్యస్య నలిప్యతే హత్వాపి స ఇమాన్ లోకాన్న హంతి ననిబధ్యతే'* ఎవడు అహంకారభావమును పొందడో, ఫలితము మీద ఎవ్వనికి బుద్ధి లేదో వాడు లోకములోనున్న వారందరిని చంపినప్పటికి హంతకుడుగాడు. వానికి పాపమురాదని పరమాత్మ తెలిపాడు. ముందు కర్మానుసారము హత్య జరిగినది. కాని జీవుడు ఏమాత్రము చేసినది కాదని అందువలన పాపమంటదని పైమాటలో తెలియుచున్నది. జీవుడు అహంకారముతో ఎప్పుడయితే కూడుకొనునో అప్పుడే జరిగిన కార్యమందలి క్రొత్తకర్మ

సంభవించును. జీవుడు తన శరీరములోని అహంకారమును గుర్తించిన వాడై, అది చెప్పుచున్న విషయము తనకు సంబంధములేదని, దాని మాట ఎప్పుడు వినడో అప్పుడు వానికి కర్మ అంటదు. జ్ఞానార్జన వలన అహంకారము మాట వినని వాడు ముందు కర్మ అనుభవించుచూ కాలముగడిపి, ముందు కర్మ అయిపోయిన వెంటనే మోక్షమును పొందును. ఈ పద్ధతినే కర్మయోగము అని గీతయందు తెలుపబడినది.

**ప్రశ్న** :- జరిగే పనిని జ్ఞానేంద్రియములు మొదలు పెట్టునట్లు మీరు చెప్పిన మాటలలో తెలిసినది. చిత్తము కర్మేంద్రియముల ద్వారా చేయించినట్లు తెలిసినది. ఇందులో మనస్సుకు సాధారణపాత్ర తప్ప ముఖ్యపాత్ర ఏమి లేదు. మరియు ప్రకృతి వలన కల్గిన గుణముల ప్రభావము కార్యములో ఏమి లేనట్లున్నది. కర్మే చిత్తమును నిర్ణయించు నట్లు చేసినదని తెలిపారు. ఇంతకుముందు ప్రబోధలో మీరు ప్రతి కార్యమునకు గుణములే కారణమంటూ తెలిపారు. ఇక్కడేమో గుణముల విషయమే లేకుండా కర్మ అంటున్నారు. నాకున్న ఈ సంశయములను వివరించి తెలుపవలయునని కోరుచున్నాను.

**జవాబు** :- ఇపుడు నీవడుగు ప్రశ్నలను బట్టి నీ బుద్ధి నేను చెప్పు విషయములను బాగుగా విమర్శించుచున్నదని తెలియుచున్నది. సరే నీ ప్రశ్నలకు సమాధానము వినుము. కర్మను గురించి తెలుసుకొనుట చాలా గొప్ప జ్ఞానము. కర్మయుండుట వలననే జీవునకు దేహమున్నది. కర్మ లేకపోతే జన్మలేదు. జీవునకు ఉన్నవి రెండే గమ్యములు. **'ఒకటి కర్మ, రెండు ముక్తి'** కర్మలోనున్న జీవుడు ముక్తికి పోవచ్చు కాని ముక్తిలోనున్నవాడు కర్మకురాడు. ఇపుడు మనము తెలుసుకోవలసినదంతా కర్మలోనున్న వాడిని గురించియే, ముక్తిలోనున్న వానిని గురించి కాదు.

కర్మను గురించి తెలుసుకొనినవానికి తప్పక ముక్తి లభించును. కర్మను గురించి తెలుసుకొనుటయే ఉత్తమజ్ఞానము.

ప్రతి క్షణమునందు కర్మ వినియోగింపబడుచున్నది. జరుగుచున్న కాలములో క్షణక్షణమునకు కర్మయే కారణము, కర్మ లేకపోతే కాలమేలేదు. కాలము లేకపోతే కర్మ లేదు. కాల కర్మములు రెండు సంబంధముగా ఉన్నవి. ప్రతికాలములోనూ జీవుడు కర్మను అనుభవించుచున్నాడు. అనగా పండుకొనునపుడు, నిద్రించునపుడు, ఊరకున్నపుడు, పనులు చేయునపుడు, మాట్లాడునపుడు, శ్వాస విడుచునపుడు, కనురెప్పలు మూయుచూ తెరుచుచున్నపుడు, అతిచిన్న పని దగ్గర నుండి ఏ కార్యము వరకైన, ఏ కార్యము చేయక ఊరక ఉండు సమయమునందైన జీవుడు కర్మను అనుభవించుచున్నాడు. ఊరకయుండుట కూడా కర్మయేనా! అని కొందరికి అనుమానము రావచ్చును ముమ్మాటికి కర్మయేనని తెలుసుకొనుము. కాలము జరుగుచున్నదంటే కర్మజరుగుచున్నదను సూత్రము ప్రకారము ఊరకుండు నపుడు కూడ కాలము జరుగుచున్నది కదా! అపుడు కూడా కర్మ జరుగుచున్నదని తెలుసుకొనుము. ఊరకుండుట కూడ ఒకరకమైన కర్మ అని తెలుసుకొనుము. ఈ విధముగా మొదట కాలమంత కర్మమయమని తెలుసుకొనుట ముఖ్యము.

ప్రతి కార్యములోను కర్మయే కారణమని ఇపుడు బాగా అర్థమైనది. ప్రతి కార్యము జరుగుటకు శరీరములో ఎన్నో భాగములు పని చేయవలయును, శరీరములో కార్యనిమిత్తము ఏ భాగము పనిచేసినా అది కర్మ ప్రభావమువలన అనియే తెలుసుకోవలయును. చలనచిత్రములో ప్రొజెక్టరులోని ఫిల్మ్మయే బొమ్మలకు కారణము. ఆ బొమ్మలు పడుటకు ప్రొజెక్టరులోని ప్రతిభాగము పనిచేయుచున్నది. సూక్ష్మముగా ప్రొజెక్టరు

లోని ఫిల్మ్ ప్రొజెక్టరు కదలికవలన పరదామీద బొమ్మరూపముగా పడునట్లు, మనయందు కపాలములో సూక్ష్మముగాయున్న కర్మ బాహ్యమున పెద్ద కార్యరూపము ధరించుచున్నది. చిన్న ఫిల్మ్ ప్రతిబింబించుటకు ప్రొజెక్టరు ఎట్లు పనిచేయుచున్నదో, అట్లే కర్మ కార్యరూపముగ ప్రతిబింబించుటకు మన శరీరములోని భాగములు పని చేయుచున్నవి. కర్మ మన శరీరములో ఏ భాగములను కదిలించి కార్యరూపముగ ఏర్పడుచున్నదో తెలుపుచున్నాను వినుము.

మన శరీరములో కర్మ ఆచరణయందు ముఖ్యపాత్ర వహించునది మనస్సు. బాహ్యేంద్రియములైన కన్ను చెవి మొదలగు ఇంద్రియములు తెలియజేయు విషయములను మనస్సు గ్రహించి అంతరేంద్రియములైన బుద్ధి చిత్తమునకు పంపవలెను. మనస్సు అంతరేంద్రియములకు బాహ్యేంద్రియములకు మధ్యవర్తిలాంటిది. మధ్యవర్తి లేకపోతే రెండు వర్గముల మధ్య విషయములు ఎట్లు నిలిచిపోవునో అట్లే మనస్సు లేకపోతే బాహ్యేంద్రియముల విషయములు అంతరేంద్రియములకు, అంతరేంద్రియ విషయములు బాహ్యేంద్రియములకు చేరవు. నిద్రయందు మనస్సు సూర్యచంద్రనాడుల మీద లేకుండా బ్రహ్మనాడియందు చేరిపోయినది. కావున బాహ్యేంద్రియ విషయములు అంతరేంద్రియములకు పోలేదు మరియు అంతరేంద్రియ విషయములు బాహ్యేంద్రియములకు రాలేదు. అందువలన నిద్రసమయములో ఏ కార్యములు జరుగకుండా స్థంభించిపోవుచున్నవి. నిద్ర సమయములో కూడ బాహ్యేంద్రియములైన కన్ను, ముక్కు, చెవి, చర్మము, నాలుక పనిచేయుచుండును. చెవికి అన్ని శబ్దములు వినబడుచునే ఉండును. కాని ఆ శబ్దమును గ్రహించి అంతఃకరణములకు తెలియజేయు మనస్సు లేదు కనుక ఏ శబ్దము

వినిపించుచున్నది లోపలనున్న బుద్ధికి చిత్తమునకు జీవునికి తెలియదు. అట్లే నిద్రాసమయములో ముక్కుకు వాసన వస్తున్నా ఆ వాసనను గ్రహించునదైన మనస్సు లేనిదానివలన జీవునకు ఆ వాసన విషయము తెలియదు. ఇట్లు అహర్నిశలు జ్ఞానేంద్రియములు వాటి వాటి పనిని చేయుచుండినప్పటికీ, వాటి విషయము గ్రహించు మనస్సు లేనిదాని వలన విషయము జీవునకుకాని, బుద్ధికికాని తెలియలేదు. ఇంద్రియముల విషయములు నిద్రయందు తెలియలేనందున నిద్రలో ఇంద్రియములు స్థంభించి పోయినవనకూడదు. శరీరములో చైతన్యముండునంత వరకు జ్ఞానేంద్రియములు వాటి వాటి పని అవి చేయుచునే ఉండును. మనస్సు కొంతకాలము తన స్వస్థానమైన బ్రహ్మనాడియందునూ, కొంతకాలము పరస్థలమైన సూర్యచంద్రనాడుల మీద ఉండును. సూర్యచంద్రనాడుల మీదున్నపుడే బాహ్యాకరణములకు అంతఃకరణములకు మధ్యవర్తిగా ఉండి ఇక్కడి విషయములను అక్కడికి, అక్కడి విషయములను ఇక్కడికి తెలుపుచుండును.

ఒక కార్యము జరుగవలయునంటే బయటి విషయములు లోపలికి పోవలయును. లోపలి విషయములు బయటికి రావలయును. అపుడే కర్మ కార్యరూపమౌను. ఒక్క మనస్సు లేకపోతే బయటి విషయములు బయటే, లోపలి విషయములు లోపలే నిలిచిపోవును. అపుడు ఏ కార్యము జరుగదు. శరీరము జడముగా ఉండును. అందువలన కర్మ కార్యరూపము ధరించుటలో మనస్సు చాలా ముఖ్యమైన దని నేను గట్టిగా చెప్పుచున్నాను. మనస్సు పై ముఖ్యపాత్ర వహించుటే కాక ఇంకను బాహ్య అంతరేంద్రియములు చేయలేని పనిని కూడా చేయుచున్నది. అది ఏమనగా వివరించెదను వినుము.

జ్ఞానేంద్రియములకు జరుగుచున్న వర్తమాన కాలములోని విషయముతోనే సంబంధముండును. బయటి ప్రపంచములో సంబంధపడిన జ్ఞానేంద్రియముల యొక్క శబ్ద, స్పర్శ, రూప, రస గంధము అనెడి పంచతన్మాత్రలు మనస్సుకు చేరవేయబడును. మనస్సు జ్ఞానేంద్రియముల నుండి వచ్చిన తన్మాత్రల విషయములను జీవుని దగ్గరకు చేరవేయును. జీవుడు విషయములను సాక్షిగా చూచుచుండగా బుద్ధి ఆ విషయము రెండు విధముల వివరించగా, అందులో చిత్తము చిత్తగించిన విషయములను మనస్సుకు చేరగా, మనస్సు కర్మేంద్రియములకు తెలుపగా, కర్మేంద్రియములు ఆ పనిని చేయుచున్నవి. ఇంద్రియములు ఆ పని అయి పోయిన వెంటనే తిరిగి వేరొక కార్యమందు లగ్నమవుచున్నవి. అంతటితో మొదటి కార్యమును అనుభవములను మరచిపోవు చున్నవి. కాని మనస్సు ప్రతికార్యమును జ్ఞప్తికి పెట్టుకొనుచున్నది. బాహ్యేంద్రియములకు అంతరేంద్రియములకు లేని జ్ఞప్తి ఒక్క మనస్సుకు మాత్రమేయున్నది. జ్ఞాపకశక్తి అని దేనిని మనమనుచున్నామో అదే మనోశక్తి. దానినే ఎరుక అని కూడ అనుచున్నాము. మనము నిత్యము ఏ విషయములందు సంబంధము కల్గియున్నామో, ఆ విషయములనే మనస్సు జ్ఞప్తికి పెట్టుకొనుచుండును. అందువలననే గీతయందు భగవంతుడు '*సర్వేసు కాలేషు మామనుస్మర యుధ్యచ మయ్యర్పిత మనో బుద్ధిర్మామే వైశ్యష్య సంశయః*' నీ మనస్సులో నన్ను స్మరించుకొనుట వలన, బుద్ధి నన్నే ఆలోచించుట వలన ఆ విషయములే జ్ఞప్తికియుండును. ఎల్లకాలము నన్నే జ్ఞప్తికి పెట్టుకొనుట వలన చివరకు నాయందే ఐక్యము కాగలవన్నాడు.

మనస్సుకు జ్ఞాపకశక్తి ఉన్నది, కావున పరమాత్మ కూడ మనస్సును బుద్ధిని నాకే అర్పితము చేసి అనగా నా పనియందే వినియోగించ

మన్నాడు. బుద్ధిని ఆయనయందు వినియోగించగా బుద్ధి విషయమంతా మనస్సు రికార్డు చేసుకొనుచుండును. సర్వకాలమందు బుద్ధిని మనస్సును పరమాత్మచింతనయందే ఉంచిన అదే జ్ఞప్తి ఎక్కువగా ఉండి చివరికి జ్ఞప్తికొచ్చును. ఈ విధముగా పరమాత్మ విషయమే కాక ఏ విషయమైన ఇంతేనని తెలుసుకొనుము. జీవితకాలములో ఏ కార్యములలో ఎక్కువ సంబంధముగ ఉన్నామో ఆ విషయమే మనస్సుకు ఎక్కువగా జ్ఞప్తికి ఉండును. దీనినిబట్టి మనస్సు జీవరాసుల శరీరములలో చాలా ముఖ్యమైన భాగముగా ఉన్నదని గుర్తించవచ్చును.

జరిగిన విషయములను మనస్సు జ్ఞప్తికి తెచ్చుకోగలదనుట బాగా తెలిసిపోయినది కదా! ఒక్కొక్కప్పుడు బాహ్యేంద్రియములు పనిచేయు చున్నపుడు కూడ మనస్సు ఆ విషయములను గ్రహించుట మానివేసి వెనుకటి విషయములను జ్ఞప్తికి తెచ్చుకొనుటలో నిమగ్నమైయుండి పోవును. అటువంటి సమయములో బాహ్యేంద్రియముల సంబంధము అంతరేంద్రియములతో తెగిపోవును. బయటి విషయము లోపల బుద్ధికి తెలియకపోవును. ఉదాహరణకు ఒక పుస్తకము చదువు సమయములో కన్ను చూచుచుండగా రూపమను తన్మాత్ర ఆ విషయమును మనస్సుకు చేరవేయుచుండును. మనస్సు దానిని బుద్ధికి జీవునికి తెలుపుచుండును. ఆ సమయములో మధ్యవర్తి మనస్సు వేరు విషయ ఆలోచనలలో ఉండిపోయినదనుకొనుము. అపుడు బాహ్యేంద్రియములైన కన్ను చదువుచూనే ఉండును ఆ విషయము మనస్సు వరకు చేరుచూనే ఉండును. కాని మనస్సు ఆ విషయమును గ్రహించి బుద్ధికి తెలుపక వేరు విషయమందుండుట వలన చదివిన విషయమేదో జీవునకు బుద్ధికి తెలియకపోవును. కన్ను చూచుచుండినా, నోరు చదువుచుండినప్పటికీ,

ఆ విషయము బుద్ధికి అందలేదంటే మధ్యలో మనస్సు వేరు ధ్యాసలోయుండునని తెలుసుకోవలయును. అటువంటపుడు చదివిన విషయము మనస్సుకు తెలియదు, కావున మనస్సు ఆ విషయమును తిరిగి జ్ఞప్తికి తెచ్చుకోలేదు. నేడు కొంతమంది విద్యార్థులు ఎంతసేపు చదివినా పరీక్షసమయములో ఆ విషయము జ్ఞప్తికి రాకపోవడానికి కారణము మనస్సు చదువునపుడు ఆ చదువుమీద ఉంచక వేరే ధ్యాస మీద ఉంచడమేనని తెలుసుకొనుము. మనము కూడ ఒక పని చేయునపుడు ఆ పని మీద ధ్యాస లేకపోయిన ఆ పనిలోని కష్ట సుఖము కూడ తెలియదు. మరియు కాలము కూడ ఎంత జరిగినది తెలియదు. ఈ విషయము **"ప్రబోధ"** గ్రంథమందు కూడా వివరించాము.

జీవుడు జాగ్రత్తావస్థలో ఉండినపుడు బాహ్యేంద్రియముల అంతరేంద్రియముల పనిలేకపోతే, బయటకు లోపలకు మధ్యవర్తిగా మనస్సు పనిచేయనపుడు, మనస్సుకు విశ్రాంతియుంటుంది కదా అని కొందరనుకోవచ్చును. అట్లు ఎప్పటికి మనస్సుకు విశ్రాంతియుండదు. బ్రహ్మనాడిలో నిద్రావస్థయందు ఉన్నప్పుడే మనస్సుకు విశ్రాంతి, అంతకు మినహా సూర్యచంద్రనాడుల మీద జాగ్రతావస్థలో ఉన్నపుడు మనస్సుకు విశ్రాంతి ఏమాత్రముండదు. మధ్యవర్తి పనిలేనపుడు మనస్సు విశ్రాంతి తీసుకొనక ఏమిచేయుచుండుననగా! ఎన్నో గత విషయములను జ్ఞప్తికి తెచ్చి బుద్ధికి జీవునకు తెలుపుచుండును. చిత్తము మనస్సు తెలిపిన విషయము లన్నిటిని జోక్యముచేసుకోదు. అందువలన మనస్సుకు వచ్చిన విషయములన్ని కార్యరూపము కావు. మనస్సు జ్ఞప్తికి తెచ్చుచూపోవుచుండును. మనస్సు వలన తెలిసిన విషయముల కొన్నిటిని బుద్ధి యోచించుచుండును. అట్లు బుద్ధి యోచించుట అయిపోగానే క్రొత్తవిషయము మనస్సు తెచ్చిపెట్టుచుండును. ఒక్కొక్కప్పుడు బుద్ధి

పూర్తి యోచించువరకు వేరువిషయములను మనస్సు తెచ్చిపెట్టదు. బుద్ధి యోచించిన విషయములన్నిటిని చిత్తము ఒప్పుకోదు. అందువలన మనస్సుకు వచ్చిన విషయములన్ని కార్యరూపముకావు. కర్మ ఉన్న విషయము మాత్రమే కార్యరూపమవును. కార్యరూపమగు ఏ కార్యమైన మొదట మనస్సే దానిని జ్ఞప్తికి తెచ్చిఉండును.

ఒక కార్యములో గుణముల ప్రభావమెంతమటుకున్నది ఇపుడు తెలుసుకొందాము. మనస్సు తెలిపిన విషయమును గుణముల మధ్యలో ఉండిన జీవునకు, బుద్ధికి తెలియును. తెలిసిన విషయమును బుద్ధి విమర్శించి యోచించును కదా! ఆ యోచన అక్కడున్న గుణముల బట్టి ఉండును. సాత్త్వికభాగములో జీవుడుండిన అందులోని గుణములబట్టి బుద్ధి విమర్శించుచుండును. రాజసములోయుండిన అక్కడున్న గుణముల ప్రకారము బుద్ధి విమర్శించుచుండును. ఒకవేళ తామసములోయుండిన అక్కడున్న గుణముల ప్రకారమే బుద్ధి విమర్శించును. బుద్ధి విమర్శించిన దానిని కర్మ ప్రకారము చిత్తము నిర్ణయించును, కాని గుణములకు చిత్తమునకు సంబంధము లేదు. చిత్తము ఒక్క బుద్ధితో మాత్రము సంబంధము పెట్టుకొనును. గుణముల ప్రభావమంతయు బుద్ధి మీదనే ఉండును. జీవుడు గుణముల మధ్యన ఉన్నప్పటికీ నిజముగా గుణముల సంబంధము జీవునకు లేదు. ఆ విధముగానే అహంకారమునకు కూడ గుణములతో సంబంధము లేదు. గుణముల మధ్యలోనున్న జీవుడు, బుద్ధి, చిత్తము, అహము అను అంతఃకరణములలో ఒక బుద్ధి మాత్రము గుణముల సంబంధము కలిగి ఆ గుణములను బట్టి విమర్శించుచుండును. ఆ విమర్శను బట్టి మిగతా చిత్తము, అహము పనిచేయును. జీవుడు మాత్రము ఎక్కడా శరీర కార్యక్రమములలో తనకు ఏ జోక్యము లేకుండాయున్నాడు.

శరీర కార్యములో జీవునికి ఏ సంబంధములేదని ఎవడైతే తెలుసుకొన్నాడో వానికి ఏ కర్మ అంటదు. ఆ విషయము తెలియక జీవునికి సంబంధమున్నదనీ, జీవుడే అన్నిటిని చేయుచున్నాడనీ, కర్మేంద్రియముల పనులను కూడ జీవుడే చేసాడనుకొను వారికి ప్రతి చిన్న కార్యములలోనూ కర్మ అంటుకొనుచుండును. ఇక్కడొక చిన్న సంశయము కొందరికి ఉద్భవించవచ్చును. అది ఏమనగా జీవునికి శరీరకార్యములో ఏ సంబంధము లేని ఎడల, ప్రతికార్యము జీవుని ప్రమేయము లేకనే జరుగుచుండిన ఎడల జీవుడు శరీరములో లేకుండినా సరిపోవును కదా! అటవంటపుడు జీవుడు శరీరములో ఎందుకున్నాడని ప్రశ్నించవచ్చును. దానికి మా సమాధానము కర్మననుసరించి శరీరములో 24 భాగములు పనిచేయుచున్నవి. కాని జీవుడు ఏ పని చేయకున్నాడు. ఏ కార్యములోనూ జీవుని పాత్ర ఏమిలేదు. అయినప్పటికి అన్ని కార్యములు జరుగవలసినది మరియు అన్ని అవయవములు పని చేయుచున్నది ఒక్క జీవునికోసమే. జీవుడు లేకుండిన ఏ కార్యము అవసరము లేదు. ప్రతి కార్యములోను గల అనుభూతిని జీవుడు అనుభవించుచున్నాడు. ప్రతిచిన్న కార్యమును మొదలుకొని పెద్దకార్యము వరకు 24 భాగములు పనిచేయగ జీవుడొక్కడు పనిచేయక అన్ని భాగములు చేసిన పనిలోని కష్టసుఖములను అనుభవించుచున్నాడు. జీవుడు సుఖదుఃఖములను అనుభవించుచుండుటకే అన్ని అవయవములు పని చేయుచున్నవనీ, ఈ శరీరయంత్రాంగమంతయూ జీవుని అనుభవమునకే ననీ తెలుసుకోవలయును. జీవుడే లేకుండిన 24 తత్త్వముల యంత్రాంగమే లేదనుకొనుము.

మనస్సు శరీరయంత్రాంగములో ముఖ్యపాత్ర వహించుచున్నదని తెలియబడినది. మోక్షమును పొందుటకు శరీరములో మనస్సును

వశపరుచుకొనుట ముఖ్యమని పెద్దలు కూడ తెలిపినారు. శరీరములో ఏ కార్యము జరుగకుండా ఉండవలయునంటే మధ్యవర్తి అయిన మనస్సును లేకుండా చేయవలయునని దానినే యోగమని తెలిపారు. సంకల్పములుద్భవించునది మొదట మనస్సు వలననే, కనుక మనస్సును వశపరుచుకున్న విషయముల జ్ఞప్తియే లేకుండ పోవును. దానివలన శరీర అంతరమున అన్ని అవయవముల కార్యములు నిలిచిపోవును. అందువలననే మనస్సును జయించుటయే యోగమనిరి. ఈ విషయమై వేమనయోగిగారు ఈ క్రింది విధముగా అంటున్నాడు.

కుక్కను తిన్నవాడు గురులింగ జంగడు
పందిని తిన్నవాడు పరమయోగి
ఏనుగును తిన్నవాడు ఎంత సుజ్ఞానియో
విశ్వదాభిరామ వినురవేమ.

**దీని భావమేమనగా!** కుక్క సంచార స్వభావము గలది. ఒక్కచోట కూడ స్థిమితముగా ఉండక అనేక చోట్లకు తిరుగుచుండును. కుక్క మాదిరి మనలోని మనస్సు కూడ సంచారస్వభావము కలదిగా ఉన్నది. ఒక్క విషయములో నిలువక అనేక విషయములను రేకెత్తించుచూనే ఉండును. అందువలన మనస్సును కుక్కతో సమానముగా పోల్చి మనస్సును లేకుండా అనగా సంకల్పములు రాకుండా చేసినవాడు గురువని తెలుపు విషయమై వేమన కుక్కను తిన్నవాడు గురువని అన్నాడు. వేమన చెప్పిన మాటలలోని అంతరార్థము తెలియకపోయిన జ్ఞానులను, యోగులను, గురువులను కేవలము మాంసాహారులుగా అందులోనూ నీచమాంస భక్షకులుగా పోల్చుకొనవలసివచ్చును. అందువలన మనలోని బుద్ధిని ఉపయోగించి వేమన మాటను వివరించుకొందాము.

మనలోని మనస్సును అతినీచ స్థలమందు సంచరించు పందిగా పోల్చి, అటువంటి మనస్సును లేకుండా చేసుకొన్నవాడు పరమయోగి అనుమాటను పందిని తిన్నవాడు పరమయోగి అని గొప్ప జ్ఞానమును చిన్న మాటలో చెప్పాడు.

సంచార స్వభావము గలది మరియు నీచ విషయముల సహితము జ్ఞప్తికి తెప్పించు మనస్సును జయించవలయును. ప్రయత్నము చేయు వారికి అది వశము కాకుండా పోవుచుండును. సాధకుడు ఎంత ప్రయత్నించిననూ మనస్సు నిలకడగా నిలువక యథాప్రకారము సంకల్పములను తెచ్చుచుండును. అందువలన మనస్సుకు ఎక్కువ బలము కలదని సాధనకు సామాన్యముగా లొంగదని జ్ఞానులనుచుందురు. అట్టి మనస్సును వేమనయోగి బలము గల జంతువైన ఏనుగుగ పోల్చి, దానిని ఎవ్వడు అణచివేశాడో వాడే సుజ్ఞాని అని చెప్పుచు, ఏనుగును తిన్నవాడు ఎంత సుజ్ఞానియో అన్నాడు. ఈ మాటలు చెప్పిన వేమనయోగి మనస్సు ఎటువంటిదో పూర్తి తెలిసినవాడై దానిని గురించిన విషయమంతయు తెలియజేశాడు. ఈనాడు మనము మనస్సును గురించి తెలుసుకొన్న విషయము ఏనాడో వేమనయోగి తెలుసుకొన్నాడనుటకు గుర్తుగా క్రింది పద్యమున్నది చూడుము.

ఇనుమున జేసిన మైనపు కడ్డి
ఇంటిమెన నక్రాపుల దొడ్డి
కూర్చుండి మేసిన కుందనపు గడ్డి
విప్పి చెప్పురా వేమారెడ్డి.

మనలోని మనస్సు తనకు ఇష్టమొచ్చినట్లు ప్రక్కకు పోవు

చుండును. చంచలమైన, నీచమైన, బలమైన మనస్సు వశమగుట చాలా కష్టము. ఎంతో కష్టమైన మనస్సును నిలుపుట గాలిని మూటకట్టినట్లు అని అర్జునుడు గీతయందు పేర్కొన్నాడు. ఒకే పద్ధతిలో నిలువక తనకు ఇష్టమొచ్చినట్లు పోవు మనస్సును సాధన ద్వారా అభ్యాసము చేసి నిలిపివేసిన తరువాత ఏ విషయముల మీదికి పోక, మనస్సు ఒకే విషయము మీద నిలిచిపోవును. అట్లు ప్రక్కలకు పోకుండ ఒకే యోగపద్ధతిలో పెట్టువారు యోగులు. యోగులకు వశముకాక యుండిన మనస్సు వశమైన తరువాత ఎట్లుండునను విషయమును వేమన తెలిసినవాడై వశమైన మనస్సు, వశముకాని మనస్సును ఉద్ధేశించి ఒకే మనస్సు ఒకపుడిట్లు మరియొకపుడిట్లున్నదని ఇనుమున చేసిన మైనపుకడ్డి అన్నాడు. ఇనుముతో చేసినది అంటే ఏ ప్రక్కకు వంగిపోక నిలకడగ ఉండునదనీ, మైనపుకడ్డి అంటే మెత్తగా ప్రక్కలకు వంగిపోవునదనీ మనకు తెలిసిన విషయమే. మనస్సు కూడ యోగికి నిలకడ ఉండుట వలన ఇనుపకడ్డిగా, సామాన్య జీవునకు నిలకడ లేనిదాని వలన మైనపుకడ్డిగా వేమన చెప్పాడు.

మన శరీరములో బాహ్యేంద్రియముల విషయములన్నియూ మనస్సుకు చేరుచున్నవి. అంతరేంద్రియముల విషయములు కూడ మనస్సుకు చేరుచున్నవి. అన్ని ఇంద్రియముల విషయములను తీసుకొనివచ్చు నరములన్నిటి మీద మనస్సు వ్యాపించియున్నది. కావున విషయములను ఆవులుగా పోల్చి, మనస్సును నరాలదొడ్డిగా పోల్చి, శరీర అంతరమునే గృహముగా పోల్చి ఇంటిమొన నవ్రావులదొడ్డి అని మనస్సునన్నాడు.

మనలోని మనస్సును వదలివేసిన తనకిష్టమొచ్చినట్లు పోవుచుండును. ఏ విధముగా అనగా ఒక విషయమును మొదట జ్ఞప్తికి తెచ్చును. దానివెంటనే దానికి సంబంధమున్న విషయము తెచ్చును. ఉదాహరణకు మొదట దొంగతనము యొక్క విషయము జ్ఞప్తికి వచ్చినదనుకొనుము. దాని తర్వాత ఎప్పుడో జరిగిన రైళులో దొంగతనము గుర్తుకువచ్చును. దానివెంటనే బస్సులలో జరిగిన దొంగతనము జ్ఞప్తికి వచ్చును. బస్సులో జరిగిన దొంగతనములో ఒకడు తనచేతి వాచ్ దొంగలకు దొరకకుండా దాచిపెట్టుకున్న విషయము, దొంగలు అందరి సొమ్ములు లాగుకొనుచు వచ్చి వాని చేతిమీద గడియారపు గుర్తుచూసి నీ గడియారమెక్కడ అన్నట్లు, వాడు ఇచ్చివేసినట్లు తర్వాత ఆ గడియారపు పట్ట వలన చేతిమీద గుర్తు ఉన్నదికదా! పట్టగొలుసు మంచిదనీ, ఆ గొలుసులు మద్రాసులో బాగుండుననీ, మద్రాసులో విదేశీ రేడియోలు కూడ దొరుకుతాయనీ, బర్మాబజారులో జపాన్ టేపురికార్డులు కూడ దొరుకుతాయనీ, ఈసారి మద్రాసు పోయినపుడు మద్రాసులో గల స్నేహితునితో కలిసితే వాడు మంచి సామానులుకొని ఇచ్చుననీ, అంతలోనే స్నేహితుని తమ్మునికి మా ఊరిలోనే పెండ్లికూతురును చూడవలయుననీ, ఇట్లు అనేకముగా మనస్సు ఒకదాని తరువాత ఒకటి తలపోయుచూనే ఉండును. మొదటి దానికి రెండవదానికి సంబంధముండదు. చివరకు చూచుకుంటే మొదలుపెట్టినది దొంగ విషయము, ఐదునిమిషములు గడిచేలోపల పెండ్లి విషయములో ఉండిపోయినది. అట్లే వదలివేసిన మనస్సు ఒకదానికొకటి ఆలోచిస్తూ పోవుచూనే ఉండును.

కుందనపు గడ్డిని సామాణ్యముగా అందరు చూచియే ఉందురు. అది భూమిలో వేర్లు ఉంటూ గడ్డిపైకి కనిపించుచుండును. ఒకగడ్డిమొక్క

ప్రక్కన వేరొకగడ్డిమొక్క ఉండును. మొదటిమొక్కకు రెండవమొక్కకు పైన సంబంధము లేకున్నా భూమిలో వేరు మాత్రము ఒక్కటిగానే ఉండును. కుందనపుగడ్డి పైకి వెడల్పుగా ఉండినా భూమిలో వేరు మాత్రము ఒక్కటే. ఒక్క వేరే భూమిలో ప్రాకుచు వల మాదిరి అల్లుకొని పైకి గడ్డి మొక్కలు కనిపించును. మనలోని మనస్సు కూడ కుందనపుగడ్డి మాదిరి విషయములను పుట్టించుచున్నదనీ, కుందనపుగడ్డి వేరు సంబంధముతో ప్రక్కప్రక్క పుట్టుచు పోయినట్లు మనలోని మనస్సు కూడ ఒక విషయసంబంధంలో ఇంకొకవిషయమును ప్రక్కప్రక్కగ రేకెత్తించు చుండుట వలన, కూర్చుండి మేసిన కుందనపుగడ్డి అని అన్నాడు. మనస్సును ఆలోచనలలో వదలివేసిన కుందనపుగడ్డితో సమానముగా యున్నదని వేమన మనస్సు విషయము బాగా తెలిసినవాడై, మనస్సును అనేక విధములుగా వర్ణించుచు కుందనపు గడ్డిగా కూడ చెప్పియున్నాడు.

ఇంతవరకు ఎంతో రహస్యమైన శరీరము లోపల జరుగుచున్న అంతఃకరణముల యొక్క విషయములను తెలియజేసుకొన్నాము. ఇంతవరకు తెలిసినది ఒక్క మానవునికే కాక సమస్త జీవరాసులయందు జరుగుచున్న విషయమని తెలుసుకొనుము. జ్ఞానికానివాడు యోగికాలేడు అను భగవద్గీత మాట ప్రకారము అంతఃకరణములు ఐదు కలవనీ, వాటియొక్కపనులు ఇవి అని తెలిసినవాడు యోగికాగలడు. కాని తన శరీరములో జరిగే పనియే తెలియనివాడు, తన శరీరములోని ఆత్మను ఏ విధముగా తెలుసుకోగలడు?

సకలేంద్రియముల సంచరించుచున్న
సంజ్ఞగాంచి పంచి యెంచి
పైన పరమాత్మ గనవలె
అఖిల జీవసంగ ఆత్మలింగ.

అని ఆత్మలింగ శతకములో అన్నారు. మన శరీరములో సకలేంద్రియములు ఏమి పనిచేయుచున్నవని వాటి వివరణ అంతయు తెలిసి, వాటిమీద గల పరమాత్మను చూడవలయునని దీని అర్థము.

ఈ కాలములో కొందరు అంతఃకరణములయిన మనస్సు, బుద్ధి, చిత్తము వేరుగా ఉన్నాయని తెలియక బుద్ధినే మనస్సనీ, మనస్సును చిత్తమనీ, ఒకప్పుడు జీవుడే మనస్సుగాయున్నాడనీ రకరకములుగా చెప్పుకొనుచుందురు. సారాయి త్రాగి నడచిన నడక మాదిరి ఉన్న బోధను వదలి, శాస్త్రప్రమాణము అయినదీ, జ్ఞాననేత్రమున చూచినదీ, ఏ నాటికి సంశయములు పుట్టింపని బోధను ఆశ్రయించవలయునని కోరుచున్నాము.

**ప్రశ్న** :- బుద్ధి కర్మానుసారిణి అని అందరు అనుచున్నారు. ఈ మాట నిజమా? బుద్ధి ఎట్లు కర్మానుసారిణి అగుచున్నది? వివరింపుము.

**జవాబు** :- అందరు అన్నంత మాత్రమున ఆ మాట నిజమవునని తలంచకూడదు. వివరించి తెలుసుకోవలయును. అబద్దమును అందరు సత్యమనినంత మాత్రమున సత్యము కాదు. సత్యమును ఒక్కడు పలికిన అది సత్యమే అవును కదా! ఇపుడు బుద్ధి కర్మానుసారిణి అని అందరనుమాట కూడ అబద్దమే. ధర్మములు అధర్మములుగా మారిపోవునను పరమాత్మ మాట ప్రకారము, ఈనాడు ధర్మముల స్థానములలో అధర్మములు నిలిచినవి. ఏదో ఒకనాడు పరమాత్మ రాక తప్పదు. ధర్మముల పేరుతో చలామణి అవుచున్న అధర్మములన్నిటిని కూలద్రోయక తప్పదు.

మానవులలో అజ్ఞానము పెరిగి, కేవలము కొంతకాలము జీవించు బ్రతుకుతెరువునే ఆశ్రయించి, అసలైన ధర్మములేవో తెలుసుకొనలేక,

తెలిపిన ధర్మములను గురించి ఆలోచించక, అధర్మములను నమ్ముకొని వారిని వారే మోసపుచ్చుకొనుచున్నారు. జ్ఞానమును విమర్శించకూడదని, అట్లు విమర్శించిన పెద్దలను కించపరచినట్లవునని, చెప్పినదే వినవలయు నని అనుటవలన, మొదట ఒకడు దారితప్పిన వాని వెనుకనే పరంపరగా దారితప్పుట జరుగుచున్నది. మొదట దారితప్పినపుడే ఇది సరైనదా కాదా అని చూచుకొని ఉండిన, అక్కడనే సరైన దారిలోనికి పోయి వెనుకవారు కూడ సరైనదారిలోనికి పోవుట సంభవించెడిది. బ్రహ్మవిద్య ప్రమాణ గ్రంథమైన భగవద్గీతయందుగల **"పరిప్రశ్నేన"** అనువాక్యము యొక్క అర్థము ప్రకారము ఎదురు ప్రశ్న అడుగరాదని ఏది చెప్పినా వినవలెనను నేటి బోధకుల వద్దనా మనము బ్రహ్మవిద్య నేర్చేది. **అయ్యవారు నిదురపోతూ విద్యార్థులు తిండిపోతులన్నట్లు** బ్రహ్మవిద్యను బోధించెడివారు తమకు ఇష్టమొచ్చినట్లు చెప్పుచుపోగా, వినువారు ప్రతి విషయమును ఆలోచించక తలూపుచూ పోగా ఆహా! ఈ విద్య ఏ గట్టెక్కునో! బ్రహ్మవిద్య నేడు అధర్మములతో నిండిపోవడానికి కారణము మొదట శిష్యులు తరువాత గురువులు. గారడివాడు ఇదుగో పాము అదుగో ఎలుక అంటూయుంటే, పామును ఎలుకను చూడగనే చప్పట్లుకొట్టు ప్రేక్షకుల మాదిరి, చెప్పువిషయము నిజమా అబద్ధమా అని ఆలోచించక, అన్ని మాటలకు తలూపువారుండబట్టే బ్రహ్మవిద్య సారాంశము తెలియక పోయినది. చిన్నపిల్లలకు కాకమ్మ గువ్వమ్మ కథలు చెప్పుచు కాలక్షేపము చేయించుచున్నారు. పిల్లలు యోచనగలవారై కాకమ్మకు ఇండ్లెట్లుండెను అని అడిగిన పెద్దలు సమాధానము చెప్పలేనట్లు, ఈనాటి బ్రహ్మవిద్యలో ఒక్క తిరుగు ప్రశ్నవేసిన సమాధానము లేకుండ పోవుచున్నది. తెలివిగల జిజ్ఞాసపరులకు సరియైన జ్ఞానమును బోధించువారే లేకుండా పోయినారు. కులమత భేదములతో,

సాంప్రదాయములను పేరుతో, సర్వ మానవులకు సమానమైన బ్రహ్మవిద్యను కొందరికే పరిమితము చేశారు. సర్వ మానవుల శ్రేయస్సుకు పరమాత్మయే గీతాశాస్త్రమును పలికి, అందు సర్వజీవులకు అవసరమైన విషయములు బోధించగా, భగవద్గీతను బ్రహ్మవిద్యా ప్రమాణ గ్రంథముగా కృష్ణుడు చెప్పియుండగా, కొందరు హిందువులు భగవద్గీతను ప్రక్కనపెట్టి, దానికి ఏమాత్రము విలువివ్వక హిందులకు వేదములే ప్రమాణ గ్రంథములనుచున్నారు. **'ఏనాటికైనను పరమాత్మయే అవతరించి వీటన్నింటిని సరిచేయగలడు. ఏనాటికి బ్రహ్మవిద్య నాశనము కాదు'**

ఇపుడు నీవడిగిన బుద్ధి కర్మానుసారిణి అన్న ప్రశ్నకు జవాబు చెప్పుదును వినుము. శరీర యంత్రాంగములో బాహ్య విషయములు మనస్సు ద్వారా గుణములమధ్యలో ఉన్న బుద్ధికి చేరునని తెలుసు కొన్నాము. అక్కడకు చేరిన విషయమును జీవుడు బుద్ధిద్వారా సాక్షిగా చూచుచుండగా, బుద్ధి అక్కడున్న గుణముల ప్రకారము రెండు విధముల యోచించగా, ఆ రెండిటిలో చిత్తము ఏదో ఒకదానిని మాత్రము నిర్ణయించుచున్నది. చిత్తము పైనున్న ప్రారబ్ధకర్మాను సారము ఏది జరుగవలసియుంటే దానినే నిర్ణయించుచున్నది. అన్ని పనులకు కర్మే కారణమైనప్పటికీ, ఆ కర్మ కార్యరూపమగుటకు జరుగు యంత్రాంగములో **బుద్ధి గుణానుసారము యోచించగా, చిత్తము కర్మానుసారము నిర్ణయించుచున్నది.** అటువంటపుడు బుద్ధి కర్మానుసారిణి అనుట జ్ఞానమో లేక అజ్ఞానమో నీవే ఆలోచించుకొనుము. బుద్ధియే కర్మానుసారిణి అయిన చిత్తము ఏ దానివలన చిత్తగించుచున్నది? అంతఃకరణ విషయము జ్ఞాననేత్రమున చూచినవానికే తెలియును. అట్లు చూడక అంచనాల మార్గము ప్రకారము చెప్పుచూపోయిన అది అజ్ఞాన

బాట అగును. జ్ఞానమార్గము ప్రకారము **'చిత్తము కర్మానుసారిణి'** అని చెప్పబడును. అట్లే **'బుద్ధి గుణానుసారిణి'** అని చెప్పబడును.

శరీరములో జరుగు యంత్రాంగమునంతటిని కలిపి సాంఖ్యము అని అందురు. గీతయందు భగవంతుడు కూడ సాంఖ్యము ముఖ్యమైన జ్ఞానమని తెలుపుచు 'క్షేత్ర క్షేత్రజ్ఞయోర్ జ్ఞానం యత్తద్ జ్ఞానం మతం మమ' అని అన్నాడు. దీనిఅర్థము క్షేత్రము అనగా శరీరము, క్షేత్రజ్ఞుడనగా అందుగల ఆత్మ. శరీరమును శరీరములోగల ఆత్మను తెలుసుకొను జ్ఞానమే ముఖ్యమైన జ్ఞానము. అందువలన జ్ఞాన జిజ్ఞాసపరులందరు శరీరము గురించి అందు నివసించు ఆత్మను గురించి మొదట తెలుసుకొనిన, ఆ తరువాత శరీరమునందే గల పరమాత్మను కూడ తెలుసుకోవచ్చును. భగవద్గీతయందు బోధించిన బోధయంత శరీరము లోనిదే, శరీరము మినహా ఏమాత్రము లేదు.

**ప్రశ్న** :- ప్రపంచముతో సంబంధము పెట్టుకొన్న జ్ఞానేంద్రియములు అయిదనీ, జ్ఞానేంద్రియములు లేకున్న ప్రపంచ సంబంధమే తెగిపోవునని తెలుసుకొన్నాము. నిత్యజీవితములో అయిదు జ్ఞానేంద్రియములందు ఎక్కువ ప్రపంచ సంబంధము కలిగినవి ఏవి?

**జవాబు** :- మొత్తము జీవితకాలములో ప్రపంచ సంబంధము కలిగిన అవయవములు (1) కన్ను (2) చెవి. మొదట జాగ్రతావస్థలో ఎక్కువ కన్ను ద్వారానే ప్రపంచ సంబంధము ఉన్నది. రెండవస్థానము చెవిది. కన్ను, చెవి లేకపోయిన నామాట నీవు వినలేవు. నన్ను నీవు చూడనులేవు. ఈ రెండు ఇంద్రియములు లేకపోతే ఇపుడు నాతోనే నీకు సంబంధము తెగిపోవును. స్పర్శ ఏదైన వస్తువు నీ చర్మము

తగిలినపుడే తెలియును. అట్లే నీ నాలుక మీద పదార్థము పడినపుడే ఆ పదార్థము యొక్క రుచి జీవునికి తెలియును. ముక్కుకు వాసన వచ్చినపుడే ఆ వాసన విషయము లోపలనున్న జీవునికి తెలియును. స్పర్శ, రస, గంధములు తన శరీరము వద్దకు వచ్చినపుడే తెలియును. కన్ను చెవి అట్లుకాక బయట అనేకముగ ఉన్న సర్వ విషయములను గ్రహించి ఎక్కడో లోపలనున్న జీవునికి తెలియజేయును. ఎవ్వరు ఎట్లు ఆలోచించి చూచిన కన్ను, చెవి ప్రపంచ సంబంధములో ముఖ్యమైన అవయవములని తెలియవచ్చును. *'సర్వేంద్రియానామ్ నయనం ప్రధానమ్'* అని పెద్దలు కూడ అన్నారు. స్పర్శ, రస, గంధములను గ్రహించు చర్మము, నాలుక, ముక్కు పని చేయకున్ననూ బ్రతుకవచ్చును. చూపు, శబ్దము గ్రహించు కన్ను, చెవి పని చేయక పోయిన ప్రపంచ సంబంధము లేని దానివలన వాని జీవితము కష్టతరము. మిక్కిలి పాపము చేసుకొన్నవారికి ఈ రెండు ఇంద్రియములు సమర్థతలేనివై ఉండునని గ్రహింపవచ్చును.

# పంచాక్షరి

పంచాక్షరి అనగానే "ఓం నమఃశివాయ" అని అందరికి తెలుసును. ఈ కాలములో చాలామంది గురువులు ఈ పంచాక్షరినే ఉపదేశ మిచ్చుటకు ఉపయోగించుచున్నారు. చెవిలో చెప్పించుకొన్న పంచాక్షరి మంత్రమును చాలామంది జపము చేయుచుండుట కూడ గలదు. ఈ కాలములో అది గురూపదేశ మంత్రముగ ఉండగ, పూర్వము ఈ మంత్రమును చిన్న పిల్లలకు విద్యాభ్యాస ఆరంభములోనే మొట్టమొదటి చదువుగ బోధించెడివారు. మొదటి భాషా లిపి ప్రారంభములోనే అన్ని

భాషలయందు **'ఓం నమః శివాయ'** అన్న పదమును పలికించి వ్రాయించి మొదలు పెట్టెడివారు. అది కొంతకాలమునకు కొంతమారి పిల్లల విద్యాభ్యాస ప్రారంభములో **'ఓం నమః శివాయః'** అని వ్రాయించబడెడిది. శివాయ పదమును శివాయః అని తప్పుగ వ్రాసెడివారు. కాని ఇపుడు అది కూడ పూర్తిగ పోయి అ ఆ ఇ ఈ అను లిపి నుండి చదువును ప్రారంభించుచున్నారు. పూర్వము పంచాక్షరి మంత్రమును **'ఓం నమః శివాయ'** అను లిపి అక్షరములతో ప్రారంభమైన చదువు నేడు అ ఆ ఇ ఈ లతో ప్రారంభము కావడము వలన పంచాక్షరి అంటే ఏమిటి? దానిని ఎందుకు పూర్వము పిల్లల చేత పలికించెడివారన్నది. ఇప్పటి కాలములో తెలియదన్నమాట.

**'తెలిసివున్న దానిని తెలియకుండ మరచిపోవుట అందరివంతైతే ఆ తెలియని దానిని తెలుపుట ఒక్కనివంతు'** అను పెద్దల వాక్యము ప్రకారము, ఇపుడు ఆ ఒక్కని పాత్ర మేము నిర్వహిస్తు తెలియజేయడము ఏమనగ! ప్రతి ఆకు ఒక ఔషధమన్నట్లు ప్రతి మాట కూడ ఒక మంత్రమగును. అందువలన **'ఓం నమః శివాయ'** అను పదము కూడ ఒక మాటయే గనుక దానిని కూడ మంత్రము అన్నారు. ఇటువంటిదే **'ఓం నమోనారాయణాయ'** అను మంత్రమును అష్టాక్షరీ మంత్రమని **'ఓం నమః శివాయ'** అను మంత్రమును పంచాక్షరి మంత్రమని పేర్లు పెట్టారు. ఈ కాలములో అష్టాక్షరీ, పంచాక్షరీలను పేర్లతో కొందరంటున్న ఈ మంత్రముల గూర్చి ఎందుకా పేర్లు పెట్టారని మేము అడుగగ, ఈ కాలములో తెలిసిన వారనిపించుకొన్న కొందరు **'ఓం నమః శివాయ ఐదక్షరములతో కూడుకొన్నది, కావున దానిని పంచాక్షరని, అట్లే ఓం నమోనారాయణాయ ఎనిమిది అక్షరములతో కూడుకొన్నది కావున**

**అష్టాక్షరియని పిలుస్తున్నాము. శైవులు పంచాక్షరీ మంత్రమును, వైష్ణవులు అష్టాక్షరీ మంత్రమును ఉపదేశమిచ్చుచుందురని'** తెలిపారు.

పంచాక్షరి మంత్రమనగా ఐదక్షరముల మంత్రమని అనుటవలన దాని అక్షరములను లెక్కించగా అందు (1) ఓం (2) న (3) మః (4) శి (5) వా (6) య లను ఆరక్షరములు వచ్చును. కాని అష్టాక్షరి మంత్రమును లెక్కించితే (1) ఓం (2) న (3) మో (4) నా (5) రా (6) య (7) ణా (8) య అను ఎనిమిదక్షరములు సరిపోయినవి. దీనిని బట్టి చూస్తే పంచాక్షరిలో ఏదో లోపమున్నదని తెలియుచున్నది. భాషాలిపి అక్షరములనెంచగా పంచాక్షరి షష్టాక్షరి మంత్రముగా కనిపిస్తున్నది. పూర్వపు పెద్దలు ఆరు అక్షరముల మంత్రమును ఐదక్షరముల మంత్రమని ఎందుకు చెప్పారను ప్రశ్న ఉద్భవించుచున్నది.

పంచాక్షరీ మంత్రముయొక్క పూర్వపరాలు యోచిస్తే, పూర్వపు జ్ఞానులు విశేషమైన అర్థముతో ఈ పంచాక్షరిని నిర్మించారని తెలియు చున్నది. ఇపుడున్న అన్ని మంత్రములకంటే మొదటిమంత్రము పంచాక్షరీ మంత్రము. పంచాక్షరీ మంత్రము వచ్చిన కొంతకాలమునకు మరి కొందరు మిగతా మంత్రములను సృష్ఠించినట్లు తెలియుచున్నది. మొదట పంచాక్షరీమంత్రమును తయారుచేసినవారి భావమెట్లున్నదనగా! క్షరమనగా నాశనమగునదని అర్థము. అట్లే అక్షరమనగా నాశనముకానిదని అర్థము. దీనిప్రకారము చూస్తే పంచాక్షరి అనగా పంచమునకు నాశనముకానిదని అర్థము. పంచమునకు నాశనముకానిదేదని యోచిస్తే **'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ'** అని భగవద్గీతలో చెప్పబడి ఉన్నది. ఓం అనునది అక్షరమని అనగా నాశనముకానిదని అదియే దైవమని అర్థమగుచున్నది. అందువలన పంచాక్షరీ మంత్రములో **'ఓం'** అనునదే దైవమనబడుచు

పంచమునకు నాశనముకానిదని తెలియుచున్నది. పంచమనగా ఏమిటన్న మాటకు వస్తే.

ప్రకృతి పరమాత్మలనబడు ఈ సృష్ఠిలో తెలియునదంతా ప్రకృతియే. కంటికి కనిపించక అంతటా ఆవహించి ఉండునది పరమాత్మ. ప్రకృతి ఐదుభాగములుగా విభజింపబడి ఉన్నది. (1) ఆకాశము (2) గాలి (3) అగ్ని (4) నీరు (5) భూమి. ఐదు భాగములుగా ఉన్న ప్రకృతిలోనే సర్వజీవరాసులు చస్తూ పుట్టుచూ ఉన్నవి. పంచభూతములకు అన్ని జీవరాసులు నాశనమగునవిగ ఉన్నవి. ప్రత్యక్షముగ మనము చూస్తూనే ఉన్నాము. గాలి చెలరేగితే ఎంత భీభత్సమైన చేయగలదు. ఎందరి ప్రాణాలనైన హరించగలదు. అట్లే నీరు చెలరేగిన అందరిని జలసమాధి చేయగలదు. ప్రకృతిలోని ఐదు భాగములు సర్వజీవరాసులను ఒకే ఒక్క క్షణములో హరించి వేయగలవు. కాని ఈ ఐదు తమను సృష్ఠించిన పరమాత్మను ఏమిచేయలేవు. సర్వజీవరాసులను నశింపజేసినట్లు పరమాత్మను నశింపచేయలేవు. ఆ విషయమును ప్రజలకు తెలియజేయుటకొరకు పూర్వపుజ్ఞానులు పరమాత్మకు భాషాలిపిలో ఒక బీజాక్షరమును సృష్ఠించి దానిని **'ఓం'** అన్నారు. అట్లే ప్రకృతిలోని ఐదుభాగములకు ఐదు బీజాక్షరములు తయారుచేసినారు. అవి వరుసగ ఒకటి ఆకాశమునకు **'న'** అని, రెండు గాలికి **'మః'** అని, మూడు అగ్నికి **'శి'** అని, నాలుగు నీరుకు **'వా'** అని, ఐదు భూమికి **'య'** అని, ఉంచారు. పంచభూతములకు గల పంచబీజాక్షరములు **'నమః శివాయ'** అని ఆనాడు అందరికి తెలుసు. పంచబీజాక్షరములలోనే మొదటి రెండక్షరములను ఒకపదముగా చివరి మూడక్షరములను ఒకపదముగా నమః శివాయ అనడములో కూడ అర్థముగలదు. పంచభూతములలో

కంటికి కనిపించని ఆకాశము, గాలి రెండుగలవు. అందువలన వీటిరెండు బీజాక్షరములు–నమః ను ఒకపదముగా కంటికి కనిపించునవి అగ్ని, నీరు, భూమి మూడుగలవు. కావున వాటి బీజాక్షరములైన శివాయ అను ఒకపదముగా పలుకుచూ **'నమః శివాయ'** అన్నారు. ఈ విధముగా పలుకుటవలన అందరికి వాటి తారతమ్యము తెలియునను భావముతో ఆనాటి పెద్దలలా ఉంచారు.

ఇంతవరకు పంచభూతములకు గల బీజాక్షరములైన 'నమః శివాయ'ను గురించి తెలుసుకొన్నాము. అట్లే పంచభూతములకు నాశనముకాని దైవమును **'ఓం'** అను బీజాక్షరముగా పూర్వపుపెద్దలు గుర్తించిన విషయమును తెలుసుకొన్నాము. పంచభూతములకు దైవము ఒక్కడే నాశనముకాడు కనుక ఆ విషయము మానవులందరికి తెలియునట్లు **'ఓం'** అనునది నాశనము కానిదని తెలుపుచూ, అది ఏమిటికి నాశనముకాదో తెలియునట్లు **'ఓం నమః శివాయ'** అను వాక్యమును చూపించారు. దైవమొక్కడే పంచభూతములకు నాశనము కానివాడని దీనిఅర్థము. అందువలన ఓంకారమును ఒక్క దానినే పంచాక్షరి అనెడివారు. పంచమునకు నాశనముకానిదని పంచాక్షరి అని ఓంకారమునే పూర్వము భావించెడివారు. ఓంకారమును అక్షరము అనగా నాశనము కానిదని పిలిచెడివారు. దేనికి నాశనము కానిదను అర్థములేక పోవునని పూర్తి వివరమిచ్చునట్లు పరమాత్మ బీజాక్షరమైన **'ఓం'** ను పంచభూతముల బీజాక్షరములైన **'నమః శివాయ'** ముందు పెట్టి మొత్తము ఆరు అక్షరములు వ్రాసి పంచాక్షరి అన్నారు. లెక్కించగా ఆరు అక్షరములే అయినప్పటికి దానిపేరు పంచాక్షరియేననీ, ఓంకారమే పంచాక్షరియనీ, పంచాక్షరిలో విశేషమైన అర్థమిమిడి ఉన్నదని తెలియాలి.

పూర్వము ఈశ్వరలింగ ప్రతిష్ఠాపనయే మొట్టమొదటి దేవాలయము. అది పురాణములలో చెప్పుచున్న శంకరుని శాపగ్రస్త ప్రతిమకాదనీ, ప్రకృతి పరమాత్మకు గుర్తింపుగా పెట్టినదనీ, అది ఈ కాలంలో శంకరుని ప్రతిమగా అందరనుకొని పూజిస్తున్నారనీ, అట్లు చేయుట వలన పూర్వపుజ్ఞానులు ఏ ఉద్ధేశ్యముతో ఆ ప్రతిష్ఠ చేశారో ఆ ఉద్ధేశ్యమును మనము పూర్తిగా విస్మరించామనీ, వాస్తవముగా ఆనాడు గల భావము కాలక్రమమున మారినదనీ, పూర్వము లింగము పరమాత్మ గుర్తుగా తలచెడివారనీ, మా రచనలలో చాలామార్లు చెప్పాము. పూర్వము లింగప్రతిష్ఠ విషయము అందరికి తెలిసినదై ఉండెడిది. వారు అక్కడకు పోయి లింగమును చూచి, పంచభూతములకు నాశనముకాని పరమాత్మ అను భావముతో, పరమాత్మ పంచభూతములకు నాశనముకానివాడను భావము పలుకునట్లు బీజాక్షరములైన **'ఓం నమః శివాయ'** అని పలికి నమస్కరించి వచ్చెడివారు. బీజాక్షరములు నోటిద్వారా పలుకుటవలన అది మంత్రముగా, పంచాక్షరి మంత్రముగ పేరుగాంచినది. ఆ పంచాక్షరి మాత్రమే నేడు గలదు. కాని పూర్వపు మనుషుల భావమునకు నేడుగల మనుషుల భావమునకు ఎంతో తేడా కనిపిస్తూనే ఉన్నది.

నేడు భగవద్గీతలో కూడా ఓం అనునది అక్షరమనీ, అదియే దైవమనీ, అదే గీతలో అక్షరమనగా నాశనము కానిదనీ అర్థమగు నట్లు తెలియబరచబడినది. అయినప్పటికి ఓం అనునది దైవమేయైతే, ఆ దైవము దేనికి నాశనము కాదు, మనమంతా దేనికి నాశనమగుచున్నామని ప్రశ్నించుకొంటే, ఆ గీతలోనే ప్రకృతియైన పంచభూతములయందే సమస్త జీవరాసులు పుట్టుచూ చచ్చుచున్నవనీ, జీవరాసులను చంపునది పుట్టించునది ప్రకృతియే నేను నిమిత్తమాత్రునిగా చూచుచున్నాననీ,

ప్రకృతి అంతా నాశనమైనప్పటికి నేను నాశనముకానివాడననీ, జవాబు దొరుకుచున్నది. అలాంటపుడు పంచమునకు అక్షరమైనది పంచాక్షరియని సులభముగా అర్థము కాగలదు. కానీ నేడు మనము యోచించడము లేదు. కావున అన్ని విషయములు మరుగునపడినవి.

పూర్వము పంచాక్షరి మంత్రమొక్కటియే ఉండెడిది. అపుడు ఇతర మంత్రములు లేవు. కాలము జరిగిపోవుకొలది పంచాక్షరి మంత్ర ప్రభావము తెలియకపోగా, మరికొంత కాలమునకు మనుజులలోనే కొన్ని తెగలు ఏర్పడి పంచాక్షరీ మంత్రము శైవులదను వాడుకవచ్చెను. తర్వాత వచ్చిన వైష్ణవులు మనకొక మంత్రము కావాలని ' **ఓం నమో నారాయణాయ**' అని సృష్ఠించుకొన్నారు. అట్లే ఎందరో ఎన్నో మంత్రములు తయారు చేయగ ఈనాడు కొన్ని ఉన్నవి. ఎన్ని ఉన్నా అన్నిటికంటే మించిన మంత్రము పంచాక్షరియేనని తెలియాలి. అది కూడ దాని అర్థము తెలిసినపుడే అది అన్నింటికంటే అధికమని తెలియును కనుక '**ఓం నమః శివాయ**' అన్న వాక్యములోని అర్థము పూర్తి అవగాహన చేసుకోండి. క్రొత్తదంతా చెప్పి మమ్ములను గందరగోళము చేయుచున్నాడని నన్ను తిట్టుకోకండి. తెలియనిది తెలుసుకోవడములోనే ఉంది సారాంశమని గమనించండి.

| **ఓం** | **న** | **మః** | **శి** | **వా** | **య** |
|---|---|---|---|---|---|
| ↓ | ↓ | ↓ | ↓ | ↓ | ↓ |
| **పరమాత్మ** | **ఆకాశము** | **గాలి** | **అగ్ని** | **నీరు** | **భూమి** |

# పోతు

సమాజములో పోతు, పెంటి అని మగ ఆడనుద్ధేశించి అంటూ ఉంటారు. ఒక పనిని సమర్థముగా చేసినపుడు వీడురా మగోడు అని అనడము జరుగుచున్నది. సమర్థముగ చేయనివాడు ఆడదానితో సమానమన్నమాట. అంతెందుకు బాగా నిద్రపోయే వానిని నిద్రపోతు అంటారు. ఎక్కువగా మాట్లాడే వానిని వదరుపోతు అంటారు. అలాగే తినేవానిని తిండిపోతు అంటారు. ఏ పనిలో అయిన సమర్థనీయుడైన వానిని ఆ పనికి తర్వాత పోతుగ అనగ మగానిగ చెప్పడము జరుగుచున్నది. గత కాలములో ఒక గురువు దగ్గర కొందరు శిష్యులుండిరట, వారిలో తిండిపోతులు, వదరుపోతులు, నిద్రపోతులు, సోమరిపోతులు మొదలగు అనేక రకములైన పోతులుండిరట. గురువుగారు జ్ఞానమెంత చెప్పిన అన్నియు విన్నప్పటికీ వారిలో కొంత కూడ మార్పు రాలేదట. వారు పోతులైనది తెలిసి గురువుగారు మౌనముగ గ్రహిస్తూ వారు ఇంకా కొంతకాలమునకైన మారరా అనుకున్నాడట. ఎంత కాలము చూచిన శిష్యులలో మార్పు రాకపోగ వారి ప్రత్యేకతలు మరి గట్టిపడుచుండుట గమనించిన గురువు శిష్యులతో ఇలా అన్నాడట.

ప్రపంచములో పుట్టిన ప్రతి జీవరాసి ప్రకృతితో సమ్మేళనమై, జీవుడు తన స్వరూపమైన పురుషుడినని తెలియలేకపోయి, ప్రకృతి లక్షణములు దాని ధర్మములు తనయందు చేరుటచేత జీవుడు కూడ ప్రకృతిలో భాగమైపోయాడు. జీవుడు పురుషుని అంశయైనప్పటికి స్త్రీవలె ఉన్నాడు. స్త్రీ లక్షణములున్న జీవాత్మ నిజపురుషుడైన వానిని తెలిసినపుడు వానిని చేరినపుడు పురుషుడేయగును. కాని ప్రపంచములో అన్నింటియందు మగాడు అని పేరుగాంచిన మీరు, పరమాత్మ జ్ఞానములో మగాడుగాలేరు. మీరు నిద్రపోతులు తిండిపోతులు మరి ఏ పోతులుగాని

జ్ఞాన పోతులు కావాలని కోరుచున్నాము. ఆశలో పూర్తి లగ్నమై ఆశపోతైన వాడు ఆశలో కాక జ్ఞానములో పోతుకావాలి. ఆశపోతు అను పదములో ఆశ పోయి కేవలము పోతు మాత్రము మిగలవలెను. అందువలన వారివారి ప్రపంచ ప్రత్యేకతలను వదలి, దైవమందు ప్రత్యేకతగాంచిన వారు నిజమైనపోతే అయితారు, అనగ పురుషుడే అగును. ప్రకృతి కాదన్నమాట. అలా కాకుండ ఏ విద్యలో పోతైనా అంతవరకే మగాడు కాని, వాడు ఆధ్యాత్మికరీత్య స్త్రీయే అని చెప్పవచ్చును. ఆత్మ పరముగ మగాడైతే అన్నింటిని మించిన బ్రహ్మవిద్యలోనే నేను మగాడినని ధైర్యముగ చెప్పవచ్చును. బ్రహ్మవిద్యలో ఆత్మను తెలియనివాడు మిగత ఏ విద్యలు తెలిసినా వాటిలో ఏ పోతైనా ప్రయోజనము లేదు. నిజముగ వాడు పెంటివాడనియే చెప్పవచ్చును. అందువలననే మీరాబాయి ఒక గురువు శిష్యులతో **"శ్రీకృష్ణుడొక్కడే మగాడు అనుకొని ఉంటినే ఇక్కడ మీరు మీ గురువు మగాల్లు ఉన్నారని నాకు తెలియదే!"** అన్నదట ఆ మాటను విన్న గురువు గారు వాస్తవమును గ్రహించిన వాడై ఆమెకు నమస్కరించి మేము ఎవ్వరము పురుషులము కాదు. మేమంతా ప్రకృతిలోని స్త్రీలమే అన్నాడట. మగాడిని కాదని అంతటి గురువే ఒప్పుకొన్నాడు. ఇపుడు మీరు దేనిలో పోతుగా ఉన్నారో నేను ప్రత్యేకించి చెప్పనవసరము లేదు. మీరు నిజమైన పోతులుగ మారవలెనని నేననుచున్నాను. కాని వాస్తముగ పురుష లక్షణములు మీలో పెరగడము లేదు. అందువలన ఇప్పటినుండైన భౌతిక పురుష లక్షణముల మీద ధ్యాస పెట్టక, ప్రకృతి లక్షణములను వాటి ధర్మమును వదలి, ఆత్మ పరముగ పురుషత్వమును సంపాదించి పురుషోత్తమునిగ మారవలెనని తెల్పుచున్నాను. ఇప్పటికైన నీవు దేనియందు పోతువో వెనుదిరిగి చూచుకొని, దేనియందు పోతువు కావలెనో యోచించి ప్రయత్నించు.

ఇంత వరకు నపుంసకులైనా పరవాలేదు. నా దగ్గర మగతనానికి మంచి మందుంది అని అన్నాడట ఆ గురువు. వారి సంగతి అలా ఉంచి మన సంగతి చూచుకొందాము. మనమూ మగవారమవుదాము.

# అవదూత

ఇందూమతములోను, ఇస్లామ్ మతములోను, క్రైస్తవమతము లోను దూత అను పదము పరిచయమున్నదే. దూత అనగ సమాచారమును తెచ్చువాడని అర్థము. ఇస్లాం మతములో దేవుని దగ్గరనుండి పంపబడిన వానిని మరియు దేవుని సమాచారము తెచ్చిన వానిని దేవదూత అంటున్నారు. క్రైస్తవ మతములో కూడా అదే పేరు, అదే అర్థము గలదు. అన్ని మతములలో దేవదూత అనే పదము గలదు. ఒక్క ఇందూమతములో మాత్రము అవదూత అంటున్నారు. అవదూత అనగ ఇందూ మతములో మాత్రము వాస్తవముగ నిజార్థము తెలియదు. ఇందూమతములో అవదూత అంటే పిచ్చివాడని అర్థము చేసుకొన్నారు. ఆ లెక్క ప్రకారము మురికికాలువలో నీళ్ళు త్రాగువానిని, శుభ్రత ఏమాత్రము తెలియకుండ మట్టిలోను, మలములోను పొర్లాడువానిని, ఆహారమేది అని తెలియని వానిని, అసలుకు మతి స్థిమితము లేని తిక్కవానిని అవదూత అనడము జరుగుచున్నది. తన శరీరము మీద, శుభ్రత అశుభ్రత మీద అవగాహనలేని వానిని అవదూత అనడమేకాక వానియందు దైవత్వముందని, మహత్యముందని నమస్కరించడము, అట్టి వానికి పూజలు చేయడము పూర్తి అజ్ఞానపు పనియే అగును. ఏది జ్ఞానము, ఏది అజ్ఞానమని తెలియనివారు తిక్కవారిని గొప్ప జ్ఞానులు

అనుకోవడము, నిజమైన జ్ఞానులను అజ్ఞానులుగా పోల్చుకోవడము జరుగుచున్నది. అందువలన **ఎంతో గొప్ప ఔన్నత్యము కల్గిన ఇందూమతము ఇందువులకే అర్థము కాక చివరకు హిందూమతముగ మారిపోయినది.**

అజ్ఞానములో కూరుకుపోయిన ఇందూమతమును ఉద్ధరించడానికి ఐదువేల సంవత్సరముల పూర్వము శ్రీకృష్ణుడు వచ్చాడు. శ్రీకృష్ణుడు ఇస్లాం మతము ప్రకారము పైగంబర్ (ఖలీపా) కాగ, క్రైస్తవ మతము ప్రకారము దేవుని కుమారుడు లేక దేవుని దూత అనవచ్చును. ఇందూమతము ప్రకారము అవదూత లేక భగవంతుడు అనవచ్చును. భగవంతుడు అను పదమునకు విప్లవాత్మకమైన అర్థముండగ అది ఎవరికి తెలియకుండ పోయినది. అట్లే అవదూత అను పదమునకు కూడ అర్థము తెలియక తిక్కవారినందరిని అవదూత అనీ, స్వాములనందరిని భగవంతుడని అనడము జరుగుచున్నది. ఎంత పెద్ద స్వాములైన భగవంతులు కారూ, తిక్కవారందరు అవదూతలూ కారని తెలియాలి. అణువణువున ప్రపంచమంతా వ్యాపించిన పరమాత్మ నుండి వచ్చిన వానినే భగవంతుడని గానీ లేక అవదూత అనిగానీ అనవచ్చును. భగవంతుని గూర్చిన వివరము ముందు చెప్పబడి ఉన్నది. కావున ఇక్కడ అవదూత యొక్క వివరము మాత్రము తెలుసుకొందాము. దేవుని వద్దనుండి వచ్చిన వానిని, దేవుని సమాచారముతో వచ్చినవానిని అవదూత అంటున్నాము. దేవుడు అనగ పరమాత్మ ప్రపంచమంతట వ్యాపించి ఉన్నాడని చెప్పగలుగుచున్నాము. కాని ప్రపంచమెంత ఉందో, ఎక్కడి వరకుందో ఎవరికి తెలియదు. జీవాత్మకు, ఆత్మకు ఆకారము అవధి ఉన్నదని చెప్పుకొను మనము, పరమాత్మకు ఆత్మ, జీవాత్మలవలె ఆకారము

కాని అవధికాని లేదని చెప్పుచున్నాము. పరమాత్మకు అవధులు కాని, ఆకారము కాని, పేరుకాని లేవు. ఈ మాటయే అన్ని మతములలో కూడ చెప్పబడుచున్నది. ఎల్లలు లేని పరమాత్మ యొక్క సమాచారమును పరమాత్మ వద్ద నుండి మోసుకొని వచ్చిన వానిని దూత అంటున్నాము. వానినే అవదూత అని కూడ అంటున్నాము. అవదులు లేని పరమాత్మ విషయము పరమాత్మకే తెలియాలి గాని సాధారణ మనిషికి తెలియదు. అందువలన దూతగ పుట్టినవాడు పరమాత్మ అంశతోనే పుట్టియుండును. అనగా వాడు కూడ పరమాత్మలోని వాడే, పరమాత్మయంతటివాడే. పరమాత్మకు, దూతగ వచ్చిన వానికి చాలా తేడాలున్నప్పటికి దూతలో కూడ పరమాత్మ అంశే ఉంటుంది. శరీరములేని పరమాత్మ యొక్క అంశము శరీరము ధరించి పుట్టడమే దూత యొక్క జన్మ. అటువంటి దూతయే పరమాత్మను గూర్చి అనగ తనను గూర్చి పూర్తి సమాచారము వివరముగా అందించగలడు. అట్లు దూతగాని వాడు భూమి మీద ఎంత పెద్ద స్వామి అయినప్పటికీ పరమాత్మ యొక్క జ్ఞానమును గూర్చిన అవగాహన ఉండదు. శ్రీకృష్ణునివలె, ఏసుప్రభువువలె దూతగాని వాడు దేశములో ఎంత పెద్ద స్వామీజీ అయినప్పటికీ, ఎంతో బాగా విపులముగ చాకచక్యముగ బోధలు చెప్పువాడైనప్పటికీ, పరమాత్మ జ్ఞానమును గూర్చి తెలియదనియే చెప్పవచ్చును. పరమాత్మను గూర్చి వాస్తవ జ్ఞానము చెప్పు స్థోమత పరమాత్మలో భాగమై పుట్టిన అవదూతకే సాధ్యమగును. ఎల్లలు లేని అనగ అవధులు లేని వానిని గూర్చి చెప్పువానిని, అవధులు లేని వాని సమాచారమును మోసుకొచ్చిన వానిని అవదూత అనడము జరిగినది. అవదూత అనగా అవధులులేని సమాచారము గలవాడని అర్థము. అవధులులేని సమాచారము గలవాడు అవదూత కాగ, అవదూత పరమాత్మలో భాగమై ఉండి శరీరము ధరించి తల్లి గర్భమునుండి

సజీవముగా పుట్టుచున్నాడు. అట్లు భగము నుండి పుట్టిన వానిని భగవంతుడనవచ్చును. తల్లి గర్భము నుండి పుట్టని వానిని మరియు అవధులు లేని సమాచారము లేని వానిని అవదూత అనిగానీ, భగవంతుడని గానీ అనకూడదు. ఈ కాలములో చాలామంది స్వాములు భగవాన్ అను పదమును తమ పేరుకంటే ముందు తగిలించుకొన్నారు. నిజమైన భగవంతుడు భూమి మీద పుట్టినపుడే నేను భగవాన్‌నని అవదూతనని చెప్పుకోలేదు. అవదూతను లేక భగవంతుని భూమి మీద కనుగొనాలంటే ఎన్నో జన్మల జ్ఞాన సంస్కారముండవలెను. అందువలన సామాణ్య ప్రజలు నిజమైన అవదూతను కనుగొనలేరు. పరమాత్మ అంశము భూమి మీదికి దొంగవలె వచ్చి దొంగవలె ఎవరికి తెలియకుండ పోవునని చెప్పబడి ఉన్నది. ఈ విషయమై గీతయందు జ్ఞానయోగమను అధ్యాయములో 'అవజానన్తి మాం మూఢా మానుషీం తను మాశ్రితమ్' అను శ్లోకములోను చెప్పబడి ఉన్నది. అవధులు లేని అవదూతను గుర్తించలేక తిక్కవారిని అవదూతలనుకోవడము చాలా పొరపాటు అవదూతయైన వాడు అంత సులభముగ అర్థముకాడని తెలియాలి.

# ఆడవారు - ఐదోతనము

జగద్భర్త అనగ జగత్తుకంతటికి భర్తయైనవాడని అర్థము. **'జ'** అనగ పుట్టుట **'గతి'** అనగ గతించునదని చాలామందికి తెలుసు. పుట్టుట గిట్టుటను బట్టి జగతి అని పేరు పెట్టగ, పుట్టి గిట్టే మానవాళికి మరియు సమస్త జీవరాసులకు భర్త ఒకడు గలడు. వానినే జగద్భర్త అంటున్నాము. జగత్తుకంతటికి భర్తయైనవాడు పరమాత్మ ఒక్కడే. ప్రపంచములో స్త్రీలకు

తాలికట్టిన వాడు భౌతికభర్తయైతే, జ్ఞానపరముగ జన్మనిచ్చిన పరమాత్మయే అందరికి భర్తయని తెలియాలి. మనమనుకొన్నా అనుకోక పోయినా అందరికి భర్త ఆ పురుషోత్తముడే. స్త్రీకి ఐదోతనము తాలికట్టిన భర్తయితే, స్త్రీకి పురుషునికి అందరికి ఐదోతనము జగద్భర్తయైన పరమాత్మయే. పరమాత్మ భర్తయితే మనమందరము ఒక విధముగ ఆడవారమే అన్నమాట. ఆడవారను పేరెట్లు వచ్చిందో కొంత ఆలోచిద్దాము.

హిందీ, ఉర్దూ మరియు చాలా భాషలలో **ఆడ** అనగ అడ్డము అని అర్థము. పూర్వము తెలుగు భాషలో కూడ అడ్డమును ఆడ అనెడివారు ఇపుడది కాలక్రమమున అడ్డముగ మారినది. ఆడ గాని అడ్డము గాని దేనికి అని యోచిస్తే జ్యోతిష్యశాస్త్రములో 1వ స్థానాధిపతికి 7వ స్థానాధిపతి ఎప్పటికి వ్యతిరేఖమున్నట్లు, యోగశాస్త్రములో పరమాత్మకు ప్రకృతి (మాయ) అనునది ఎప్పటికి వ్యతిరేఖముగ ఉన్నది. జగతిలో పరమాత్మ పక్షము, ప్రకృతి పక్షము అను రెండు పక్షములలో మనము ఎల్లపుడు ప్రకృతి పక్షములోనే ఉన్నాము. యోగశాస్త్రరీత్యా పరమాత్మకు ప్రకృతి వ్యతిరిక్తమన్నట్లు, ప్రకృతి పక్షమైన మనము పరమాత్మకు వ్యతిరిక్త దిశలోనే నడుస్తున్నాము. మనలోనుండి ఎవడైన పరమాత్మ వైపు ప్రయాణించాలని ప్రయత్నము చేస్తే, అందరు వానికి వ్యతిరేఖత తెలుపుట వాస్తవము. ఒక ఇంటిలో భర్త దేవుని వైపు పోవాలనుకొన్నపుడు భార్య మరియు మిగతావారు ఆటంకపరచడము, ఒకవేళ భార్య దేవుని వైపు ప్రయాణించాలనుకొన్నపుడు భర్త ఆటంకపరచడము జరుగుచున్న సత్యము. స్త్రీలు పురుషులు అందరు ప్రకృతి పక్షములో ఉండుట వలన పరమాత్మ వైపు పోవాలనుకొన్న వానిని అడ్డగించడము సహజమే అన్నాము కదా! అందువలననే ఆటంక పరచువారందరిని పూర్వము ఆడవారనడము

జరిగినది. ఈ కాలములో ఆడవారనగా కేవలము స్త్రీలే అనుకోవడము జరుగుచున్నది. అది పొరపాటు ఆడవారనగా ప్రకృతి వైపువారని అర్థము చేసుకోవాలి. పరమాత్మ పురుషుడు, ప్రకృతి స్త్రీయని భగవద్గీతలో గుణత్రయ విభాగయోగమునందు కూడ చెప్పియున్నారు. ప్రకృతివైపున్న ఆడ అను పదమునకు స్త్రీలు అను అర్థము గలదు. దీనినిబట్టి కేవలము భౌతిక స్త్రీలేఆడవారని, భౌతిక పురుషాకారులను పురుషులనుకోవడము పొరపాటు. అట్లనుకోక ప్రకృతివైపున్న స్త్రీ పురుషులందరికి ఆడవారను పేరు వర్తిస్తుందని తెలియాలి.

స్త్రీ పురుషులనందరిని ఆడవారనుకోవడమేమిటి, ప్రత్యక్షముగ నేను పురుషున్నని కనిపిస్తు ఉంటే స్త్రీగ ఎట్లు పోల్చుకోవాలని కొందరు మగవారికి కొంత బాధగ అనిపించి ఉండవచ్చును. దానికి సమాధాన మేమనగా! వాస్తవముగ నీవు శరీరము కావు. నీవు కేవలము జీవాత్మవే. నీవు నివశించు శరీరమును బట్టి నేను పురుషుడనని, నేను స్త్రీనని అనుకోవడము జరుగుచున్నది. శరీరమును బట్టి ప్రపంచపరముగ సమాజములో స్త్రీ పురుషులు అనుకోవచ్చును. కాని ఆధ్యాత్మికరీత్య పై లెక్క పనికిరాదు. అట్లయిన శరీర భేదములు ఎందుకున్నవని కొందరికి ప్రశ్నరావచ్చును, దానికి సమాధానము ఏమనగా! పరమాత్మ సృష్ఠి ఆదిలో ప్రకృతిని తయారు చేసి తనకు సాటిగ పెట్టుకొన్నాడు. ప్రకృతి చేతనే సమస్తమును సృష్ఠించాడు. పరమాత్మ తనను పురుషునిగ, ప్రకృతిని స్త్రీగ చెప్పుచు నా వలన ప్రకృతి చేత సమస్తము సృష్ఠింపబడినదని చెప్పాడు. సృష్ఠించబడిన జీవాత్మలకు స్త్రీ అంటే ఏమిటో, పురుషుడంటే ఏమిటో అర్థముగాదు. కనుక పరమాత్మ జీవులకు సృష్ఠి వివరము తెలియునట్లు స్త్రీ గర్భము దాలుస్తుందని, పురుషుడు బీజదాతయని

వారి వలననే సృష్టి జరుగుచున్నదని తెలియునట్లు చేశాడు. మనకున్న భౌతిక శరీరములు ప్రకృతి పరమాత్మలకు గుర్తులని తెలియక, ఆధ్యాత్మికములో సృష్టి వివరమును ప్రకృతి పురుషుల గుర్తింపును తెలుపునవని గ్రహించక, శరీరమును బట్టి నేను పురుషుడనని అనుకోవడము పొరపాటు. కొందరు శిష్యులు మా గురువు పురుషుడు స్త్రీలకు ప్రవేశము, దర్శనము లేదన్నపుడు మీరాబాయి నవ్వి "నేనింత వరకు ఒకడే పురుషుడనుకొన్నాను మీ గురువు కూడ పురుషుడేనా" అని అన్నదట. పరమాత్మ ఒకడే పురుషుడని అందరు స్త్రీలేననుకొన్న మీరాబాయికి ఆ గురువు పురుషుడంటూనే నవ్వి ఆశ్చర్యముగ ఇక్కడ మరొక పురుషుడున్నాడా! అని అడిగిందట. ఆమె మాట విన్న గురువు బయటకు వచ్చి **"నేను పురుషున్ని కాను జగతిలో అందరము స్త్రీలమే"** అని ఒప్పుకొన్నాడట.

పరమాత్మ తన విధానమును తెలుపు నిమిత్తము స్త్రీపురుష శరీరములను తయారుచేశాడనీ, వాస్తవముగ మనము ఆడవారమేననీ, ఆడ తనము ప్రకృతిదేననీ, ప్రకృతి వైపు నుండి పరమాత్మవైపు మనము పయనించాలనీ, అలా ప్రయాణించు వారికి మనము "ఆడ" కాకూడదని గ్రహించాలి. సహజముగ బయటి ప్రపంచములో స్త్రీ శరీరమునకు యుక్తవయస్సు వస్తూనే పురుషుని మీద ధ్యాస ప్రారంభమగును. ఆ స్త్రీ పురుషున్ని చేరుకొనుటకు ప్రయత్నిస్తుండును. పురుషున్ని చేరుకోవాలను కొన్న స్త్రీకి ఎటువంటి ఆటంకములు వచ్చిన లెక్కచేయదు, ఎన్ని ఆటంకములు ఎదురైన పురుషుని దరిచేరాలన్న ధ్యాస మాత్రము పోదు. అలాగే మనమందరము ఆధ్యాత్మిక దేశములో ఆడవారమే. స్త్రీకి యుక్తవయస్సు వచ్చి పురుష ధ్యాస వచ్చినట్లు, మనలో ఎవనికో ఒకనికి జ్ఞానవయస్సు వచ్చి పురుషోత్తమున్ని కలుసుకోవాలను ధ్యాస

వస్తుండును. అటువంటి వానికి బయటి భార్య బంధువులు ఎందరు ఆటంకమొచ్చిన లెక్క చేయడు. లోపల మాత్రము తన పురుషున్ని (దేవున్ని) చేరుకొనుటకు శతవిధాల ప్రయత్నము చేయుచుండును. ఒకవేళ నీవు నీ పురుషున్ని చేరుకోవాలనుకొన్నపుడు నీ ఇంటిలో వారుగానీ, నీ ఊరిలో వారుగానీ, నీ దగ్గర బంధువులుగానీ, నిన్ను హేళన చేయడముగానీ, చివరకు నీ ఆలి (భార్య) నీకు అన్నము పెట్టకుండ పోవడముగానీ మరేమైన జరుగవచ్చును. ఎన్ని జరిగినా, ఎన్ని ఆటంకములు అడ్డువచ్చినా, స్త్రీ ధ్యాసలో పురుషుడు వచ్చిన తర్వాత అటువైపే ప్రయాణించుటకు ఏదో ఒక దారి వెతుకుతున్నట్లు, పరమాత్మ చింతన కల్గిన వానికి ఎన్ని ఆటంకములొచ్చిన వెనుకాడడు.

యోగశాస్త్రరీత్యా మనమందరము ప్రకృతి పరముగనున్న ఆడవారము. నీకు నాకు అందరికి పురుషుడనువాడు కావాలి. పురుషున్ని చేరుకొనేంతవరకు మనకు తపన ఆగదు. అంతవరకు ధనధాన్యములు ఉన్నా, వస్తు వాహనములుండినా, అధికారము హోదాలుండినా ఎన్ని ఉండినా ఏదో లోటుగనే ఉండును. ఐదోతనమైన భర్త లభించినపుడే తృప్తి పరిపూర్ణత ఏర్పడును. జ్ఞానము తెలియని వారికి ఈ మాటలు చాలా విచిత్రముగ తోచుచుండును. మాకు పెళ్లి అయినది, భార్యా భర్తలమున్నాము కదా! అనుకోవచ్చును. వాస్తవముగ నీకు జరిగిన పెళ్లి పెళ్లికాదు. అది దైవత్వమును తెలియజేయు తంతు. మీరు భార్యాభర్తలనుకోవడము వలన భార్యాభర్తలు కాదు. భార్యాభర్తలను మాట ప్రకృతి పరమాత్మలను తెలియజేయు విధానము. భర్త అనగ భరించువాడని, భార్య అనగ భరింపబడునదని అర్థము. ఈ అర్థము ప్రకారము ఆలోచించు నీవు ఎవరిని భరిస్తున్నావు? నిజానికి నిన్ను నీవు

భరించుకోలేదు. నిన్ను భరించువాడు నీ శరీరములో గలడు. వాడు భరించునంత వరకు శరీరములో నీవు ఉండగలవు. అందరము అలాగే ఉన్నాము. అందరికీ భర్త గలడు. వాడే అందరికి ఐదోతనము. ఐదోతనమనే మాట చాలా చోట్ల వింటున్నాము. ఐదో తనమనడములో అర్థమేమిటి? ఐదోతనమని ఎందుకనాలి? భర్తను మూడోతనమో లేక నాల్గవతనమో అనకూడదా అని మనము ఆలోచించలేదు. తెలియనివాడు ప్రశ్నవేస్తే ఏదో ఒకటి చెప్పి సరిచేయక నిజార్థం ఏమిటో ఆలోచించి చూద్దాము.

ఒకప్పుడు నన్ను వేరొకరు నీవేమి చదువుకొన్నావని ప్రశ్నించారు. అపుడు నేను రెండు విధముల జవాబిచ్చాము. ప్రపంచ పరముగ అయితే పదకొండు తరగతులు చదివాను. పరమాత్మ పరముగ అయితే నాలుగు చదువుకొన్నాను ఐదుకు పోవాలన్నాను. ఈ రెండో జవాబును విపులముగ చెప్పాలంటే ఈ విధముగనున్నది. మన శరీరములో వరుసగ మూడు గుణభాగములున్నాయి. నాల్గవది గుణములేని భాగము కూడ ఉన్నది. మానవునికి ఇవి తరగతులలాంటివి. జ్ఞానములో మూడు గుణములను అతిక్రమించినవాడు, మూడు గుణములను జయించినవాడు, మూడు గుణములు అంటనివాడు త్రిగుణాతీతుడన్న మాట. అనగా మూడు తరగతులను దాటినవాడని అర్థము. ఆ మూడు తరగతులే తామస, రాజస, సాత్త్వికములనబడునవి. ఇక నాల్గవ తరగతిని యోగము అంటారు. యోగమును పూర్తి చవిచూచిన తర్వాత యోగమును కూడ అతిక్రమించినవాడగును. అటువంటివానిని యోగీశ్వరుడని అందురు. అట్లుకాక యోగములో ఉండినవానిని యోగి అని అందురు. నాకు నాల్గు తరగతులు పూర్తి అయినవి కావున యోగీశ్వరుడనై ఐదో

తరగతికి పోవాలని ఉన్నానన్నాను. నాల్గవదైన యోగము తర్వాత ఉన్నది మోక్షము. దానినే బయలనీ, అచేలమనీ, ముక్తియనీ, పరమపదమనీ, పరలోక రాజ్యమనీ అనేక రకములుగ చెప్పుచుందురు. నాల్గవ దాని తర్వాత ఉన్న ఐదోతరగతైన మోక్షమే మానవునికి చివరి తరగతి. ప్రపంచ చదువులెన్ని తరగతులుగ ఉండినా, అవి అన్నియు యోగశాస్త్రములో మూడు తరగతులలోనివేనని తెలియాలి. ఎంత పెద్ద డిగ్రీలు సహితము నాల్గవ తరగతి వరకు రాలేవు, అన్ని మూడవ తరగతిలోనివే. నేను యోగశాస్త్రములో నాలుగు తరగతులు చదివి, చివరిదైన ఐదుకు కాచుకొన్నాము.

అలాగే ప్రతి మనిషికి ఈ ఐదుతరగతులు గలవు. చివరిదైన దానినే ఐదోతనము అని కూడ పూర్వము పెద్దలనెడివారు. అందు వలననే అన్నిటికంటే మించిన భాగ్యము ఐదోతనమని, దానినే సౌభాగ్యమని కూడ అన్నారు. సౌభాగ్యమనగ భర్తను కల్గియుండడము. భర్తను కల్గియుండడమే ఐదోతనము. బయట శరీర భర్త ఐదోతనము కాదు. నిజముగ మూడవతనమే అగును. నిజమైన భర్త పరమాత్మ. ఆ జగద్భర్తను వెదుకుటకు ప్రయత్నించి ఐదో తనమును సాధించుకోవలెను. ప్రపంచములో స్త్రీ పురుషులకెవరికైన ఐదోతనము అవసరము. చాలా మంది తామసమైన ఒకటిలోనో, రాజసమైన రెండులోనో, సాత్త్వికమైన మూడులోనో ఉన్నారు. కనీసము నాల్గవదైన యోగము వరకు కూడ రాలేదు. జనాభాలో ఎక్కువ శాతము రెండవతరగతే దాటడము లేదు. 99 శాతము మూడునే దాటలేదు. అటువంటి వారు నాల్గు ఎప్పుడు దాటగలరు. ఒకవేళ నాల్గు వరకు వచ్చిన, ఎన్నో ఆటంకములచే అక్కడ పాసుకాలేకపోవుచున్నారు. కొందరేమో ఒకటిలో ఉంటూ, ఐదులో

కూర్చున్నామనుకొంటున్నారు. మా గురువు మోక్షములో కూర్చో బెట్టాడంటున్నారు. అయిదుకు పోయినవాడు కంటికే కనిపించక పరమాత్మలోనికి ఐక్యమైపోవును కదా! అలాంటపుడు కనిపించే గురువు, కనిపించే శిష్యులను మోక్షములో పెట్టాడంటే ఆ గురువు ఆ శిష్యులు అందరు ఒకటో తరగతిలోనే ఉన్నారన్న మాట. ఎవరెట్లు పోయినా పరవాలేదు. **నీవు మాత్రము నీ భర్తను చూచుకో, నీ భర్తకే మ్రొక్కు, నీ భర్తకే సేవ చేయి, నీ ఐదోతనము పోకుండ చూచుకో, ముత్తైదువుగ బ్రతుకు, ముండమోపిగ బ్రతుకవద్దు మనమందరము ఆడవారమే కనుక మన ఆడవారందరికి ఐదోతనమే ముఖ్యమని తెలుసుకో.**

# బ్రాహ్మణ - నాయి బ్రాహ్మణ

బ్రాహ్మణులను, నాయిబ్రాహ్మణులను తెలియనివారుండరను కొంటాను. ఎందుకనగా ఎపుడో ఒకపుడు తప్పనిసరిగా వారివద్దకు పోవలసిన అవసరం అందరికి ఉన్నది. ఇంటిలో ఎవరైనా పుట్టితే వారికి నామకరణం కొరకు, జాతకము కొరకు, ఎవరైనా మరణిస్తే వారి కర్మ తంత్రములకోసము, బ్రతికినపుడు పంచాంగము అడగడము కోసము, బ్రాహ్మణుల దగ్గరకు తప్పక పోవలసి ఉన్నది. నాయిబ్రాహ్మణులు (మంగళ వారి) వద్దకైతే తలవెంట్రుకలు పెరిగినపుడు, గడ్డము పెరిగినపుడు నెలకొకమారైన పోవలసి ఉన్నది. అందువల్ల బ్రాహ్మణులు, నాయి బ్రాహ్మణులు ఇద్దరూ ప్రజలకు సుపరిచితులేనని చెప్పవచ్చును. నేటి కాలములో వీరిపని అందరికి తెలిసినదే, అయినప్పటికి పూర్వకాలములో వీరు ముఖ్యముగ చేయుచున్న పని ఏమిటి? వారికాపేరు ఎలా వచ్చింది?

అని యోచించిన కొన్ని క్రొత్త విషయాలు తెలుస్తున్నవి. అవి ఏమిటో చూద్దామా!

పూర్వము కృతయుగము తర్వాత త్రేతాయుగములోనే బ్రాహ్మణ కులము పెద్దకులముగా పేరుగాంచినది. అన్ని కులములకంటే పెద్ద కులముగా పేరుగాంచడమునకు కారణమేమంటే బ్రాహ్మణులు మాత్రము బ్రహ్మవిద్యను గురించి బోధించెడివారు. అన్ని విద్యలకంటే పెద్ద విద్య అయిన బ్రహ్మవిద్యను బోధించెడివారు, కనుక ఆ కులమును పెద్ద కులముగా పరిగణించెడివారు. బ్రహ్మవిద్యను బోధించెడు వారు కనుక బ్రాహ్మణులని పేరు వచ్చినది. ఆనాటి రాజులవద్ద కూడా గురువులుగా, ఆస్థానపండితులుగా స్థానమును బ్రాహ్మణులు పొందియుండిరి. బ్రాహ్మణుల మాటకు రాజులు కూడ ఎదురు చెప్పెడివారు కాదు. ఈ విధముగా కొంతకాలము జరుగుచూపోగా భూమి మీద దేవాలయములు ఎక్కువై పోయాయి. ప్రతి దేవునికి ఇద్దరు భార్యలను దేవాలయములలో పెట్టడము జరిగినది. దేవాలయములను నిర్మించినదీ, అందులో ప్రతిమలను ప్రతిష్ఠించినది బ్రాహ్మణులే. ప్రజలలో దేవతలతో సమానమైన గౌరవమున్న బ్రాహ్మణులు కూడా గుడిలోని దేవతలవలె ఇద్దరు భార్యలను వివాహమాడనారంభించిరి. గుడిలోని దేవుళ్ళకు ఇద్దరు భార్యలున్నట్లు ఆనాటి బ్రాహ్మణులకు కూడా ఇద్దరు భార్యలుండడము వలన బ్రాహ్మణులు భూమిమీద దేవతలనీ, భూసురులనీ పేరుగాంచిరి. బహుభార్యత్వమును ఆనాటి బ్రాహ్మణులే ఎక్కువ కల్గియుండెడివారు. అంతేకాక ఆనాటి రాజులు కూడ కొందరు ఇద్దరు భార్యలు కల్గిన వారుండెడివారు. అప్పటి త్రేతాయుగములోనే దశరథుడు ముగ్గురు భార్యలు కల్గియుండుట అందరికి తెలుసు. ఆనాటి రాజులుగానీ, బ్రాహ్మణులుగానీ మొదటి భార్యకు పుట్టిన

సంతానమునకే ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చెడివారు. అదే విధానముతోనే పెద్దభార్యకు పుట్టిన రామునికి రాజ్యమును కట్టాలని ధశరథుడు అనుకోవడము, దానిని చిన్న భార్య వ్యతిరేఖించడము జరిగినది.

ఆనాటి బ్రాహ్మణులలో కూడ మొదటి భార్య సంతతికి పాధాన్యత ఇచ్చెడివారనుకొన్నాము కదా! దానిప్రకారమే దేవాలయములో బ్రహ్మ జ్ఞానమును బోధించు కార్యమును రెండు విధములుగా విభజించి, ఒకటి లోపల బోధించువారూ, రెండు బయట కార్యరూపముగా చూపించువారూ అను రెండు కార్యములనుంచారు. ఆనాటి బ్రాహ్మణులు మొదటి భార్య కుమారులకు లోపల బోధించు సులభమైన కార్యములను చేయమని చెప్పి, బయటి కార్యమును రెండవ భార్య కుమారులుకు చెప్పారు. **అప్పటినుండి గుడిలోని కార్యమూ, గుడి బయటి కార్యమూ రెండూ బ్రాహ్మణులే చేయుచున్నారు.** కానీ కాలక్రమములో గుడిలోని వారు బ్రాహ్మణులుకాగా, గుడి బయటివారు మాత్రము నాయీ బ్రాహ్మణులైనారు. ఈనాటి బ్రాహ్మణ, నాయీ బ్రాహ్మణ ఇద్దరూ త్రేతాయుగములో బ్రాహ్మణ సంతలే అని నేడు తెలియకుండ పోయినది. ఆనాడు తండ్రి ద్వారా వచ్చిన కార్యములను సోదర బ్రాహ్మణులైన బ్రాహ్మణ, నాయీ బ్రాహ్మణులు ఇద్దరు క్రమము తప్పక గుడి లోపలా, గుడి బయటా బ్రహ్మవిద్యకు సంబంధించిన పనిని చేయుచూనే ద్వాపరయుగము వరకు వచ్చారు. మనము అక్కడినుండి వివరించుకొందాము.

బ్రహ్మజ్ఞానము తెలుపువాడు లేక తెలిసినవాడు బ్రాహ్మణుడు అనుమాట పూర్వముండెడిదన్నాము కదా! ఆమాట ప్రకారమే బ్రాహ్మణులు బ్రహ్మజ్ఞానము ఇతరులకు తెలుపు పనియే ముఖ్యముగ పెట్టుకొని జీవనము సాగించెడివారు. మానవ జీవితధ్యేయము మోక్షమును సాధించుటయేనని

తెల్పెడివారు. పురములో జీవించు పౌరులకు జీవితంలో **'దైవప్రాప్తి కోసము హితమును బోధించువారు కావున పౌరోహితులని'** కూడ వీరిని పిలుచుట గలదు. పౌరులకు హితమును బోధించుచు పౌరోహితులని పేరుగాంచిన బ్రాహ్మణులు అందరి తలయందు దైవము నివాసమున్నాడనీ, మనతలలోని గుణములు పనిచేయుచున్నంత వరకు దైవమును తెలుసు కోలేమనీ, లెక్కింపనలవికాని గుణముల యొక్క ఆలోచనలను అణచి వేసినపుడే, శిరస్సులో నివాసమున్న ఆత్మ అనుభవమునకు వచ్చి తెలియుచున్నదనీ, ఆత్మ దర్శనము లేని జీవితము వ్యర్థమనీ బోధించెడి వారు. బ్రాహ్మణులు ఈ విధంగా ప్రజలకు బోధిస్తూ మంచి కార్యము చేయుచుండగా, నాయిబ్రాహ్మణులని పేరుగాంచిన మంగళవారు మీకంటే మేము ఏమి తక్కువలేమని, మీరు ఆత్మజ్ఞానమును బోధిస్తే దానిని మేము అర్థమగునట్లు చూపించువారమని బ్రాహ్మణులకు పోటీ కార్యములు చేసెడివారు.

ఈ విధముగా బ్రహ్మజ్ఞానమును తెలుపువారు రెండు తెగలుగ విడిపోయి ఉండెడివారు. ఒక తెగ వారు బ్రహ్మజ్ఞానమును నోటితో బోధిస్తే, మరొక తెగవారు నోటితో బోధించక చేతితో చేసి అర్థమగునట్లు చేసెడివారు. బోధించెడివారికంటే చూపించేవారు ఎక్కువని కొందరూ, చూపించేవారికంటే బోధించేవారే గొప్పయని మరికొందరూ ఒకరికొకరు వాదించుకొనెడివారు. ఏది ఏమైనా బ్రహ్మజ్ఞానము ఏదో ఒక విధముగ తెలుపువారు కావున రెండు తెగల వారికి సోదర బ్రాహ్మణులు అని పేరు ఉండెడిది. రెండు తెగల బ్రాహ్మణులు అనేక విషయములలో పోటీపడుచు ఎవరికి వారు గొప్పయనుకొనెడివారు. ఆ విధముగనే అనేకమగు తలంపులు మన తలయందున్నాయనీ, ఆ తలంపులను లేకుండ

చేసుకొంటే ఆత్మదర్శనమగునని బ్రాహ్మణులు తెలుపగా అనేక తలంపుల చిహ్నామే తలమీది అనేక వెంట్రుకలనీ, ఆ తలవెంట్రుకలు పూర్తి కొరిగితే **'గుండుగ'** మారి క్రొత్త ఆకారము దర్శనమగుననీ, అదే విధముగ తలంపులు లేని స్థానములో క్రొత్తగ **'ఆత్మ'** దర్శనమగుననీ పూర్తి వివరముగ అర్థమగునట్లు, ఒక మనిషి తలమీద వెంట్రుకలు పూర్తి కొరిగి చూపించి, లోపల కూడ తలంపులు లేకుండ చేసుకొమ్మని నాయీబ్రాహ్మణులు చేసి చూపించారు.

ఇట్లు అనేక విషయములలో బ్రాహ్మణ, నాయిబ్రాహ్మణ అను దాయాది తెగల బ్రాహ్మణులు పోటీ కార్యములు నిర్వహిస్తూ ఉండెడివారు. వాటిలో కొన్నిటిని ఇపుడు వివరించుకొందాము. బ్రాహ్మణులు దేవాలయములలోనికి పోయి అందులోని ప్రతిమ ముందర ప్రాతః కాలముననే బ్రహ్మవిద్యాపారాయణము చేయుచూ, అనేక శ్లోకములను చదువుచూ, దేవున్ని ఆరాధించుచు ప్రజలందరూ దేవుని మంత్రోచ్ఛాటన శబ్దముతో మనస్సు లగ్నము చేసి ఆరాధించవలెనని, జ్ఞానమంత్ర శబ్దము దైవసమానమని అటువంటి నాదమే **'బ్రహ్మమని'** బోధించగ, నాయి బ్రాహ్మణులు జ్ఞానమంత్ర శబ్దముకంటే గొప్పదైన నాదము వేరున్నదనీ, జ్ఞానమంత్రనాదముకంటే తాము మ్రోగించు నాదము చాలా మంగళకర మైనదని చెప్పెడివారు. మంగళవాయిద్యముల నుండి పుట్టునాదములలో మనస్సు లగ్నమైన, నిత్యము మనలను పీడించు అనేక విషయములను మరచిపోయి గొప్ప అనుభూతిని మానవుడు పొందగలడనీ, అది దేవునికి చాలా దగ్గరైనదనీ, ప్రపంచ విషయముల నుండి సులభముగ బయటపడుటకు మంత్రనాదముకంటే మానాదమే మేలనీ వాయించి, మనుష్యుల మనసులను ఆ నాదము మీదనే నిలబడునట్లు చేసామనీ,

అట్లు చేయుట వలన తలంపులు లేకుండపోయి క్రొత్తగా ఆత్మ దర్శనమగునని ఆ అర్థముతోనే మనుషుల తలలుకొరిగి చూపించారు. కొరుగుటకు కావలసిన పరికరములు, శబ్దము చేయుటకు కావలసిన వాయిద్యములు అనాటి నుండే సమకూర్చుకొని పెట్టుకొన్నారు.

గుడిలోపల మీరు మంత్రము చదివితే, గుడి బయటే మేము వాయిద్యములు మ్రోగిస్తామని పోటికి కూర్చున్నారు. అట్లే వివాహ సమయంలో బ్రాహ్మణులు మంత్రములు చదివితే, నాయిబ్రాహ్మణులు వాయిద్యములు మ్రోగించెడివారు. పెళ్లి మీరు చేస్తే, పెళ్లికుమారునిగ చేసేది మేమేయనీ, మేము లేనిదే పెళ్లి కుమారుడే లేడు అని అన్నారు. ఇప్పటికి నాయి బ్రాహ్మణులు పెళ్లికుమారుని చేయుట గలదు. ఆ విధముగానే ఒక మనిషి చనిపోయినపుడు బ్రాహ్మణులు మంత్రములు చదివి కర్మతంత్రము నిర్వహించి చనిపోయిన మనిషికి బ్రతికియున్న వారికి నేటితో సంబంధము తెగిపోయినది, ఇంతవరకు ఇచటనే తిరుగుచున్న జీవాత్మ ఆ దినముతో పూర్తి సంబంధము లేకుండ పోతుందని తెలుపగ, నాయిబ్రాహ్మణులు బ్రతికియున్న వారికి గడ్డము పెంచుకొమ్మని ఆ దినము వాటిని కొరిగి ఇంతవరకు మీకు కరుచుకొని ఉన్న గడ్డపు వెంట్రుకలు, తలవెంట్రుకలు ఎలా ఇపుడు సంబంధము లేకుండ పోయినాయో, అలాగే చనిపోయిన వారి జీవాత్మ నేటి నుండి మీతో సంబంధము లేకుండ పోతున్నదని తెల్పుచూ కర్మతంత్రములు చేసెడివారు. ఇట్లు బ్రాహ్మణుల చొరవయున్న చోటంతా దాయాదులైన నాయి బ్రాహ్మణుల చొరవయున్నదని తెలియాలి.

అనేక చోట్ల పోటీపడిన రెండు తెగల బ్రాహ్మణులు తమ తమ అధిపత్యము చాటుకొనుచు, ఒక తెగయైన బ్రాహ్మణులు మేము

**'భూసురులమని'** చాటుకొనిరి. భూమి మీద ప్రత్యక్ష దేవతలమని బ్రాహ్మణులు చాటుకొనగ, రెండవ తెగయైన నాయిబ్రాహ్మణులు మేము బ్రాహ్మణులకంటే శుభకరమైనవారమని మంగళ ప్రదమైన మేము మంగళవారమని (శుభకరమైనవారమని) ప్రకటించుకొనిరి. మొదట రెండు తెగలవారికి బ్రాహ్మణులని పేరుండెడిది. నాయిబ్రాహ్మణులనెడి పేరు మధ్యలో మంగళకరమైన వారికి వచ్చినది, కాని మొదట ఉండెడిది కాదు. పూర్వకాలములోనే బ్రాహ్మణుల మధ్యలో భేదాభిప్రాయములు వచ్చినపుడు **'భూసురులని'** ఒక తెగకు **'మంగళవారని'** ఒక తెగకు పేరు వచ్చినది. మంగళవారను పేరు ఒక తెగకు అట్లే నిలిచిపోగ, భూసురులని పేరు మరియొక తెగకు అంతగ ప్రచారముకాక బ్రాహ్మణులను పేరుగానే నిలిచిపోయినది. నువ్వా నేనా గొప్పయని పోటీపడుచు వచ్చిన రెండు తెగల బ్రాహ్మణులు ఒకరినొకరు ద్వేషించుకొను వరకు వచ్చి, ఎవరైన కార్యనిమిత్తమై పోవునపుడు మంగళవాడు ఎదురైన అపశకునమనీ, ఆ కార్యము భంగమై పోవుననీ, మంగళవారిని అమంగళులుగా బ్రాహ్మణులు చెప్పి ప్రచారము చేసిరి. దానిని చూచిన మంగళబ్రాహ్మణులు అదే విధమైన అపవాదును బ్రాహ్మణులకు అంటకట్టదలచి, ఎవరైనా కార్యనిమిత్తమై పోవునపుడు బ్రాహ్మణుడు ఎదురైతే అపశకునమనీ, ఆ కార్యము భంగమైపోవుననీ, ప్రచారము చేసిరి. అపశకునములలో ఈనాటికి అవి ప్రచారములో గలవు.

ఇట్లు కాలము గడుస్తూరాగా పాతవారు పోతూ క్రొత్తవారు వస్తూ పూర్వమున్న అభిప్రాయములు మారిపోయి వారి పెద్దలు ఏమి చేశారో, పూర్వమున్న పద్ధతులేమిటో తెలియక, బ్రాహ్మణులు బ్రహ్మజ్ఞానమును వదలి కేవలం బ్రతుకు తెరువుకొరకే అన్నట్లు ఆలయములో ఆరాధన

మొదలుకొని, చచ్చినవారి కర్మతంత్రముల వరకు చేయుచున్నారు. ఆనాటికి ఈనాటికి వారు చేయు పనులలో కూడ మార్పులు చేసుకొన్నారు. బ్రాహ్మణులు బ్రహ్మజ్ఞానమును వదలి వేదమంత్రములలో పడిపోయారు. అట్లే మంగళవారియందు కూడ అర్థాలు తెలియని ఆచారాలు మిగిలి పోయినవి. వారు చేయుచున్న పనులే నేడు చేయుచున్నప్పటికీ ఆనాటి పనులు భావయుక్తమై ఉండెడివి. నేడు భావరహితమై కేవలము వృత్తి విద్య అన్నట్లున్నవి. ఇలా రెండు తెగలవారు గాడితప్పి పాత విధానమునూ అర్థమునూ వదలి పనులు చేయుచున్నారు.

పూర్వకాలము బ్రాహ్మణులు మంగళవారు సమానముగ ఒకరికొకరు పోటీపడుచు వచ్చినప్పటికీ, కొంతకాలమునకు మంగళవారే ఎక్కువ ప్రచారములోకి వచ్చి, వారిదే రాజుల వద్దనూ ప్రజలవద్దనూ పై చేయిగా మారింది. దానిని చూచిన బ్రాహ్మణులు పట్టుదల కలిగి మంగళవారిని క్రిందికి పంపి తాము పైకి రావాలనుకొని బుద్ధిని ఉపయోగించి దానికి తగిన పథకమును యోచించారు. తాము కూడా రాజులతో స్నేహం చేసి, అధికారమును తమవైపు ఉపయోగించుకొని తమ ప్రాబల్యమును సంపాదించుకోవాలనుకొన్నారు. అప్పటినుండి ఎక్కువ రాజుల సాన్నిధ్యంలో చేరి, వారికి అనేక విషయములు బోధిస్తూ, రాజుల దగ్గర ఆసనమును సంపాదించి రాజగురువుల హోదా కల్గి చలామణి అగుచూ, 'మంగళవారి' కంటే ఎక్కువ ప్రాబల్యమును అన్ని విధముల గొప్ప తనమును సంపాదించుకొనిరి. ఏ పథకము లేకుండా సాధారణంగా తమ పనులు చేయుచూ వచ్చి కొంతకాలమునకు తాము బ్రాహ్మణులకంటే చాలా తక్కువ వారిగ ఉన్నట్లు, తమకంటే వారు ఎన్నోరెట్లు ఎక్కువగా ఉన్నట్లు మంగళవారు తెలుసుకొనిరి. తాము ఎటులైన బ్రాహ్మణులతో

సమానంగా ఉండాలని తలచి, తాము కూడ వారివలె రాజుల వద్దనే స్థానం సంపాదించుకోవాలని యోచించారు. ఒకనాడు శ్రీకృష్ణదేవరాయల గారి ఆస్థానంలో మంగళి ఒకడు "మేము కూడ ఒకప్పుడు బ్రాహ్మణులమే, మమ్ములను కూడ బ్రాహ్మణుల స్థానము కల్పించి ఆదరించవలెనని" శ్రీకృష్ణదేవరాయలను కోరగా అపుడు వారి పూర్వాపరాలు తెలియని రాయలవారు, బ్రాహ్మణులను చూసి ఇతనిని కూడా బ్రాహ్మణునిగా చేయమన్నాడట. అపుడు వారు రాయల వారి ఆజ్ఞ ప్రకారము అతనిని తుంగభద్రానదికి తీసుకపోయి మంత్రములు చదువుచూ, నీటిని పోయుచు నేటితో నీచత్వము పోయి బ్రాహ్మణత్వము రావాలని సంస్కృతమున మంత్రములను చెప్పుచుండిరట. ఆ విషయం బ్రాహ్మణుల కులస్థుడైన తెనాలి రామకృష్ణకు తెలిసింది. **'మంగళవారు'** మాకు సాటియా అని ఆగ్రహించిన రామకృష్ణుడు ఆ కార్యమును భంగము చేయుటకు యోచించి, ఒక 'కుక్క'ను తన వెంట పెట్టుకొని తాను కూడ తుంగభద్రానదికి పోయాడు. అక్కడ జరుగుచున్న తంతును చూచి, తానువారికంటే కొన్ని గజముల పై భాగమునకు పోయి, కుక్క మెడలో తాడుకట్టి తాడును కాలిక్రింద అదిమిపట్టి తాను మంత్రములు చెప్పుచు, ఈ కుక్క కామధేనువు(ఆవు)గా మారవలెనని చెప్పుచూ కుక్క ముఖము మీద నీరు చల్లుచుండెనట. అపుడు ఆ కుక్క నీటి తాకిడికి తట్టుకోలేక అరుస్తూ నీటిలో ఎగరడం మొదలు పెట్టెను. నీటి వాలుకు పై ప్రక్క ఉన్నందువల్ల కుక్క త్రొక్కిన నీరు మిగతా బ్రాహ్మణులవైపు వచ్చుచుండెను. పైగా కుక్క అక్కడ అరవడం, నీరు అంతయు మురికికావడం వారికి సరిపోక రామకృష్ణను దూరముగ పొమ్మనీ, నీ వలన మా కార్యము చెడిపోవుచున్నదనీ, కుక్క శరీరము మీద పడిన నీరు తమవైపు పారుచున్నదనీ, ఎంత చెప్పినా రామకృష్ణ వినకుండెను. పైగా తెనాలి

రామకృష్ణయే వారి మీదకు వాదనకు దిగెను. అపుడు చేయునది లేక ఆ విషయమును రాజుగారికి తెలియజేసి మా కార్యము రామకృష్ణవల్ల భంగమైనదనిరి. అపుడు రాయలవారు రామకృష్ణ చేసిన పనికి ఆగ్రహించి సభలోనికి అతనిని పిలిపించెను. నేను మంగళవాన్ని బ్రాహ్మణునిగా చేయమని చెప్పగ వారిపనికెందుకు అడ్డు తగిలావని రామకృష్ణున్ని దండించెను. అపుడు రామకృష్ణుడు వినయముగ కుక్కను ఆవుగా చేయాలని అక్కడకెళ్లి కుక్కను మంత్రోదకముతో శుద్ధి చేయుచుంటిని. వారికి నేనేమి అడ్డురాక నాపనిని నేను చేసుకొనుచుంటిననెను. ఆ మాట విన్న రాయలు ఆశ్చర్యపడి మంత్రోదకమున శుద్ధి చేస్తే కుక్క గోవుగా ఎట్లు మారును? అని అడిగెను. దానికి రామకృష్ణ తెలివిగ మంత్రోదకముతో శుద్ధి చేస్తే **'మంగళవాడు' 'బ్రాహ్మణుడిగ'** ఎట్లు మారునో, అట్లే కుక్క కూడ మారునని సమాధానము చెప్పెను. రాయలు విచిత్రంగా "ఏమి చేసినప్పటికీ కుక్క ఆవుగ మారుట అసంభవం" అన్నాడు. వెంటనే రామకృష్ణ "అయితే ఏమిచేసినా మంగళవాడు బ్రాహ్మణుడుగ మారడము అసంభవం" అని సమాధానము చెప్పాడు. రామకృష్ణ యొక్క వాక్ చాతుర్యమునకు రాయలు మెచ్చుకొని నేను మంగళివాడికి ఇచ్చిన మాటయేమి కావలెననగా? దానికి రామకృష్ణుడు మార్గము యోచించి రాజుగారికి సంతోషము కల్గునట్లు "ప్రభూ! మంగళిని బ్రాహ్మణునిగా మారుస్తానని తమరు మాట ఇచ్చారు. అట్లు మారుటకు నాకుక్క అడ్డు వచ్చినమాట నిజమే. రాజుగారి మాట వృథాకాకుండా ఉండునట్లు కుక్క కారణమున ఆ కార్యము నిలిచిపోయినది కావున, నేటి నుంచి మంగళివాడిని **'నాయిబ్రాహ్మణ'** అని పిలుచునట్లు ఊరూరు దండోర వేయించవలెనని నామనవి. మంగళివాడు బ్రాహ్మణుడిగా మారుటకు కుక్క అడ్డు వచ్చిన కారణమున నాయిబ్రాహ్మణ అని పలానా రాయలవారి

కాలంలో ఈ కార్యము జరిగి ఈ పేరు వచ్చినదని తమపేరు స్థిరస్థాయిగ ఉండునట్లు ఇదే తగినపేరు" అని చెప్పెను. రామకృష్ణ తెలివికి సంతోషించిన రాయలు అనాటి నుండి **'మంగళివాన్ని'** నాయి బ్రాహ్మణునిగ పిలుచునట్లు దండోర వేయించెను. ఇట్లు పూర్వము నుండి నాయి బ్రాహ్మణ అనుపేరు లేకుండినప్పటికీ, రాయలవారి కాలము నుండి ఆపేరు **'మంగళవారికి'** వచ్చినది.

పూర్వము వాస్తవానికి బ్రాహ్మణులే అయినప్పటికీ, ఆచార వ్యవహారములలో వేరుపడి మరియొక తెగగామారిన వారు నేడు మంగళవారిగ పిలువబడినప్పటికీ, నాయిబ్రాహ్మణ అను పేరు అతికించబడి ఉన్నది. రాయలవారు ఆస్థానము హంపి. హంపి ఈనాడు కర్నాటకలో ఉన్నది. ఆనాడు హంపి కూడ ఆంధ్రలోనే ఉండెడిది. అప్పుడు కన్నడ భాష కొంత హంపిలో ఉండెడిది. కన్నడ భాషలో నాయి అనగా కుక్క అని అర్థము. నేడు బ్రాహ్మణులు సంఘములో విలువగా ఉంటే, నాయిబ్రాహ్మణులు వారికంటే తక్కువ వారిగా ఉన్నారు. ఇదంతయూ కాలక్రమమున మారిన విచిత్రమని తెలియాలి. కాని ప్రజలకేమో డబ్బు తీసుకొన్నా ప్రతిఫలంగా చేతల రూపంగా ఉపయోగపడువారు నాయిబ్రాహ్మణులనీ, కేవలము మాటలు చెప్పి సరిచేయువారు బ్రాహ్మణులని ప్రజలలు అనుకొంటున్నారు.

అదే విషయమునే వేమనయోగి కూడా తన పద్యములో మంత్రజలముకన్నా మంగళిజలమెచ్చు అన్నాడు. బ్రాహ్మణుడు డబ్బు తీసుకొని మంత్రపు నీటిని తలమీద చల్లితే దానివలన సుఖము కనిపించదు. అదే డబ్బు తీసుకొని తలకొరుగుటకు మంగళి నీల్లు చల్లి తలమీద చేయిపెట్టగానే ఎంతో హాయి కనిపిస్తుంది. దానివలననే

వేమన అట్లన్నాడు. నేడు సమాజములో బ్రాహ్మణులకంటే మంగళవారే ఎక్కువ ఉపయోగపడుచున్నారు. అయినప్పటికీ పూర్వపరాలు తెలియని దానివలన బ్రాహ్మణులు, మంగళవారు ఒకే జాతియని తెలియకుండా పోయినది. తమ విషయము తమకే తెలియని మంగళవారు ఇప్పుడున్నారు. బ్రాహ్మణ అను పేరుకంటే మంగళ అను పేరు గొప్పదని తెలియని మంగళవారు నేడున్నారు. బ్రాహ్మణ అంటే కేవలము జ్ఞానమనీ, మంగళ అంటే మోక్షమనీ, జ్ఞానము మార్గముకాగా గమ్యము మోక్షమని తెలియని మంగళవారు నేడు గలరు. ప్రపంచములోనే అత్యున్నతమైన శబ్దము మంగళమను శబ్దమనీ, అదే మంగళమను మాటను దేవాలయములలో కూడ దేవుని ఆరాధన చివరిలో హారతియందు చివరిగా పలుకుచుందురని తెలియని వారుండుట వలన, మంగళవారు బ్రాహ్మణులకంటే అన్ని విధముల తక్కువగాయున్నారు. పూర్వము గుడిలో ప్రారంభమైన తలకొరుగు కార్యము నేడు బ్రతుకు తెరువుకన్నట్లు బజారులోని షాపులలోనికి మారినది. ముఖ్యముగా చెప్పుకోతగ్గ వింత ఏమనగా! గౌరవప్రదమైన మరియు పవిత్రమైన మంగళమను పదమును వదలి, అగౌరవమైన మరియు అపవిత్రమైన కుక్క అనుటకు మారుగాయున్న **"నాయి"** అనే పేరును తగిలించుకొని **"నాయిబ్రాహ్మణ"** అని పేరు పెట్టుకోవడము విచిత్రము కాదా! ఏ షాప్‌లో చూచినా నాయీ బ్రాహ్మణ సంఘము అని బోర్డు పెట్టుకోవడము హాస్యాస్పదము కాదా! చదువురాని కొంతమందికి నాయి అంటే ఏమిటని అర్థము తెలియక ఆ పేరు పెట్టుకొనియుండవచ్చును. కానీ చదువుకొన్నవారు ఎందరో ఆ కులములో ఉండీ, ఇది మనకు మంచిపేరా చెడ్డపేరా అని యోచింక పోవడము విచిత్రము కాదా! నాయీ బ్రాహ్మణ అంటే కుక్క బ్రాహ్మణుడని అర్థము కదా! అటువంటి అర్థముతో మాది కుక్క బ్రాహ్మణ సంఘమని

బోర్డు పెట్టుకోవడము మంచిదా? ఇప్పటికైనా కన్ను తెరిసి సమాజములో అవమానమును కల్గించు ఆ పేరును వదలిపెట్టి పూర్వపు ఆచరణతో అర్థముతోనే ఉంటూ, మొదటి మాదిరే మంగళప్రదమైన బ్రాహ్మణులై తమపని పవిత్రమైనదనీ, మాపేరు నాయీ బ్రాహ్మణులుకాదని సమాజానికి చాటవలెను. అట్లు చాటుటకు మొదట జ్ఞానమును తెలుసుకొని కుల ఆచారమైన నాదమును ప్రయోగించుటకు, తలకొరుగుటకు దైవసంబంధ అర్థమును చెప్పి నిజమైన మంగళ ప్రదాతలుగ మంగళవారుండవలెనని తలచుచున్నాను.



# గురుపౌర్ణమి

అంతు లేక అంత్యము అనగా అందరికి తెలుసు. ప్రపంచములో అన్నిటికి మొదలు చివర తప్పనిసరిగ ఉంటాయి. ప్రపంచములో మొదలు అంత్యము లేనివి ఏవి లేవు. ప్రపంచమే ఆది అంత్యముతో కూడుకొని ఉన్నది. పేరుకు ఊరుకు, గీతకు రాతకు, పనికి పాటకు, ఆటకు బాటకు, చేనుకు సాలుకు అన్నిటికీ మొదలు చివర ఉండనే ఉన్నవి. అందువలననేమో ఎవరినైన దేనినైన నీ అంతుచూస్తానంటుంటాము. దీనితో అంతు అందరికీ, అంత్యము అన్నిటికీ ఉన్నదని తెలియుచున్నది. అన్నిటికీ అంతు ఉండినప్పటికీ, ఒకే ఒక దానికి అంతులేదు. అదియే గోళము లేక గుండ్రము. గుండ్రము అను పదము నుండి గురువు అను పదము కూడా పుట్టినది. పరమాత్మకు కూడ ఆది అంత్యము లేదు. ఆది మధ్య అంత్య రహితుడైన పరమాత్మ భూమి మీద సాకారరూపముతో భగవంతునిగ పుట్టినపుడు ఆయననే గురువు అంటున్నాము. ఆది అంత్యములులేనిది కావున దానినే గురువు అంటున్నాము. పరములోని

పరమాత్మకు, ఇహములోని గురువుకు మొదలు చివరలు లేవని తెలియాలి. దీనినిబట్టి పరమాత్మ అనినా, భగవంతుడనినా, గురువు అనినా ముగ్గురు ఒక్కటేనని తెలియుచున్నది.

పూర్వము కొందరు పెద్దలు గురువు గుండ్రాయిలాంటివాడని సామెతగ అనెడివారు. గుండ్రాయికి కూడ మొదలు చివరలుండవు. అందువలన గురువును గుండ్రాయితో పోల్చారు. గురువు అనగా కేంద్రము అని కూడ అర్థము గలదు. జ్ఞానమునకు కేంద్రమైనవాడు గురువు. జ్ఞానమనునది ఎక్కడ ఎవరిచేత తెలియబడుచుండినా, అనగ ఎక్కడైన ఏ బోధకులు చెప్పుచుండినప్పటికీ అది మొదట జ్ఞానకేంద్రమైన గురువునుండియే వచ్చి ఉండును. అపార జ్ఞానకేంద్రము, వాస్తవ ధర్మనిలయము గురువేయగును. పరమాత్మ భూమి మీద అవతరించినపుడు భగము నుండి పుట్టినవాడు కనుక భగవంతుడని, ఆది అంత్యములు లేనివాడు కనుక గురువని చెప్పబడుచున్నాడు. జ్యోతిష్యశాస్త్రము ప్రకారము జ్ఞానమునకు చిహ్నము చంద్రుడు. సంపూర్ణ జ్ఞానమునకు చిహ్నము పున్నమి రోజు వచ్చిన గుండ్రని చంద్రుడు. పున్నమి చంద్రుడు పూర్ణ జ్ఞానమునకు గుర్తు. మానవులు దైవమైన గురువును గుర్తు చేసుకొనునట్లు సంవత్సరమునకొక పౌర్ణమిని గురుపౌర్ణమిగ పెద్దలు నిర్ణయించారు.

ఆది అంత్యములు లేనివాడను అర్థము కల్గిన గురువును గుర్తు చేసుకొనీ, సంపూర్ణ జ్ఞానముగ పున్నమి చంద్రుని దినమైన పౌర్ణమిని గురుపౌర్ణమిగ తలచి, భగవంతుడైన గురువును ఆరాధించడమే గురుపౌర్ణమి యొక్క అంతరార్థము. ఆచారముండి అర్థము తెలియని ప్రజలకు గురువంటే ఏమిటో, గురుపౌర్ణమంటే ఏమిటో తెలియదు.

అర్థము అంతరార్థము తెలియని ప్రజలకు దేవుడెవరో, దయ్యమేదో, గురువెవరో, బోధకుడెవరో తెలియదు. ఆ సందర్భములో తెలియని తనమును ఆసరాగా చేసుకొని మాయ తానే గురువునని అందరికి తెలియునట్లు ప్రచారము చేసుకొన్నది. జ్ఞానము ధర్మము తనవద్ద లేకున్ననూ, తన మహత్యములే జ్ఞానమనీ, తాను చేయు దానములనే ధర్మములనీ, అందరికి అర్థమగునట్లు చేసి అందరిని తన వైపుకు త్రిప్పుకొన్నది. తానే గురువునని తెలియునట్లు మాయ చేయుట వలన ప్రజలు అసలైన దైవగురువును వదలి మాయ గురువును ఆశ్రయించడము, ఆ గురువునే గురుపౌర్ణమి దినమున గుర్తు చేసుకోవడము, ఆరాధించడము జరుగుచున్నది. గురుపౌర్ణమి రోజు కొన్ని లక్షల చోట్ల గురుపూజలు జరుగుచున్ననూ, కనీసము ఒక్కచోట కూడ నిజగురువు యొక్క పూజ జరుగుచున్నదను నమ్మకము లేదు. పరమాత్మకు వ్యతిరేఖమైన మాయ పరమాత్మవైపు ఎవరు పోకుండ తనవైపే అందరు ఉండునట్లు, ఎన్నో పథకములతో ప్రజలకు మేలు చేయుచు అందరిని తనవైపు లాగుకొనుచున్నది. మాయలోపడిన ఎందరో గురువును గుర్తించలేక పోవడమేకాక, దైవమును గురువుకాదని నిందించడము, అవమాన పరచడము చేయుచు మాయను గురువుగ లెక్కించి ఆనందముతో ఆరాధించడము జరుగుచున్నది. భక్తియనునదున్న ప్రతివాడు తమ భక్తిని దేవతలవైపు, మహత్యముల చూపు బాబాలవైపు, పురాణముల బోధించు బోధకులవైపు చూపుచు గురువును అగౌరవపరచుచున్నారు. క్షుద్రదేవతలకు మ్రొక్కు ఒక సామాణ్యుడు పదవిలో ఉంటే దేవతలకే దేవుడైన గురువును తన ముందు నిలబెట్టుకొని కనీసము కూర్చోమనక హేళనగ మాట్లాడడము జరుగుచున్నది. మాయా ప్రభావము మనుషులలో ఉన్నంతవరకు వారికి మాయాగురువులు గొప్పగ కనిపించడము,

భగవంతుడైన నిజగురువు నీచముగ కనిపించడము సహజమే. మాయకు పరమాత్మకు జరుగుచున్న ఆటలో సమస్తము మాయవైపు ఉండగ, ఒకే ఒక జ్ఞానము ధర్మము పరమాత్మ వైపు గలవు. మాయ వైపు మహత్యములు, దానము, ధనికులజేయుట, కోరిన కార్యములు నెరవేర్చుట ఇలాంటి ఎన్నో వేల ఆయుధములు ఉండగ పరమాత్మ వైపు ధర్మములు అను ఆయుధము ఒక్కటే గలదు. ఈ విషయమునకు ఉదాహరణగ ద్వాపరయుగమున భారత యుద్ధములో నాతో సమానమైన పదివేలమంది యోధులందరు ఒకవైపు, నేనొక్కనిని ఒకవైపు ఉందునన్నాడు. పదివేల మంది యోధులు ఆయుధములు పట్టి పోరాడగ నేను ఆయుధము పట్టక ఊరక మాటలు చెప్పువాడనై ఉందునన్నాడు. ఆనాడు చెప్పిన అంతరార్థమేమని యోచించిన నాచేత తయారు చేయబడిన నా మాయ నాతోనే ఎన్నో ప్రజానుకూల సంఘటనలను ఆయుధములతో పోరాడుచు జీవులను తనవైపు లాగుకొని యుద్ధములో గెలవాలని చూస్తున్నది. నేను మాత్రము ఏ సంఘటనలను ఆయుధములు పట్టక ధర్మములను మాటల ఆయుధములతోనే పోరాడుదునని తెల్పినట్లున్నది.

ఈ కాలములో మాయ అనేక మార్గములలో మనుషలను తన వైపు లాగుకొనుచు, తానే దైవముగ లెక్కించబడుచు, ఎన్నో గుడులను సహితము కట్టించుకొని, దైవముగనే రంగు మార్చుకొని కన్పిస్తున్నది. మనుషులెవరు గుర్తించలేని మాయను పరమాత్మే గుర్తించాలి. పరమాత్మ ఇది మాయయని చెప్పినప్పటికీ, పరమాత్మవలెనున్న మాయను పరమాత్మేనని నమ్ముచు, పరమాత్మనే మాయగ తలచువారు గలరు. ఇటువంటి పరిస్థితిలో మనమున్నాము. ఈ స్థితిలో మాయ ఎవరో గురువు ఎవరో గుర్తించడము చాలా కష్టము. ఒక వేల నీవు మాయను

వదలి దేవునివైపు పోతున్నానని అనుకొనినా, నిజగురువును ఎన్నో సంవత్సరముల నుండి గుర్తించినప్పటికీ, మాయ తలచుకొంటే నిజ గురువును మాయయని, మాయను నిజగురువుయని నీతోనే అనిపించ గలదు. దేవుడు అన్ని ఆయుధములు మాయకిచ్చాడు. దేవునివి ఉత్తమాటలు తప్ప ఏమి లేవు. ఉత్త మాటలతో మనకేమి లాభమని నిండు ఘంటులిచ్చు మాయవైపు పోతారో, ఉత్తఘంటు ఉన్న పరమాత్మవైపు పోతారో మీరే నిర్ణయించుకోండి. సర్వులకు ప్రకృతి అమ్మ, పరమాత్మ నాన్నయని తెలుసుననుకుంటాను. మొత్తానికి అమ్మ ఘంటు, నాన్న ఘంటు రెండు ఉన్నాయి. అమ్మ ఘంటు నిండుది, నాన్న ఘంటు ఉత్తది. ప్రపంచములో నిండుఘంటైన మీ అమ్మ ఘంటుకావాలో, ఉత్తఘంటైన మీ నాన్న ఘంటు కావాలో మీరే నిర్ణయించుకోండి.

# ఉపనిషత్తులు

ఉపనిషత్‌లను మాట చాలా వరకు వినియుందురు. ఉపనిషత్ లను ఎందరో జ్ఞానులు, వేదాంతులు, ఋషులు వ్రాశారు. చాలా మంది చేత వ్రాయబడిన ఉపనిషత్‌లు ఖచ్చితముగ ఇన్ని ఉన్నాయని చెప్పలేము కాని 1108 ఉన్నాయని ప్రతీతీ. ఇన్ని ఉపనిషత్‌లు చదవడానికి మానవునికి చాలా కాలము పట్టుననో లేక మరియే యోచన చేతనో 1108 ఉపనిషత్‌లలో ముఖ్యమైనవి 108 మాత్రమేనని కొందరు చెప్పారు. వేదములకంటే గొప్పవనీ, వేదముల చివరివనీ, వేదాంతములనీ, దైవమును తెల్పుననీ చెప్పుచూ, వాటియందే కొన్ని ముఖ్యమైనవనీ, కొన్ని ముఖ్యము కానివనుట చాలా విచిత్రము. ఈ మాటలువిన్న సామాణ్య మానవుడు

యోచిస్తే ఇదేమిటి అన్నిటికంటే గొప్పవైన వాటియందే కొన్ని ముఖ్యము కానివి ఉంటే, వాటియొక్క గొప్ప తనమేమిటి? అను ప్రశ్న ఉద్భవించగలదు. కొన్ని ముఖ్యమనుటయందే మరి కొన్నిటియందు లోపముందని అనుమానము కల్గుచున్నది. అందువలన అవి మానవునికి ఉపయోగపడేవేనా అను ప్రశ్న కూడ ఒకవైపు కల్గునట్లుండగా, 108 యందు కూడ కొన్ని మాత్రము ముఖ్యమని కేవలము పదింటిని మాత్రము సూచించుట మరీ విచిత్రము. ఆ దశోపనిషత్‌ల పేర్లు ఇలా ఉన్నవి.

| | |
|---|---|
| 1. ఈశావాస్యోపనిషత్ | 2. కేనోపనిషత్ |
| 3. కఠోపనిషత్ | 4. ప్రశ్నోపనిషత్ |
| 5. ముండకోపనిషత్ | 6. మాండూక్యోపనిషత్ |
| 7. తైత్తరీయోపనిషత్ | 8. ఐతరేయోపనిషత్ |
| 9. చాందోగ్యోపనిషత్ | 10. బృహదారణ్యకోపనిషత్ |

ఎన్నో ఉపనిషత్‌లలో కేవలము పది పేర్లను చెప్పడము విచిత్రమైతే అన్నిటినిమించిన గొప్ప విచిత్రము మరియొకటిగలదు. అది ఏమంటే ఉపనిషత్తుగా చెప్పబడు భగవద్గీత ముఖ్యమైన వాటిలో లేక పోవడమే! దశోపనిషత్‌లయందే కాక 108 యందు కూడ భగవద్గీతకు స్థానము లేక పోవడము చాలా శోచనీయము. ముఖ్యస్థానము వహించిన 108 ఉపనిషత్‌ల పేర్లు క్రింద ఇవ్వబడినవి.

| | |
|---|---|
| 1. ఈశావాస్యోపనిషత్ | 2. కేనోపనిషత్ |
| 3. కఠోపనిషత్ | 4. ప్రశ్నోపనిషత్ |
| 5. ముండకోపనిషత్ | 6. మాండూక్యోపనిషత్ |
| 7. తైత్తరీయోపనిషత్ | 8. ఐతరేయోపనిషత్ |

9. చాందోగ్యోపనిషత్ 10. బృహదారణ్యకోపనిషత్
11. బ్రహ్మోపనిషత్తు 12. కైవల్యోపనిషత్తు
13. జాబాలోపనిషత్తు 14. శ్వేతాశ్వతరోపనిషత్తు
15. హంసోపనిషత్తు 16. ఆరుణికోపనిషత్తు
17. గర్భోపనిషత్తు 18. నారాయణోపనిషత్తు
19. పరమహంసోపనిషత్తు 20. అమృతబిందూపనిషత్తు
21. అమృతనాదోపనిషత్తు 22. అధర్వశిరోపనిషత్తు
23. అధర్వశిఖోపనిషత్తు 24. మైత్రాయణ్యుపనిషత్తు
25. కౌషీతకిబ్రాహ్మణోపనిషత్తు 26. బృభజ్జాబాలోపనిషత్తు
27. 1.నృసింహ పూర్వతాపిన్యుపనిషత్తు
2.నృసింహోత్తరతాపిన్యుపనిషత్తు
28. కాలాగ్నిరుద్రోపనిషత్తు 29. మైత్రేయోపనిషత్తు
30. సుబాలోపనిషత్తు 31. క్షురికోపనిషత్తు
32. మన్త్రికోపనిషత్తు 33. పక్వసరోపనిషత్తు
34. నిరాలంలోపనిషత్తు 35. శుకరహస్యోపనిషత్తు
36. వజ్రసూచికోపనిషత్తు 37. తేజోబిందూపనిషత్తు
38. నాదబిందూపనిషత్తు 39. ధ్యానబిందూపనిషత్తు
40. బ్రహ్మవిద్యోపనిషత్తు 41. యోగతత్త్వోపనిషత్తు
42. ఆత్మబోధోపనిషత్తు 43. నారదపరివ్రాజకోపనిషత్తు
44. త్రిశిఖిబ్రాహ్మణోపనిషత్తు 45. సీతోపనిషత్తు
46. యోగచూడామణ్యుపనిషత్తు 47. నిర్వాణోపనిషత్తు
48. మండలబ్రాహ్మణోపనిషత్తు 49. దక్షిణామూర్త్యుపనిషత్తు
50. శరభోపనిషత్తు 51. స్కన్దోపనిషత్తు
52. త్రిపాద్విభూతిమహినారాయణోపనిషత్తు

53. అద్వయతారకోపనిషత్తు
54. రామరహస్యోపనిషత్తు
55. రామతాపిన్యుపనిషత్తు
56. శాండిల్యోపనిషత్తు
57. ముద్గలోపనిషత్తు
58. శాండిల్యోపనిషత్తు
59. పైఙ్గలోపనిషత్తు
60. భిక్షుకోపనిషత్తు
61. మహోపనిషత్తు
62. శారీరకోపనిషత్తు
63. యోగశిఖోపనిషత్తు
64. తురీయాతీతోపనిషత్తు
65. సన్న్యాసోపనిషత్తు
66. పరమ హంసపరివ్రాజకోపనిషత్తు
67. అక్షమాలికోపనిషత్తు
68. అవ్యక్తోపనిషత్తు
69. అన్నపూర్ణోపనిషత్తు
70. సూర్యోపనిషత్తు
71. ఏకాక్షరోపనిషత్తు
72. అక్ష్యుపనిషత్తు
73. అధ్యాత్మోపనిషత్తు
74. కుండికోపనిషత్తు
75. సావిత్ర్యుపనిషత్తు
76. ఆత్మోపనిషత్తు
77. పాశుపతబ్రహ్మోపనిషత్తు
78. పరబ్రహ్మోపనిషత్తు
79. అవధూతోపనిషత్తు
80. త్రిపురాతాపిన్యుపనిషత్తు
81. దేవ్యుపనిషత్తు
82. త్రిపురోపనిషత్తు
83. కఠరుద్రోపనిషత్తు
84. భావనోపనిషత్తు
85. రుద్రహృదయోపనిషత్తు
86. యోగకుండల్యుపనిషత్తు
87. భస్మజాబాలోపనిషత్తు
88. రుద్రాక్షజాబాలోపనిషత్తు
89. గణపత్యుపనిషత్తు
90. దర్శనోపనిషత్తు
91. తారసారోపనిషత్తు
92. మహవాక్యోపనిషత్తు
93. పంచ బ్రహ్మోపనిషత్తు
94. ప్రాణాగ్నిహోత్రోపనిషత్తు
95. గోపాలతాపిన్యుపనిషత్తు
96. కృష్ణోపనిషత్తు
97. యాజ్ఞవల్క్యోపనిషత్తు
98. వరాహోపనిషత్తు
99. శాట్యాయనీయోపనిషత్తు
100. హయగ్రీవోపనిషత్తు

101. దత్తాత్రేయోపనిషత్తు 102. గారుడోపనిషత్తు
103. కలిసంతరణోపనిషత్తు 104. జాబాల్యుపనిషత్తు
105. సౌభాగ్యలక్ష్మ్యేపనిషత్తు 106. సరస్వతీరహస్యోపనిషత్తు
107. బహ్వృచోపనిషత్తు 108. ముక్తికోపనిషత్తు

యోగశాస్త్రముగ పేరు పొందినది, సాక్షాత్తు పరమాత్మయే చెప్పినది యైన **భగవద్గీతోపనిషత్** ముఖ్యమైన వాటిలో లేక పోవడమేమిటను ఆలోచన యోచించు అందరికి పొడచూపగలదు. యోచించు వానికి ఇట్లు ఒక ప్రశ్న వచ్చిందనుకొందాము. దానిప్రక్కనే మరియొకటీ, మరి దాని వెంటనే ఇంకొకటీ, ఇట్లు సరైన సమాధానము దొరుకు వరకు ప్రశ్నలోస్తాయి.

ఎవరికి ఎట్లు యోచనలొచ్చినా మనము తెలుసుకోవలసినది కొంత ఉన్నది. అది ఏమనగా! ఉపనిషత్ అంటే అర్థమేమిటి? ఉపనిషత్‌లు ఎవరి చేత వ్రాయబడినవి? ఉపనిషత్‌లలో ఏమి ఉన్నది? ఏమి ఉండాలి? ఉపనిషత్‌లు శాస్త్రములా? అశాస్త్రీయములా? ఇలా ఎన్నో ప్రశ్నలకు సమాధానములు మనము తెలుసుకోవలసి ఉన్నది. ఈ విధమైన ప్రశ్నలకు జవాబులు తెలియనపుడు ఉపనిషత్తుల విషయములో గ్రుడ్డిగ నమ్మిన వారమౌతాము. అలా కాకుండ ఎవరో చెప్పినారని గ్రుడ్డిగ నమ్మక సత్యమునకే విలువనిచ్చువారమై అసత్యమెంత గొప్పదైన దానిని విసర్జించువారమై ఉండాలని కోరుచున్నాము.

ఇపుడు ఉపనిషత్ అను శబ్దమునకు అర్థము తెలుసుకొందాము. ఉపనిషత్ అను పదమును విభజించి చూడగ అది మూడు భాగములుగా ఉన్నది. అది ఏమనిన ఉప+ని+షత్ అని చెప్పవచ్చును. 1) ఉప అనగా సమీపము (ప్రక్కన) 2) ని అనగా చక్కగా (బాగుగ) 3. షత్

అనగా చేర్చునది లేక పొందించునది. పూర్తి అర్థము వ్రాస్తే సమీపముగ ఉన్న దానిని చక్కగా పొందబడునట్లు చేయునది ఉపనిషత్. మనము జీవాత్మగా మనకు మిక్కిలి సమీపమున ప్రక్కనే ఉన్నది ఆత్మ. జీవాత్మలమైన మనము ప్రక్కనే గల ఆత్మతో ఐక్యత చెందుటకు ఉపయోగపడునట్లు చేయునదియే ఉపనిషత్. **'త్రైగుణ్య విషయా వేదా'** మూడు గుణముల విషయములే వేదములని గీతలో సాంఖ్యయోగమున గలదు. అందువలన గుణములకతీతముగ గుణముల అంత్యములో ఉన్న ఆత్మను తెలియజేయు నది ఉపనిషత్తు. వేదముల తర్వాత అనగ గుణముల తర్వాత ఉన్న దానిని తెలియజేయునది, కావున దానిని వేదాంతమని కూడ అన్నారు. నీకు సమీపమున ఉన్న దానిని చక్కగ తెలియజేసి పొందించునదని ఉపనిషత్తు అర్థమిమిడి ఉండగ, అలాంటి ఉపనిషత్తులందు అన్నియు ఆత్మను తెలియచేయు ధర్మములే నిండియుండునని అర్థమగుచున్నది. ఉపనిషత్తు అర్థము ప్రకారము లేని పుస్తకమును ఉపనిషత్తనకూడదు. ఉపనిషత్తు అర్థముతో నిండియున్న ఏ పుస్తకమైన ఉపనిషత్తే అగును. అర్థమునుబట్టి ఏవి ఉపనిషత్తులో, ఏవి ఉపనిషత్తులు కావో మీరే నిర్ణయించుకోవచ్చును.

ఎందరో మహానుభావులు ఉపనిషత్తులను వ్రాశారు. వ్రాసినవారి పేర్లను బట్టియే ఆయా ఉపనిషత్తులకు పేర్లు పెట్టబడినవి. అలా ఎన్నియో పేర్లను మీరు చూడగలిగారు. 108 యందు కూడ భగవద్గీత స్థానము చేసుకోలేదంటే భగవద్గీత ఉపనిషత్తు యొక్క అర్థమునకు సరిపోదాయని చూస్తే, గీత అన్ని విధముల ఆత్మ ధర్మముల బోధించు చున్నది కావున దానిని మించిన ఉపనిషత్తు లేదనిపిస్తుంది. మిగతా 108 ఉపనిషత్తులను అదే దృష్టితో పరిశీలిస్తే వాటియందే కొన్ని లోపములు

కనిపించి, ఇవి ఉపనిషత్తులు కావేమోనని అనిపిస్తున్నది. కాని ఉన్న సత్యమును చెప్పితే, ముఖ్యమైన వాటిలో తప్పు చూపితే మమ్ములనే ఏవగించుకొనువారు, విసిగించుకొనువారున్నారని నాకు తెలుసును. ఎవరో ఏవగించుకుంటారని ఉన్న సత్యమును దాచలేని వారము మేము. గీతకు ముఖ్యస్థానము లేకున్నను ఇది ఏమని ప్రశ్నించి అడుగలేని వారందరూ ఉపనిషత్తులు ముఖ్యముకావని వాటియందు లోపములు ఉన్నాయని వింటూనే మండిపడుచున్నారు. పాఠకులుగ ఈ సమస్యకు మీరే తీర్పు చెప్పి ఏవి ధర్మములను బోధిస్తున్న నిజమైన ఉపనిషత్‌లో, ఏవి ఉపనిషత్తని పేరు పెట్టుకొని అధర్మములను బోధిస్తున్నవో తేల్చండి.

ఉదాహరణకు ఒక ఉపనిషత్తులోని విషయమును వివరించు కొందాము. అది ఉపనిషత్తో కాదో మనమే యోచిస్తాము. మన శరీరము రెండు భాగములుగ ఉన్నది. ఒకటి స్థూలము రెండు సూక్ష్మము. స్థూలభాగము అనగ కంటికి కనిపించునదని, సూక్ష్మభాగమనగ కంటికి కనిపించనిదని అర్థము. పైన కంటికి కనిపించు శరీరమంతయు స్థూలశరీరమంటాము. మన శరీరమందు గల 25 భాగములలో కంటికి కనిపించు భాగమందు ఉన్నవాటిని తెలుసుకుంటే **జ్ఞానేంద్రియములు ఐదు అనగా 1) కన్ను 2) చెవి 3) ముక్కు 4) నాలుక 5) చర్మము. కర్మేంద్రియములు ఐదు అనగా 1) కాల్లు 2) చేతులు 3) నోరు 4) యోని లేక లింగము 5) గుదము.** ఇవి పైకి కనిపించు పది భాగములు కావున వీటిని స్థూలశరీరమని అనవచ్చును. కనిపించక 15 భాగములున్నవి **అవి పంచవాయువులు ఐదు అనగా 1) వ్యాన 2) సమాన 3) ఉదాన 4) ప్రాణ 5) అపానవాయువులు. అట్లే ఐదు తన్మాత్రలు అనగా జ్ఞానేంద్రియముల వెనుకల కనిపించక ఉన్న శక్తులు**

**1) చూపు 2) శబ్దము 3) ఘ్రాణము 4) రుచి 5) స్పర్శ.** **అట్లే ఐదు అంతరేంద్రియములు 1) మనస్సు 2) బుద్ధి 3) చిత్తము 4) అహము 5) జీవుడు.** ఇవి మొత్తము 15 కంటికి కనిపించవు. కావున సూక్ష్మమంటాము. ఇలా వివరించుకొన్న తర్వాత చిన్న పిల్లవాడైన ఇది సూక్ష్మము, ఇది స్థూలమని చెప్పగలడు. ఉదాహరణకు మనస్సు అన్నామనుకోండి అది కంటికి కనిపించదు కావున దానిని సూక్ష్మమని చెప్పగలము. అట్లే కాళ్లు అన్నామనుకోండి అవి కంటికి తెలియునవి కనుక స్థూలమని చెప్పవచ్చును. ఇప్పుడు శరీరమును గురించి మీకు కూడ అర్థమై ఉంటుంది. స్థూల సూక్ష్మముల గురించి ఇప్పుడు అసలు విషయమునకొస్తాము. ముఖ్యమైన 108 ఉపనిషత్తులలో **యోగచూడా మణ్యుపనిషత్తు** కూడ ఒకటి గలదు. అందులో ఒక శ్లోకమిలా ఉన్నది. *'జ్ఞాన కర్మేంద్రియైంతా ప్రాణాది పంచవాయవ మనోబుద్ధిచ్ఛ సూక్ష్మలింగమత్యుచ్ఛతే'* జ్ఞానేంద్రియములైదు, కర్మేంద్రియములైదు, ప్రాణవాయువు మొదలైన వాయువులు ఐదు, మరియు మనస్సు ఒకటి బుద్ధి ఒకటి మొత్తము 17 భాగములు సూక్ష్మశరీరమని పై శ్లోకము యొక్క అర్థము. కాళ్లు చేతులు మొదలైన కర్మేంద్రియములు కనపడనివా? కనిపించునవా? అన్న విషయము మీ అందరికి తెలుసును. మనస్సు బుద్ధి రెండును పంచవాయువులు కంటికి కనిపించని సూక్ష్మములని అందరికి తెలుసును. అట్లే కంటికి కనిపించు కర్మేంద్రియములు జ్ఞానేంద్రియములు కంటికి కనిపించు స్థూలమని తెలిసిన సత్యమే. అటువంటపుడు అందరికి తెలిసిన సత్యమును కప్పిపుచ్చి జ్ఞాన కర్మేంద్రియములను సూక్ష్మమని చెప్పుట ఎంత అసత్యమో చూడండి. 17 భాగములు సూక్ష్మమైనపుడు మిగత 8 స్థూలముగ లెక్కింపవలసి ఉన్నది. ఆ మిగతావియైన జీవాత్మ కంటికి కనిపించువాడా? చిత్తము

కనిపించునదా? అహము కనిపించునదా? ఎనిమిదిలో ఏవీ కనిపించవు. అయినా కనిపించెడివని ఇలాంటి ప్రత్యక్ష అసత్యమును చెప్పునది ఒక ఉపనిషత్ అయితే, అదియు ముఖ్యమైన 108లో ఉంటే ఎంత విచిత్రమో చూడండి. 108లోనే ఇట్లుంటే ముఖ్యముకావని వదిలేసిన 1000 ఉపనిషత్తులలో వాస్తవమెంతుంటుందో మీరే యోచించండి.

ఇలా పరిశీలిస్తూ పోతే నిరూపణకు రాని విషయములలో ఎన్నో ఉపనిషత్‌లున్నాయి. ఇలాంటి అసత్య విషయాలతో నిండియున్న వాటిని అసలు ఉపనిషత్‌లనాలా? వాటికాపేరు తగునా? అని యోచిస్తే ఏమాత్రము తగదు. సత్యాన్వేషణ చూపులేని కొందరు మేమన్న ఈ మాటను హేళనగ తీసుకోవచ్చును. ముందు వచ్చిన చెవులకంటే వెనుక వచ్చిన కొమ్ములు పెద్దవా అనవచ్చును. ముందు వచ్చిన చెవులు వయసులో పెద్దవైన పొడవులో చిన్నవే. వెనుక వచ్చిన కొమ్ములు వయస్సులో చిన్నవైన పొడవులో పెద్దవే. అలాగే అసత్యమును చెప్పినవారు ఎంతటి ముందువారైన సత్యమును చెప్పువారికంటే చిన్నవారేనని తెలియాలి. మహర్షులు చెప్పారని అసత్యమును నమ్మనవసరము లేదు. హేతుబద్ధముగా విమర్శించి చూచి సత్యమైనపుడే, నిరూపణకు వచ్చినపుడే, శాస్త్రబద్ధమైనపుడే దానిని ఎన్నుకోవాలి, అలాకాక గ్రుడ్డిగ నమ్మితే ఎలాగైనా కావచ్చును.

"పిల్లవాడు చచ్చినా, తొట్ల మర్లు పోలేదను" సమత (సామెత) ప్రకారము ఇవి సత్యము కాదు అసత్యమని తెలిసిపోయినప్పటికీ, వాటి మీదనున్న అభిమానము చేత కొందరు వాటి గొప్పతనమును గూర్చి మొండిగ వాదిస్తూనే ఉంటారు. సాలు సట్టము సూత్రబద్ధము లేని వారి వాదనను విడిచి సత్యమును ఎన్నుకొని, ఏది సత్యమును

బోధిస్తున్నదో యోచించాలి. అలా యోచించినపుడే సత్యము తెలిసి పరమాత్మను చేరగలరు. మీరు యోచించుటకొరకు ఉదాహరణగా ఒక ఉపనిషత్‌లోని విషయమును తెల్పాను. ఇటువంటి పంథాలో యోచిస్తూపోతే అన్ని ఉపనిషత్‌లకంటే భగవద్గీత ముఖ్యమైన ఉపనిషత్‌గ తెలియుచున్నది. అందులోని అన్ని ధర్మములు ప్రక్కన గల దానిని (ఆత్మను) చక్కగ తెలుసుకొనుటకు వ్రాయబడినవే. కొన్ని ఉపనిషత్‌లలో భగవద్గీతకు వ్యతిరిక్తమైన విషయములు ఉండుట గమనించవచ్చును. అవి అన్నియు చివరకు అసత్యములైపోయి భగవద్గీతలోని ధర్మములే సత్యమగుట వలన అన్నిటిని మించిన ఉపనిషత్ **భగవద్గీతయేనని** చెప్పవచ్చును. పూర్తిగ ఉపనిషత్ అర్థము తెలిసి, ఏది ఉపనిషత్తో తెలుసుకోగలిగినవారు **'ఉపదేశము'** యొక్క అర్థము కూడ తెలియగలరు. సంసార సముద్రములో ఉపనిషత్ ఓడ అయితే, ఉపదేశము విదేశీ గట్టులాంటిది. ఉపనిషత్ ఆధారముతో ఉపదేశమను రెండవ దేశము యొక్క గట్టు చేరితే, తర్వాత ఆ దేశములోనికి ప్రవేశించవచ్చును. అసలు పడవ లేకనే, గట్టు చేరకనే, ఇతర దేశములో మనము సంచరించలేము కదా! అందుకని ఉపనిషత్‌ను తెలిసి, అలాగే ఉపదేశమును తెలిసి, చివరకు మోక్షమును పొందాలని కోరుచున్నాను.

# యుగాది

కంటికి కనిపించు ఈ జగత్తంతయు ఒక రోజు ప్రారంభమై ఆనాటినుండి కొనసాగుచూనే ఉన్నది. ప్రపంచమునకు కూడ చావు పుట్టుకలు గలవు. అందువలననే ఈ ప్రపంచమునంతటిని జగతి అంటున్నారు. **'జ'** అనగ పుట్టునదని **'గతి'** అనగా చావునదని అర్థము

గలదు. జగతి అను శాశ్వత నామమును గల్గిన ఈ ప్రపంచము ఏదో ఒక రోజు పుట్టి, ఏదో ఒక రోజు లేకుండ పోవునదని అందరు తెలుసుకోవలయును. ఒక మనిషి పుట్టి కొంతకాలముండి చనిపోవుట అందరికి తెలిసిన సత్యమే. అతను ఉండు కొంత కాలమును అతని ఆయుస్సు అంటున్నాము. మనిషి ఆయుస్సుకు కొలమానముగ నిమిషములు మొదలుకొని సంవత్సరముల వరకు గలవు. అట్లే పుట్టి కొంత కాలముండి పోవు ప్రపంచమునకు కూడ ఆయుస్సు కలదు. దాని కొలమానము యుగముల లెక్కలో ఉండును. మనిషి పుట్టిన దినమును జన్మదినమనియు, జాతకమనియు చెప్పుచుందురు. అట్లే ప్రపంచము పుట్టిన దినమును **'యుగ ఆది'** అనెడివారు. దానినే కొంతకాలమునకు **'యుగాది'** అనెడివారు. కాలము జరుగుకొద్ది యుగాది కూడ పోయి **'ఉగాది'** అయినది. రాబోవు కాలమునకు ఇంకా ఏ పేరుగా మారిపోతుందో తెలియదు.

నేటి కాలములో కొందరు తమ పుట్టినరోజును ప్రతి సంవత్సరములో పండుగ చేసుకొనుచుందురు. తీపి పదార్థములు పంచి తన పుట్టిన దినమని తెలియజేయుచుందురు. జన్మదిన వేడుకలు ప్రస్తుత కాలములో ప్రబలిపోయినవి. కాని పూర్వము ఎవరు తమ జన్మదిన వేడుకలు జరుపుకొన్నట్లు చరిత్రలో లేదు. శ్రీకృష్ణాష్టమి, శ్రీరామనవమి వారు బ్రతికి ఉన్నపుడు వారు చేసుకొన్నట్లు ఆధారములు లేవు. పూర్వకాలములో వ్యక్తిగత పుట్టిన దినములు ఎవరు జరుపుకోక, సమిష్ఠిగ ప్రపంచము యొక్క పుట్టిన దినమును చేసుకొనెడివారు. ఆ దినమునకే **'యుగ ఆది'** అనిపేరు పెట్టి అన్నిటికంటే మిన్నగా, దానికంటే మించిన పండుగలేనట్లు చేసుకొనెడివారు. కాలము జరుగుకొలది తర్వాత

చాలా పండుగలు తయారై అన్నిటిలాగే ఇది ఒక పండుగైనది. ఇంకనూ కొంతకాలము జరిగిపోతే ఈ పండుగ లేకుండ పోయే స్థితి ఏర్పడుతుందేమో! ఇప్పటికే కొంత పేరు మారింది, కొంత ఆచరణయు మారినది. విదేశీ సాంప్రదాయమైన జనవరి సంవత్సరాది అయినది. రాబోవు సమాజములో యుగాది ఉంటుందో లేదో చెప్పలేము.

ఇందువులు హిందువులుగ మారి వారి సంస్కృతినే మరచి పోయినా, ఆదిలో పుట్టిన ఇందువుల జాతి మరి ఏ ఇతర మతములుగ మారిపోయినా, ఇందూ సంస్కృతిని మానవులు వీడినా, ఆ సంస్కృతి మనుషులను వదలలేదని చెప్పుటకు కొన్ని తార్కాణములు మిగిలి ఉన్నవి. వాటిలో ముఖ్యమైన ఒకదానిని వివరించుకొందాము.

భూమండలములో ఎన్నో దేశములు గలవు. అట్లే ఎన్నో మతములూ, ఎన్నో సంస్కృతులూ, ఎన్నో భాషలూ, ఎన్నో సాంప్రదాయములు గలవు. భూమి మీద మానవులందరు ఎన్ని రకములుగ ఉన్ననూ, అందరికి పగలు రాత్రి ఒక్కటే. అంతే కాక వారమునకు ఏడు దినములు, నెలకు ముప్పైరోజులు, సంవత్సరమునకు పండ్రెండు నెలలు సర్వసాధారణముగ ఉన్నాయి. ఇంకనూ ముఖ్యముగ తెలుసు కోవలసినదేమనగా! ప్రపంచమునకంతటికి వారములోని పేర్లు ఒక్కటిగనే ఉన్నవి. ఏ దేశమువానికైన, ఏ మతమువానికైన వారములోని దినముల పేర్లు ఆది, సోమ, మంగళ, బుధ, గురు, శుక్ర, శనివారము కావడము విశేషము. ప్రపంచములో ఇందువులు మొట్టమొదట ఏర్పరచిన పేర్లే మొత్తము ప్రపంచమునకంతటికి వర్తించడము ఇందువులెవరైన గర్వింపదగ్గ విషయము.

పూర్వము సృష్ఠి మొదలైన దినము వారములో మొదటి దినమై ఉండుట వలన, ఆ దినమును ప్రతివారము చిన్న పండుగగ చేసుకొనెడివారు. ప్రపంచము ఆదిలో మొదలైన దినమునకు ఆదివారమనే పేరు పెట్టారు. అనగ మొదటి దినమని అర్థము. ఆదివారముతో మొదలగుట వలన ఆ దినము అందరికి చిన్న పండుగలాగ ఉండెడిది. ఆ దినము పనులు మాని సంతోషముగ కాలమును గడుపుచూ, పిండి వంటలను చేసుకొని, దేవునికి నైవేద్యము పెట్టి తాము తినెడివారు. వారములో ఆరు దినములు పనిచేస్తు ఒక మొదటి దినము పనిచేయక పండుగ చేసుకొనెడివారు. పూర్వము ప్రతి ఆదివారము పండుగ వాతావరణము కల్గియుండెడిది. ఇప్పటికి కొంతమార్పుతో ప్రతి ఆదివారము విశ్రాంతి దినమై మాంసాహారులకు పండుగవలెనే ఉన్నది. పూర్వము ఆదివారమంటే సృష్ఠి మొదటి దినమను పవిత్రభావము అందరికి ఉండి ఆ దినమును పవిత్రముగనే గడిపెడివారు. నేడు ఆదివారమంటే దురభ్యాసపరులకు ఇష్టారాజ్యముగ ఉండును. ఎలాగైతేనేమి మొత్తము మీద ఆదివారము యొక్క ప్రత్యేకత ఈ నాటికి మిగిలి ఉన్నది. ఇలా భూమి మీద అన్ని దేశముల ప్రజలకు వారములు ఏడై, అందులో ఆదివారము మొదటివలె ప్రత్యేకత కల్గియుండడము గమనిస్తే, కాల గమణములో ఎవరెలా మారినా ఇందువుల పవిత్రదినము నేటికినీ అందరికి కొంత పండుగవలెనుండడము చూస్తే, మనుషులు సాంప్రదాయమును వదలినప్పటికి, సాంప్రదాయము మనుషులను వదలలేదని తెలియుచున్నది. ప్రపంచము మొత్తము ఇందువుల సాంప్రదాయములు ఇలా అందరి వద్ద ఉండడమును బట్టి సృష్ట్యాలో ఇందువులే ఉండెడి వారని, తర్వాత అది మారుచు చివరకు అనేక మతములైనప్పటికి గుడ్డలోని ఇంగువ పోయిన

గుడ్డకు ఇంగువవాసన పోనట్లు, మనుషులలో ఇందుత్వము పోయిన ఇందుత్వ వాసన మనుషులలో పోకుండ కొంతైన మిగిలి ఉన్నది.

ఆదిలో దేవునివలన నెలకొల్పబడిన జ్ఞానము చేత తయారయినదే ఇందుత్వము. ఇంత భూమండలము మీద, ఇన్ని దేశముల మధ్య ప్రత్యేకించి మనము నివశించు ఈ దేశములోనే ఇందువులు ప్రకాశించారు. అందువలన ఈ దేశము ఇందూదేశమైనది. ఈ గడ్డమీద మనము నివాసముండి, మన పూర్వీకులకు వారసులుగ ఉంటూ, మన సాంప్రదాయమేమిటో మనకే తెలియకపోవడమూ, సృష్ట్యాదిలో ఏ దినము మొదలైనదో దాని ప్రత్యేకత ఏమిటో తెలియకపోవడమూ, చివరకు వారమునకొకమారువచ్చు ఆదివారము కూడ ఏమిటో మనకు తెలియ కుండ పోయి కేవలము సెలవు దినమనుకోవడమూ, ఆదివారమే సెలవు దినమెందుకైనదని యోచించక పోవడమూ, ఈ విషయమును స్వాములు, గురువులు, పీఠాధిపతులు చెప్పక పోవడమూ, అన్నిటిని పరికించి చూచితే మనలను చూచి మన పూర్వీకులు బాధపడవలసిందే. వారి వారసులమై నందుకు మనము సిగ్గుపడాల్సిందే.

ఇప్పటికైన మించిపోయినది లేదు. **'ఆది'**లో ప్రారంభమైనది కావున ఆదినమునకు **'ఆది'** వారమని పేరు గల్గినదని తెలిసినవారమై, సృష్ఠి ఆదిలో మొదలైన ఆదివారమే యుగాదిగ ఇప్పుడు తిరిగి వస్తున్నదనీ, మిగతా దినములలో వచ్చు యుగాదులకంటే ఆదివారము వచ్చు యుగాదే స్వచ్ఛమైన **'యుగాది'** అని నీవు తెలుసుకొని ఇతరులకు తెల్పుటకు ప్రయత్నించవలెను. నీవు నిజముగ ఇందువు యొక్క వారసునివైతే, ఆదిలో ఆదివారముతో మొదలైన యుగాది తిరిగి ఇపుడు వస్తుండడం వలన ఆ దినమును పవిత్రముగ గడుపవలెనని ప్రయత్నించుము. ఆదిలోని

రహస్యములను తెలుసుకొనుటకు ప్రయత్నించుము. ఆ దిన కాలమును కథలతో, కవిత్వములతో, పాటలతో, పద్యములతో, నాటకములతో వ్యర్థముగ గడపక అసలైన ఇందూ వారసుడవగుటకు, ఇందువుగ జీవించుటకు నీయందు ఇందుత్వము కొంచెమైన సజీవముగ ఉండాలి. యుగాది అను పేరు కూడ భ్రష్టు పట్టి ఉగాదిగ పిలువబడు నేటికాలములో తిరిగి **'యుగఆది'** యొక్క ప్రత్యేకతలను చాటి చెప్పెదరని ఆ దినము క్రొత్తగుడ్డలు ధరించడమే కాక, అది సృష్టి ఆదిలోనే క్రొత్తదినమనీ, మొదట మొదలైన దినమని వివరించి తెలియని వారికి తెలియజేయమని కోరుచున్నాము.



# ఆత్మ సర్వజీవుల ఎడల సమానమా?

ఒక జీవాత్మ తనలోని ఆత్మను చూచిన అది ఎట్లు తెలియునో, అదే విధముగ అన్ని జీవరాసుల శరీరములలోని ఆత్మలు తెలియగలవు. **జీవుల దృష్టిలో ఆత్మలు సర్వసమానము. ఆత్మల దృష్టిలో జీవరాసులు సమానము కాదు.** సర్వజీవరాసుల శరీరములలో ఉండు ఆత్మలకు కర్మలు లేవు. జీవాత్మలకు మాత్రమే కర్మలు గలవు. అందువలన జీవాత్మలతో పాటు శరీరములలో గల ఆత్మలన్నియు సమాన అంశగలవై ఉండీ, జీవాత్మల కర్మననుసరించి పని చేయించు ధర్మము గలవై ఉన్నవి. అందువలన జీవాత్మలకు ఆత్మలు సమానమైనప్పటికీ, ఆత్మలు జీవాత్మల ఎడల సమానముగ లేవు. ఆకారములో ఆత్మలు జీవరాసుల శరీర ఆకృతిననుసరించి అనేక ఆకారములతో ఉన్నప్పటికీ, వాటి అంశ ధర్మములన్నియూ ఒకటే విధముగ ఉండును. అందువలన ఒక

శరీరములోని జీవాత్మ తన శరీరములోని ఆత్మను తెలుసుకొనిన, సర్వజీవరాసుల శరీరములలోని ఆత్మలను తెలుసుకొనినట్లేయగును. సర్వ శరీరములలోని ఆత్మ ఒకే అంశ ధర్మముతో కూడినదైనందున ఆత్మంటే ఏమిటో, అది అన్ని శరీరములలో అన్ని ఆత్మలుగ ఎట్లున్నదో, తన శరీరములో ఆత్మను చూచినవానికి అర్థమైపోవును.

ప్రపంచములోని అన్ని జీవరాసులలోని ఆత్మలు ఒకే అంశ ఒకే ధర్మము కల్గియున్నవి. కావున వాటినన్నిటిని విడివిడిగ చెప్పు కోవచ్చును లేక అన్నిటిని కలిపి ఒక్కటిగ చెప్పుకోవచ్చును. అర్థమగుటకు విడివిడిగ చెప్పుకోవడమే మంచిదనుకొంటాము. సర్వుల యొక్క ఆత్మలు వారివారి శరీర ఆకారమును కల్గి రూపములో భేదములుగ ఉన్నవయినప్పటికీ, వాటిలోనున్న అంశ ధర్మములో తేడాలు లేవు. ఉదాహరణకు కొలిమిలో పెట్టిన ఇనుప వస్తువులోనికి అగ్ని ప్రవేశించినపుడు ఆ వస్తువు ఎర్రగ అగ్నివలె కనిపిస్తున్నది. ఆ వస్తువు యొక్క ఆకృతినే ఆ సమయములో అగ్ని చెంది ఉన్నది. ఆ సమయములో కూడ అగ్ని యొక్క ధర్మమైన వేడిమి సహజముగనే ఉన్నది. అగ్ని తాను ప్రవేశించిన వస్తువు యొక్క ఆకృతిని పొందినట్లు, ఆత్మ తాను ప్రవేశించిన శరీర ఆకృతిని పొందుచున్నది. అగ్ని ఏ వస్తువులో ప్రవేశించినా తన ధర్మము కోల్పోనట్లు, ఆత్మ ఏ శరీరములో ప్రవేశించినప్పటికీ తన ధర్మమును కోల్పోదు. వస్తువుల ఎడల అగ్ని ఒకే ధర్మముగలదై వేడిమినిచ్చునదై ఉన్నది. కాని అగ్నికే వస్తువులు ఒకే విధముగ లేవు. అగ్ని తగిలినపుడు ఒకటి పొంగును, ఒకటి కృంగును, ఒకటి పేలిపోవును, మరొకటి గట్టిగమారును, ఇంకొకటి పెలుచుగమారును, ఒకటేమో పైకెగురును, ఒకటేమో ప్రక్కకు దొర్లును. ఇలా అనేక వస్తువులు అనేక విధములుగ అగ్నిచే

మార్పుచెందును. అలాగే ఆత్మ సర్వజీవుల ఎడల తాను చైతన్యము నిచ్చు ధర్మము గలదై ఉన్నప్పటికి, సర్వ జీవుల కర్మలవలన వాటి శరీరముల జాతులననుసరించి, ఒక్కో జాతికి ఒక్కో విధముగ ఆత్మ తనశక్తి నిచ్చుట వలన జీవుల ఎడల ఆత్మ సమముగ లేదని చెప్పవచ్చును.

ఉదాహరణకు జంతు జాతిలోని జింకను తీసుకొందాము. జింక పుట్టగానే లేచి నిలబడగలదు. అలాగే పరుగెత్తనూ గలదు. కానీ మనిషి జాతిని చూచినట్లయితే పుడతానే లేచి నిలబడలేడు, పరుగెత్తనూ లేడు. జింక పుట్టిన కొన్ని దినములకే నీటిలో ఈదగలదు, మనిషి అలా ఈదలేడు. శరీరములలో ప్రతి కదలికకు ఆత్మ చైతన్యమే కారణమైనపుడు మనిషి శరీరములోని ఆత్మ మనిషి ఎడల ఒక విధముగ వర్తించగా, జింక శరీరములో గల ఆత్మ దాని ఎడల మరొక విధముగా వర్తించుచున్నది. మనిషి శరీరములోని ఆత్మ మనిషి పుట్టిన వెంటనే నడిపించదు. జింక శరీరములోని ఆత్మనడిపించ గలదు. ఇలా ఒక జాతికి ఒకే రకముగ తన శక్తినిచ్చు ఆత్మలు అన్ని జీవరాసుల ఎడల సమానముగ లేవని ప్రత్యక్షముగ తెలియుచున్నది. కొన్ని శరీరములలో ఆత్మ చేయుపనులను కొన్ని శరీరములలో నేర్వవలసి ఉండును. ఉదాహరణకు జంతువులు పక్షులు నీటిలోపడిన వెంటనే ఈదగలవు, ఆ పద్ధతి (ఈత) స్వయముగ ఆత్మయే చేయుచున్నది. జంతువులు ఈతను నేర్వకున్ననూ ఆత్మకు ఆవిద్య తెలుసు. మనుషులలోని ఆత్మకు అన్ని విద్యలు తెలిసినప్పటికీ, ఈత అను పద్ధతైన కదలికను మానవునకివ్వదు. నీటిలో పడిన జంతువు కాళ్లు, చేతులు పద్ధతి ప్రకారము కదిలి బయట పడగలుగుచున్నది. ఆ పద్ధతైన కదలిక జంతువులోని ఆత్మకు తెలుసు. ఈతరాని మనిషి నీటిలో పడినపుడు కాళ్లు చేతులు కొట్టుకొనుచున్నాడు. కాని ఆ

కదలిక పద్ధతి ప్రకారము ఉండదు, కావున మునిగి పోవుచున్నాడు. మనిషిలోని ఆత్మకు మనిషి బయటపడుటకు కావలసిన కదలిక తెలిసినప్పటికీ, ఆ పద్ధతిని అక్కడ ఉపయోగించలేదు. ఆ కదలికను మనిషి ఇష్టానికి వదలివేసినది. అందువలన ఈత నేర్చినవాడు మాత్రము ఈదగలడు. జంతు శరీరములోని ఆ పద్ధతిని ఆత్మ తన ఇచ్ఛలో పెట్టుకొన్నది. కావున జంతువు ఈతనేర్వకున్నను బయటపడగలదు.

ఈ విధముగ పరిశీలించి చూచిన ఆత్మలు తన యొక్క కదలికలను మానవుల ఎడల ఒక విధముగ, జంతువుల ఎడల ఒక విధముగ కలుగచేయుచున్నవని తెలియుచున్నది. దీనిని గురించి బాగా యోచించిన తెలియునదేమనగా! జీవాత్మ యొక్క ఇచ్ఛలో పనిచేయు కండరములనీ, ఇచ్ఛలో లేకుండ పనిచేయు కండరములని రెండు భాగములుగ సర్వజీవరాసుల శరీరములలో ఉన్నవి. జీవునికి తెలిసి బుద్ధి చిత్తము ద్వార జరుగు పనులను ఇచ్ఛాదీన కండరముల ద్వార జరుగు పనులని అంటాము. జీవునికి తెలియకనే బుద్ధి చిత్తములకు సంబంధములేకుండ స్వయముగ ఆత్మ చేతనే చేయబడు పనులను అనిచ్ఛాదీన కండరముల ద్వార జరుగు పనులని అంటాము. ఏ పని జరిగిన కర్మననుసరించియే అయినప్పటికీ, ఆ పనులు రెండు విధములుగ విభజింపబడి కొన్ని ఇచ్ఛాదీన కండరముల ద్వార, కొన్ని అనిచ్ఛాదీన కండరముల ద్వార జరుపబడునట్లు పరమాత్మ నిర్ణయించి పెట్టాడు. ఆయన నిర్ణయము ప్రకారమే జగతిలో తూచ తప్పక జరుగుచున్నది. వీటిని కొంత వివరించుకొని చూద్దాము.

కర్మ ప్రకారము ప్రతి కదలిక గలదనీ, చివరకు అడుగు తీసి అడుగు వేయుటకు, కనురెప్ప మూసి తెరచుటకు కూడ కర్మలో లెక్క

గలదనీ **భగవద్గీతలో** చెప్పబడి ఉన్నది. అలావున్న కర్మ కొంత మనస్సు, బుద్ధి, చిత్తము చేత ఆచరణకు వస్తున్నది. కొంత మనస్సు, బుద్ధి, చిత్తము యొక్క జోక్యము లేకుండానే ఆచరణ జరుగు చున్నది. ఇటువంటి వాటిలోనే జంతువులకు, మనుషులకు చాలా తేడా కల్పించబడి ఉన్నది. కర్మ రెండు రకములుగా జీవరాసుల శరీరములలో ఆచరణకువచ్చు పద్ధతిని విభజించి చూచినట్లయితే ఈ విధముగ ఉన్నది. ఒకటి ఇచ్ఛాధీన కండరముల చేత మనస్సు, బుద్ధి, చిత్తము యొక్క జోక్యము ద్వారా జరుపబడుపనులు గలవు. ఉదాహరణకు పరుగెత్తుట కర్మను బట్టి జరుగుచున్ననూ, చిత్తముచేత తల నుండి ఆజ్ఞ వచ్చినపుడే మనిషి పరుగిడుచున్నాడు. పైకి పరుగిడు కార్యము జరిగినపుడు శరీరములోపల మనస్సు ద్వార అందిన విషయమును బుద్ధి యోచించిన తర్వాత, ఇపుడు పరుగిడుటయే మంచిదని చిత్తము నిర్ణయించిన తర్వాత, ఆ విషయమును మనస్సు బాహ్య అవయవములకు చేర్చగ, లోపలి ఆజ్ఞప్రకారము కాళ్లు పరుగిడుచున్నవి. లోపలి చిత్తము ఆజ్ఞననుసరించి జరిగిన కార్యము కావున దీనిని ఇచ్ఛాధీన కార్యమంటున్నారు. ఇటువంటి పనులన్నియు చేయు కాళ్లు, చేతులు, నోరు, గుదము, లింగము అను ఐదు అవయవములను ఇచ్ఛాధీన కండరములంటున్నాము. చిత్తము యొక్క ఆధీనములో ఉండి దాని ఇష్టప్రకారము జరుగు కార్యములను ఇచ్ఛాధీన కార్యములంటున్నాము. ఇచ్ఛాధీనమైనా, అనిచ్ఛాధీనమైనా కర్మ ప్రకారమే జరుగుచుండునని ముందే అనుకున్నాము కదా! కర్మ ప్రకారము పరుగెత్తవలసినపుడు అది అంతరేంద్రియములైన మనో బుద్ధి చిత్తముల ద్వార, బయట కర్మేంద్రియముల ద్వార కార్యాచరణకొచ్చును. ఇందులో జీవుని ఇచ్ఛ ఏమి లేదు. ఈ కార్యములో జీవుని జోక్యము ఏమిలేదు. అయినప్పటికీ ఈ కార్యములు జరుగుచున్నపుడూ, జరిగిన తర్వాత కల్గు

సుఖమునుగానీ, శ్రమనుగానీ అనుభవించడమే జీవుని ముఖ్యకర్తవ్యము. ప్రతిపని జీవుని ఇచ్ఛకు ఏమాత్రము సంబంధము లేదు. అయినప్పటికీ ఈ కార్యములన్నియు నా ఇష్టానుసారమే జరుగుచున్నవనియు, నిర్ణయములను తీసుకొనునది తానేనని జీవుడు నిత్యము అనుకొనుచుండును. అలా అనుకొనునట్లు ప్రతి జీవున్ని చేయునది వాని శరీరములోని అహము అనుభాగమే. శరీరములోని ప్రతి భాగమునకు ఒక్కొక్క పని ఉన్నట్లు, ప్రతి పనిని జీవుడే చేయుచున్నాడనీ, ప్రతి పని జీవుని నిర్ణయము ప్రకారము జరుగుచున్నదనీ, జీవున్ని భ్రమింపజేయడమే అహమునకు ముఖ్యమైన పని. అహముచేత భ్రమించిన జీవుడు అన్నిటికి తన నిర్ణయమే కారణమనీ, అన్నిటిని తానే చేయుచున్నాననీ, పొరపడి తాను చేయని అన్ని కార్యములను తనమీద వేసుకొంటున్నాడు. అలా జీవుడనుకొనుటవలన జరిగిన పనిలో క్రొత్తగ పుట్టుకొచ్చు కర్మ జీవుని కర్మచక్రమును చేరి అది మరుజన్మకు కారణమగుచున్నది. ఇలా ఇచ్ఛాధీన కండరముల కార్యమున్న ప్రతి పనిలోనూ, ప్రతి జీవునకు అహము యొక్క బెడద తప్పదు. దానివలన కర్మ అంటక తప్పదు.

ఇక అనిచ్ఛాధీన కండరములంటే ఏమిటో వాటి కార్యములేమిటో చూద్దాము. మన శరీరములో గుండె కొట్టుకొనుచున్నది, ఊపిరాడుచున్నది, తిన్న అన్నము జీర్ణమగుచున్నది. ఇలా మనస్సు, బుద్ధి, చిత్తములకు సంబంధములేని కార్యములనేకము శరీరములో జరుగుచున్నవి. ఈ పనులు చేయు గుండె, ఊపిరితిత్తులు, జీర్ణాశయము మొదలగునవి అనిచ్ఛాధీన కండరములని అంటున్నాము. ఈ పనులన్నిటికి ఆత్మ స్వయముగ తన చైతన్యము చేత చేయిస్తున్నది. మనము మెలుకవలో ఉన్నపుడు గానీ, నిద్రలో ఉన్నపుడు గానీ, మన జోక్యము లేకుండానే

గుండె కొట్టుకొనుట అందరికి తెలిసిన విషయమే. అయినా ఇక్కడ అహము జీవున్ని భ్రమింపచేయలేదు. అందువలన ఆ పనులు జీవుడు తాను చేయుచున్నానని భ్రమించలేదు. కావున పుట్టింది మొదలు మరణించు వరకు శరీరములలో ఆత్మలు చేయు అనిచ్ఛాధీన పనుల ద్వార జీవునికి పాపపుణ్య కర్మలు రావడము లేదు. ఇచ్ఛాధీన కండరముల కార్యములలోనే అహము చేత కర్మ అంటుకొను అవకాశము గలదు. కాని అనిచ్ఛాధీన కండరముల కార్యములో అహము లేదు, కర్మ రాదు.

**అనిచ్ఛాధీన కండరములను ఎక్కువ ఇచ్ఛాధీన కండరములను తక్కువగ జంతువులకు, ఇచ్ఛాధీన కండరములను ఎక్కువ అనిచ్ఛాధీన కండరాలను తక్కువగ మనుషులకు దేవుడిచ్చాడు.** దీనివలన జంతువుల ఎడల ఆత్మ ఎక్కువ పనిచేయుచు, మనుషుల ఎడల తక్కువ పని చేయుచున్నది. మనుషులపట్ల మనో బుద్ధి చిత్తములు ఎక్కువ పనిచేయుచు, జంతువులపట్ల తక్కువ పనిచేయుచున్నవి. అందువలన మనుషులలోని బుద్ధి ఉన్నట్లు జంతువులలోని బుద్ధి లేదు. బుద్ధి కుశలత ఎక్కువగా ఉన్న మనుషజాతి, బుద్ధి పనితనము తక్కువగా ఉన్న ఇతర జాతులను తన వశము చేసుకొని వాటినాడించుచున్నాడు. బుద్ధి పనితనము ఎక్కువగల మానవజాతి తన తెలివితో సైకిల్ నుండి రాకెట్ల వరకు కనిపెట్టగలిగాడు, కంప్యూటర్లను కనిపెట్టగలిగాడు. కాని బుద్ధి కుశలత లేని పశుపక్షి మృగాదులు ఏమి కనిపెట్టలేకపోయాయి. మానవజాతి ఎన్ని కనిపెట్టినా తన అహము చేత కర్మలను ఎక్కువ సంపాదించుకొంటున్నది. ఆత్మశక్తి చేత ఎక్కువ పనులు చేయు జంతువులు పక్షులు తమ కర్మను ఎక్కువ ఖర్చు చేయుచున్నవి. కానీ తక్కువ కర్మను సంపాందించుకొనుచున్నవి.

మానవ జాతి అన్ని జన్మలకంటే ఉత్తమమైనదనుట ఒక విధముగ పొరపాటేననిపిస్తుంది. ఎందుకనగ బుద్ధిలో ఉత్తమమైనంత మాత్రమున ఒరిగిందేమి లేదు. ఒక విధముగ దేవున్ని తెలుసుకొనుటకు, దైవజ్ఞానము నార్జించుటకు అవకాశమున్న జన్మ అనుకొనుటకు కూడ వీలులేదు. జంతువులకు మానవులకు దైవమును తెలుసుకొను మార్గము సమానముగ ఉన్నది. జంతువులలోనూ ఇతర జాతులలోనూ మానవునికంటే దగ్గరగ దైవమును తెలుసుకొను విధానమున్నది. దానికి సంబంధించినంత బుద్ధి ఉన్నది. మానవుడే దైవమును తెలుసుకొను మార్గమునకు దూరముగ ఉన్నాడు. దేవుడొక్కడేనను భావము వదలి అనేక దేవతలనారాధిస్తు పరమాత్మకు దూరమగుచున్నాడు. జంతువుల భాషా విధానము మనకు తెలియదు, కావున అవి దైవమార్గములో మనకంటే తక్కువనుకోవడము పొరపాటు.

ఒక విధముగ ప్రత్యక్షముగ కనిపించు విధానమును పరిశీలించి చూచినప్పటికీ, మానవునికంటే మిగతా జాతులు దైవమునకు దగ్గరగ ఉన్నవని చెప్పవచ్చును. మానవుడు ప్రతి నిత్యము అహము చేత కర్మను సంపాదించుకొనుచు దైవమునకు దూరమగుచున్నాడు. మిగతా జాతులు ప్రతి నిత్యము కర్మను సంపాదించుకొనక, ఎక్కువ అనుభవించుచు కర్మను లేకుండ చేసుకొనుచున్నవి. మానవుడు మాత్రము అనుభ వించడము తక్కువ, సంపాదించుకోవడము ఎక్కువ. అందువలన దిన దినము దేవునికి దూరమవడమే జరుగుచున్నది.

మానవజాతికంటే పశు పక్షి మృగ జాతులే గొప్పవనుటకు నిదర్శనముగా ఆత్మ వాటి ఎడల స్వయముగ పనిచేయుచున్నది. పుట్టిన పిల్లకు సహితము పాల పొదుగును ఆత్మయే చూపుచున్నది. పాలు

త్రాగవలెనను పరిజ్ఞానమును ఏర్పరచుచున్నది. మానవుని పట్ల ఆత్మ పనిచేయక వాని బుద్ధికే వదలి వేయడము వలన, బుద్ధి పనిచేయని మానవ శిశువు తల్లిరొమ్మును కూడ గుర్తించలేదు. దీనిని బట్టి సకల జీవరాసుల ఎడల ఆత్మలున్నట్లు మానవజాతి పట్ల లేవనీ, ఆత్మలకు సర్వులు సమానము కాదని తెలియుచున్నది. అంతేకాక జంతువుల కంటే మరీ ఎక్కువగా వృక్షముల ఎడల ఆత్మ పనిచేయుచున్నదని తెలియుచున్నది. సర్వ జీవరాసులను తన చైతన్యము చేత ఆడించు ఆత్మ వృక్షములలో కదలికలు లేకున్ననూ వాటి జీవన విధానమును తన మీదే ఎక్కువగా పెట్టుకొనుచున్నది. జంతువులకంటే బుద్ధి తక్కువైన వృక్షములు జంతువులకంటే కర్మను సంపాదించడము, అనుభవించడము తక్కువే. ఒక దెబ్బ యొక్క అనుభూతి మానవులలో ఎక్కువ, జంతువులలో తక్కువ, వృక్షములలో మరీ తక్కువగ ఉండడము గమనార్హము. వీటిన్నిటిని పరిశీలించినట్లయితే జీవులకు ఆత్మలు సమానమైనప్పటికీ, ఆత్మలకు జీవులు సమానము కావని తెలియుచున్నది.

## ఇందువు

జ్యోతిష్యశాస్త్రము ప్రకారము జ్ఞానమునకు అధిపతి నవగ్రహములలో చంద్రుడు. భూమి మీద మానవునకు కర్మరీత్య సమస్తమును సమకూర్చి పెట్టునవి నవగ్రహములేనని తెలియాలి. మానవునకు క్రొత్త జ్ఞానమును సంపాదించి పెట్టడములో చంద్రునకు అధికారము లేకపోయినప్పటికీ, పోయిన జన్మలో ఎంత జ్ఞానము ఉన్నదో అంత మరుజన్మకు కూడ అందించు బాధ్యత చంద్రునకు ఉన్నది. మానవునకు

జ్ఞానము అందించు అధికారము చంద్రునికి మాత్రము కలదు. కావున జ్యోతిష్యశాస్త్రములో జ్ఞానమునకు అధిపతిగ చంద్రుడు నిలిచాడు. కంటి చూపుకూ, నీటికీ, ఆకాశమునకూ మొదలగు ఎన్నిటికో ఆదిపత్యము వహిస్తూ మానవునకు కర్మరీత్య వాటిని అందించుచున్నప్పటికీ చంద్రునికి ప్రత్యేకమైన పేరు రాలేదు. కాని ఒకే ఒక జ్ఞానమునకు అధిపతియైనందు వల్ల ఇందువు అను ప్రత్యేకమైన పేరు కలిగినది. దీనినిబట్టి ఆకాశములో ఇందువు చంద్రుడని అందరూ గ్రహించవలెను.

యోగశాస్త్రమైన గీతలో దైవము యొక్క విశ్వరూపమును గూర్చి తెలుపునపుడు సూర్య ప్రకాశమును పోల్చి చెప్పారు. అట్లే దైవము యొక్క జ్ఞానమును గూర్చి చెప్పునపుడు చంద్ర ప్రకాశమును గూర్చి చెప్పారు. అంటే దైవమును సూర్యునిగ, దైవజ్ఞానమును చంద్రునిగ పోల్చి చెప్పడమైనది. అలా పోల్చడమునకు కారణము కలదు. సూర్యుడు స్వయం ప్రకాశకుడు. సూర్యుడు స్వయంగా మండుచున్న అగ్ని గోళము. చంద్రుడు స్వయం ప్రకాశము లేనివాడు, సూర్యకిరణము చంద్రుని మీద పడినపుడు మాత్రమే ప్రకాశింపగలడు. సూర్య కిరణము ఎంత ప్రదేశముపడితే అంత ప్రదేశమే ప్రకాశవంతంగా చంద్రుడు కన్పించును. ఇటువంటి ఏర్పాట్లు నవ గ్రహములలో మరియే ఇతర గ్రహములకు లేదు. సూర్యునికి ఎంత ఎదురుగపోతే అన్ని కిరణములు చంద్రుని మీద పడి చంద్రుడు ప్రకాశింపగలడు. సూర్యునికీ చంద్రునికీ మధ్యలో భూమి కలదు. చంద్రుడు భూమి వెనుక వచ్చినపుడు సూర్యకిరణములు చంద్రుని మీద పడక చంద్రుడు ప్రకాశింపడు. చంద్రుడు భూమి నీడను వదలి ఎంత ప్రక్కకు వస్తే అంత ప్రకాశిస్తాడు. ఇది ప్రతి నెలలోను అమావాస్య పౌర్ణమి రూపములలో చూస్తూనే ఉన్నాము.

దైవసమానము సూర్యుడైతే, జ్ఞానము తెలుసుకొన్న మానవుడు చంద్రునితో సమానము. ఇక భూమి దైవమునకు మానవునకు మధ్యలో ఉన్న మాయతో సమానమని తెలియునట్లు ప్రత్యక్షముగ అమావాస్య పౌర్ణమి రూపములో ప్రపంచ నిర్మితము జరిగినది.

సూర్యుడు ఎల్లపుడు ప్రకాశిస్తూనే ఉన్నాడు. అట్లే దైవము ఎల్లపుడూ గలడు. చంద్రుడు మధ్యలో అడ్డుగ గల భూమి నీడను వదలి పోయే కొద్దీ ప్రక్కకు పోయిన ఆ కొద్ది భాగము సూర్యకాంతిచే ప్రకాశిస్తున్నాడు. అట్లే మానవుడు మాయను వదలి ఏ కొద్దిగ దైవము మీద శ్రద్ధ కలిగినా ఆ శ్రద్ధయంతయే జ్ఞానము కల్గును. భూమినీడను వదలి పూర్తి ప్రక్కకు వచ్చు చంద్రబింబము పూర్తి ప్రకాశిస్తూ పౌర్ణమి అవుచున్నది. అట్లే ఎవడైతే పూర్తి మాయ ప్రభావమును వదలి, దైవము మీద శ్రద్ధ కలిగి ఉన్నాడో వాడు సంపూర్ణ జ్ఞానిగ లెక్కింపబడుచున్నాడు. చంద్రబింబము ఎంత భూమి నీడకు పోవుచున్నదో, అంత చీకటి దానియందు ఏర్పడుచున్నది. పూర్తి భూమి చాటుకు పోతే చంద్రుడు పూర్తి చీకటైపోయి అమావాస్యగా మారి ఉన్నా లేనట్లే అగును. అట్లే మానవుడు మాయ ప్రభావమయిన గుణములవైపు పోవుకొలది వానియందు అజ్ఞానము చోటు చేసుకొనును. పూర్తి మాయ వైపు పోవువాడు పూర్తి అజ్ఞానిగ మారిపోయి ఉన్నా లేనట్లే అగును. ప్రత్యక్షగ విషయము అర్థమగునట్లు మొదట దైవము, తర్వాత అజ్ఞానము, ఆ తర్వాత జ్ఞానముగ, మొదట సూర్యున్ని, మధ్యలో భూమిని తర్వాత చంద్రున్ని ఉంచడము జరిగినది.

ఇట్లుండగ కొందరు బాహ్య సూర్యున్ని మ్రొక్కుచున్నారు. బాహ్య చంద్రున్ని పొగడుచున్నారు, గానీ జ్ఞానము తెలుసుకోలేక పోవుచున్నారు.

దైవమును అనుసరించలేక పోవుచున్నారు. కొందరు దైవము యొక్క విలువ తెలిసినవారై, అట్లే మాయ యొక్క బంధనాన్ని కూడ గుర్తించిన వారై, దైవము మీద శ్రద్ధ పెంచుకొని దైవజ్ఞానమును పొందుచున్నారు. ప్రపంచములో అట్టివారు ఎచట ఉన్నా వారిని జ్ఞానులు అంటాము. దైవత్వమును గూర్చి తెలిసినవాడు ఎవడైన జ్ఞానియే. దైవత్వమనునది ఒకటున్నదనీ దాని మీద భక్తి కలిగి, దాని మీద శ్రద్ధ కలిగి జ్ఞానము పొందినవాడు అమెరికా క్రైస్తవుడు గానీ, గల్ఫ్ ముస్లీమ్ గానీ, చైనా భౌద్దుడు గానీ మరియే ఇతర దేశస్థుడుగానీ జ్ఞానియే అనబడును.

దైవజ్ఞానము పొందిన వానిని జ్ఞాని అంటున్నాము కదా! అట్టి వానిని బ్రహ్మ విద్యా విధానమున "ఇందువు" అని కూడ అనుచున్నాము. దైవజ్ఞానము పొందిన ఎవడైన ఆకాశములో సూర్యకిరణములు పొందిన చంద్రునితో సమానము. కనుక చంద్రుని పేరైన ఇందువు అను పదమును జ్ఞానికి ఉపయోగించుచున్నాము. చంద్రుని పేరును జ్ఞాని ఎడల గీతయందు కూడ ఉపయోగించుచు *'తత్ర చాంద్ర మసం జ్యోతిర్యోగీ ప్రాప్యని వర్తతే'* అని అక్షర పరబ్రహ్మ యోగమున 25వ శ్లోకములో కూడ అనడము జరిగినది. పూర్వ జన్మమున యోగియైనవాడు మోక్షము పొందనపుడు తిరిగి చంద్ర తేజమును పొంది పునర్జన్మ (పునరుద్భవము) పొందునని భగవంతుడు చెప్పిన మాట గీతయందు గలదు. చంద్ర తేజము ఆకాశములో వెన్నెల రూపమున, మానవునిలో జ్ఞానరూపమున ఉండునని తెలియుచున్నది. అందువలననే దైవజ్ఞానము పొందిన వానిని ఇందువు అంటున్నాము.

సూర్యుడు, చంద్రుడు, భూమి వరుసగ దైవము, జ్ఞానము, మాయలుగ అర్థమగునట్లు సృష్టించిన దేవుడు మానవున్ని జ్ఞానిగా

మారుటకు తగునన్ని సూచనలిచ్చాడు. అయినప్పటికీ మానవులందరు ఆ విధానమును తెలుసుకోలేక పోయినప్పటికీ, భూమి మీద కొందరు దైవ సూత్రమును గ్రహించగల్గినారు. ఎన్నో దేశములుగ విభజింపబడి ఉన్న ఈ భూగోళములో భారత దేశములో మాత్రమే దైవసూత్రములు తెలిసి జ్ఞానమును పొందినవారు ఎక్కువగ పూర్వముండెడివారు. పూర్వ కాలమున ఒకే ఒక భారతదేశమున జ్ఞానము పొందినవారున్నారనీ, దైవమునకు భారత దేశము కేంద్రములాంటిదనీ, ప్రపంచ దేశములన్నిటికి కూడ తెలుసును. భారతదేశము జ్ఞానులకు నిలయమైన దేశము కావున, జ్ఞానకేంద్రమైన దేశము కావున, భారతదేశమును పూర్వము ఇతర దేశముల వారందరు "ఇందూదేశము" అనెడివారు.

జ్ఞానము పొందిన వానిని చంద్రునితో సమానముగ ఇందువు అనుట బ్రహ్మవిద్యయందు గలదు. కావున జ్ఞానుల దేశమైన భారత దేశము ఇందువుల దేశముగ పిలువబడెడిది. భారత దేశమునకు ఈ విధముగ పూర్వకాలమేనాడో జ్ఞాన సంబంధమున ఏర్పడిన పేరుయే ఇందూదేశము.

అచ్చు **'ఇ'** తో మొదలైన ఇందూదేశము ఈనాడు హల్లు **'హి'** తో ప్రారంభమై హిందూదేశముగ పిలువబడుచున్నది. ఆనాడు జ్ఞాన సంబంధమైన ఆకాశ చంద్రునికి మారుపేరైన ఇందూదేశము నేడు భూమిమీద నదికి మారుపేరైన సింధూదేశముగా అదియే హిందూ దేశముగా చెప్పుకొనుచున్నాము. హిందూదేశమను పేరు ఎట్లు వచ్చినదీ కొంతమంది పరిశీలకులకు అర్థముకాక, భూమి మీద ప్రవహించు సింధూనది పేరు ఉంటుందనీ, సింధూనది ప్రవహించుట వలన సింధూ దేశమనీ, అదియే హిందూ దేశముగ మారి ఉంటుందని సరిపుచ్చు

కొన్నారు. ఎంతో జ్ఞానచరిత్ర కల్గి, ఎందరో బ్రహ్మర్షులు ఉద్భవించిన జ్ఞాన నిలయదేశమైన దానివలన ఇది ఇందూ దేశముగ పూర్వముండెడిదని తెలియలేక పోయారు. కాలగర్భమున హిందువుగ మారినవాడు జ్ఞానముకల్గి తిరిగి ఇందువుగ మారవలెనని, ఇది హిందూదేశము కాదు, నిజానికి ఇందూదేశమని నిరూపించాలని అందరిని కోరుకుంటున్నాము. సింధూనది పాకిస్థాన్‌లో గలదు. పాకిస్థాన్‌లోనే సింధూరాష్ట్రమని సింధూనది పేరుతో ఒక రాష్ట్రము కూడా గలదు. పాకిస్థాన్‌లో గల సింధూ పేరును మన దేశమునకు పెట్టుకోవడమేమిటని యోచించాలి. ఆంగ్లేయులే ఇండియా అని మన దేశమునన్నారు, హిండియా అని అనలేదు. అందువలన మనము ఇందువులమేనని తెలియాలి.

# మత సామరస్యము

సర్వ సృష్టికి ఆదికర్త ఒకడున్నాడు, అతడే అన్ని మతాలలోను చెప్పబడే దేవుడు. దేవుడు సర్వ ప్రపంచమునకు అధిపతే కాక ప్రపంచములోని అన్ని జీవరాసులను శాశించి నడిపించువాడు, రాత్రి పగలు మారునట్లు చేసి, పగలు పనిని, రాత్రి నిద్రను కల్పించిన వాడు దేవుడే. ఆయన గొప్పతనమును మానవుడు కొనియాడాలంటే బుద్ధి చాలదు. మానవుని బుద్ధికంటే అతీతమైనవాడు గనుక దేవున్ని పొగడుటకు మనచేతకాదు. ఆయన మహత్తులు మనకు చాలా తెలియవు. ఆయనకున్న అనేక మహత్తులలో "ఏకాంశేన స్థితో జగత్ " అను గీతా వాక్యము ప్రకారము దేవుని ఒక్క అంశచేతనే మొత్తము సృష్టియంతయు కల్పించబడి ఉన్నది. అంతులేని దేవుని యొక్క అంశములలో ఒకే ఒక్క అంశచేత మొత్తము ప్రపంచమే నిర్మింపబడి ఉన్నదంటే దేవుడు ఎంత

గొప్పవాడో తెలియదనే చెప్పవచ్చును. ఆయన యొక్క పూర్తి వివరములు తెలుసుకొనుటకు మానవుని బుద్ధి చాలదనియే చెప్పవచ్చును. మానవుడు తన బుద్ధితో స్థూలపదార్థమును గురించి ఎన్ని పరిశోధనలైన చేసి ఏమైన కనుగొనవచ్చును, ఎన్నో రంగములలో ప్రాధాన్యత గడించవచ్చును, కాని సూక్ష్మమైన ఏ పదార్థము కాని, ఏ పేరులేని, ఏ రూపములేని దేవున్ని మానవుడు ఏ విధముగాను కనుగొనలేడు. దేవుడు ఉన్నాడని నమ్మవలసిందే కాని పలానా అని నిర్ధేశించి చెప్పుటకు వీలులేదు. ఒక్క మాటలో చెప్పాలంటే బ్రతికివున్న ఏ జీవరాశి దేవున్ని తెలియుటకు అవకాశమే లేదు. ఏదికాని దేవున్ని, ఏమికాని దేవున్ని మానవుడు ప్రత్యక్షముగ కాని, పరోక్షముగ కాని తెలియలేడు, ఇది శాసనము. పూర్తి స్థాయి దేవుడెవడో తెలియనపుడు ఈయన మా దేవుడనీ, ఇది మా మతమనీ మనుషులు ఒకరిమీద ఒకరు ద్వేషములు పెంచుకోవడము, మత ఘర్షణలకు దిగడము బుద్ధి తక్కువ పని కాదా?

దేవుని మహత్తులలో కొద్ది మాత్రము మనము తెలుసుకోవాలన్నా దేవుడే దేవున్ని గురించి చెప్పవలసి ఉన్నది. కావున దేవుడే తన విషయములను (తన జ్ఞానమును) ప్రత్యేక కాలములో, ప్రత్యేక దేశములో, ప్రత్యేక వ్యక్తులకు చెప్పాడు. అలా ఏ ఏ దేశములలో, ఏ ఏ కాలములలో, ఏ ఏ వ్యక్తులకు చెప్పాడో సమగ్రముగ మనకు తెలియదు. లక్షలు, కోట్ల సంవత్సరముల పూర్వము ఎలా గడిచిందో తెలియదు కాని, కొన్ని వేల సంవత్సరముల నుండి దేవుని పరమ, పవిత్ర, పరిశుద్ధ వాక్కులు ఎక్కడ, ఎప్పుడు, ఎవరికి చెప్పబడ్డాయో కొంతవరకైన అర్థమవుచున్నది. అటువంటివి ముఖ్యముగ కొన్ని సందర్భములు మాత్రము తెలియుచున్నవి. ఒకటి ఐదు వేల నూటయాభై సం॥ల పూర్వము భారతదేశములో పంజాబ్

రాష్ట్రములోని కురుక్షేత్రము వద్ద శ్రీకృష్ణుని ద్వార దేవుని జ్ఞానము చెప్పబడి ఉన్నట్లు తెలియుచున్నది. రెండవది రెండువేల సం॥ల పూర్వము ఇజ్రాయిల్ దేశములో ఏసుప్రభువు ద్వార దేవుని జ్ఞానము చెప్పబడి ఉన్నది. మూడవది పదునాల్గు వందల సంవత్సరముల పూర్వము అరబ్ దేశములోని మక్కాలో పదమూడు సంవత్సరములు, మధీనాలో పది సంవత్సరములు హజ్రత్ మహమ్మద్ ద్వారా దేవుని జ్ఞానము బయటకి వచ్చినది. మూడు కాలములలో, మూడు దేశములలో, ముగ్గురు వ్యక్తుల ద్వారా చెప్పబడిన జ్ఞానము ఒకే దేవుని గురించినది. చెప్పిన వాడు ఒకే దేవుడే కావున చెప్పబడిన విషయము కూడ ఒకే సారాంశము గలదై ఉన్నది. దేవుని ప్రవచనములు అన్నిటికి కర్త అయిన, అంతటా వ్యాపించిన, సర్వేశ్వరుడైన, ఆది మధ్య అంత్యరహితుడైన దేవున్ని గురించే చెప్పబడినవి కాని దేవుడుకాని దానిని గురించి ఎక్కడ చెప్పలేదు. కొందరు మనుషులు దేవుని జ్ఞానము తెలియక దేవుడుకాని దానిని దేవుడని నమ్మియుండ వచ్చును. అజ్ఞాన చీకటిలో గ్రుడ్డివారైన ప్రజలు దేవుని మార్గము తెలియక వక్రమార్గములో నడుస్తుండవచ్చును. అటువంటి వారు అన్ని మతములలోను గలరు. అటువంటి వారిని ఇందూమతములో అజ్ఞానులని, క్రైస్తవమతములో అవిశ్వాసులని, ఇస్లామ్ మతములో కుఫ్ర్ లేక కాఫిర్‌లని అంటాము. విభిన్నమైన ప్రదేశములలో, విభిన్నమైన భాషలలో, విభిన్నమైన కాలములలో, విభిన్నమైన వ్యక్తుల ద్వారా దేవుని విషయము చెప్పబడుట చేత చెప్పబడినది కూడ విభిన్నమైన దేవుల్లదని మాయ (సాతాన్) లేక సైతాన్ అనబడునది మనిషి మెదడులో అనుమానాన్ని రేకెత్తించినది. మాయ ప్రభావము చేత మనిషి దేవుని విషయములో తారతమ్యములు పెంచుకొని, అవగాహన లోపము వలన ప్రత్యేకమైన మతములను సృష్ఠించుకొన్నాడు. సాతాన్ ప్రభావము చేతనే

దేవున్ని కూడ ఏకత్వమునుండి భిన్నత్వములోనికి మార్చుకొని మా దేవుడు వేరు, మీ దేవుడు వేరు, అనుస్థితికి చేరుకొన్నాడు. సర్వసృష్ఠికి కారకుడైన దేవున్ని వదలి, అజ్ఞాన అంధకారముతో వారి ఊహలలోనే దేవుల్లను సృష్ఠించుకొన్నారు.

ప్రస్తుత కాలములో ఎవరి మతము వారికి గొప్పగ కనిపిస్తున్నది. ఎవరి దేవుడు వారికి గొప్పగ కనిపిస్తున్నాడు. హిందువులు, క్రైస్తవులు, మహమ్మదీయులు ఒకరినొకరు నీచముగ చూచుకొనుచూ, ఇతర మతముల వారికంటే మేమే గొప్ప అనుకుంటున్నారు. సర్వ మానవులు నాచేత సృష్ఠింపబడినవారేనని చెప్పిన దేవుని మాటను మరచి పోయారు. అందరము దేవుని బిడ్డలమనీ, అందరికి తండ్రి దేవుడనీ ఏమాత్రము అనుకోవడము లేదు. దేవుడు చెప్పిన దానికి వ్యతిరిక్త భావము మనలోని మాయ కల్గించినదని ఎవరు అనుకోవడము లేదు. అలా ఉండడము వలన చివరికి మతముల మధ్య సామరస్యము, దేవుని మాటల పట్ల అవగాహన లేకుండాపోయినది. చివరికి ఎవరి మతము పట్ల వారికి అవగాహన తగ్గిపోయినది. ప్రస్తుత కాలములో ముఖ్యమైన మూడు మతములు ఏ విధముగనున్నాయో వివరించుకొని చూచెదము.

**<u>హిందూ మతము</u> :-** వాస్తవముగ ఈ మతము పేరు పూర్వము ఇందూమతమని ఉండెడిది. కాలగమణములో ఏనాడో ఇందూమతము హిందూమతముగ మారిపోయినది. దేవుని జ్ఞానమును ఇందువు అని చెప్పెడివారు. ఇందువు అనగా చంద్రుడనీ, చంద్రుడు జ్ఞాన చిహ్నమనీ, జ్ఞానమున్నవాడెవడైనా ఇందువని పూర్వపు భావము. అందువలన కుల మత తారతమ్యము లేకుండ దేవుని జ్ఞానము కల్గిన ప్రతివాడు ఇందువనే అర్థముండెడిది. వేల సంవత్సరముల క్రితం భారతదేశములో నూటికి

తొంభైమంది దైవజ్ఞానము కలవారుండే వారు. అందువలన జ్ఞానుల దేశమని ఇతర దేశముల చేత పిలువబడెడిది. జ్ఞానుల దేశమను అర్థముతోనే ఇందూదేశమనెడి వారు. నేటి కాలమునకు ఇందూదేశము హిందూదేశమై పోయినది. పేరులోనే కాక జ్ఞానములోను పూర్తి దిగజారి పోయి, వేయికి ఒకడైన జ్ఞాని ఉన్నాడో లేదో తెలియని స్థితి ఏర్పడినది. ఇందువులకు ముఖ్యగ్రంథమైన భగవద్గీతను గురించి తెలియనివారు నూటికి తొంభై తొమ్మిది మంది ఉన్నారని చెప్పడము అతిశయోక్తి కాదు. యువకులకు ప్రపంచ చదువు తప్ప దేవుని జ్ఞానముతో పనేలేదు. వయో వృద్ధులను పరికిస్తే ఇప్పుడే నాకెందుకు అన్ని అయిపోయిన తర్వాత చూస్తాములే అని నూరేళ్లు బ్రతికే గ్యారెంటి ఉన్నవానిలాగ అంటున్నారు. కొందరు స్వాములు గురువులను వారుండినప్పటికీ, వారి బ్రతుకు తెరువు నిమిత్తము హరికథలలాగ జ్ఞానము చెప్పుచున్నారు. ఒక్కొక్క స్వామి ఒక్కొక్క విధముగ బోధిస్తూ ఏ దారి పట్టాలో, నిజముగ దేవుని దారి ఏదో అర్థము కాకుండ చేయుచున్నారు. కొందరు భాగవత రామాయణములు చదువుచూ ఇంతకంటే జ్ఞానము అవసరమే లేదంటున్నారు. దేవుడు చెప్పిన జ్ఞానము మరచి రామాయణము ముందర భగవద్గీత పనికే రాదను వారు కూడ కలరు.

ప్రపంచమంతా వ్యాపించి అందరికీ ప్రభువైన దేవున్ని మరచి ఇతరత్ర దేవతలను ఆరాధించను మొదలు పెట్టారు. భగవద్గీతలో చెప్పిన ఏకేశ్వరోపాసన పూర్తిగా మరచినవారై పోయారు. భగవద్గీతలో "**భక్తిర వ్యభిచారిణీ** " అన్నట్లు భక్తిలో వ్యభిచారము మొదలు పెట్టి ఒక స్త్రీ తన భర్తను వదలి ఇతరులతో అక్రమసంబంధమేర్పరుచుకున్నట్లు, జగద్భర్త అయిన పరమాత్మను మరచి అన్యదేవతారాధన చేయుచున్నారు. విశ్వ

ప్రభువైన పరమాత్మను వదలి, భగవద్గీతలో చెప్పిన మాటలు తెలియక కోర్కెల నిమిత్తము కోట్ల దేవతలను సృష్టించుకొనుచున్నారు. ఈ విధముగా ఇందూమతములో చెప్పిన సారాంశము ఇందువులకే అర్థము కాకుండ పోయినపుడు పరమతములలో దేవుడు చెప్పినదెలా అర్థమగును. అందువలన పరమతముల మీద ద్వేషమూ, హింసించు స్వభావమూ, ఇందూమతములో కూడ కలదని చెప్పవచ్చును. ఇందూ గురుగానున్న మేము చెప్పిన జ్ఞానమును అర్థము చేసుకోలేక పరమతమని, పరమతమును బోధిస్తున్నారని మామీదనే దాడికి ప్రయత్నించారంటే హిందువులు ఏ స్థితిలో ఉన్నారో అర్థము చేసుకొండి.

**క్రైస్తవ మతము :-** భారత దేశములో భగవద్గీత ద్వార దేవుని జ్ఞానము చెప్పబడినట్లే, ఇశ్రాయిల్ దేశములో బైబిల్ ద్వార జ్ఞానము చెప్పబడినది. ఇక్కడ ఒక ముఖ్యమైన విషయము గమనించవలసి ఉన్నది. భగవద్గీత శ్రీకృష్ణుని ద్వార చెప్పబడగ, బైబిల్ ఏసుప్రభువు ద్వార చెప్పబడినది. ఈ ఇద్దరు ప్రవక్తలు ఒక కోవకు చెందగ, ఇస్లామ్ మత ప్రవక్త మరొక కోవకు చెందినవారు. ఎందుకనగా హజరత్ ప్రవక్తకు పవిత్ర ఖురాన్ జిబ్రీల్ అను దైవదూత ద్వార చెప్పబడినది. గీతకాని, బైబిల్ కాని అలా దైవదూతల చేత చెప్పబడలేదు. గీతను శ్రీకృష్ణుని నుండే దేవుడు పలికించగ, బైబిల్‌ను ఏసుప్రభువు శరీరమునుండి పలికించబడినది. అంతమాత్రమున శ్రీకృష్ణుడుగాని, ఏసుప్రభువు గాని నేనే దేవుడని చెప్పుకోలేదు. శ్రీకృష్ణుడు పరమాత్మను గురించి, ప్రభువు ఎహోవాను గురించి దేవుడని చెప్పారు. పరమాత్మ అనినా, ఎహోవా అనినా ఒకే అర్థమని తెలియని ప్రజలకు దేవుడు అందరికి తండ్రి అని ఏసుప్రభువు బైబిలులో చెప్పగా, గీతలో పరమాత్మ సర్వజీవులకు తండ్రి అని శ్రీకృష్ణుడు

తెలియజేశాడు. శ్రీకృష్ణుడూ ప్రభువూ వేరువేరు ప్రవక్తలైనప్పటికీ ఇద్దరు ఒకే దేవున్ని గురించే చెప్పారు. ప్రభువు చెప్పినదే ముందు శ్రీకృష్ణుడు చెప్పాడని క్రైస్తవులకు తెలియక పోవడము వలన, సాతానుకు మంచి అవకాశము దొరికి క్రైస్తవుల చేతనే పరలోక తండ్రియైన పరమాత్మను పరోక్షముగ నిందించునట్లుచేసినది. సాతాన్ ప్రభావం వలన మా దేవుడు వేరు, మీ దేవుడు వేరు అనునట్లు చేసినది. సర్వులను సృష్ఠించిన సృష్ఠికర్తను వేరువేరనుకొన్నపుడు దేవున్ని భేదభావముతో చూచినట్లగు చున్నది. క్రైస్తవులు విశ్వాసముతో ఎహోవాను ఒక ప్రక్కనస్థుతిస్తూ, మరొక ప్రక్క నిందించునట్లగుచున్నది. జ్ఞానము కలిగి చూచినట్లయితే శ్రీకృష్ణునిలోను, ప్రభువులోను పల్కినవాడొకడేనని తెలియును. క్రైస్తవులు శ్రీకృష్ణున్ని అర్థము చేసుకోలేక పోతే, ఒకే ప్రభువును ముందర మ్రొక్కి, వెనుకల తిట్టినట్లగుచున్నది. వాస్తవముగ మాకు మాత్రము ప్రభువులోను, శ్రీకృష్ణునిలోను ఏ భేదము కనిపించలేదు. మాకు శ్రీకృష్ణుని వాక్యము వచ్చినపుడు ఎంత సంతోషమగుచున్నదో, ప్రభువు వాక్యమొచ్చినపుడు కూడ అంతే సంతోషమగుచున్నది. క్రైస్తవులలో ఎక్కువ మంది వీరిద్దరు ఒకటేనను భావములో లేకుండడమే కాక, ప్రభువు చెప్పిన ముఖ్యమైన బోధనలను కూడ సరిగ అర్థము చేసుకోలేదనిపిస్తున్నది. ప్రభువు చెప్పిన సందేశమును పాటించక, మతవ్యాప్తి కొరకు ఎక్కువ శ్రద్ధ చూపడము, ఇహలోక సుఖములకై ప్రభువును ప్రార్థించడము జరుగుచున్నది. ఆ పంథాలో నిజముగ ఏసుప్రభువే వచ్చివారి ముందు తిరిగి దేవుని జ్ఞానము చెప్పినా ఆయనను తెలుసుకోలేక, నీకు కూడ బాప్తిస్మమిస్తామను రీతిలో క్రైస్తవులు ఉన్నారు. ఒక విధముగా చూస్తే ఇందువులకంటే దేవుని మీద విశ్వాసము గలవారు క్రైస్తవులలో చాలా ఎక్కువ. ఇతర మతస్థులను హింసించు స్వభావము క్రైస్తవులలో లేదని చెప్పవచ్చును.

**ఇస్లామ్ మతము :-** ఇస్లామ్ మతము మహమ్మద్ ప్రవక్త చేత పదమూడు సంవత్సరములు మక్కాలోను, పది సంవత్సరములు మధీనాలోను చెప్పబడినది. సృష్ఠికర్త అయిన పరమాత్మ ఇక్కడొక అద్భుతము చేశాడని చెప్పవచ్చును. ఇందూ క్రైస్తవ ప్రవక్తల శరీరములో నుండి అప్పుడప్పుడు స్వయముగ పల్కిన పరమాత్మ ఇస్లామ్‌లో అలా చేయలేదు. ప్రత్యేకమైన తన దూత ద్వార హజరత్ మహమ్మద్ గారికి తన సందేశములన్నిటిని అందజేశాడు. సత్‌పురుషుడైన చదువురాని మహమ్మద్ మహాశయున్ని తన సందేశమును తెలుపు సందేశపరునిగ కావించుకొన్నాడు. మిగతా మతములలో దేవునికి ప్రవక్తకు మధ్యలో దేవదూత లేదు. ఒక్క ఇస్లాం మతములో దేవుడు ప్రత్యేకించి తన దూతను ప్రవక్త మధ్యలోనికి తెచ్చుకొన్నాడు. ఈ విషయము తెలియని దానివలన ముస్లీమ్‌లు ఇతర మతములను, అందులో బోధించిన దేవున్ని గుర్తించలేక పోయారు. ఒక్క విషయము చెప్పాలంటే ప్రస్తుతము ఇందువులలో నిజదేవుని జ్ఞానము కల్గినవారు వేయిమందికొకడుండడము కూడ అరుదైతే, క్రైస్తవులలో నూటికి అరవైమంది దేవుని మీద విశ్వాసము కలవారున్నారు. ఇస్లాం మతములో నూటికి తొంభై మంది పూర్తి విశ్వాసులై ఉన్నారు. ఇస్లామ్ మతములో దేవుని జ్ఞానము తక్కువ ఉన్నప్పటికీ, దేవుడు విధించిన సంఘ నియమములు ఎక్కువగా ఉండుట వలన ఆ మతము ఎంతో క్రమశిక్షణ కలదై ఏకేశ్వరోపాసన (**తౌహీద్** ) కల్గి ఉన్నది.

ఆ మతములో విధించిన నియమావళి మిగత మతములలో కనిపించదు. ***"లా ఇలాహ ఇల్లల్లాహ"*** (దేవుడొక్కడే) అను ముఖ్య సూత్రముండుట వలన ముస్లీమ్‌లంతా ఒకే తాటి మీద నిలవగలిగారు. జ్ఞాని అయిన వానిని ఇందువు అన్నట్లు దేవుని ఆజ్ఞను శిరసా

ఆచరించువాడు ముస్లీమ్ అని అర్థము. దైవవిశ్వాసి కానివాడు ఇస్లామ్ మతములో ఉన్నప్పటికి ముస్లీమ్ కాదు. దైవము ఒక్కడే **(లా ఇలాహ ఇల్లల్లాహ్)** అను నమ్మకమున్నవాడు ఏ మతములో ఉండిన ముస్లీమ్ అని చెప్పవచ్చును. అలాగే దైవజ్ఞానియై దేవుని మీద విశ్వాసము కలవాడు నిజముగ ఇందువే. అటువంటివాడు ఏ మతములో ఉండిన ఇందువనియే చెప్పవచ్చును. ఇందువు ముస్లీమ్ అను మాటలు దేవుని విశ్వాసమును బట్టి వచ్చినవి గాని, మతపరముగ వచ్చినవి కావు. ఇస్లామ్ ప్రకారము నిజమైన తౌహీద్‌ను తెలిసినవారు నిజమైన ముస్లీమ్‌లని చెప్పవచ్చును. అలాగే ఇస్లామ్ మతములో దేవుని జ్ఞానము తెలిసిన పూర్తి విశ్వాసిని ఇందువనియే చెప్పవచ్చును. అదే విధముగ కొందరు క్రైస్తవులు నేను నిజమైన క్రైస్తవుడననీ, దేవునీ వాక్యమునకు నిజభావము తెలిసినవాడననీ గర్వముగ చెప్పుకొన్న సందర్భములు కూడ కలవు. విశ్వాసమే ప్రధానము కావున ఇందువులను ముస్లీమ్‌లు, క్రైస్తవులు అని చెప్పుకోవడములో తప్పులేదు. అలాగే వారిని ఇందువులనడములో తప్పులేదు. దేవుని మీద విశ్వాసమును జ్ఞానమును బట్టి పిలువడమే ముఖ్యము, వేరుకాదని తెలియాలి.

మా అనుభవములో అన్ని మతములు ఒకే సారాంశము కలవని తెలియుచున్నది. వాటిని అర్థము చేసుకోలేనప్పుడే మనుషుల మధ్య భేదభావములు పుట్టుచున్నవని తెలియుచున్నది. ప్రతి మతములోను దేవుడున్నాడు మరియు మాయ ఉన్నది. దేవుని మార్గము నుండి మనుషులను తప్పించాలని మాయ (సాతాన్) లేక సైతాన్ ఎల్లప్పుడు కాచుకొని ఉండును. అందువలన ఎంతో పవిత్రత కల్గిన అన్ని మతస్థులలోను అది పని చేయుచూ, వైషమ్యములు పెంచుచూ, మనిషికి

మనిషికీ మధ్య ద్వేషమును పెంచుచున్నది. దేవుని మీద దృష్టిని మతము మీదికి త్రిప్పి మతములను పెంచుకోవలెనని భ్రమలు కల్గించి, మనుషులనే మట్టుబెట్టుచున్నది. ఉదాహరణకు ఇస్లామ్ మతములో దేవుడు మనిషికి ముఖ్యమైన కొన్ని విదులను జీవితములో పాటించునట్లు నియమించాడు. అవి వరుసగ **ఒకటి నమాజ్, రెండు రోజా, మూడు జకాత్, నాలుగు హజ్, ఐదు జీహాద్ అనునవి.** మొదటిది దేవుని ప్రార్థన లేక ఆరాధన అనబడుచున్నది. రెండవది ఉపవాస వ్రతమును రోజా అంటున్నాము. మూడవది తనకు కల్గిన ధనమును కొంత దేవునికి ఉపయోగించడము జకాత్ అంటున్నాము. నాల్గవది జీవితములో పుణ్యక్షేత్రము యొక్క యాత్ర చేయడము హజ్ అంటున్నారు. ఐదవది మతమును రక్షించుకోవడమును జీహాద్ అంటున్నాము. ఈ విధులలో అందరు చేయదగినవి నమాజ్ మరియు రోజా అను ఉపవాసము కాగ, అందరు చేయలేనివి మిగతా మూడు విధులు. ఈ విధులన్ని దేవుని పవిత్రతను చాటునవై ఉండగా జీహాద్ అను విధానం మాత్రం కొందరి ప్రవర్తన వల్ల కలుషితమై పోవుచున్నది. మత రక్షణకని దేవుడు చెప్పగ మతమునకు ముప్పురాని సందర్భములలోను మతమంటే ఏమిటో తెలియని అమాయకుల మీదను జీహద్‌ను ఆచరించడము వలన మానవ జీవితములు రక్తసిక్తమై పోవుచున్నవి. మతమునకు ముప్పు కల్గించు వాని మీద బలప్రయోగము చేసిన పరవాలేదేమో కానీ, ఏ ముప్పుచేయని అమాయకులను సహితము హింసించి ఘోరముగ చావుకు గురిచేయమని దేవుడు చెప్పనేలేదు. అటువంటి వారిని దేవుడు సహించడు కూడ, అజ్ఞానముతో దేవున్ని గురించి చెడుగ మాట్లాడినప్పటికీ ఓర్చుకొని వానికి మాటలతో దేవుని మీద విశ్వాసము కల్గించాలి, కాని చంపకూడదని దేవుని సందేశములోనే ఉన్నది. అప్పటికీ వినని పక్షములో వానికి దేవుని శిక్ష తప్పదు.

అందరిని శిక్షించువాడు దేవుడుండగా ఆయన మీద దృష్టి సారించక మేము కర్తలమనుకోకూడదు.

విశ్వమంతా వ్యాపించి ప్రతి శరీరములోను మూలాధారమైన శక్తియే దేవుడని గ్రహించిన వారు, అన్ని శరీరములలోను దేవుడు నివశిస్తున్నాడని తెలిసి, ఏ మత ఘర్షణలకు దిగడు. మతాలు దేవుని తెలుసుకొను మార్గాలనీ, మార్గములైన మతాలు దేవుడు కాదనీ, మతాలకతీతమైన వాడు దేవుడనీ తెలియువాడే నిజమైన విశ్వాసి అనియు, నిజమైన ఇందువనియు లేక నిజమైన ముస్లీమ్ అని చెప్పబడును. ఇన్ని మాటలు చెప్పిన నాదేమతమో మీకు తెలుసునా? తెలియకపోతే తెలుసుకొమ్మని కోరుచున్నాము.

# యజ్ఞమంటే ఏమిటి?

యజ్ఞము అంటే ఆరాధన అని కొందరు, ద్రవ్యములను దేవతలకు సమర్పించు విధానమని కొందరు, చిన్న గుండమును గావించి అందులో అనేక వస్తువులను మంత్ర యుక్తముగ వేసి కాల్చి వేయడమేనని కొందరు అనుకొనుట అలవాటై ఉన్నది. ఏది ఏమైన చిన్న గుంత త్రవ్వి అందులో ఏదో వేసి కాల్చడమే యజ్ఞమని సామాన్య మానవునియందున్న భావము. భగవంతుడు గీతయందు తెల్పిన ప్రకారము మనము చూస్తున్న యజ్ఞములు ధర్మసహితమైనవా, అధర్మసహితమైనవా అని తెలుసుకోవడము ముఖ్యము. ఆత్మను తెలుసుకోవడానికి సాధన చేస్తే సరిపోతుంది ఇవన్ని తెలుసు కోవడము దేనికి అని కొందరు అనుకొనువారు కూడ కలరు. దానికి సమాధానమేమనగా! ధర్మము తెలియనిదే ధర్మముల మీద ఆధారపడిన

దేవుడు తెలియడు. అందువలననే కదా! విశ్వశక్తి, విశ్వవ్యాపి అయిన పరమాత్మ శరీరము ధరించి మన మధ్యకు వచ్చి అన్ని ధర్మములను తెలియజేశాడు. ధర్మములను తెలిసి సంపూర్ణ జ్ఞానికానిదే ఎవరు దేవుని తెలియలేరని, ఆ దేవుడే 'శ్రేయోహి జ్ఞాన మభ్యాసాత్' అన్నాడు. కనుక ప్రతి విషయము ధర్మ సమ్మతముగ తెలిసి, అధర్మ సహితమైన వాటిని వదలి వేసినపుడే దేవున్ని తెలియుటకు అవకాశము గలదు. అట్లు కానినాడు దేవుని తెలియుట పొందుట కష్టము. అందువలన యజ్ఞముల గూర్చి మనము అవగాహన చేసుకొన్న విషయములను ధర్మబద్ధమా కాదా అని చూడవలసిందే.

ధర్మమునకు బలము దేవుడొక్కడే, అధర్మమునకు బలము యావత్ ప్రపంచము. అందువలన ఈ ప్రపంచములో అధర్మములకే ప్రజలు ప్రాధాన్యత ఇవ్వడము జరుగుచున్నది. ధర్మములు కొరగానివైనపుడు, ధర్మములకు బలము చేకూర్చడము కోసము ఆ దేవుడే అవతరించి చెప్పవలసిందే. అధర్మములు అట్లుకాక అధర్మములు మానవుని చేతనే ప్రచారము కాబడుచున్నవి. దేవుడొక్కడు మానవునిగ వచ్చి ధర్మములు చెప్పితే, మానవులెందరో ఇదియే నిజధర్మమని అధర్మములను బోధిస్తూ మానవునిగ వచ్చిన దేవుని మాటకు వ్యతిరిక్తముగ ప్రచారము చేసుకొనుచుందురు. దైవాంశ కల్గిన ఒక్క మానవుని చేత తెల్పబడిన ధర్మములకు వ్యతిరిక్తముగ మాయ బలము గల ఎందరో మానవులచేత తెల్పబడు అధర్మముల ధాటికి ధర్మములు మాసిపోవుచుండును. అందువలననే దేవుడు అప్పుడప్పుడు పుట్టవలసి వస్తున్నదని గీతయందు అన్నాడు.

సామాణ్య మానవుడు ధర్మములను గాని, అధర్మములను గాని ప్రచారము చేయు స్థితియందుండడు. కాని ఇక్కడ అధర్మములను

ధర్మములుగ మలచి చూపిస్తు దేవుని మాటకు వ్యతిరిక్తముగ ప్రచారము చేయుటకు అవకాశము జ్ఞానము బోధించు స్థోమత కల్గినవారికి మాత్రమే ఉండును. సామాణ్య మానవునికి ఏది తెలియదు, కావున బోధించువారు చెప్పినట్లు నడచుకొనుచుందురు. కాని విమర్శించు శక్తి వినేవారికి ఉండదు. ఇటువంటి వాతావరణములో అధర్మములు సులభముగ ప్రాకి, ప్రజలయందిమిడి పోవుచున్నవి. ఆ విధముగ ఎందరి చేతనో చెప్పబడి బహుళ ప్రచారములో ఉన్న అధర్మములను దేవుడే అవతరించి ఖండించవలసి వచ్చినపుడు, చూసేవారికి దేవుడు కూడ ఒక మనిషిలాగే కనిపిస్తుంటాడు. కావున ఎందరో చెప్పిన దానికంటే నీవు చెప్పునది నిజమా? పెద్దలందరు తెల్పినది నీ ఒక్కడవు కాదంటావా? అని అంటారు. కాని ఈయన చెప్పునది ఏమి? ఇంతకు ముందు మనము విన్నదేమి? ఏది నిరూపణకు వచ్చు సత్యము అని యోచించరు. అందువలన పరమాత్మయే శ్రీకృష్ణునిగా పుట్టినపుడు ధర్మములను ప్రజలకు చెప్పితే ఎందరో మునులు చెప్పిన దానికంటే నీవు వ్యతిరిక్తముగ నాది ధర్మమంటావా? నీకంటే ముందు పుట్టినవారు తెల్పినది అధర్మమంటావా? కఠోరమైన బ్రహ్మచారులు, మహర్షులు జీవితమంతా ఒకే ఆచరణలో ఉన్నవారు తెల్పిన మాటలు అధర్మములా? ఎందరో భార్యలు గల నీవు, మామూలుగ అన్ని విషయములందు తలదూర్చు నీవు చెప్పునది ధర్మమా? అని ఎదురు ప్రశ్నవేస్తారని శ్రీకృష్ణుడు అవకాశమొచ్చినపుడు అర్జునునికి మాత్రము తెల్పిపోయాడు. శాసనములు, సిద్ధాంతములు, నిరూపణలు అయిన ఆనాటి శ్రీకృష్ణుని వాక్యములకు కూడ ఈనాడు వక్రభాష్యము ఏర్పడినది. ముందు పుట్టి, గడ్డములు పెంచి, చెప్పిపోయిన వారి మాటలన్ని వేదములనీ, ఉపనిషత్తులనీ, అందులోని వాక్యములే ధర్మములనీ, గ్రుడ్డిగ నమ్ముచూ సత్యాసత్య విమర్శలేక ఈనాడు గీతను కూడ వెనక్కు

నెట్టినవారున్నారు. పిప్పలాద మహర్షి చెప్పిన గర్భోపనిషత్‌లోని వాక్యములను గ్రుడ్డిగ నమ్ముచు గీతలో స్వయముగ దేవుడే చెప్పిన **'వాసాంసి జీర్ణాని'** అను శ్లోకమునే అర్థరహితము చేశారు. జీవుడు శరీరమును పొందు విషయమును తెల్పిన ఆ శ్లోకము యొక్క సత్యమునే సమాధి చేశారు. దానికి విరుద్ధముగ వారు అట్లు చెప్పారు, వీరు ఇట్లు చెప్పారు అని అంటారు కాని, ఏది సత్యము అని మనుషులు యోచించరు. అసలుకు కొందరి భావములో శ్రీకృష్ణుడంటే సామాణ్య మానవుడని లెక్క. సామాణ్య మానవులను దేవునిగ లెక్కించి గౌరవించు మనుషులు, నిజమైన దేవుడు మనిషిగ వచ్చినప్పటికీ కృష్ణున్ని గుర్తించలేక పైగా సామాణ్యులకంటే నీచముగ లెక్కించుకొన్నందులకు మేము బాధ పడుచున్నాము. ఇపుడు ధర్మయుక్తముగ, శాస్త్రబద్దముగ యజ్ఞమంటే ఏమిటో తెలుసుకొందాము.

యజ్ఞమనగ కాల్చుట అని అర్థము. ఇక యజ్ఞము జరుగుచున్నదంటే ఒకటవది కాల్చేదానికి ఒక అగ్ని కావాలి. రెండవది కాల్చబడే దానికి ఒక వస్తువు కావాలి. మూడవది కాల్చే దానికి ఒక మనిషి కావాలి. 1) కాల్చేది 2) కాల్చబడేది 3) కాల్చేవాడు అను మూడు ఉండవలసినదేననుట అందరికి తెలిసిన విషయమే కదా! ఎక్కడ యజ్ఞములు జరిగినా యజ్ఞగుండములో అగ్ని ఉంటుంది. అందులోనికి వేసే వస్తువులు చిన్న పుల్లలు మొదలుకొని గొప్ప ఔషధములు, పట్టుచీరలు, బంగారు, నెయ్యి ఎన్నో ఉన్నవి. అట్లే వాటిని నెరవేర్చుటకు ఋత్విక్కులు అనువారు ఉన్నారు కదా! కానీ ఇది ధర్మమో, అధర్మమో తెలియదు. దీనిని గురించి యోగశాస్త్రమైన గీతయందు చెప్పినది మాత్రము ధర్మము. యోగశాస్త్రమైన గీతను బట్టి యజ్ఞములు రెండు విధములుగ

విభజింపబడినవి. 1) ద్రవ్యయజ్ఞము 2) జ్ఞానయజ్ఞము. ద్రవ్యయజ్ఞము ప్రకృతి సంబంధమైనది. పరమాత్మను పొందుటకు ఈ యజ్ఞము పనికిరాదు. ప్రకృతిలో పుట్టిన కంటికి కనిపించు వస్తువులను కాల్చివేయునది, కావున దీనికి ద్రవ్యయజ్ఞమని పేరు పెట్టారు. ఈ యజ్ఞము ద్రవ్యములను కాల్చుచు, జన్మకు కారణమైన కర్మను వృద్ధి చేయును. కాని పుట్టిన ప్రతి జీవరాసి ద్రవ్యయజ్ఞమును చేయుచున్నది. ద్రవ్యయజ్ఞముకంటే అన్ని విధముల భిన్నమైనది శ్రేష్ఠమైనది జ్ఞానయజ్ఞము. ఈ యజ్ఞము ఆత్మ పరమైనది. సర్వకర్మలు జ్ఞానయజ్ఞమందు కాలిపోయి జన్మ లేకుండ ముక్తిని కల్గిస్తున్నది. అందువలననే గీతయందు జ్ఞానయోగమున 33వ శ్లోకము॥

శ్లో ॥ శ్రేయాన్ ద్రవ్య మయా ద్యజ్ఞాత్ జ్ఞాన యజ్ఞః పరంతప !
సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరి సమాప్య తే !!

ద్రవ్యయజ్ఞముకంటే జ్ఞానయజ్ఞము శ్రేష్టమైనది. ఎందుకు అనగా! సర్వ కర్మలు జ్ఞానాగ్నిలో పరిసమాప్తమౌను అని దేవుడన్నాడు. దేవుడు చెప్పిన ఈ యజ్ఞములేవో? ఎక్కడున్నవో? ఎలా జరుగుచున్నవో? ఎవరు చేయుచున్నారో? తప్పక తెలుసుకోవలసి ఉన్నది. దేవుడు తెల్పిన ఈ యజ్ఞముల వివరము తెలిసినవాడు ఎవడైనా ఇప్పటి కాలములో జరుగుచున్న యజ్ఞముల ఎడల మోసపోడు.

భగవద్గీతయందు అక్షరపరబ్రహ్మ యోగమను అధ్యాయము 4వ శ్లో॥ **'అధి యజ్ఞో హమే వాత్ర దేహే దేహ భృతాం వర'** సర్వ దేహములందు జరుగు యజ్ఞములకు నేనే భోక్తగాయున్నాను. అను దేవుని మాటననుసరించి రెండు విధముల యజ్ఞములు మన దేహములందే జరుగుచున్నవని తెలియుచున్నది. ఎలా జరుగుచున్నదనగా! ద్రవ్యయజ్ఞము

సర్వ జీవరాసుల శరీరములోని జీర్ణాశయములో జఠరాగ్ని చేత జరుగుచున్నది. జీర్ణాశయములో కలిసెడి రసముల చేత అగ్ని ప్రభావమేర్పడి మనము నిత్యము తింటున్న ద్రవ్యములను భస్మీపటలము చేయుచున్నది. జీర్ణాశయములో ఏదో అగ్ని ఉన్నదనుటకు మన నోటి ద్వారములో వేడి కన్పిస్తున్నది. నోటి ద్వారములో వేయు వివిధ రకములైన ద్రవ్యములు యజ్ఞగుండమైన జీర్ణాశయములో పడి కాలిపోయి మార్పుచెందుచున్నవి. ఈ ద్రవ్యయజ్ఞము దినముకు మూడు లేదా నాలుగు మార్లు మనము మనకు తెలియకనే చేస్తున్నాము. ఈ యజ్ఞములో దహించు అగ్ని ఆత్మ చైతన్యము చేత స్రవింపబడి కలిసెడు రసముల చేత ఏర్పడినది. అందువలన ఆ అగ్నిని జఠరాగ్ని అనీ, కాల్చబడునవి ఆహార ద్రవ్యములని తెలియుచున్నది. ఈ ద్రవ్యయజ్ఞమును గురించి భగవద్గీతయందు పురుషోత్తమప్రాప్తి యోగమను అధ్యాయమున 14వ శ్లో॥ 'అహంవైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్' అన్ని ప్రాణుల దేహములందు నేను అగ్ని స్వరూపుడనై ఉండి, వారు తినిన నాల్గు రకముల పదార్థములను జీర్ణింప చేయుచున్నాను. అని భగవంతుడు తెల్పియున్నాడు.

దేవుడు తెల్పిన ఈ ద్రవ్యయజ్ఞమును మనము నిత్యమూ మనకు తెలియకనే చేస్తున్నామంటే ఆశ్చర్యముగ ఉంటుంది కదా! నిజమేమరి మన మహర్షులు చెప్పిన తీయని మాటలు దేవుని ధర్మమునకు వ్యతిరిక్తముగ మనయందు ఇమిడి పోయాయి. కావున గుంతలు త్రవ్వి పుల్లలు వేసి కాల్చేటివే యజ్ఞములనుకొన్నాము. కావున ఈ విషయము ఆశ్చర్యముగ ఉంటుంది. ద్రవ్యయజ్ఞము మన నిత్య జీవితములో తప్పనిసరి అయినది. దీనికొరకు ద్రవ్యములు కావలయును. ఆ

ద్రవ్యముల కొరకు అనేక పనులు మానవుడు చేయుచున్నాడు. కర్మ వలన ప్రేరేపింపబడు కార్యముల చేతనే యజ్ఞములు జరుగుచున్నవి. కర్మ చేత చేయబడు ఏ కార్యములోనైనా తిరిగి క్రొత్త కర్మ వచ్చును కదా! ద్రవ్యయజ్ఞములు చేయుట వలన క్రొత్త కర్మ వచ్చును కదా అని కొందరికి సంశయమురావచ్చును. దానికి సమాధానము ఏమనగా! కర్మ వచ్చు మాట నిజమే, అయినా ద్రవ్యయజ్ఞములు చేయుట వలన సంభవించు కర్మను తప్పించుటకు తగిన ఉపాయము తెలుసుకొని బయటపడవచ్చును. కూటి కొరకు కోటివిద్యలన్నట్లు ద్రవ్యయజ్ఞము కొరకు చేయు పనులన్నిటిలో కంటికి తెలియని కర్మ మనకంటుకొను చున్నది. మనము నిత్యము చేయు పనులలో కొన్ని మంచివీ, కొన్ని చెడువి ఉంటాయి. మంచి పనులు చేయుట వలన పుణ్యము, చెడు పనులు చేయుట వలన పాపము మనకు తెలియకనే మన కర్మచక్రమందు చేరుచుండును. ఇది ద్రవ్యయజ్ఞ సారాంశము. ద్రవ్యయజ్ఞము వలన సంభవించు కర్మను నాశనము చేసుకొని, జన్మల నుండి బయటపడాలంటే తప్పనిసరిగ జ్ఞానయజ్ఞము చేయాలి.

జ్ఞానయజ్ఞము మన శరీరములోని తలయందు జరుగుచున్నది. ఇందులో కూడ కాల్చబడు సమిదలు, కాల్చు అగ్ని, కాల్చువాడు ముగ్గురూ గలరు. దీనియందు ఒకటి పాపపుణ్యమను కర్మలు కాలిపోవుచున్నవి. రెండు జ్ఞానమను అగ్ని (జ్ఞానశక్తి) కర్మలను కాల్చివేయుచున్నది. మూడు చేయువాడు జీవుడే. జ్ఞానయజ్ఞములో ద్రవ్యయజ్ఞము ద్వార సంభవించు పాపపుణ్య కర్మలన్నియూ నశించిపోవును. అందువలన గీతలో జ్ఞానయోగమను అధ్యాయము 37వ శ్లో॥ *'జ్ఞానాగ్ని సర్వ కర్మాణి భస్మసాత్'* సర్వ కర్మలు జ్ఞానమను అగ్నిలో భస్మమైపోవునని భగవంతుడన్నాడు.

నేడు అందరు ద్రవ్యయజ్ఞము చేసి కర్మలను సంపాదించుకొన్నా జ్ఞానయజ్ఞము చేసి కర్మలు కాల్చువారు అరుదు. అందరి శరీరముల కడుపులో జఠరాగ్ని కొదవలేకుండ ఉంది. కాని తలయందు జ్ఞానాగ్ని ఏమాత్రము లేకుండ పోయినది. అందువలన జ్ఞానయజ్ఞము చేయలేక పోవుచున్నారు. కర్మములను కాల్చలేక పోవుచున్నారు. మేము **'యోగులంటే ఎవరు'** అని వ్రాసినపుడు యోగశక్తి (జ్ఞానాగ్ని) కల్గి కర్మలను భస్మీపటలము చేయువారే యోగులు అని తెల్పగా, నిజముగ అటువంటివారు భూమిమీద ఉన్నారా! అని ఆశ్చర్యముగ ప్రొద్దుటూరు నుండి ఒకరు ప్రశ్నించారు. దేవుడు చెప్పిన ప్రకారము నడుచుకొని జ్ఞానయజ్ఞము చేస్తే కర్మ కాలిపోవును. భగవద్గీతలో చెప్పిన ప్రకారము జ్ఞానయజ్ఞము చేస్తే ఏ కాలములోనైన కర్మను కాల్చు శక్తి మానవునికి ఉంటుంది. విధానము తెలియక మనము కుంటుపడు చున్నాము, కాని సామర్థ్యము లేక కాదు. నిజము చెప్పాలంటే బాహ్య యజ్ఞములలో మనలను నిమగ్నము చేసి, అంతర్ముఖముగ ఉన్న, దేవుడు తెల్పిన యజ్ఞముల మీదికి ధ్యాస లేకుండ చేసిన మన పెద్దలది తప్పు.

జ్ఞానయజ్ఞము చేయాలంటే మనము క్రొత్తగ జ్ఞానాగ్ని అను నిప్పును సంపాదించుకోవాలి. ఆ నిప్పు జ్ఞానయజ్ఞము చేయుచున్న వారి తలయందుంటుంది. కావున నిప్పు ఉన్న పొయ్యి నుంచి నిప్పులేని పొయ్యిని రగుల్చుకొన్నట్లు, జ్ఞానాగ్నిని కల్గిన యోగుల వద్దగల అగ్నిని మన తలయందు వేయించుకొని జ్ఞానయజ్ఞము చేసి, కర్మబంధము నుండి ముక్తులుకావలయును. అందుకే జ్ఞానాగ్ని ఉన్న గురువుల చెంతకు మానవుడు పోవలసియున్నది. కొందరు గురువుల దగ్గరకు పోవుచున్నారు, కాని జ్ఞానాగ్నిని దానము చేయించుకోవడానికి కాదు, మంత్ర జపమును

చెప్పించుకోవడానికి మాత్రము పోవుచున్నారు. జ్ఞానాగ్ని దానమే ఉపదేశమని తెలియక, మంత్రదానమే ఉపదేశమనుకొనుచున్నారు. ఇప్పటికైన మా పిలుపుతో మేల్కోండి. అధర్మములను ఖండించండి, ధర్మములను ఆచరించండి, గ్రుడ్డిగ నమ్మి నడవద్దండి, యోచించి ధర్మములను బయటకులాగండి. నేను యోగశాస్త్రమైన భగవద్గీత ఆధారముగ చెప్పిన మాటలివియని మరువకండి. అసూయ భావమును వదలండి. ఆత్మ ఔన్నత్యమును వెదకండి.

**యజ్ఞము :** ఉన్నదానిని లేకుండ కాల్చడము (శరీరములో జరుగుచున్నవి)
గీత అక్షరపరబ్రహ్మయోగము - 4వ శ్లోకము

**ద్రవ్యయజ్ఞము :** జఠరాగ్నిలో ఆహార ద్రవ్యములు కాలిపోవుట (కడుపులో)
గీత పురుషోత్తమ ప్రాప్తి యోగము - 14వ శ్లోకము

**జ్ఞానయజ్ఞము :** జ్ఞానాగ్నిలో కర్మలు కాలిపోవును (తలలో జరుగుచున్నది)
గీత జ్ఞానయోగము - 37వ శ్లోకము.

**చేయువాడు :** జీవాత్మ

**అధిపతి :** ఆత్మ

# ఋణము

ఋణము అనగ బాకీ అని అర్థము గలదు. ఋణములు ఎన్నో రకములుగ ఉన్నవి. చాలా రకములైన ఋణములను రెండు విధములుగ విభజించవచ్చును. ఒకటి ప్రపంచ సంబంధ ఋణము. రెండవది పరమాత్మ సంబంధ ఋణము. ప్రపంచ సంబంధ ఋణమును పరిశీలించిన, ఒకవ్యక్తి మరొక వ్యక్తినుండి ఒక ఫలితము పొంది,

దానికి తిరిగి ప్రతిఫలముగ ఇవ్వవలసిన దానిని బాకీ అనుచున్నాము. ఒకడు మరొకని నుండి దేనినైన పొందవచ్చును. దానికి ప్రతిఫలముగ దేనినైన ఇవ్వవచ్చును. అది ఇచ్చువాడు తీసుకొనువాని మధ్య ముందే ఒడంబడికలు ఉండును. ఉదాహరణకు ఒకడు మరొకనికి కిలో వంకాయలిచ్చాడనుకొందాము. వాడు వంకాయలకు ప్రతిఫలముగ ఐదు రూపాయలివ్వవలెనని ముందే ఒప్పందము చేసుకొనియుండును. చేసుకొన్న ఒడంబడిక ప్రకారము వంకాయలు తీసుకొన్నవాడు ఇచ్చిన వానికి డబ్బులు చెల్లించవలసి ఉన్నది. ఇస్తే బాకీ తీరిపోవును, ఇవ్వకపోతే బాకీ అగును. ఈ పద్ధతి ప్రకారము వస్తురూపేన, ధనరూపేన అనేకరూపములుగ ఒకరికొకరు బాకీపడుట, తీర్చుకొనుట జరుగుచున్నది.

ప్రపంచ సంబంధ బాకీలు ఎన్ని రకములుగ ఉన్ననూ, పరమాత్మ సంబంధమైన బాకీ ఒకే ఒక విధముగనున్నది. అది ఏమనగా! ఒకరి నుండి మరొకరు జ్ఞానము తెలుసుకోవడము జ్ఞానఋణమగును. ఒకరి నుండి మరొకరు క్రొత్తగా మొట్టమొదట తెలియబరచబడినదీ, ఎవరిచేత చెప్పబడనిదీ, క్రొత్తదయిన జ్ఞానవిషయమును తెలుసుకొనుట వలన ఋణమగుచున్నది. ముందే ఇతరుల చేత తెలియబరచబడిన విషయమును తర్వాత ఎవరు ఎందరికి తెల్పినా అది బాకీకాదు, దానమగును. ఉదాహరణకు ఒక గురువు ఎవరికి తెలియని జ్ఞానరహస్యమును మొదట తెలిపాడనుకొందాము, ఆ విషయమును మొదట తెలుసుకొన్న వారు ఆ గురువుకు ఋణపడిపోదురు. తరువాత అదే జ్ఞానవిషయమును ఎవరు ఎవరికి తెలిపినా అది బాకీకాదు. ఒకరి నుండి మొదట తెలిసిన అది బాకీ అయినపుడు, తర్వాత అలాగే ఒకరినుండి మరొకరు తెలియుట బాకీకాక మరేమగును? అని కొందరడుగ వచ్చును. దానికి సమాధానము

ఏమనగా! మొదట ఒకరి చేత తెలియబడిన విషయము తరువాత ఎందరి చేతనో ఎందరికో తెలియబడినా, అది జ్ఞానదానమగును ఏమాత్రము బాకీకాదు. మొట్టమొదట క్రొత్తదిగా తెలిపినపుడే బాకీ అగును.

పరమాత్మ జ్ఞానరహస్యములను మొదట సూర్యునికి తెలిపానని గీత జ్ఞానయోగమను అధ్యాయమున తెలిపాడు. తర్వాత సూర్యుడు మనువుకూ, మనువు ఇక్ష్వాకుడను రాజుకూ, ఆ రాజు ఇతరులకూ తెల్పుచు పరంపరగ ఒకరి నుండి మరొకరు తెలుసుకొన్నారు. ఇట్లెందరు తెలుసుకొన్ననూ, మొదట పరమాత్మకు సూర్యుడు ఋణపడి ఉన్నాడు. తర్వాత అదే జ్ఞానము ఒకరి నుండి ఒకరికి దానమయినది. ఇట్లది దానమైనప్పటికీ, దానమునకు ప్రతిదానముండవలెను. ఒకడు చెక్కెరనీరిస్తే నీకు అంతస్థోమత లేకున్నా, నీ స్థోమతకు తగినట్లు ఉప్పునీరైన ప్రతి దానము చేయవలసి ఉండును. ఒక గురువు నుండి జ్ఞానదానము పొందిన వాడు తనకు కలిగినది దక్షిణగ ఇచ్చుట సాంప్రదాయము. ఈ పద్ధతిలో పూర్వము బోధకులు శిష్యుల నుండి నాల్గుసేవలనెడి దక్షిణలు పొందెడివారు.

జ్ఞానదానము పొందిన వారు ఎవరినుండి జ్ఞానమును పొందారో వారినే గురువులుగ ఎంచుకొనెడివారు. దానివలన చెప్పినవాడు గురువు, చెప్పించుకొన్నవాడు (శిశువు) శిష్యుడు అయ్యెడి వారు. జ్ఞానమార్గమును చూపినవాడు గురువనీ, ఆ మార్గము గురువు ద్వారా తెలిసినవారు శిష్యులనీ లెక్కించెడివారు. ఈ విధముగ గురుశిష్యుల సంబంధ బాంధవ్యములు ఆది నుండి గలవు. ముందుగ ఏర్పరచిన జ్ఞానమార్గము తెలిసినవాడై దానిని తెల్పుట వలన ఇతరులకు గురువులగుచున్నారు.

మార్గము తెలిసి ఇతరులకు తెలియచేయువాడు గురువైనపుడు ముందే మార్గము నేర్పరచిన వానినేమనాలి? దానికి సమాధానము ఏమనగా తెలిసిన జ్ఞానమును తెల్పువాడు బోధకుడు. మొదట తెల్పినవాడు గురువు.

జ్ఞానమార్గమేర్పరచి ఇదియే మార్గము, ఈ మార్గము తప్ప దేవుని వద్దకు పోవుమార్గము లేదని తెలుపువాడు గురువగును. ఆ గురువెవరని వెదకి చూచిన మొదట ఎవరికి తెలియని జ్ఞానమార్గమును తెలుపు గురువు పరమాత్మ అయిఉండును. ఈ విషయమును గీతయందు స్పష్టముగ తెలియజేశారు. ఎక్కడ ఎవరిచేత తెలియబడని జ్ఞానము మొట్టమొదట పరమాత్మనుండియే బయలుదేరిరావలెను. ఎవరైన ఎక్కడ లేని క్రొత్త జ్ఞాన విషయము తెలుసుకొన్నారంటే అది దానము కాదు, బాకీ అగును. దానమైతే సేవలను దక్షిణలతో సరిచేసుకోవచ్చును. బాకీ అయితే తీసుకొన్న దానికి సమాన విలువగలది ఇవ్వవలసి ఉండును. అపుడయితే గాని బాకీ తీరదు.

ప్రపంచ వస్తువుకైతే విలువ కట్టవచ్చును. దానికి సరియైన దిచ్చి బాకీ తీర్చుకొనవచ్చును. పరమాత్మ జ్ఞానమునకు విలువ కట్టుటకు సాధ్యముకాదు. ఒక క్రొత్త జ్ఞానవిషయము వెలకట్టలేనంత విలువ కలిగి ఉండును. డబ్బు రూపేణ లక్షలు, కోట్లు సరిపడవు. వస్తు రూపమున వజ్ర వైఢూర్యములు కూడ సరిపోవు. అటువంటి జ్ఞానము యొక్క ఋణమెలా తీర్చుకోవలెను? మన జీవితమంతయు ధారపోసినా తీరునదికాదు. అంత గొప్ప బాకీ తీర్చగలమా! అని అనుమానము రావచ్చును. వాస్తవమే ఒక విధముగ యోచిస్తే ఏమిచేసినా ఆ ఋణము తీరునది కాదు. మరియొక విధముగ యోచిస్తే కొంత ఉపాయము గలదు. అదేమనగా! ప్రపంచములో ఒకడు మరొకనికి పదిలక్షలు బాకీ

పడ్డాడనుకొందాము.  బాకీ తీసుకొన్న వానిదగ్గర కేవలము వేయి రూపాయలు మాత్రమున్నవి.  అలాంటపుడు వాడు పదిలక్షలు బాకీ తీర్చలేడు.  అట్లని పూర్తిగ ఎగరగొట్టకూడదు.  ఉన్నదానితో న్యాయముగ బాకీ తీర్చాలంటే దివాలాపెట్టడమే ఉపాయము.  దివాలా పెట్టి చేతులెత్తిన తర్వాత తనకున్నది బాకీలో రూపాయకు పైసా భాగమైన, రూపాయకు పైసా సమానమైనట్లే,  ఆ బాకీ తీరినట్లే.  ఇకవాడు బాకీలేనట్లే అగును. అదే విధముగ పరమాత్మకు జ్ఞానపరముగ బాకీపడినవారు ఏమిచ్చినా ఆ రుణము తీరదు.  కావున దివాలా పెట్టవలసినదే.  తనకున్నది కొద్దియైన గొప్పయైన బాకీకి దామాషా కట్టవలసిందే.  ప్రపంచ సంబంధ బయట బాకీ అయితే కోర్టు తీర్పూ, జమ ఉంటుంది.  పరమాత్మ బాకీకి తీర్పు ఎట్లని యోచించనవసరము లేదు.  ఇలాంటి బాకీకట్టినవారు పూర్వము చాలా మంది ఉన్నారు.  కావున వారి విధానమే అనుసరించవచ్చును. తనతో సహా తనకున్నదంత నీదేనని ఒప్పజెప్పడమే పరిష్కారమవును. మరియు తనకేదయితే ఉందో అదినాది కాదు.  జ్ఞానమార్గమును నేర్పించిన వానిదే అనుకోవడమే తీర్పగును.  అపుడు అది ఎంత పెద్ద బాకీ అయినా తీరినట్లే అగును. బహు చిన్న ఉపాయముతో పెద్ద బాకీని తీర్చుకొనుటకిదే ఉపాయము.  బయట బాకీకి దివాలా సరిపోయినట్లు లోపల బాకీకి నాదేదీ లేదు, నేను కూడ నీవాడినే, నాకున్నదంతా నీదే అనుకొనుటవలన గురువు బాకీ తీరిపోవును.

తెలిసిన జ్ఞానమును తెలుపువారు గురువులు కాదు, వారు బోధకులగుదురు.  వారు ఉపదేశమును కూడ ఇవ్వగలరు.  మొదట జ్ఞానమార్గమును చూపినవాడు గురువు,  అతను ఉపదేశమివ్వడు.  ఏ సందర్భములోనైనా ఉపదేశమెవరికైన ఇచ్చినట్లయితే, అది బోధకులైన

వారికి మార్గదర్శకత కొరకేగాని వేరు కాదు. బోధకుడు ఈ విధముగ ఉపదేశమివ్వాలని చూపించు నిమిత్తము తప్ప ఉపదేశమిచ్చుట ఆయన పనికాదు. బోధకులకు వందలు, వేలు, లక్షల సంఖ్యలో శిష్యులుండ వచ్చును. గీతను బోధించిన శ్రీకృష్ణునికి శిష్యులులేరని గ్రహించవచ్చును. ఎందుకనగా ఆయన బోధకుడు కాదు. క్రొత్త జ్ఞానమును తెల్పిన గురువు శ్రీకృష్ణుడు.

తెలిసిన జ్ఞానమార్గమును తెలుపువారు బోధ గురువులు కాగ, ప్రపంచములో అందరికి వర్తించు, ఎవరికైనా పనికివచ్చు జ్ఞానమార్గము నేర్పరిచినవాడు గురువగును మరియు జగద్గురువగును. జగత్తుకంతటికి శాసనమైవర్తించు మార్గమును మొదట తెలిపినవాడు జగద్గురువు కాగ, తరువాత ఆ విధానమును తెలియజేయువారు కేవలము బోధ గురువులు మాత్రమే అగుదురు. మొదట తెలుపు జ్ఞానమును బట్టి గురువు మరియు తరువాత తెలుపు జ్ఞానమును బట్టి బోధకుడు లేక బోధగురువు అను మాట భూమి మీద ఉండును. శిష్యుల సంఖ్యను బట్టి గురువు, అనుమాట ఉండదు. గురువుల వద్ద జ్ఞానమును తెలుసుకోవడము జ్ఞానఋణమగును. బోధకులవద్ద జ్ఞానమును పొందడము జ్ఞాన దానమగును. బోధగురువుల వద్దగల జ్ఞానము ఒకరి నుండి మరొకరికి పరంపరగ వచ్చునది. నిజగురువువద్దగల జ్ఞానము పరంపరకానిదీ, ఆయన నుండియే మొదలగునదనీ తెలుసుకోవలయును.

బోధ గురువుల జ్ఞానమునకు ప్రతిఫలముగ చేయునది దక్షిణయగును. ఇక్కడ బోధకుడు అతనికి శిష్యుడనువాడు ఉన్నాడు. కనుక బోధగురువుకు శిష్యుడు సేవలు చేయవచ్చును. అసలైన జగద్గురువు యొక్క జ్ఞానమునకు ప్రతి ఫలముగ సేవలు చేయుట అనునది

ఉండదు. ఎందుకనగా ఇక్కడ శిష్యుడనేవాడు ఉండడు. నేను వేరను భావమే ఉండకూడదు. తన్ను తాను సమర్పించుకొని నేను ఉన్నాననీ, నాది నా ఆస్తి ఉన్నదను భావమే మనసులో ఉండకూడదు. కావున జగద్గురువు వద్ద సర్వము సమర్పణ తప్ప సేవలంటూ ఉండవు. అట్లయితేనే జ్ఞానఋణము తీరినట్లగును.

# అబ్బ- ఆచారము

అబ్బ అనగ తండ్రి అని అర్థమున్నా ఆధ్యాత్మిక అర్థములో పరమాత్మ అని తెలుసుకొన్నాము. బ్రహ్మ అనగ పెద్ద అని అర్థముండగా ఆధ్యాత్మిక అర్థముతో పరమాత్మ అని కూడ తెలుసుకొన్నాము. పరమాత్మ జ్ఞానము ప్రకారము నడుచుకొనువాడు బ్రహ్మయొక్క ఆచరణ ఆచరించినవాడగుచున్నాడు. అట్టివాడు బ్రహ్మయొక్క ఆచరణ ఆచరించినవాడు గనుక వానిని బ్రహ్మచారి అనుచున్నారు. బ్రహ్మచారి అనగ స్త్రీ సాంగత్యము చేయనివాడని కూడ ప్రపంచములో బాహ్య అర్థము గలదు. అట్లని ఆడవారి సాంగత్యము చేయనివానిని, వివాహముకాని వానిని బ్రహ్మచారి అనకూడదు. ఇక్కడ దైవిక జ్ఞాన అర్థము ప్రకారము పురుషుడంటే పరమాత్మయనీ, స్త్రీ అంటే ప్రకృతియనీ అర్థము చేసుకోవాలి. ప్రకృతికి సంబంధించిన విషయములలో సంబంధపడక కేవలము పరమాత్మ విషయముల మీద ఉండువానిని బ్రహ్మచారి అనవచ్చును. ప్రకృతియను స్త్రీసంబంధము లేనివాడు బ్రహ్మచారి అని పెద్దలనెడివారు. ప్రస్తుత కాలములో ఆ అర్థమును వదలి బాహ్య ప్రపంచములో ఆడవారి సంబంధము లేని వానిని బ్రహ్మచారి

అనుచున్నారు. ఆధ్యాత్మికరీత్యా అట్లనడము తప్పుయనీ, స్త్రీతత్త్వమైన ప్రకృతితో సంబంధము లేనివాడు నిజమైన బ్రహ్మచారియని తెలియాలి.

బ్రహ్మచారి అనగ బ్రహ్మయొక్క ఆచరణ ఆచరించువాడని తెలుసుకొన్నాము. అట్లే పరమాత్మ ఆచరణ ఆచరించువానిని బ్రహ్మచారి అనడమేకాక అబ్బాచారి అనికూడ అనుచుండెడివారు. అబ్బ అనగ పరమాత్మ కావున బ్రహ్మచారి, అబ్బాచారి ఇద్దరు ఒకటేనని తెలియాలి. ఇపుడు బ్రహ్మచారము, అబ్బాచారము రెండు ఒకటేనని తెలిసిపోయినది కదా! ఇపుడు మనము కొన్ని వేల సంవత్సరముల వెనుకకు పోయి చూస్తాము. అప్పటి పూర్వకాలములో పరమాత్మ జ్ఞానము తెలిసినవారు వారి బుద్ధినంతయు పరమాత్మ విషయముల మీదనే ఉపయోగించెడివారు. వారి బుద్ధి ప్రావీణ్యతంతయు పరమాత్మ విషయము మీదనే ఉండెడిది. ప్రపంచ విషయములలో వారి బుద్ధి ప్రావీణ్యత ఉండెడిది కాదు. ఇతరుల మాదిరి డబ్బు సంపాదించలేక పోయెడివారు. ఎన్నో చోట్ల అందరిని నమ్మి మోసపోయెడివారు. ప్రావీణ్యతగ మాట్లాడుట తెలియదు. ఎన్నో చోట్ల పొరపాటు పనులు చేసెడివారు. అబ్బాచారము గలవారు ప్రపంచములో సాధారణ మనుషులకంటే బుద్ధిలో తక్కువ స్థాయిలో కనిపించెడివారు. అలా అనేక విషయములలో బుద్ధి ప్రావీణ్యత లేనివారిని చూచి, చాలామంది అతను అబ్బాచారములో ఉన్నాడు అందువలన వానికి సరిగ తెలియదు అనెడివారు. ఈ కాలములో సారాత్రాగిన వాడెవడయైన పొరపాటుగ మాట్లాడితే **'త్రాగినోడు వానితో ఏమిలే'** అన్నట్లు, ఆ కాలములో పరమాత్మ ఆచరణగల వారు లేక అబ్బాచారులు ఏదైన పొరపాటుపడినపుడు గానీ, మోసపోయినపుడు గానీ, సరిగమాట్లాడ లేనపుడు గానీ, **"వాడు అబ్బాచారములో పడిపోయాడు వానితో ఏమిలే"** అనెడివారు. అదే విధముగ కొంతకాలము అనుచు అనుచు కాల

క్రమమున అబ్బాచారము అను పదము **'బొబ్బాచారము'** అను పదముగ మారిపోయినది. ఇట్లు అబ్బాచారము అనుపదము యొక్క అర్థము పూర్తిగ మారిపోయి బొబ్బాచారము అవడమేకాక, దైవజ్ఞానము లేని తెలివితక్కువ వాడిని బొబ్బాచారములో పడినాడనుట జరుగుచున్నది.

పూర్వకాలము యుక్తవయస్సునందు ప్రపంచ విషయములలో కాలము గడపిన వారు, వృద్ధాప్య వయస్సులో పరమాత్మ విషయముల మీదికి పోయెడివారు. అందువలన అటువంటి వారిని ముసలి ముప్పున బొబ్బాచారములో పడినాడనెడి వారు. ప్రస్తుత కాలములో వృద్ధాప్యమున దైవజ్ఞానములో లేకున్ననూ కొద్దిపాటి పొరపాటుగ మాట్లాడిన వానిని బొబ్బాచారములో పడినాడని అనుచున్నారు. కొంత చిన్న వయస్సులోనే ఏదో ఒక విషయములో పొరపాటుపడినపుడు వీనికిపుడే బొబ్బాచారము పట్టిందని కూడ అంటున్నారు. ప్రస్తుత కాలములో బొబ్బాచారమనగ తెలివితక్కువ అను భావమున్నది. అదే పూర్వకాలములో అయితే ప్రపంచములో తెలివితక్కువ, పరమాత్మలో పూర్తి ఆచరణ అనెడి భావముండెడిది. చూచారా పూర్వకాలానికి ఈ కాలానికి ఎంత తేడా వచ్చిందో. ఏది ఏమైన అబ్బాచారమనెడి మాట బొబ్బాచారమను మాటగా ఇప్పటికీ మిగిలియున్నందుకు సంతోషించాలి. పూర్వము ఈ విషయముండెడిదను నిరూపణకు ఈనాడు బొబ్బాచారమను మాట మిగిలి ఉన్నది.



# వాయువు-ఆయువు

పంచభూతములలో ఆకాశము స్పర్శకు కూడ దొరకదు. చూపుకు కూడ దొరకని ఖాళీ బయలు, కావున అది మొదటి స్థానము వహించినది. రెండవదైన వాయువు కంటికి కనిపించక పోయినప్పటికీ స్పర్శకు తెలియబడుచున్నది. మూడవది అగ్ని రంగు ఆకారము కలదిగ ఉండి స్పర్శకు, చూపుకు తెలియబడుచున్నది. నాల్గవదైన నీరు చూపు, స్పర్శ, రుచి కూడ తెలియుచున్నది. ఐదవదైన భూమి చూపు, స్పర్శ, రుచియేకాక ముక్కుకు వాసనగ కూడ తెలియుచు చేతికి కూడ దొరుకుచున్నది. వీటికి జీవులకు ఉన్న సంబంధము వలననే వాటి వరుస క్రమమేర్పడినదని తెలియాలి.

మానవుని శరీరమందు ఈ ఐదు భాగములు ఇమిడి ఉన్నవి. ఇవి శరీరములలో ఉండి ఒక్కొక్కటి ఒక్కో ప్రత్యేకత కల్గి వాటి విధులు అవి నిర్వర్తించుచూ, శరీర ఆరోగ్య అనారోగ్యములకు కూడా కారణమై ఉంటూ, మానవుని జీవితమును సాగించునటుల చేయుచున్నవి. ఇందులో కనిపించని ఖాళీ ప్రదేశముగ జీవుడుండగ, ఆ జీవుని జీవితకాలమును కొలుచు కొలబద్దగ వాయువున్నది. నూనెను కొలుచుటకు లీటరు, గుడ్డను కొలుచుటకు మీటరు ఎట్లు ఉన్నవో, అట్లే ఒక శరీరములోని జీవుని జీవితకాలమును కొలుచుటకు వాయువు శ్వాస అను కొలత కల్గియున్నది.

చీరైతే ఇంత పొడవు, పంచైతే ఇంత పొడవు, టవలైతే ఇంతే పొడవు ఉండవలయునని ఎట్లు కొలతలున్నవో అట్లే మనిషైతే ఇంతకాలము, కుక్కైతే ఇంతే కాలము, దోమైతే మరీ ఇంతే కాలము అని జీవిత కాలములో తేడాలున్నాయి. ఒక్కొక్క జీవరాసికి ఒక్కొక్క రకముగ ఆయువు యొక్క తేడాలున్నాయనుట అందరికి తెలిసిన విషయమే.

మానవునికి నూరేళ్ళు, ఎద్దుకు ఇరవై ఏళ్లు, దోమకు ఏడు దినములు అన్నట్లు కొంత మేరకు వాటి ఆయువు నిర్ణయింపబడి ఉన్నప్పటికీ, వాటివాటి కర్మానుసారము మనిషి నూరేళ్లు బ్రతుకుతాడన్న నమ్మకమూ లేదు. దోమ ఏడు రోజులు బ్రతుకుతుందను నమ్మకమూ లేదు. ప్రమాదవశాత్తు కర్మరీత్య మనిషి ఆరు రోజులకు చనిపోవచ్చును. దోమ మూడు రోజుల వరకు జీవించవచ్చును.

కర్మ ప్రకారము ప్రతిది ముందే నిర్ణయించబడినట్లు, ఎవరు ఎంత కాలము బ్రతకాలన్నది కూడ నిర్ణయించబడి ఉన్నది. ఆ నిర్ణయము శ్వాస అను కొలతతో ఉన్నది. శ్వాసకు ఆధార రూపమైనది వాయువు. కావున ప్రతి వానికి జీవిత కాలము యొక్క పొడవు వాయువు చేత తయారు చేయబడినది. ఎన్ని శ్వాసల వాయువు వానికి ఉండవలయునో కర్మచేత ముందే నిర్ణయింపబడి ఉన్నది.

మానవుని జీవిత కాలము వాయువు చేతనే నిర్ణయింపబడి ఉన్నది. కావున పలానా వాని యొక్క వాయువు ఎంత అని చూడవలసినపుడు దానిని గురించి జ్యోతిష్యుని అడిగెడివారు. జ్యోతిష్యుడు జ్యోతిష్యశాస్త్రము ప్రకారము లగ్నమునకు ఎనిమిదవ ఇల్లును చూచి, అక్కడ గ్రహముల స్థితిగతులనుబట్టి వీని ఆయువు ఇంతే ఉన్నది, వీడు యుక్తవయస్సులో పోవుననో, వృద్ధాప్యములో పోవుననో చెప్పెడివారు. దీనిని బట్టి చూడగ మానవునికి నిర్ణయింపబడిన వాయువే ఈ దినము అందరి నోట ఆయువు అని పిలువబడుచున్నదని తెలిసినది. వీని వాయువెంత అని ఈనాడు అడగడములేదు. వీని ఆయువెంత అని అడుగుచున్నాము. వాయువు అను పదము ఆయువు అను పదముగా రూపాంతరము చెందినది. వాయువు అను పదములోని మొదటి అక్షరమైన వా లో వ+ఆ రెండు

శబ్దములు ఇమిడియున్నవి. వాయువులో మొదటి "వ" పోయి రెండవ "ఆ" మాత్రము మిగిలియుండుట వలన **ఆయువు** అని పలుకబడుచున్నది. ముందరి ***'వ'*** కారమును వదలి "ఆ" కారముతోనే పలుకబడు ***'ఆయువు'*** నిజానికి ***'వాయువు'*** అని తెలియాలి.

మన శరీరములో అందరికి తెలిసేలాగ వాయువు శ్వాస రూపముగ ఉన్నది. ఆ వాయువు శ్వాస అను కొలత ప్రకారము అయిపోవుచునే ఉన్నది. శ్వాస అయిపోవు కొద్దీ మనకు నిర్ణయింపబడిన వాయువు అయిపోవుచునే ఉన్నది. అనగా ప్రతి శ్వాసకు మనము మృత్యువుకు కొద్దిగా దగ్గరవుచున్నామని తెలియుచున్నది. కాని మన వాయువు మీద ఎవరికి ధ్యాసలేదు. వాయువు క్షీణించుచున్నదను జాగ్రత్త ఏమాత్రము లేదు. అది క్షీణించుకొద్ది జాగ్రత్తపడకపోగా, ప్రపంచ ధ్యాసలలో పూర్తి చిక్కుకొని పోవుచున్నారు. కాలము జరుగు కొద్దీ బాధ్యతలు పెంచుకొనుచూ, తన శరీరములోని వాయువును పూర్తిగా మరచిపోయి, మరణమను భయము లేకుండా చిరకాలముండునట్లు పనులు చేసుకొంటు పోయి, ఏదో ఒక రోజు తనకు తెలియకుండా మరణము పొందుచున్నారు.

**దీపమున్నపుడే ఇల్లు సర్ధవలెనను** పెద్దలు చెప్పిన సామెత (సమత) మరచిపోయి, ఆయువు ఉన్నట్లే పరమాత్మ ధ్యాసకల్గి, శరీర గృహమును ఆత్మ ధనముతో నింపుకోక, ప్రపంచ సంబంధమైన విషయములతో నింపుకొనుచున్నారు. ఇప్పటికైన నీ వాయువు మీద ధ్యాస పెట్టి, నేను పుట్టినపుడు ఎంత తెచ్చుకున్నానోననీ, దానిలో ఎంత అయిపోయిందో ననీ, పోయేదానికి దగ్గరకొచ్చిందేమోనని యోచించి, ప్రతి శ్వాస కాలమును మంచిగ గడుపుటకు ప్రయత్నించవలెను. నీలో నీకూ, నీ

వాయువుకూ అధిపతియైనవాడెవడో వానిని మరువవద్దు. రాజు తలచుకుంటే దెబ్బలు కొదవా! ఈశ్వరుడు తలచుకొంటే ఆయువు కొదవా! అను పెద్దల మాటను కూడ మరువవద్దు.

# పుణ్యమా! జ్ఞానమా!

ఎందరో, ఎన్నో పనులు నిత్యమూ చేయుచుందురు. అందులో కొన్ని మంచి పనులు కొన్ని చెడ్డపనులు ఉండును. మంచి పనులు గత జన్మ పుణ్యము వలన, చెడుపనులు గత జన్మ పాపము వలన జరుగుచుండును. అట్లు పాపపుణ్యములు కార్యాచరణకొచ్చినపుడు జరిగిన పనులలో తిరిగి పాపపుణ్యములు వచ్చుచుండును. ఇది సహజముగా ప్రపంచములో జరుగువిధానము. ఇది కాక చాలా అరుదుగా జరుగు విధానము కూడ ఒకటున్నది. ఇది కేవలం శ్రద్ధకు సంబంధించినదని చెప్పవచ్చును. ఆ శ్రద్ధయూ కేవలం దైవసంబంధ మైనదిగా ఉండును. గుణములలో ఉన్న ప్రపంచ శ్రద్ధకాక, పరమాత్మ సంబంధమైన శ్రద్ధవలన జరిగెడి కార్యాచరణలోని పనులకు పాప పుణ్యములు రావు. ఆ పనులలో పరమాత్మ సంబంధమైన జ్ఞానము మాత్రమే వచ్చును. ప్రపంచ సంబంధముగా చేసెడి పనులకు వచ్చునది కర్మ. దానివలన పరమాత్మకు దూరము కావడము జరుగుచుండును. పరమాత్మ సంబంధముగ చేసెడి పనులకు వచ్చునది జ్ఞానము. అందువలన పరమాత్మకు దగ్గర కావడము జరుగుచుండును. ఇలా పాపము వచ్చునది, పుణ్యము వచ్చునది, జ్ఞానము వచ్చునది అను మూడు రకముల కార్యములున్నవి.

ఒకడు మంచి పనిచేసినపుడు అది ఇతరులకు కూడ మంచిదై, వారికి మేలు చేయునదైవుండును. ఒకడు ఒక చెడుపని చేసినపుడు అది ఇతరులకు కూడా చెడుదై, వారికి నష్టము వచ్చునదై ఉండును. ఒకడు చేయు పరమాత్మ సంబంధ కార్యము వలన దైవమునకు మంచిదై జ్ఞానము కలుగుటకు, అది ప్రచారమగుటకు వీలుకలుగునదై ఉండును. మంచి వలన మంచి జరుగుట, చెడువలన చెడు కలుగుట, జ్ఞానము వలన జ్ఞానము కలుగుట వాటి వాటి విదానములని చెప్పవచ్చును. ఈ విషయము నిజమనుటకు ఉదాహరణగా ఒక విషయము చూస్తాము. ఒక గురువు వద్ద కొందరు శిష్యులు జ్ఞాన శిక్షణలో ఉండిరి. జ్ఞానము మీద శ్రద్ధగల మల్లయ్య అను శిష్యుడు గురువుకంటే మించిన దైవము లేడని తెలిసీ, గురువు యొక్క సుఖము కోరినవాడై, గురువుగారికి ఉపయోగపడు ఒక వస్తువును బజారు నుండి ఖరీదుచేసి కొని తెచ్చాడు. దాని వలన గురువుగారికి కొంత సుఖము ఏర్పడినది. అపుడు ప్రక్కనున్న మరొక శిష్యుడు ఇలా అన్నాడు. మల్లయ్య పుణ్యాన ఆ వస్తువు వలన గురువుగారికి కొంత సుఖము కల్గినది అనెను. ఆ మాట గురువు గారు విన్నవాడై వెంటనే ఇలా ఈ విషయములో మల్లయ్య పుణ్యాన అనకూడదు మల్లయ్య జ్ఞానాన అని అనాలి. మల్లయ్య పుణ్యము వలన చేసినదైనా, లేక మల్లయ్యకు పుణ్యము వచ్చునదైనా మల్లయ్య పుణ్యాన అని అనవచ్చును. ఈ పని పుణ్యము వచ్చునది కాదు, పుణ్యముతో చేసినదియు కాదు, కావున కేవలము జ్ఞానమే అతనికి వచ్చును. జ్ఞానము మీద శ్రద్ధ వలన చేసినదే కావున జ్ఞానము వచ్చును. కావున మల్లయ్య "జ్ఞానాన" అని అనాలి.

ప్రపంచ సంబంధముగ చేసిన మంచి పనులన్నింటిని వారి పాపపుణ్యాన అని చెప్పవచ్చును. ఒకడు చేసిన మంచిపని సహాయము

వలన ఇంకొకడు బాగుపడినపుడు వాని పుణ్యాన నేను బాగుపడినాననుట అక్కడక్కడ వినుచుందుము. చేసినది పుణ్యము పని అయినపుడు దానివలన పుణ్యము వచ్చునని అనవచ్చును. ఇక్కడ అటులకాదు, మల్లయ్య చేసినది జ్ఞాన సంబంధమైనది కావున అతను చేసిన పని అతని జ్ఞానాన కలిగినది. మల్లయ్య జ్ఞానాన గురువగు నాకు కొంత సుఖము ఏర్పడినది. కావున ఆయనకు జ్ఞానము లభించి పరమాత్మకు దగ్గరకాగలడు అనెను.

భూమి మీద కొద్దిగ ధర్మాలు మిగిలి ఉన్నాయి. కావున గురువుగారు చెప్పినట్లు ఒకరి ద్వారా మంచి జరిగినపుడు వాని పుణ్యాన నాకు మంచి జరిగినదని అక్కడక్కడ వింటుంటాము. అట్లే చెడు జరిగినపుడు వాని పాపాన వాడు పోతాడు, అనుట వినియుందుము. పరిశీలించి చూచినట్లయితే పుణ్యము వలన పుణ్యము, పాపము వలన పాపము, జ్ఞానము వలన జ్ఞానము కలుగునని తెలియుచున్నది. జ్ఞానమువచ్చు పనులకు పుణ్యము అని చెప్పకూడదు.

# స్వప్నములు

పూర్వ కాలములో "స్వంత ఆచరణ" అనుమాటను స్వప్నములు అనెడివారు. నాప్రాణాన్ని ఫనంగా పెట్టి అయినా సాధిస్తానని అనడము ఇప్పటికీ అక్కడక్కడ వినుచుందుము. నేను స్వయంగా ఆ పని చేస్తానని (ఆచరిస్తానని) గాఢంగా చెప్పుటకు అలా అనుచుందురు. ఫనములు అనగ కార్యములని **'స్వ'** అనగ స్వంత లేక తనయొక్క అని అర్థము. స్వంత పనులు అనడమును స్వఫనములు అనెడివారు. కాలక్రమమున

ఎన్నో పదముల ఉచ్ఛారణలో మార్పు వచ్చినట్లు, స్వఫనములు కూడ మారిపోయి స్వప్నములైనవి. జాగ్రత్తావస్థలో జరుగు కార్యములన్నీ వారు చేయు పనులేనని అందరు ఒప్పుకోకతప్పదు. కాని స్వప్నములలో జరిగిన కార్యములు మాత్రము తాను నిద్రపోయి ఉన్నాను కదా నేనెప్పుడు చేశానని ప్రశ్నించుకోక తప్పదు. నిద్రలో జరగని పనిని జరిగినట్లు అనుకోవడమును కల అనీ లేక స్వప్నము అని అనుచుందురు. ఇది కలా, నిజమా? అనికూడ అనడము అక్కడక్కడ వినుచుందుము. అబద్ధమును కలయని తలచు భావముండుట వలన ఇది అబద్ధమా, నిజమా అనుమాటను కలా? నిజమా? అని అనుట గలదు. కలా? నిజమా అనుట వలన స్వప్నములను అందరు అబద్ధముగనే భావించుచున్నారని తెలియుచున్నది. మరియు కొందరు అద్వైతులు **'బ్రహ్మ సత్యం జగత్ మిథ్య'** అనుచు దైవము మాత్రము నిజము, ప్రపంచము అసత్యమని చెప్పుచుందురు. దానినే వివరముగ చెప్పునపుడు ప్రపంచమూ జీవితమూ అంతయు కలలాంటిది, ఇది నిజము కాదు, కనిపించని దైవమే నిజముగ ఉన్నదని కూడ చెప్పుచుందురు. మొత్తము మీద కల లేక స్వప్నము అనునది అసత్యమైనదనీ, నిజముకాదను భావము చాలా మందిలోనున్నదని తెలియుచున్నది.

యోచించి చూస్తే స్వప్నమును అసత్యమనుట పూర్తి పొరపాటనీ, స్వప్నము వాస్తవమైనదనీ చెప్పవచ్చును. ఎటువంటి కదలికలేని నిద్రలోని మనిషికి లోపల ఏమి జరిగినదో బయటవారికి తెలియనిది సత్యమెట్లగునని? చాలామందికి అనుమానము కూడ ఉన్నది. కొందరేమో అటు సత్యమనీ, ఇటు అసత్యమనీ తేల్చి చెప్పలేక పోవుచున్నారు. ఎవరేమనుకొనినప్పటికి స్వప్నము అసత్యమను మాట నిజముకాదనీ,

స్వప్నము సత్యమైనదనీ చెప్పుటకు ఆధారములున్నవి. స్వప్నములు శరీరములోనే కర్మరీత్య జరుగుచుండును. బయట మనుషులతో సంబంధము లేకుండ జరగవలసిన కర్మవున్నపుడు, స్వప్నములో ఆ కర్మ జరుగును. అట్లే తాను మాత్రము ఎవరికీ తెలియకుండ అనుభవించవలసి వచ్చినపుడూ, మరియు అసాధారణ కర్మలు నెరవేరవలసి ఉన్నపుడూ, బయటి ప్రపంచమునకు తెలియకుండ ఎవరిది వారికి తెలియునట్లు జరుగు కర్మ ఆచరణ స్వప్నములోనే జరుగుచుండును. ఎవరి కర్మ వారికి మాత్రమే తెలియు దానిని స్వంత అగుటవలన స్వ అనీ, ఆచరణలను ఫనములనీ, స్వఫనములనీ తర్వాత స్వప్నములని పిలుచు చున్నాము. నిద్ర, మెలుకువ అవస్థల మాదిరే జీవునకు స్వప్నావస్థ (స్వంత అవస్థ) అనునది కూడ గలదు. అందులో జరుగునవి జీవుడు స్వయముగ అనుభవించవలసియున్నది. స్వప్నావస్థలో జీవునికి అన్ని అనుభవములున్నవి. జీవుడు సూక్ష్మశరీరము ద్వార అనుభవములను అనుభవించును. అందువలన స్థూలశరీరము ఎచటనున్నది అచటే కదలకుండును. స్థూలశరీరము కదలలేదను అభిప్రాయముతో స్వప్నములు అసత్యమని కొందరనుకొనుచుందురు. స్వప్నములు స్థూలము ద్వార జరుగక సూక్ష్మము ద్వార మాత్రమే జరుగుచుండుట వలన కొందరలా అనుకొనుచుందురు.

స్వప్నములలోని విషయములు దాదాపు 95 శాతము సూక్ష్మము ద్వారానే జరుగుచుండును. కేవలము 5 శాతము మాత్రము సూక్ష్మముతోనే కాక స్థూలముతో కూడ సంబంధపడి జరుగుచుండును. మనిషికి అలాంటపుడు మాత్రము స్వప్నము నిజమని నమ్ముటకు ఆధారములు దొరుకుచున్నప్పటికీ, తర్వాత సూక్ష్మము ద్వార జరుగు

స్వప్నముల మీద తిరిగి అనుమానమొచ్చుటకు అవకాశమున్నది. స్వప్నములో జీవుడు కర్మ అనుభవించుటకు శరీరములోని సూక్ష్మ భాగములు పని చేయునపుడు నమ్మలేని సత్యమును, కర్మేంద్రియాలు పని చేసినపుడు నమ్మవలసి వస్తున్నదన్నాము కదా! అదెలాగనగా! స్వప్నమొచ్చినపుడు అందులో కర్మేంద్రియములైన నోరు, గుదము, లింగము అను మూడు విసర్జన అవయవములు మాత్రము స్వప్నములో పని చేసినట్లయిన, ఆ స్వప్నము నిజముగ జరిగినదని నమ్ముటకు ఆధారమేర్పడును. కర్మేంద్రియములలో లింగము మూత్ర విసర్జన మరియు వీర్యవిసర్జన చేయునదై ఉన్నది. ఈ మూడిటిలోను స్వప్నమునందు ఏ ఒక్కటి పనిచేసినా, అవి విసర్జన అవయవములు అగుట వలన శరీరమునందు అవయవములనుండి విసర్జన పడుకొన్న శరీరము ద్వారా జరిగియుండును. అట్లే స్వప్నములో ఏ స్త్రీతోనైన సంయోగము చేసినట్లయితే, స్వప్నములో వీర్య స్కలనము జరిగి స్త్రీ సంభోగ సుఖము జీవుడు అనుభవించును. అది జరిగినది స్వప్నములో అయినప్పటికీ విసర్జన అవయవము అక్కడ పనిచేసినందువలన, అది స్థూల శరీరములోని లింగము ద్వార జరిగి వీర్యస్కలనము గుడ్డల మీద కనిపించును. ఇలా మూత్రవిసర్జన గానీ, వీర్యస్కలనము గానీ స్వప్నములో జరిగినట్లయితే బాహ్య శరీరము ద్వార అవి నెరవేరుచున్నవి. అదే మాదిరి స్వప్నములో నోటితో ఎంగిలి మూసినట్లు జరిగితే అదిపడుకొన్న చోటనే మూయబడి ఉండును. అదే విధముగ స్వప్నములో నిర్జన ప్రదేశములో మల విసర్జన చేసినట్లయినపుడు, అది స్థూల శరీరము ద్వార పడుకొన్న చోటనే జరిగి ఉండును. ఏదికాదని వాదించినప్పటికీ ఈ మూడు అవయవముల కార్యములను ఎవరు కాదనలేరు. విసర్జన బాహ్య ప్రపంచ సంబంధముతో ముడిపడి ఉన్నది. కావున అవి తప్పక

బయటికి కనిపించును. వీటిని బట్టి స్వప్నములు అసత్యమనుటకు గానీ, అవి శరీరమందే జరగలేదనుటకు గానీ అవకాశమే లేదు. ప్రతి స్వప్నము శరీరమందు జరుగుచున్నది, దానిని జీవుడు అనుభవిస్తూనే ఉన్నాడు. మనస్సుకు, బుద్ధికి, చిత్తమునకు, జీవునకు, అహమునకు, పంచతన్మాత్రలకు, పంచవాయువులు అయిన సూక్ష్మ ఆకారము చేత పడుకొన్న శరీరములోనే స్వప్నములు జరుగుచున్నవని తెలియాలి. దీనిని బట్టి స్వప్నములు సత్యములనీ, అసత్యములుకాదని కూడ తెలియాలి.

# చైతన్య శక్తి (కుండలీ శక్తి)

చైతన్యశక్తి అను పదమును ఆత్మశక్తి అనుదానికి బదులుగ ఉపయోగించిన పదమని తెలియాలి. చైతన్యశక్తి అనినా, ఆత్మశక్తి అనినా, సత్తు అనినా, కదలికశక్తి అనినా ఒక్కటేనని తెలియాలి. ప్రతి జీవరాసి శరీరములో ఆ శక్తి ఉండి, ఆ శరీరములు కదులుటకు ఉపయోగ పడుచున్నది. కనురెప్ప కదులుటకు, కాళ్లు చేతులు చలించుటకు, గుండె స్పందించుటకు, సకలేంద్రియములు పనిచేయుటకు ఆత్మశక్తి అవసరము. ఉదాహరణకు రేడియో, ఫ్యాన్, టీవి, ఫోన్, లైటు మొదలగు వస్తువులు వేరు వేరై, వేరు వేరు కార్యములకు ఉపయోగపడునవైనప్పటికీ అవి పనిచేయుటకు విద్యుత్తు అను ఒకే ఒక శక్తి అవసరము. అట్లే మన శరీరములో వేరువేరు అవయవములుండి, వేరువేరు కార్యములకు ఉపయోగపడునవైనప్పటికీ అవి పని చేయుటకు ఒకే ఒక శక్తి అవసరము, అదియే ఆత్మశక్తి (చైతన్యశక్తి). బయటి పరికరములకు ఉపయోగపడు విద్యుత్‌శక్తి రాగి అల్యూమినియమ్ తీగలద్వార ప్రవహించగలదు. అట్లే

శరీరముల లోపల గల చైతన్యశక్తి మన శరీరములలోని నరముల ద్వార ప్రవహించుచున్నది. విద్యుత్తును అది ప్రవహించు స్పీడును ప్రవాహ వెడల్పును బట్టి ఇంత ఓల్ట్స్ అని ఇంత ఆమ్‌పియర్స్ అని చెప్పవచ్చును. అయితే శరీరములో ప్రవహించు ఆత్మశక్తిని కొలుచుటకు పరికరములు లేవు, కొలుచుటకు సాధ్యపడునది కాదు. ఇంత స్పీడుతో ఇంత మందములో ప్రవహిస్తున్నదని చెప్పలేము. విద్యుత్ ప్రవాహము మొదలవు స్థానము జనరేటర్ అనుకుందాము. ఆ విధముగనే చైతన్యశక్తి మొదలవుటకు కూడ స్థానము కలదు, అది మన శిరోభాగము. విద్యుత్ ఒకచోట తయారై అచటినుండి ప్రవహించునదైతే, చైతన్యశక్తి అలాకాక ఒకచోట నిలువయుండి అచటి నుండి ప్రవహిస్తున్నది. విద్యుత్ ఒక కేంద్రములో తయారవుటను బట్టి ప్రవహించడము, అది ఉపయోగ పడడము జరుగుచున్నది. తక్కువ తయారైతే తక్కువగనే వినియోగించు కోవలసివస్తున్నది. ఆత్మశక్తి అలాకాదు అది ఒక కేంద్రములో తయారవునది కాదు, ఉపయోగాలకు తక్కువ వచ్చునది కాదు. అది శిరోభాగములో కేంద్రీకృతమై ఉండీ, కర్మానుసారము ఏ శరీరమునకు ఎంతకావాలో అంత శక్తిని అందిస్తూనే ఉంటుంది.

శరీరములో గల ఈ శక్తిని గురించి తెలుసుకోవాలను యోచన విజ్ఞాన పరిశోధకులకు కొందరికొచ్చినప్పటికీ, ఇంతవరకు అది ప్రవహించు నర్వస్ సిస్టమ్‌ను గురించియే తెలుసుకోలేక పోయారు. కనుక ఆ శక్తిని ఏమాత్రము తెలుసుకోలేక పోయారు. ఆత్మశక్తిని తెలుసుకోవడములో బ్రహ్మవిద్యా శాస్త్రమును తెలిసినవారు ముందంజ వేయగలిగి దాని వివరమంతా తెలుసుకోగలిగారు. తెలుసుకొన్నవారు దాని అనుభూతిని చెప్పుటకు సాధ్యము కాకపోయినప్పటికీ, దానిని

గూర్చి కొన్ని విషయములను అందించుటకు వీలున్నది. అందులో అది ప్రవహించు విధానమునూ, అది పనిచేయు విధానమునూ ముఖ్యముగ తెలుసుకొందాము.

తలయందుగల మెదడు మధ్యభాగములో చైతన్యశక్తి (ఆత్మశక్తి) నిలువయుండి, మెదడునుండి ప్రారంభమై గుదస్థానము వరకు వ్యాపించి ఉన్న వెన్నుపాము అను పెద్ద నరము ద్వార శరీర అన్ని భాగములకు వ్యాపించుచున్నది. బ్రహ్మనాడి అనునది ఆత్మశక్తి ప్రవహించు కాలువకాగా, ఆ కాలువకు కొన్ని నరములను తూములుండీ, ఆ తూముల ద్వార బయటికి ప్రవహించి, ఆ కాలువలు చిన్న చిన్నవిగ చీలిపోగా, మొత్తము శరీరమంత ఆ శక్తి ప్రవహిస్తున్నది. ఈ తతంగమంత నీరు నిలువయున్న డ్యాం నుండి మొదట పెద్దకాలువ తర్వాత చిన్నకాలువల ద్వార చీలుతుపోయి చివరకు పొలములన్నిటిలో నీరు వ్యాపించి తడిచేయునట్లు, ఆత్మశక్తి తలనుండి మొదట బ్రహ్మనాడీ తర్వాత సూర్యచంద్రనాడులూ, ఆ తర్వాత అనేక నాడులయందు ప్రవహించి, చివరకు వెంట్రుకలకంటే చిన్నగ ఉండు నరముల ద్వార శరీరములోని ప్రతి అణుధాతువుకు చేరి పోవుచున్నది. శరీర అవయవములు కదలునట్లు మరియు శరీర ధాతుకణములు పనిచేయునట్లు చేయుచున్నది. చిత్రమేమిటంటే పొలములకు కాలువల ద్వార ప్రవహించు నీరు కొంతకాలమునకు డ్యాంలో అయిపోవచ్చును. కాని తలలోని శక్తి ఎప్పటికి అయిపోవునది కాదు.

కాలువల ద్వార ప్రవహించు నీరు ఎక్కడి నుండి వస్తున్నదని వెదకి చివరకు డ్యాం నుండి అని తెలుసుకోవచ్చును. ఆ నీటిలో మునిగి రుచి చూచి, ఆ నీరు ఇటువంటిదనీ పలానా రుచిగలదనీ

దానిని గూర్చి ఇతరులకు చెప్పవచ్చును. తలనుండి ప్రవహించు శక్తి ఎచ్చటినుండి వస్తున్నదని తెలుసుకొన్నవారు, దానియందు మునిగి (కలిసి) అది ఎట్లున్నదను అనుభూతిని పొందినవారు భూమిమీద అరుదుగ ఉండవచ్చును, కాని అది ఇట్లున్నదని చెప్పుటకు ఎవరికీ శక్యముకాదు. అట్లు చెప్పలేక పోవుటకు కారణము దానిని పోలినది మరియొకటి లేదు, కనుక చెప్పలేరు. నీటిని గురించి చెప్పలేక పోయినా దాని కాలువల గురించి చెప్పినట్లు, ఆ నీరు చేయుపనిని గూర్చి చెప్పినట్లు, ఆత్మశక్తి అనుభూతిని చెప్పలేక పోయినప్పటికీ, అది ఎట్లు ప్రవహిస్తున్నది శరీరమందు అది దేనికి ఉపయోగపడుచున్నది చెప్పవచ్చును.

తలనుండి ప్రారంభమైన మొదటి పెద్ద నరముయొక్క పేరు వెన్నుపాము అనడము అందరికి తెలుసును. ఈ నరము కపాలమునుండి ప్రారంభమైన వెన్నెముక పూసల మధ్యలో గలదు. వెన్ను అనగ వీపు అని అర్థము. వీపున గల ఎముకల దండిలో ఉన్నది కనుక దానిని వెన్నుపాము అంటున్నాము. వెన్నెముక ఒక ఎముక కాదు. అది పూసలవలె ఉన్న కొన్ని ఎముకల దండలాగ ఉండును. కావున దానిని వెన్నుదండ అని అనడముకూడ జరుగుచున్నది. వెన్ను ఎముక పూసల మధ్యగల సందులో మెదడు నుండి ప్రారంభమైన పెద్ద నరము వ్రేలాడుచున్నది. కనుక దీనిని వెన్నుపాము అనడము జరిగినది. వెన్నుపాము అనడములో వెన్ను అంటే తెలిసినది, కాని పాము అని ఎందుకన్నారని ప్రశ్న రావచ్చును. నాగుపాముపవలె మెదడునుండి దీని నిర్మాణము ఉన్నది కనుక ఆ నాడిని పాము అనడము జరిగినది. తలలోని తెల్లని మెదడునుండి దీని నిర్మాణము ఉన్నది, కనుక ఆ నాడిని పాము అనడము జరిగినది. తలలోని మెదడునూ, దాని నుండి మొదట

లావుగ ప్రారంభమై చివరకు చిన్నగ ముగిసిన తెల్లని నరమునూ, చిత్రించుకొని చూచిన మెదడు పడగలాగ చివరి భాగము తోకగ కనిపించి పాముగ పోలియున్నది. అందువలన పాము అనడములో చిత్రమేమి లేదు. అంతేకాక దీనిని పాము అనడములో ఇంకా కారణము కూడ కలదు. అది ఏదనిన మనము నాగుపామును తలమీద కొట్టి చంపినపుడు, అది చనిపోయినట్లు పడిపోవుట వలన అది నిజముగ చనిపోయినదనుకుంటాము. కాని దాని శరీరము కొంత పాడైనప్పటికీ, మిగిలిన కొంత భాగమునందు లోపల చైతన్యము కలిగియుండీ, కొన్ని గంటలకు అది తిరిగి పూర్తి చలనము కలిగి ప్రాకిపోవు అవకాశము కలదు. తల పగులకొట్టినా, వీపు విరగ కొట్టినా, తిరిగి బ్రతికి పోవుటకు వీలున్నది. కావున పూర్వము తెలిసినవారు నాగుపామును చంపితే తిరిగి బ్రతుకకుండ దాని శరీరమును పూర్తి కాల్చి బూడిద చేసెడివారు. పూర్తి విషయము తెలియకున్ననూ, ఈ కాలములో కూడ నాగుపామును చంపిన తర్వాత కాల్చడము జరుగుచున్నది. పాముకు తలనుండి చివరివరకు ప్రాణమున్నదను విషయము ఆనాటి వారికి తెలుసును. నాగుపామువలె మన వెన్ను నరము కూడ మెదడు నుండి చివరవరకు చైతన్యము కలిగి ఉన్నది, కావున పాము అను పేరు దీనికి సార్థకమైనది.

వెన్నుపాము నుండి ప్రక్కలకు అనేక నరములు బయలుదేరి అవి విభజింపబడుచుపోయి, చివరకు శరీరములో ప్రతి భాగమునకు చేరుచున్నవి. వెన్నుపామును పోలినట్లే అన్ని నరములు ఉండుటవలన, అవి ఒకదానికొకటి విడిపోవుట వలన, చూచుటకు వెన్నుపాము చెట్టు మొదలు కాగ, మిగత నరములు దాని కొమ్మలు కాగ, శాఖోపశాఖలుగ విభజింపబడిన వృక్షములాగ కనిపించును. అందువలన శరీరములోని

మొత్తము నరనిర్మాణమును గూర్చి భగవద్గీత పురుషోత్తమప్రాప్తి యోగమను అధ్యాయములో **'అశ్వర్థ వృక్షమని'** అన్నారు. అశ్వర్థవృక్షమంటే రావిచెట్టని అందరికి తెలుసు. శరీర నరనిర్మాణమును భగవద్గీతలో రావి చెట్టుగనే ఎందుకు పోల్చారనుటకు కూడ సమాధానము గలదు. రావిచెట్టు ప్రతి ఆకు పడగెత్తిన నాగుపామువలె ఉండును. ఆకు పై భాగము పాము పడగ ఆకృతిని పోలి క్రింద భాగమున ఆకు పొడవాటి కొనభాగము పాము తోకను పోలి ఉండునట్లు ఎవరైనా గ్రహించవచ్చును. **(రావి చెట్టు నాగుపాముకు మారుపేరుగ ఉన్నదనీ, పాము విషమును తిరిగి పాము పీల్చగలదను వైద్య సూచన ప్రకారము, రావిఆకుతోనే పాము విషమును మనిషి నుండి తీసివేయవచ్చునను వైద్య విధానమును మేము సత్యాన్వేషి గ్రంథములో తెలిపాము)** శరీర నాడీ నిర్మాణమును వృక్షకొమ్మలవలె ఉన్నదనుటకు అశ్వర్థవృక్షమును గీతయందు భగవంతుడు పేర్కొన్నాడని తెలియాలి.

ఇంకనూ ఇటువంటి నిర్మాణము గల శరీరములో జీవుడు నివశించడము ఎట్లున్నదనగా, విషయములను పాములవలయములో నివశించినట్లేనని తెలియుచున్నది. అందువలననే ఈ చెట్టు విషయము తెలిసితే, సర్వ వేదములను తెలిసినట్లేనని భగవంతుడు అన్నాడు. ఈ అశ్వర్థవృక్షమను శరీరమందుండుట పాముల విషవలయములో చిక్కి నివశించుటవంటిది. ఇది గుణములను ఆహారమును ఉపయోగించుకొని పెరిగీ, కర్మములను ఫలములనుకాచి రెండవ జన్మకు విత్తనములుగ నిలుచుచున్నది. ఇది మన శరీరమందు కనిపించని వృక్షమయితే, ఇది కదలుటకు వృద్ధి అగుటకు అవసరమైనదేదో ఒక మూలశక్తి కావాలి కదా! అదే ఆత్మశక్తి. ఆ శక్తి మెదడును కేంద్రముగా చేసుకొనియుండి,

అశ్వర్థవృక్షములాంటి నరనిర్మాణమంతయు ప్రాకి, శరీరయంత్రాంగ మంతయు పని చేయునట్లు శక్తి నిచ్చుచున్నది.

సూర్యుడొక్కడు ఆకాశములో పైనయుండి ప్రపంచమునంతటిని తన కిరణముల ద్వార ప్రకాశింపజేసినట్లు, ఆత్మ శరీర పై భాగమున తలయందుండి నాడుల ద్వార మొత్తము శరీరమునంతటికి చైతన్యము కలుగజేయుచున్నది. ఆత్మశక్తి శరీరములోని ప్రతి భాగమునకు చేరి, ప్రతిభాగము తన పనిని నిర్వర్తించుటకు కావలసిన చైతన్యమును అందించుచున్నది. అందువలన కన్ను చూడగల్గుచున్నది, కాళ్లు నడువ గల్గుచున్నవి, నోరు మాట్లాడగల్గుచున్నది. ఇలా బయటి అవయవములే కాక లోపలి గుండె, ఊపిరితిత్తులు, కాలేయము మొదలగు మన ఇచ్ఛలో లేని అవయవములు కూడ పనిచేయుచున్నవి. అహర్నిశలు ఆ శక్తి శరీరములో ప్రాకి ఉండబట్టె మనము నిద్రించునపుడు కూడ గుండె కొట్టుకోగలుగుచున్నది, ఊపిరి ఆడగల్గుచున్నది. ఆ శక్తి ఏ క్షణములో గుండె చివరి వరకు చేరదో అపుడు గుండె ఆగిపోగలదు. అందువలన మనిషి సజీవమై ఉన్నాడంటే, మనిషిలోని అవయవములన్ని పనిచేయు చున్నవంటే, ఆ శరీరములో చైతన్యశక్తి శరీరమంతటా అన్ని భాగములకు వ్యాపించి ఉందన్నమాట.

ఈ శక్తి రక్తప్రసారము లేని నాడుల ద్వార ప్రవహించునది. ఎప్పుడైనా కూర్చున్నపుడు కాలిలోపలి నరమునకు ఒత్తిడికల్గి దానిలో ప్రవహించుశక్తికి ఆటంకమేర్పడినపుడు, ఆటంకమేర్పడిన స్థలము నుండి క్రింది భాగమంతయు జోము పట్టి స్పర్శలేనిదై, బలము లేనిదై పోవును. అది గమనించిన మనము కొద్దిగ కదులుటవలన తిరిగి శక్తి ప్రవహించి జోము పట్టిన భాగమంతయు కొద్దిక్షణములలో చైతన్యవంతమగును. అట్లే ఒక వ్యక్తికి ఒక ప్రమాదములో వెన్నుపాము మధ్యలోనికి తెగిపోయినది

ఆ వ్యక్తికి వెన్నుపాము తెగిపోయిన ఊపిరితిత్తుల భాగమునుంచి క్రిందిభాగము ఎటువంటి స్పర్శకానీ, నొప్పికానీ అసలు అది ఉన్నట్లు కానీ తెలియకుండ పోయినది. తెగిన పై భాగమునుండి స్పర్శ నొప్పి అన్నీ ఉన్నాయి. కావున ఆత్మశక్తి అంతవరకే ప్రవహిస్తున్నదనీ, క్రిందిభాగమునకు ప్రవహించక పోవడమువలన అది చైతన్యమును కోల్పోయినదనీ తెలియుచున్నది. ఆత్మశక్తినే కుండలీశక్తి అనుటకూడ జరుగుచున్నది.

దీనినంతటిని గమనించిన కుండలీశక్తి అను చైతన్యము అహర్నిశలు శరీరమంతా వ్యాపించి ఉండవచ్చునని తెలియుచున్నది. వాస్తవ విషయమిట్లుండగా, కొందరు జ్ఞానులమనుకొన్నవారు కుండలీశక్తి నాభిస్థానమందు పామువలె చుట్ట చేసుకొని నిద్రపోవుచున్నదనీ, దానిని నిద్ర లేపవలెననీ, అట్లు నిద్రలేపడమే యోగసాధననీ బోధించడమూ పుస్తకరూపముగ వ్రాయడమూ జరిగినది. కుండలీశక్తి అంటే ఏమిటో తెలియని వారందరు అది నిజమేనని నమ్మినారు. ఆ మాట నిజముకాదనీ నిరూపణకు రానిమాటయనీ తెలుసుకోలేక పోయారు. ఆ శక్తి నిదురించునది కాదు. అదియే ఎరుకై ఉండగ దానికి నిద్రనునదే లేదు. అది నిదురించితే సర్వ శరీరములు నిశ్చేష్టమై, నిర్జీవమై పోగలవు. ఈ శక్తి నిద్రించునదనుటకు తార్కాణముగానీ, శాస్త్ర ఆధారముగానీ, లేకపోగా, కొందరు గ్రుడ్డిగ ఎలా చెప్పగలిగారో అర్థము కాలేదు. అది నిదురించునది కాదని ఆత్మలింగ శతకములో కూడ ఒకాయన ఇట్లన్నాడు.

ఆ॥ నల్ల తామరాకు నడుమ రంధ్రములోన
కుండలియను పాము గ్రుడ్లు పెట్టి
రెండు పిల్లలీని రేయి బగలరచెన్
అఖిల జీవసంగ ఆత్మలింగ !

పై పద్యములో కుండలీశక్తి అనునది ఉచ్ఛ్వాస, నిచ్ఛ్వాసలను అరుపుగ రేయి పగలరచుచున్నదని తెల్పాడు. దీనినిబట్టి అది నిదురించు నది కాదని తెలియుచున్నది. శరీర కార్యములన్ని జరుగుటకు కర్మ కారణమైతే, ఆ కార్యములు జరుగుటకు శరీరమునకు కదలిక శక్తి నిచ్చునది కుండలీ (ఆత్మ) శక్తి. కర్మానుసారము కదలికలు గల వారందరికీ ఆ కదలికలకు వెనుక శక్తియుండి కదిలించుచు అహర్నిశలు మేల్కొని ఉన్నది. మనిషి నిద్రించునపుడు బాహ్యశరీరము కదలకున్ననూ, లోపల కదలికలకు నరముల ద్వార శక్తినందించుచూ, మనము అజాగ్రత్తగ నిద్రలోనికి పోయినప్పటికీ అది జాగ్రత్తగా ఉన్నది. ఆ శక్తిని నిద్రించుచున్నదని చెప్పడము చాలా పొరపాటు.

# ఆశ్రమము-పోలీస్‌స్టేషన్

నేటి ప్రపంచములో మనుషులందరు ఎవరి పనివారు చేసుకొంటు పోతున్నారు. వారికిష్టమొచ్చిన పనిచేయడమే వారి ఉద్ధేశ్యము. ఆ పనియందు ఇతరులకు కష్టమెంత, నష్టమెంత అని యోచించక కేవలము తన లాభము, తన సుఖము కోసము చేయుచున్నారు. ఇలా మనము చేయుపనులలో కొన్ని మంచివి ఉండవచ్చును, కొన్ని చెడ్డవి ఉండవచ్చును. అవి ఏవైన అపుడు తనకు కావలసిన పనినే చేయును కాని ఎవడూ ఇది మంచిది కదాయనీ, లేక చెడ్డది కదాయనీ తలువడు. ఎప్పుడైన ఒకప్పుడు ఆ యోచన వచ్చినప్పటికీ తాను చేయుచున్నది మంచిదేననుకొనును. ఎవరైన ప్రక్క వ్యక్తి నీవు చేయుచున్నది సరికాదని తెలిపినప్పటికీ, తాను చేయుచున్నది సరియైనదే అందుకే చేయు చున్నానను.

ఎవరు ఏ పని చేయుచున్ననూ వాటిని మంచిచెడు అని ఎలా నిర్ణయించగలము? మంచివాడు మంచి పనిచేయుచున్నపుడు దానిని చెడ్డవాడు చెడ్డ పని అనుకోవచ్చును కదా! చెడ్డవాని దృష్టికి మంచి పని చెడ్డగ, చెడ్డపని మంచిగ తోయును కదా! అలాంటపుడు పనులను ఇవి మంచివి, ఇవి చెడ్డవి అని ఎలా నిర్ణయించగలము? వాటిని నిర్ణయించుటకు ఏమైనా మార్గమున్నదా? అని యోచిస్తే ఉన్నదనియే తెలియుచున్నది. నీతి, న్యాయము అను సూత్రములను బట్టి ఏ కార్యములోనైన మంచి చెడ్డలు నిర్ణయించవచ్చును. నీతిసూత్రములు ఇవి అని ఎందరో పెద్దలు తెలిపియున్నారు. నీతికి లోబడి చేసిన పనులు న్యాయమైనవిగా ఉండును. అవినీతికి లోబడి చేసిన కార్యములు అన్యాయమైనవిగా ఉండును. ఇదంతయు బయట కనిపించు తంతు అనియే చెప్పవచ్చును. బయటి కార్యములకు ఫలితము డబ్బు రూపముగనో, ధాన్యరూపముగనో, వస్తురూపముగనో వచ్చునని అందరికి తెలియును. కాని కంటికి కనిపించని ఫలితము ప్రతి కార్యములోనూ వస్తున్నదని చాలామందికి తెలియదు. ఆ తెలియని ఫలితమేమిటనగా ఒకటి పాపము, రెండవది పుణ్యము. కార్యాచరణలో పాపభీతి లేకుండ పాపమువచ్చు పనులు చాలామంది చేయుచున్నారు.

ఒక సూత్రము ప్రకారము చెడు అవినీతి పనులు చేయుటవలన పాపము, మంచి నీతి పనులుచేయుట వలన పుణ్యము వచ్చునని తెలుసుకొన్నాము కదా! పాపము వలన వచ్చు ఫలితము (అనుభవము) ఏమిటని, అట్లే పుణ్యము వలన వచ్చు అనుభవము (ఫలితము) ఏమిటని ప్రశ్న కూడ కలుగుచున్నది. దానికి జవాబు పుణ్యము చేయుటవలన కలుగు ఫలితము సుఖసంతోషములు, అట్లే పాపము చేయుట వలన

ఫలితము కష్ట దుఃఖములు కలుగును. ఈ జన్మలో ఒక పని చేయుట వలన సంభవించు కంటికి కనిపించని పాపము గానీ, పుణ్యము గానీ ఈ జన్మలోనే అనుభవానికి వచ్చునా? అన్న ప్రశ్న ఉద్భవించినపుడు ఒక జన్మలో చేసిన పాపముగానీ, పుణ్యముగానీ ఆ జన్మలోనే అనుభవమునకు రాదు. తిరిగి వచ్చు జన్మలలో వచ్చునని తెలియుచున్నది. ఒక చెడు పనిచేసినప్పటికీ బయటికి కనిపించు అనుకూలమైన ఫలితము మీద దృష్టి కేంద్రీకరించడము వలనా, కంటికి కనిపించని పాపపుణ్యములు కంటికి కనిపించక వాటి అనుభవము ఆ జన్మలో లేక పోవడము వలనా, మానవుడు చెడు ఏదను యోచన లేకుండా బాహ్య ప్రపంచ కోర్కెల మీద ఆధారపడి పనిచేయుచున్నాడు.

ఒకనిని మోసము చేయుటవలన ఇంకొకనికి కొంత డబ్బు వచ్చును. ఒకనిని హత్య చేయుట వలన అతని ఆస్తి మొత్తము ఇంకొకనికి లభించును. ఇట్లు వానికొచ్చు లాభము మీదనే మానవుని దృష్టి ఉండుట వలన తన మెదడుయందు పాపమొచ్చునను భయము లేకుండ ఇష్టమొచ్చిన కార్యములు చేయుచున్నాడు. ప్రజలు చెడుకార్యములు చేయకుండ ప్రభుత్వము ఎన్నో కట్టుదిట్టములు చేసినది. మోసగాళ్లను, హంతకులను, కుతంత్రములు చేయువారిని, హత్యాచారము చేయువారిని, దొంగలను కనిపెట్టి పట్టుకొనుటకూ, అటువంటి పనులు చేయకుండ చెడ్డవారిని అడ్డగించుటకూ, మంచి వారికి రక్షణ ఇచ్చుటకూ, ప్రభుత్వము రక్షకభటులను (పోలీస్‌లను), పోలీస్ స్టేషన్‌లను నియమించింది. తప్పు చేసిన వారిని విచారించుటకు న్యాయస్థానములు, న్యాయాధిపతులను, శిక్ష అనుభవించుటకు జైళ్లను నియమించింది. ప్రభుత్వము యొక్క ఉద్దేశ్యము మంచిదే అయినప్పటికీ ప్రభుత్వకార్యముల వలన చెడు

ఎంతమటుకు పోయినది అని యోచిస్తే, ప్రజలలో చెడు నశించక పోవడమే కాక మరికొంత పెరుగుచున్నది. యోచిస్తే ప్రతి మనిషికి ఒక పోలీస్ కాపల ఉన్నప్పటికీ మనిషి చెడునే చేయుటకు ప్రయత్నించును. కాని దండించువారు, శిక్షించువారు ఉన్నారు కదా అని యోచించడు. అందువలన దోపిడీలు, హత్యలు, మోసములు ప్రజలలో ఎక్కువైపోతున్నవే గానీ తగ్గడము లేదు. మూలకారణము మానవునిలో పాపభీతి లేక పోవడమే.

ఇంకనూ యోచిస్తే ప్రభుత్వము ఎంతో డబ్బు ఖర్చుపెట్టి పోలీస్‌లను, పోలీస్‌స్టేషన్‌లను ఎక్కువ చేస్తు పోతున్నప్పటికీ, ప్రభుత్వము ఆశించిన ఫలితము లేకపోవుటకు కారణము అందరియందుకాక కొంతమంది పోలీస్‌లయందు కూడ కొంతలోపము కనిపిస్తువున్నది. పోలీస్ ఉద్యోగము చేయువారు కూడ మనుషులే కనుక వారియందు కూడ మంచిచెడ్డ గుణములు ఉండుటవలన, కొందరు వారి వృత్తియందు కూడ కొంత చెడుకల్గి ఉందురు. కొందరు దోషులు పోలీస్‌ల చేతిలో దొరికినపుడు ఆ దోషులు పోలీస్ వారికి డబ్బు ఆశ చూపి తప్పించుకొనుచున్నారు. పోలీస్ వారు కూడ మనుషులైనందు వలన కొందరు ఇది చెడుపని అని యోచించక, పాపమొచ్చునని తెలియక, అవినీతి పరులై పోవుచున్నారు. కొందరు పోలీస్ ఇన్‌స్పెక్టర్లు ఎక్కడలేని గర్వగుణప్రభావము చేత ఏ ఊరిలో ఉద్యోగము చేయుచు ఉంటే ఆ ఊరికి తానే రాజునని ఊహించుకొని, తన ఇష్టమొచ్చినట్లు ప్రవర్తించు చుందురు. జూదరులను త్రాగుబోతులను అరికట్టడానికి ప్రభుత్వము నియమించితే వాటిని నిర్వహించు వారితో లాలూచి పడి ఆ పనులు సాగిపోవుటకు వీలుకల్పించుచున్నారు. పెద్ద పెద్ద దొంగ రవాణాలు,

చేయువారినీ, లక్షలతో మోసాలు చేయువారినీ సమాజములో చెడు చేయువారినీ, హత్యలు, మానభంగములు చేయువారినీ చూచి చూడనట్లు వదలివేస్తూ ఏమి తెలియని అమాయకులను, గౌరవస్తుల మీద తన గొప్పతనమును ప్రకటించుకొనుటకు చేయి చేసుకొనుచున్నారు. ఇట్లు ప్రజలూ అటు పోలీస్‌లూ మిగత అన్ని ప్రభుత్వ రంగముల పనివారూ అవినీతి అక్రమాలలో చిక్కుకున్నారంటే అది ప్రకృతి సహజమే. ఎందుకనగ ప్రతివారియందు ప్రకృతి సిద్ధమైన గుణములుండుట వలన మంచి చెడు గుణములు చెలరేగుచుండును. అటువంటి సమయములో తమలోని గుణప్రభావము తెలియని మనిషి ఏ డిపార్టుమెంటులో పనిచేయువాడైన పాపభీతి తెలియక, చెడుకార్యముల చేయుటకు అవకాశమున్నది. మంచి ఫలితము నివ్వక చెడు సాగిపోవుచుండుటకు కారణము మనిషికి పాపము యొక్క వివరము తెలియక పోవడమే.

మానవులకు పాపపుణ్య వివరము తెలియజేయాలంటే, వారిని చెడునుండి మంచికి, మంచి నుంచి ఇంకా ఉన్నత స్థితికి మల్లించాలంటే, ఒక గురువుల వలననే సాధ్యమవుతుంది. పాపపుణ్య వివరము తెలిపి, కర్మనెలా నిరోధించాలో తెలిపి, గుణ ప్రభావములు తెలిపి, మానవుని శరీరములోని మనస్సు యొక్క వివరము తెలిపి, గురువులు ఎంతటి కఠినాత్ములనైన, ఎంతటి హంతకులనైన సులభముగ మార్చగలరు. బయటి శిక్ష వలన మానవుడు మారడనీ, వానిలోని మనస్సు గుణములు మారినపుడు మారగలడనీ గురువులకు తెలుసును. శిక్షించు అధికారము మానవులలోని సహజత్వాన్ని మార్చలేదు. వివరము చెప్పుట వలననే మనిషిలోని సహజత్వము మారగలదు. అజ్ఞాని ఉన్నతమైన జ్ఞానికాగలడు. భగవద్గీతయందు భగవంతుడు కూడ దుర్మార్గుల సంఖ్యను తగ్గించుటకు

సన్మార్గుల సంఖ్యను హెచ్చించుటకు ధర్మములను బోధిస్తానన్నాడు. కాని ఎక్కడా శిక్షించి బాగుపరుస్తానని తెలియజేయలేదు. బయటి దండనకు మారకుండ తప్పుచేసి శిక్షనెలా తప్పించుకోవలయునని యోచించువాడు, తన శరీరములో ఈ పని చేయుటవలన నాకు పాపము వచ్చును కదా! పాపము తప్పక నేనే అనుభవింపవలయును కదాయని వానికి భయము కల్గినపుడు తప్పుచేయక మానును.

కొందరు గురువులు మానవునికి పాపభయము పుట్టుటకు మరియు పాపపు పనులు చేయకుండునట్లు యమలోకమొకటున్నదనీ, అక్కడ మనము చేసిన చెడ్డపనులకు యమలోకములో కొట్టుట, కోయుట, కాల్చుట, వేడినూనెలో పడవేయుట, కాకులతో పొడిపించుట, తేల్లు పాములతో కరిపించుట, శూలములతో చెక్కించుట మొదలగు నానా హింసలుండునని తెలిపి పాపభీతి పుట్టించినారు. అందువలన ఏ కొందరికో మార్పువచ్చి ఉండును. అందరిలోను మార్పురాలేదు. కారణమేమనగా కొందరు యమలోకము ఉన్నదని విన్ననూ, అక్కడికి పోయినపుడు కదా అనుభవించేది అపుడు చూడవచ్చులేననీ, అక్కడనుభవించేది ఏదైతే ఏమి ఇపుడు అనుకూలమైన పనులు ఎందుకు వదులుకోవాలనీ, అక్కడనుభవించేది ఎవడు చూచాడనీ ఇలా అనుకొనుచు వారికిష్టమొచ్చిన పనులు చేయుచు పోవుచున్నారు. ఇది కొంత వెనుక కాలము మాట. నేడు యువకులుగ ఉన్నవారి మాటకొస్తే వారికి యమలోకమను విషయము కూడ తెలియదు. అసలు పాపమనే విషయమే తెలియక పోయినది.

ఇటువంటి సమాజమునకు కర్మ వివరము తెలిసిన గురువులు ఎంతో అవసరము. కాని నేడు గురువులంటే తెలివితక్కువ వారి క్రిందికి

జమకట్టే సమాజమేర్పడినది. ప్రభుత్వము పోలీస్ స్టేషన్లలను పెంచుతూ పోతున్నది కాని, ఎక్కడైన ఆశ్రమములు నిర్మించి గురువులకు పోషణ ఇచ్చి, సత్ ప్రవర్తనకల్గు సద్బోధలు చేయుమని తెలుపడములేదు. ఇతర మతములలో గురువులకెంతో ఉన్నత స్థానముంది. వారి మాటను తూచ తప్పక ఆచరించుచున్నారు. సిక్కుమతములో గురువుల ఆజ్ఞను ఎంతో ఉన్నతమైన పదవిలో ఉన్నవాడు కూడ ఆచరించుచున్నారు. ఒకప్పుడు **పంజాబ్ ముఖ్యమంత్రి బర్నాల** మతపరమైన తప్పు చేసినందుకు గురువులు విధించిన శిక్ష ప్రకారము వారి మందిరమైన గురుద్వారలో స్థంభమునకు కట్టివేయబడి తర్వాత అక్కడికి వచ్చు భక్తుల చెప్పుల దుమ్ము తుడిచాడు.

చూచారు కదా! వారిలోని గురుభక్తి. అలాగే ముస్లీమ్‌లు వారి మత పెద్దలనే అరబ్ దేశాలలో పరిపాలకులుగ రాజులుగ పెట్టుకొన్నారు. వారి వారి మతములను వారు కాపాడుకొనుచు ముఖ్యమైనది దైవభక్తి తర్వాత అన్ని పనులను ఆచారమున్నది. కాని హిందూమతములో గురువులను అధికారులు చిన్న చూపు చూస్తున్నారు. ఎటూ గుర్తింపు లేనివారై గురువులు కూడ వారివారి జీవనమునకై ప్రాకులాడుకోవలసి వచ్చినది. అటువంటి సమయములో మానవున్ని కట్టుదిట్టము చేయు బోధలెలా బోధిస్తారు? బోధిస్తే వారికి బత్యముండదు. అందువలన కొందరు గురువులు కూడ ప్లేటు మార్చి మానవునికి ఆహ్లాదకరమైన విషయమునే చెప్పుచూ, వీటివలన మీకు కష్టాలు పోతాయి, వీటివలన సుఖాలు వస్తాయి అని సహజముగ మనుషులు కోరు సుఖాల సంబంధమైన బోధలనూ, వారి మనోభీష్టమునకు సరిపడు బోధలనూ చెప్పుచుందురు. కాని నిజగురువు ఎక్కడో ఒకచోట ప్రజల ఇష్ట

ప్రకారము వారికి అనుకూలముగ అసత్య బోధ చేయకూడదని తలచి, సత్యమైన బోధలు తెల్పుచూ మనుషలను గురువుల వైపు మళ్లించాలి కాని గురువులు ప్రజలు వైపు మళ్లకూడదను నిర్భయముతో ఉండీ, మానవుని మనస్సుకు నచ్చకుండినప్పటికీ కఠినమైనప్పటికివారు సత్యమునే తెల్పుచుందురు. అటువంటి బోధలు ఎన్నో విమర్శలకు లోనైనప్పటికీ వారి పంథా వారు విడువక, మానవుని మార్పుకోసము ప్రయత్నము చేయుచునే ఉందురు.

అట్టివారు మనిషిని చెడునుండి మళ్లించుటకు యమలోకమును పాపమును గూర్చి యదార్థము తెలుపుచూ, యమలోకము ఎక్కడో లేదనీ అట్లే స్వర్గము కూడ ఎక్కడో లేదనీ, ఇక్కడే భూమి మీదనే ఉందని తెలుపుచుందురు. అవును నిజమే యోచిస్తే యమలోకములో ఏ భాదలయితే ఉన్నాయనుకొంటున్నామో అవియే భూమిమీద ఉన్నవి. భూమిమీదనే మానవుడు కత్తులతో పొడిపించుకొంటున్నాడు. కుక్కలతో కరిపించుకొంటున్నాడు. నానా రూపములుగ యమబాధలు అను భవిస్తున్నాడు. స్వయముగా అనుభవిస్తున్నప్పటికీ ఇవియే యమబాధలని తెలుసుకోక మరి ఎక్కడో యమలోకముందనుకోవడము పొరపాటు. ఎక్కడో ఉందంటే మానవునికి అసలు భయముండదు. ఇక్కడే ఉన్నదని తెలియబరిస్తే అడుగడుగున కనిపించుచున్న సంఘటనలకు మానవుడు చలించిపోగలడు. ఇక్కడే అనుభవిస్తున్నామనుటకు గుర్తుగా మన నోటి నుండి అపుడపుడు మనకు తెలియకనే పాపము అనుపదము వస్తూ ఉంటుంది. ఉదాహరణకు రైలుక్రింద పడి ఒక వ్యక్తి కాలు తెగిపోయిందనుకొందాము. అపుడు అక్కడికి పోయి చూచినవారు అయ్యో పాపము అని వారికి తెలియకనే వారినోటవెంట పలుకడము

జరుగుచుండును. అలా అనుచున్నవారు ఇక్కడ జరిగిన పనికి మనము పాపము అనడానికి ఏమి సంబంధము అని యోచించడము లేదు. ఇట్లు ప్రతి ఒక్క కష్టము వద్ద అయ్యో పాపము అనుమాట రావడానికి కారణము పాపమనునదియే ఈ కష్టమునకు కారణమని లోపలినుండి ఎవరో తెల్పినట్లున్నది.

మనకు కల్గు కష్టములు దుఃఖములన్నిటకి పాపమే మూల కారణమని తెలిసినపుడు ప్రతి మనిషి పాప భూయిష్టమైన పనులను చేయుటలో వెనుకాడును. ఎందుకనగా ఈ పని చేయకూడదను అభిప్రాయము వాని అంతరంగమున ఏర్పడుచున్నది. అంతరంగము ప్రకారమే మనుషులు నడుచుకొనుచుందురు కనుక వారాపనులు చేయరు. అట్లు కాక పాపము యొక్క వివరము తెలియక, అంతరంగము చేయమంటుంటే బయటి పోలీస్‌లకు వాడు భయపడక చేయును. అందువలన నేడు ఊరూరికి పోలీస్‌స్టేషన్ పెట్టినప్పటికీ, మానవుల చెడు పనులలో తేడ రాక ఎక్కువగుచూనే ఉండునని తెలియాలి. ప్రభుత్వ పరిపాలకులకు కూడ ఈ విషయము తెలియదు, కనుక ప్రజలు చేయు చెడుకార్యములను నిరోధించుటకు కేవలము పోలీస్‌స్టేషన్ల మీదనే ఆధారపడినారు. అట్లు కాక పాపపుణ్య వివరము తెల్పు బోధకును ప్రోత్సహించీ, వారికి పోషణకు కొంత వేతనమిచ్చి మండలానికి ఒక గురువును ఏర్పాటు చేసినా బాగుంటుంది. అందువలన ప్రభుత్వము కేవలము పోలీస్‌స్టేషన్‌లనే పెంచి పోషించక ఆశ్రమాలను కూడ అభివృద్ధి చేయుట వలన మానవున్ని అజ్ఞానము నుండి జ్ఞానము వైపు మళ్ళించినట్లగుతుంది.

# కర్త-కర్మ-క్రియ-సాక్షి

ఆధ్యాత్మికములో కర్మ అను పదము చాలా ముఖ్యమైనది. కర్మ అను పదము నేటికాలములో చాలా అర్థరహితమై పోయినదనియే చెప్పవచ్చును. ఎందుకనగా మానవుని దృష్ఠిలో చెడుపనులనే కర్మయనుట జరుగుచున్నది. ఏదైన ఒకనికి చెడు జరుగుచున్నపుడో, కష్టము కలుగుచున్నపుడో వానికి కర్మ పట్టింది అంటారు. కాని మంచి జరుగునపుడు, సుఖమనుభవించునపుడు కర్మ అని అనరు. అలా అనక పోవడములో కర్మ అనగా కేవలము చెడ్డదనియే మనుషుల నమ్మకమని తెలియుచున్నది. ఇంతేకాక కర్మములను కార్యములనుకొని, కార్యములు వేరు కర్మములువేరని తలువక, పనులనే కర్మములను సాంప్రదాయము కూడ మానవులయందు కొందరిలో కనిపిస్తున్నది. కార్యములన్ననూ కర్మములన్ననూ ఏ భేదములేని అర్థమనువారు కూడ కలరు. అందువలన ముఖ్యముగ కర్మమంటే ఏమిటో మొదట మనము తెలియాలి. కర్మయంటే ఏమిటో వివరించుకొని చూస్తే మనము చేయు ప్రతి పనియందు ప్రపంచమున డబ్బురూపముగనో, ధాన్య రూపముగనో, వస్తురూపముగనో ఏదో ఒక విధముగ కనిపించు ఫలితము కల్గుచున్నది. ఇంతేకాక ప్రతి పనియందు కనిపించని ఫలితము కూడ కల్గుచున్నదని తెలియాలి. చేసినపని మంచిదయితే పుణ్యము, చెడ్డదయితే పాపము మనకు తెలియకుండనే వస్తూ ఉంటుంది. ఈ విధముగవచ్చు కనిపించని ఫలితములైన పాపము+పుణ్యము = కర్మ అని అనుచున్నాము. పాపపుణ్యములు మనము నిత్యము చేయు పనులయందు మిలితమై ఉన్నపుడు, అందరము మంచిపని చేసి పుణ్యమునే సంపాదించుకోవచ్చును కదా! అని కొందరనుకోవచ్చును దానికి సమాధానమేమనగా! ప్రతి పని మనము స్వయముగ నిర్ణయము తీసుకొని చేయడము లేదు. ప్రతి

పని వెనుకల కర్మ యొక్క విధానమనిగి ఉన్నది. గత జన్మలలో చేసుకొన్న పాపపుణ్యములు తిరిగి వచ్చుచున్న జన్మలయందు పనుల రూపముగ అమలు జరుగుచున్నవి. గత జన్మల కర్మల ప్రకారము మన మెదడునందు ఆలోచనలు కదలి నిర్ణయమై ఆ పనులకు కారణమగుచున్నవి. మనకు తెలియకుండ జరుగు ఈ విధానము మనకు తెలియదు. కనుక మన మెదడులో కదలు ఆలోచనలు జరుగు నిర్ణయములు మనవే చేయుచున్నామని అనుకోవడము జరుగుచున్నది. అందువలన ముఖ్యముగ తెలుసుకోవలసినది ఏమనగా! ప్రతికార్యము వెనుక ఆ పనికి కారణము మనముకాదనీ, అట్లే ప్రతికార్యమునకు కారణమైనది "కర్మ"యని తెలియాలి.

ఇక కర్మములు ఎన్ని విధములు? అవి ఏవి? అను విషయము తెలుసుకొందాము. ఈ ప్రశ్నను ఇతరులనడిగితే మీరే చెప్పారుగ కర్మ రెండు రకములని, అవి పాప పుణ్యములని అనవచ్చును. ఇది ప్రశ్నకు తగిన సరైన జవాబు కాదు. కర్మ అంటే ఏమిటి అన్నపుడు పై జవాబు సరిపోతుంది. కాని ఎన్ని రకములు, అవి ఏవి? అన్నపుడు ఆ జవాబు సరిపోదు. ఆ ప్రశ్నకు సరైన జవాబేమిటనిన, కర్మ మూడు రకములుయనీ, ఒకటి ప్రారబ్ధకర్మ, రెండు ఆగామికకర్మ, మూడు సంచితకర్మ అనీ వాటి పేర్లను చెప్పవచ్చును. ఈ త్రికర్మల వివరమేమిటని యోచించిన ఇలా ఉన్నది.

**1) ప్రారబ్ధకర్మ :** ఒక జీవుడు పుట్టినది మొదలుకొని మరణించు వరకు చేయుపనులకు కారణమైన దానిని ప్రారబ్ధకర్మ అంటాము. పుట్టినది మొదలు ఎన్నో కార్యములు చేయుచూ, అందలి కష్టసుఖ అనుభవములను పొందుచూ జీవుడు ప్రారబ్ధకర్మను అనుభవించుచున్నాడు.

గత జన్మలయందు చేసుకొన్న కర్మల కూడలి కొంత ఉండగా, అందునుండి కొంత కర్మ కేటాయించబడి, అది జీవితము మొదలు పెట్టిన క్షణమునుండి జీవితము చాలించువరకు మానవుని ఆడించును. ఆ విధముగ ఒక జన్మయందు మానవుని కదలికలను క్రమము చేసి నడిపించు కర్మను ప్రారబ్ధకర్మ అంటాము. జీవితమునందు కేటాయించ బడిన ప్రారబ్ధకర్మ ప్రకారము ప్రతి జీవరాసి కదలి పనిచేసి అందలి కష్ట సుఖములనను అనుభవించవలసివున్నది. ప్రారబ్ధకర్మ ప్రతి జీవరాసి తలయందు సూక్ష్మరూపముగ నిక్షిప్తమైయున్న కర్మచక్రమున నిలువ ఉండి, కాలక్రమమున అమలుకు వచ్చుచున్నది. ఒక కర్మ కార్యరూపము కావాలంటే తలయందే గల గుణచక్రములోని గుణములను ప్రేరేపించి, అనగా అ సమయమునకు ఏ కార్యము జరుగవలయునో దానికి సంబంధించిన గుణములనే ప్రేరేపించి, మంచి చెడు అనీ, ఇది చేయవచ్చు ఇది చేయరాదని బుద్ధి హెచ్చరించుచున్ననూ, ప్రారబ్ధకర్మ చిత్తము ద్వార ఆ పనినే చేయునట్లు చిత్తగింప చేసి, కార్యము జరిగించి అందులోని ఫలితమును కష్టసుఖరూపములతో జీవున్ని అనుభవింపజేయుచున్నది. మానవునికి ఇష్టమైనా అయిష్టమైనా ప్రారబ్ధకర్మానుసారమే ఆ పని జరుగుచుండును. కాని మానవుని ఇష్టప్రకారము జరుగుననుకోవడము పొరపాటు.

ఈ ప్రారబ్ధ కర్మ విధానము తెలియని మానవుడు మన ఇష్ట ప్రకారమే పనులు చేయుచున్నాము కదా! మనము తీసుకొన్న నిర్ణయ ప్రకారమే కదా! మన శరీరము ద్వార పనులు జరుగుచున్నది. అటు వంటపుడు ప్రారబ్ధకర్మ అనడమేమిటని అడుగవచ్చును. శరీరమే "నేనను" భావమున్న ప్రతి మానవుడు ఈ విధముగనే అనుకోవడము జరుగుచున్నది.

మనకు యోచనలురావడము కానీ, పని నిర్ణయము కావడము కానీ, ఆ కార్యము నీచేత చేయడము కానీ అన్ని కర్మ యొక్క ఆచరణలే. ప్రతి మనిషి కర్మయందే ఇమిడి ఉన్నాడు. కావున దానికి అతీతుడు కాకుండ కర్మ చూచుకొనుచూ మానవున్ని తాను వేరు, తన కర్మ వేరని తెలియకుండునట్లు చేయుచున్నది. కర్మలు, గుణములు వేరని, తానువేరని తెలియని మానవుడు కర్మచేత జరిగెడి కార్యములకు కర్త తానే అనుకొనుచున్నాడు. వాస్తవానికి మానవుడు క్రియకాగ, ప్రకృతి మనిషికి కర్తకాగ, ప్రారబ్ధము కర్మయై ఉన్నది. కర్త, కర్మ, క్రియ అనునవి ఏవి అని తెలిసిన మానవునికి కొంత జ్ఞానమేర్పడి తానెవరైనది తెలియగలదు. సర్వ జీవరాసులను తన ఆధీనమందుంచుకొని, గుణముల చేత ఇంద్రియముల చేత ఆడించుచు, జీవుని క్రియగ చేసి, ప్రారబ్ధమనుదానిని కర్మగా చేసి, ప్రకృతి కర్తగ ఉండగా, దైవము అన్నిటిని చూస్తూ సాక్షిగా ఉన్నాడు. ఈ విధముగ కర్త, కర్మ, క్రియ మరియు సాక్షి అను పదములు మన బ్రహ్మవిద్య నుండి పుట్టుకు వచ్చాయి.

క్రియ అనగ పని లేక కార్యము అని అర్థము కదా! అటువంటపుడు మానవున్ని క్రియ అనడమేమిటని కొందరికి అనుమానమురావచ్చును. దానికి జవాబు ఏమనగా! మానవుడు అజ్ఞాన దశలో ప్రతిపనియందు పూర్తి లగ్నమై నేను వేరను భావము లేకుండా చేయుచున్నాడు. కనుక మానవున్ని క్రియ అనవలసి వచ్చినది. జరుగుచున్న పనిని నేను చేయుచున్నానను భావము పూర్తి కలిగిన దానివలన మానవుడు క్రియయైపోయాడు. జరుగుచున్న ఏ కార్యమునకైన తానే పూర్తి కర్తననుకొనువాడు జ్ఞానుల లెక్కలో క్రియయై ఉన్నాడని తెలియుచున్నది. ప్రతి క్రియ వెనుకల కనిపించని ఫలితము

వచ్చునన్నాము కదా! అందువలన జరుగుచున్నది మంచి క్రియయైతే పుణ్యము, చెడ్డదైతే పాపము తప్పక వస్తాయి. అగ్నిశిఖలకు పొగ ఉండునని గీతలో చెప్పినట్లు, ప్రతి పని వెనుకల కర్మ ఉన్నది.

**2. ఆగామి కర్మ :** ప్రతి పనియందువచ్చు క్రొత్తగా కర్మను ఆగామికర్మ అనుచున్నాము. పుట్టినప్పటినుండి మానవున్ని సుఖదుఃఖములను అనుభవించునట్లు చేయునది ప్రారబ్ధము కాగ, ప్రారబ్ధము ప్రకారము జరిగిన పనియందు క్రొత్తగా వచ్చునది ఆగామికము. ఇక్కడ కొందరికొక అనుమానము రావచ్చును. అది ఏమనగా! గత జన్మలలోని కర్మ ప్రారబ్ధముగ మారి ప్రతి పని అదియే చేయుంచునపుడు, మధ్యలోని జీవునికి క్రొత్త కర్మ ఎందుకు రావలయును? జీవుడు తాను స్వయముగ ఏమీ చేయలేదనీ, కర్మయే గుణములను సూత్రముల చేత చేయించు చున్నదనిన, క్రొత్త కర్మకు జీవుడు బాధ్యుడు కాదు కదా! అని అడుగవచ్చును. ఆ లెక్కప్రకారమైతే కార్యముల ఎడల ఏ నిర్ణయము చేయని జీవునికి క్రొత్తకర్మ ఏమాత్రము సంబంధము లేదు. ఏమాత్రము అతనికి క్రొత్తకర్మ అంటకూడదు. కానీ క్రొత్త కర్మ అంటుచునే ఉన్నది. ఎందుకనగా! జీవుడు తాను ఏమి చేయకున్ననూ, అన్ని క్రియలకు కర్మయే కారణమని అనుకోక, అన్ని క్రియలకు తానే కారణమనీ, అన్నిటికి తానే కర్తననీ అనుకోవడము వలన, జీవునకు సంబంధములేని "ఆగామి" అను క్రొత్త కర్మ వచ్చి అతనినే అంటుచున్నది. ప్రతి పనికి కర్మ కారణమైనప్పటికీ, ప్రతి పనికి క్రొత్త కర్మ రావడము జరుగుచుండును. దానిని తెలిసినవాడు కర్మచేత కార్యములు జరుగుచున్నవనీ, తన వలన జరగడములేదనీ, తన శరీరము కదలి పని చేయుచున్నప్పటికీ, తాను వేరు శరీరము వేరనీ, జరిగెడి పనులకు తాను ఎంత మాత్రము కర్తకాదనీ

తెలిసినపుడు, ప్రతిపనియందు వచ్చు క్రొత్తకర్మ అతనిని చేరక జ్ఞానాగ్ని చేత కాలిపోవుచుండును. దానినే “యజ్ఞకర్మ” అని గీతయందు కూడ అన్నారు. యజ్ఞకర్మగ నీవు పనిచేయక పోతే దానివలన తప్పక కర్మ బంధనములు కల్గునని **'యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మ బన్ధనః'** అని గీతయందు భగవంతుడన్నాడు.

ప్రతి మానవుడు చిన్న వయస్సు నుండి అలవడిన అలవాటు ప్రకారము అహము చేత నేను అనుకుంటేనే కదా, నేను చేస్తేనే కదా పని జరుగుచున్నదని తలపోయుచు, తన వెనుకల ఆడించు ప్రారబ్ధకర్మను గుర్తించ లేకపోవుట వలన క్రొత్తకర్మ వచ్చి చేరుచున్నది. తాను చేయని పనికి తాను అనవసరముగా బాధ్యుడై, వచ్చిన కర్మను మోసుకొని పోయి మరియొక జన్మలో అనుభవింపవలసి వస్తున్నది. ఒక జన్మలో అనుభవించునది ప్రారబ్ధమైతే అదే జన్మలో క్రొత్తగా వచ్చునది ఆగామికర్మ, ఖర్చవునది ప్రారబ్ధము, జమ అవునది ఆగామికము. ప్రారబ్ధము పుట్టినప్పటి నుండి అమలుకు వచ్చి కష్ట సుఖములు అనుభవింప జేయుచున్నది. ఆగామికము పుట్టినప్పటి నుండి రావడము లేదు. ఎందుకనగా జీవుడు ధరించిన శరీరముతో పాటు మనస్సు, బుద్ధి, చిత్తము, అహము కూడ పెరుగవలసి ఉన్నది. శరీరమునకు నాలుగైదు సంవత్సరములు వయస్సు వచ్చు వరకు లోపలయున్న అహము కూడ చిన్నదై ఉండి పని చేయదు. శరీరము పెరుగుకొలది అహము కూడ పెరిగి నాలుగైదు సంవత్సరముల నుండి పని చేయుటకు మొదలు పెట్టును. అప్పటి నుండి జీవాత్మ అహము యొక్క పని వలన జరిగెడు పనులకు తానే కారణమనుకొనును. అపుడు ఆగామికర్మ వచ్చి చేరుటకు అవకాశము గలదు. అందువలన పుట్టినప్పటి నుండి ఆగామికము

రాదు. ఒక జన్మలో అయిపోవునది ప్రారబ్ధము, అదే జన్మలో వచ్చి కూడునది ఆగామికము.

**3. సంచితము :-** ఒక జన్మలో సంపాదించిన ఆగామికర్మ పూర్తి మరుజన్మమున ప్రారబ్ధమై పోవడము లేదు. ఎందుకనగా 80 సంవత్సరములు మానవ జన్మలో జీవించి ఆగామికర్మ సంపాదించుకొన్న వాడు, వాని కర్మానుసారము కుక్కజన్మ ఎత్తవలసి వచ్చినపుడు పదినుండి పదిహేను సంవత్సరములకు మించి బ్రతకని కుక్క జీవితములో 80 సంవత్సరముల పొడవున వచ్చిన ఆగామికర్మ అయిపోదు. అపుడు వచ్చిన కర్మనుండి కొంత కర్మ కుక్కజన్మకు కేటాయించబడి ఉండును. కేటాయించబడినది ప్రారబ్ధముకాగ, మిగిలిన దానిని సంచితకర్మ అంటున్నాము. ఇట్లు మనవెనక మిగిలి ఉన్న కర్మను "సంచితము" అంటాము. అనగా ఒక జన్మలో అనుభవించునది ప్రారబ్ధము. అట్లే ఒక జన్మలో వచ్చునది ఆగామికము. జన్మ జన్మలకు మిగులుచు వచ్చినది సంచితము అని తెలియాలి. సంచితము నుండి కొంత కర్మ తీసుకొని పుట్టు వానికి అపుడు ఏర్పడిన ప్రారబ్ధము గత జన్మలలో పది జన్మల క్రిందిది కూడ ఉండవచ్చును. అందువలన ప్రస్తుత జన్మలో అనుభవించునది వెనుక జన్మ కర్మ అనుకోవడము సత్యము కాకపోవచ్చును.

ఎందుకనగా జన్మజన్మలకు మిగిలిన కర్మ వరుసక్రమమున అమలుకు వచ్చును, కావున ఇపుడు అమలుకు వచ్చినది గత జన్మదే అని చెప్పుటకు వీలులేదు. ఎక్కువ సంచితమున్న వానికి ఎక్కువ జన్మల క్రితముదై ఉండవచ్చును. తక్కువ సంచితమున్న వానికి తక్కువ జన్మల క్రితముదుండవచ్చును. ఒక్కొక్కనికి సంచితము ఖాళీగ ఉండిపోయి

గత జన్మ ఆగామికము పూర్తి ప్రారబ్ధముగ మారి ఉండవచ్చును. సంచితమనునది తరుగుచు పోవచ్చును, పెరుగుచు పోవచ్చును. అది జన్మల వయస్సునుబట్టీ, వారుచేయు పనులయందు అహమునుబట్టీ ఉండును.

జ్ఞానము తెలిసినవాడు ఆగామికమును సంపాదించుకొనక ప్రారబ్ధమును మాత్రము అనుభవించుచున్నాడని అనుకొందాము. అపుడు వానికున్న సంచితము జన్మజన్మలకు తరుగుచు వచ్చి చివరకు ఏమీ లేకుండ పోవును. అట్టి వాని కర్మంతయు అయిపోగా వాడు జన్మలకు పోడు, పోవుటకు కర్మలేదు కావున వాడు మోక్షము పొందును. కొందరు అజ్ఞానము చేత రెట్టింపు కర్మల సంపాదించుకొనుచూ పోవుచుందురు, అట్టివారికి సంచితము అధికమై పోయి కొన్ని వందల జన్మలకు సరిపోవునదై పెరిగి ఉండును. అట్టివాడు మోక్షము పొందక జన్మలు ఎత్తుచు కర్మయందే నలిగి పోవుచుండును. కర్త, కర్మ, క్రియ, సాక్షి ఎవరని తెలియకపోతే సంచిత, ఆగామి, ప్రారబ్ధమను త్రి కర్మలను తెలియక ప్రారబ్ధమును అనుభవిస్తూ, ఆగామికమును సంపాదిస్తూ, సంచితమును వృద్ధిచేస్తూ తనెవరో, తనస్థితి ఏమిటో, తెలియక ప్రతినిత్యము గుణముల ప్రభావములో మునిగిపోయి, కనపడు ప్రపంచము మీద చూపు నిలిపి అజ్ఞానములోనే ఉందురు. చేతికి దొరకని కాలము తన ఆయుస్సును హరించి వేయుచు ఆఖరి ఘడియలకు దగ్గర చేర్చినపుడు, తనవారు అనుకొన్న వారందరిని వదలిపోవలసి వచ్చినపుడు, ఎవరు తనను ఆపలేరనీ ఏ డబ్బు తనను నిలుపలేదని తెలిసినపుడు, ఎంతటివాడైన ధీనాతి ధీనస్థితిలో మిగిలి తనను ఎవరు రక్షిస్తారని ఆశగా చూచుటకంటే, నేడు మరణమాసన్నము కాక మునుపే, జ్ఞానము తెలిసి

కర్త, కర్మ, క్రియ, సాక్షి అనువారెవరో తెలిసి, అన్నిటికి సాక్షి అయిన దైవమును ఆశ్రయించి, కర్తయైన ప్రకృతి చేతినుండి తప్పించుకొనిన భగవద్గీతలో చెప్పినట్లు కర్మ నిన్ను అంటదు, క్రియలు మీచేత జరుగవు. నీవు నిత్యుడుగా, అమృతుడుగా, ఆత్మగా, పరమాత్మగా మారిపోగలవు.

# భోగి - మంటలు

భోగిమంటలను మాటను బహుశ సంక్రాంతి పండుగ సందర్భములో వింటుంటాము. యుగాది పండుగకు ప్రత్యేకత ఉన్నట్లే సంక్రాంతి పండుగకు కూడ ప్రత్యేకత గలదు. యుగాదికి గానీ, సంక్రాంతికి గానీ ఆధ్యాత్మికతను, గ్రహముల ప్రయాణమును బట్టి ప్రత్యేకత గలదు. సూర్యుడు కాలచక్రములో కటకరాసియందు ప్రవేశించినపుడు కటక సంక్రమణము అనియూ, అదే విధముగ సూర్యుడు మకరరాసిలో ప్రవేశించినపుడు మకర సంక్రాంతి అనియూ మన పెద్దలు చెప్పుచుందురు. ఈ రాసులనునవి ఏమిటి, ఎందుకున్నవి? అని యోచిస్తే కొంత సమాచారము తెలియగలదు. మనిషి యొక్క ఆధ్యాత్మిక పాఠములో కాలచక్రమనునది చాలా ప్రాముఖ్యము గలది. కాలచక్రము మొత్తము పండ్రెండు భాగములుగ విభజింపబడి ఉన్నది. మానవుని జ్యోతిష్యము ఈ పండ్రెండు భాగములను ఆధారము చేసుకొని ఉన్నది. కాలచక్రములోయుండి కర్మను పరిపాలన చేయు నవగ్రహములు నిర్ణీతకాలము ప్రకారము ఈ కాలచక్రములోనే తిరుగుచుండును. అన్నిటికంటే ముఖ్యగ్రహము మరియు మొదటి గ్రహమైన సూర్యుడు కాలచక్రములో ఎక్కువ ప్రసిద్ధి చెందినవాడు. సూర్యుడు మొదటి వాడైనందున ఆయనకు ఆదిత్యుడని కూడ పేరు గలదు. జ్యోతిష్యశాస్త్రములో

సూర్యున్ని బట్టి గ్రహచారము నిర్ణయింప బడుచున్నది. కాలచక్రములోని పండ్రెండు భాగముల పేర్లు వరుసగ ఇలా కలవు. 1) మేషము 2) వృషభము 3) మిథునము 4) కర్కాటకము 5) సింహము 6) కన్య 7) తుల 8) వృశ్చికము 9) ధనస్సు 10) మకరము 11) కుంభము 12) మీనము. కాలచక్రమును దానిలోని భాగములను క్రిందగల పటములో చూడవచ్చును.

కాలచక్రములోని సగభాగములో సూర్యుని సంచారమున్నపుడు దానిని "ఆయణము" అంటారు. దీనినిబట్టి రెండు ఆయణములు గలవని, అవియే ఉత్తరాయణము, దక్షిణాయణము అని తెలియవలెను. సూర్యుడు కాలచక్రములోని ఒక్క భాగమును దాటుటకు ఒక నెలదినములు పట్టును. దీనిని బట్టియే మనకు నెలల పేర్లు కూడ నిర్ణయించారు. అవి వరుసగ 1) ఛైత్రము 2) వైశాఖము 3) జ్యేష్టము 4) ఆషాఢము 5) శ్రావణము 6) భాద్రపదము 7) ఆశ్వీయుజము 8) కార్తీకము 9) మార్గశీర్షము 10) పుష్యము 11) మాఘము 12) ఫాల్గుణము. కాలచక్రములో సూర్యుడు మేషరాసి భాగములో ప్రయాణించు ముప్పది







**కాల చక్రము**

దినములను ఛైత్రమాసమన్నారు 2) వృషభరాసిలోనున్న కాలమును వైశాఖమాసము అన్నారు. 3) మిథునరాసి కాలమును జ్యేష్టమాసము అన్నారు. 4) కర్కాటకరాసిలో ఉన్నపుడు ఆషాఢమాసము అన్నారు 5) సింహరాసిలో ఉన్నపుడు శ్రావణమాసము అన్నారు 6) కన్యారాసిలో ఉన్నపుడు భాద్రపదమాసము అన్నారు 7) తులారాసిలో ఉన్నపుడు ఆశ్వీయుజమాసము అన్నారు 8) వృశ్చికరాసిలో ఉన్నపుడు కార్తీకమాసము అన్నారు. 9) ధనస్సు రాసిలో ఉన్నపుడు మార్గశీర్షమాసము అన్నారు. 10) మకరరాసిలో ఉన్నపుడు పుష్యమాసము అన్నారు. 11) కుంభరాశిలో ఉన్నపుడు మాఘమాసము అన్నారు. 12) మీనరాసిలో ఉన్నపుడు ఫాల్గుణమాసము అన్నారు.

కాలచక్రములోని పండ్రెండు భాగములలో ఆరు భాగములను ఉత్తరాయణముగ, మిగత ఆరు భాగములను దక్షిణాయణముగ లెక్కించడము జరుగుచున్నది. సూర్యుడు మకరరాసిలో ప్రవేశించిన పుష్యమాసము నుండి మిథునరాసిలో ఉండు జ్యేష్టమాసము వరకు ఆరు నెలల కాలమును ఉత్తరాయణమనియు, అలాగే సూర్యుడు కటక రాసిలో ప్రవేశించిన ఆషాఢమాసము నుండి ధనస్సురాసిలో ఉండు మార్గశీర్ష మాసము వరకు ఆరునెలల కాలమును దక్షిణాయణమనియు చెప్పడము జరుగుచున్నది. కాలచక్రములో మొదటిదయిన మేషరాసిని ఒకటవ దానిగ తీసుకుంటే చివరదయిన మీనము పండ్రెండవదగును. జ్యోతిష్య శాస్త్రము ప్రకారము ఒకటవ రాసి మానవుని జన్మరాసి అగును, అలాగే పండ్రెండవది మరణరాసి అగును. మనిషి పుట్టుక శరీర లభ్యము యొక్క విషయములు ఒకటవ స్థానములో ఉండగ, చివరి మరణము గురించిన విషయమంతయు పండ్రెండవ స్థానములో ఉండును.

మనిషి పుట్టుక మరియు మరణముల విషయములు ఉత్తరాయణ భాగములోనే కలవు. ఉత్తరాయణ భాగము జ్ఞానసంబంధమైనదనీ, దక్షిణాయణ భాగము అజ్ఞాన సంబంధమైనదని, కూడ చెప్పబడినది. ఉత్తరాయణ కాలములో చనిపోయినా, పుట్టినా మోక్షము పొంది దేవునిలో ఐక్యమగుటకు అవకాశమున్నది. అంతేగాక ఉత్తరాయణ కాలములో పుట్టినవారు దైవసంబంధ జ్ఞానముపొంది జ్ఞాని జన్మకల్గుటకు కూడ అవకాశమున్నది. సూర్యుడు ఉత్తరాయణములో ప్రవేశించి ఉండు ఆరునెలల కాలము దైవపరముగ ప్రాముఖ్యతచెంది ఉండుటవలన ఆ కాలమును **ఉత్తరాయణ ఉత్తమకాలమని** పూర్వము అనెడివారు. కాలక్రమమున ఉత్తరాయణ ఉత్తమకాలము మార్పుచెంది ఉత్తరాయణ పుణ్యకాలమని పలుకబడుచున్నది.

మేషము, వృషభము, మిథునము ఈ మూడు రాసుల కాలమును, అలాగే మకర, కుంభ, మీనరాశులయందు మూడు నెలల కాలమును ఉత్తరాయణమని చెప్పుకొన్నాము. మిగత ఆరునెలల కాలము దక్షిణాయణముగ లెక్కించుకొనుచున్నాము. ఉత్తరాయణము ఉత్తమ మైనదిగా దైవపరముగా లెక్కించుకోగా, దక్షిణాయణము ప్రపంచపరమైన భోగములకు ప్రతీకగ చెప్పుకొనుచున్నాము. దక్షిణాయణము ప్రకృతి భోగములకు గుర్తుగ ఉన్నది. ప్రపంచములోని అనుభవములను భోగములనుచున్నాము. ప్రపంచ సంబంధ విషయములను అనుభవించుటను భోగము అనుచుండగా! దైవసంబంధ ఆత్మను అనుభవించుటను యోగము అంటున్నాము. భోగములో కర్మలు అనుభవింపబడుచున్నవి. యోగములో కర్మలు కాల్చబడుచున్నవి. దక్షిణాయణమును భోగములకు గుర్తుగ చెప్పుకొన్నారు. భోగములు

అజ్ఞానమునకు సంబంధించినవి, కావున దక్షిణాయణమును ప్రపంచసంబంధ భోగముల చిహ్నముగ వ్యక్తపరిచారు. ఉత్తరాయణమును దైవసంబంధ యోగములకు గుర్తుగ చెప్పుకొన్నారు. ఈ విధముగ చెప్పడమే కాక అందరికి కొంత గుర్తుండునట్లు కూడ చేశారు. ప్రతి మనిషికీ భోగములను అనుభవించడము అలవాటై పోయినది. భోగములనగా కేవలము సుఖములే అనుకోకూడదు. కష్టములను సుఖములను రెండిటిని భోగములే అంటున్నారు. భోగములనగా అనుభవించునవని అర్థము.

అలాగే ప్రతి మనిషి యోగములను పొందలేకపోవుచున్నాడు. యోగములనగా భోగములకు వ్యతిరేఖములుగ ఉన్నవి. కర్మానుభవము కానివి యోగములు, కర్మను కాల్చునవి యోగములు, జ్ఞానమను అగ్ని నిలయములు యోగములు. కర్మలను కాల్చునది జ్ఞానాగ్ని మాత్రమేనని మరువకూడదు. జ్ఞానాగ్ని నిలయమైన యోగములకు గుర్తుగ ఉత్తరాయణము, అనుభవములకు నిలయములైన భోగములకు గుర్తుగ దక్షిణాయణము జ్ఞాపకముండునట్లు సంవత్సరములో ఒక పండుగను ఉంచారు. అదియే సంక్రాంతిపండుగ, దీనినే మకరసంక్రాంతి అందురు.

మకర రాసిలోనికి సూర్యుడు ప్రవేశించుటను మకర సంక్రాంతి అంటున్నాము. సాధారణముగ జనవరి 14వ తేదిననే సంక్రాంతి వచ్చుచుండును. బహుశ కొన్ని సంవత్సరములకొకమారు జనవరి 15వ తేదీన సంక్రాంతి జరుగుచుండును. జనవరి 13 తేది వరకు దక్షిణాయణముండగా, 14వ తేదినుండి ఉత్తరాయణమగును. దక్షిణాయణము భోగములకు గుర్తు కావున ఆ విషయము గుర్తుండునట్లు జనవరి 13వ తేదీని సంక్రాంతి ముందు రోజును భోగి అన్నారు.

భోగి తర్వాత సంక్రాంతి అనుట సహజముగ ఉన్నదే. భోగి దినమున రాత్రికి మంటలు వేసి భోగి మంటలని పేరు పెట్టడము కూడ జరిగినది. భోగిని గుర్తింపుగ చెప్పుకోవడము ఆ రాత్రికి మంటలు వేయడము అందరు చేస్తున్న పనియే కాని దాని అర్థము, వివరము చాలామందికి తెలియదనుకొంటాము.

దక్షిణాయణము అజ్ఞాన సంబంధ, ప్రపంచ సంబంధ గుర్తు అని ముందే చెప్పుకొన్నాము. ప్రపంచ అనుభవములకు తార్కాణముగ ఉన్న దక్షిణాయణమును భోగి అను పేరుతో చివరిదినమున గుర్తు చేసుకొనుచు, మా జీవితములలో కూడ నేటి నుండి భోగములు పోయి యోగములు రావాలని పూర్వము కోరుకొనెడివారు. భోగములు అనగ అనుభవములకు కారణమయిన కర్మపోవాలని, భగవద్గీతలో చెప్పినట్లు కర్మలను కట్టెలుగ, జ్ఞానమును అగ్నిగ పోల్చి రాత్రికి మంటలు వేసెడివారు. అనుభవమునకు రాబోవు కర్మలను లేకుండ చేయడమునకు చిహ్నామే భోగి మంటలు. దక్షిణాయణము చివరిలో భోగములకు స్వస్తిచెప్పడము, భోగిమంటలు మండించడము, అలాగే ఉత్తరాయణము మొదటిలో యోగమునకు ఆహ్వానము పలుకడము సంతోషకరమైన విషయము. కావున ఆ దినమును సంక్రాంతి ఉత్సవముగ పండుగ చేసుకొనుట పూర్వాచారము. పూర్వము పెద్దలు భావయుక్తముగ చేసిన ఆచారము నేటికిని జరుగుచున్నప్పటికీ భోగి అని ఎందుకు అంటున్నామో, భోగిమంటలు ఎందుకు వేస్తున్నామో, సంక్రాంతి పండుగ ఎందుకు చేస్తున్నామో తెలియదు.

*"జ్ఞానాగ్ని సర్వకర్మాణాం భస్మసాత్"* జ్ఞానమను అగ్నిచేత సర్వకర్మలు భస్మీపటలమగునని గీతయందు భగవంతుడు చెప్పాడు. భోగికున్న

కర్మలను జ్ఞానమునకున్న అగ్నికాల్చుడమునే భోగి మంటలు అంటున్నాము. సంక్రాంతికంటే ముందు దినము అజ్ఞానమునకు చివరిదినము కావలెననీ, సంక్రాంతి మొదటి దినము జ్ఞానమునకు ఆరంభ దినము కావలెననీ, అంతరార్థమును బాహ్యార్థముగ తెల్పుచు పూర్వము భోగి మంటలు వేయగ ఆనాటి ఆచారము ఈనాటికి ఉన్నది. ఆచారముంది అర్థము లేదు. ఈనాటి ఆచారమునకు ఆనాటి అర్థమును జోడించుకొని చేస్తే ఎంతో విలువతో కూడుకొన్న పని అగును. కావున ఈరోజు ఉద్ధేశ్యముతో పనిచేస్తే ఒకనాటికది నెరవేరును. ఉద్ధ్యేశము లేని పని వ్యర్థము, కావున బజారులో భోగిమంటలు మండించితే ప్రయోజనము లేదు. మన తలలో భోగములకు కారణమైన కర్మలను జ్ఞానమంటలతో మండించవలెను. ఇప్పటికైన విలువ అర్థము తెలిసి సంక్రాంతి పండుగ చేస్తాము. శరీరములో జ్ఞానమను అగ్నిని చేకూర్చుకొని కర్మలను కాల్చగలమను అర్థముతో బయట భోగి మంటలను మండిస్తాము.

# దేవుడు - మాయ

రాజకీయములో పక్షము ప్రతిపక్షము ఉన్నట్లు, ఒక నాటకములో విలన్ హీరో ఉన్నట్లు, ఆటలో జట్టు ప్రతిజట్టు ఉన్నట్లు, జగన్నాటకమను ఆటలో కూడ ఇద్దరు అవసరమయ్యారు. జగత్తుకంతటికి పరమాత్మయే పెద్ద అయినప్పటికీ, జగన్నాటకములో తనకు ప్రతిపక్షముగ ప్రకృతి అనుదానిని తయారుచేసి పెట్టాడు. ప్రకృతి పంచభూతములుగ కనిపిస్తున్నప్పటికీ, ప్రకృతినుండియే కనిపించని మాయను దేవుడు తయారు చేసిపెట్టాడు. పంచభూతములైన ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి అను ఐదు భాగములుగనున్న విశ్వమంతటా దేవుడు వ్యాపించి ఉన్నాడు.

అదేవిధముగ ఐదు భాగములందు మాయకూడ వ్యాపించి ఉన్నది. ఒక ఆటలో సమాన ఆటగాళ్లు రెండువైపుల ఉన్నపుడే ఆట రసవత్తరముగ ఉండును. ఇద్దరు సమాన ఆట కనబరచినప్పటికీ చివరకు ఒకరు ఓటమి, ఒకరు గెలుపు చవిచూడక తప్పదు. అలాగే జగన్నాటకములో దేవుడు, మాయ సమానముగ ఆడుచున్నారు. గెలుపు ఓటములు చివరకు తెలియును. గెలుపు, ఓటముల సంగతికి వస్తే చివరకు దేవుడే గెలుచును. అయినా అంతవరకు మనకు అవసరములేదు. మనము చూడవలసినది తెలుసుకోవలసినది ఆట ఏ విధముగా సాగుచున్నది, ఎవరు ఏ విధముగ ఆడుచున్నారు, ఆడబడు బంతి ఎటువైపు పోవుచున్నదని మాత్రమే.

జగన్నాటకమను ఆటలో, ప్రకృతి పరమాత్మలు ఆడుకొను చదరంగములో పావుగ కదపబడువాడు జీవుడు. జగన్నాటకమను చదరంగములో పావులను కదిలించువారు ప్రకృతీ పరమాత్మలే అయినప్పటికీ, పావుగ కదులువాడు జీవుడే అయినప్పటికీ, తనను ఎవరు కదలించుచున్నారను విషయము జీవునికి తెలియదు. ఎందుకనగా దేవుడు అంటే దేవులాడబడేవాడు, వెదకబడేవాడు అని అర్థము. అర్థము ప్రకారమే దేవుడు శరీరము ధరించిన ఎవరికీ తెలియడు. మనము శరీరము ధరించి ఉన్నాముకదా అందువలన మనకు కూడ తెలియడు. ఇక్కడ కొందరికొక ప్రశ్నరావచ్చును. **"పూర్వము ఎందరో దేవుని విశ్వరూపమును చూచినవారున్నారు కదా! దానిని బట్టి చూస్తే మీమాట అసత్యమగును కదా!"** అని అడుగవచ్చును. దానికి మా సమాధాన మేమనగా! మామాట అసత్యము అయితే దేవుడన్న పదము యొక్క అర్థమే అసత్యమగునని చెప్పవచ్చును. ప్రపంచము పుట్టినప్పటినుండి దేవుడు తాను ఇటువంటివాడినని తెలియజేయు నిమిత్తము భగవద్గీతలో

అర్జునునకు తన విశ్వరూపము చూపానని చెప్పాడే తప్ప, మరెచ్చటగాని ఏ సందర్భములోగాని విశ్వరూపము చూపలేదు, ఎవరు చూడలేదు. దేవుడను అర్థము వ్యర్థము కాకుండ, తనకు తానుగ అర్జునునకు దేవుడు చూపినది విశ్వరూపము. ముందునుండి ఎందరో నా విశ్వరూపమును చూడాలని కాంక్ష కల్గియున్నారు, అయినప్పటికీ ఎవరికి తెలియని విశ్వరూపమును నా ఇష్టముతో నీకు చూపుచున్నాను. ఈ కన్నులతో నీవు చూడలేవు కావున ప్రత్యేకమైన జ్ఞాననేత్రములను నీకిచ్చుచున్నానని దేవుడే చెప్పి చూపినది విశ్వరూపము. దేవుడిచ్చిన జ్ఞానదృష్టి ఆ కొద్దిసేపు తప్ప తర్వాతగాని ముందుగాని అర్జునునకు లేదు. ఆ విధముగ ఒక నిరూపణ కొరకు చూపబడినది విశ్వరూపము. అర్జునునికంటే ముందుగాని, అర్జుని తర్వాతగాని ఎవరు విశ్వ రూపమును చూడలేదు. అది కనిపించదు. అదే భారతములోనే కౌరవసభలో విశ్వరూపమును కృష్ణుడే చూపాడు కదా!? అని కొందరడుగవచ్చును. అది కేవలము కట్టుకథ మాత్రమేనని చెప్పవచ్చును. సభలో అందరు మామూలు కళ్లతోనే చూచారని గాంధారిదేవి కూడ కళ్లకున్న గుడ్డను తీసి చూచినదని వ్రాయబడియున్నది. అలా కళ్లకు కనిపించునది విశ్వరూపము కాదు. అలా కనిపిస్తే అది వెదకబడేదే కాదు, అనగా దేవుడే కాదు. దేవుడు అనగా వెదకబడేవాడు అను సూత్రబద్ధముగ, అర్థసహితముగ ఉన్న విధానమని తెలియాలి. ఒక్కమాటలో చెప్పాలంటే ఎవరికి తెలియబడనివాడు దేవుడు. ఉండి తెలియనివాడు దేవుడు. కావున ఏ జీవునికి తనను దేవుడెట్లు నడుపుచున్నాడో తెలియకుండ పోయినది.

ఇక మాయను గురించి తెలుసుకొందాము. మాయ అనునది దేవుని చేత తయారుచేయబడినది. అందువలన "మమ మాయా" అని

దేవుడు గీతయందు చెప్పాడు. జగన్నాటకములో తనకు సమానముగ ఆడునట్లు మాయను దేవుడు సృష్టించుకొన్నాడు. తానే సృష్టించినప్పటికీ, తనకు వ్యతిరేకదిశలో ఆడమని దేవుడే మాయను ఆజ్ఞాపించాడు. అందువలన దేవుని మాటను తప్పక మాయ ఆచరించుచున్నది. ఈ మాట కొంత ఆశ్చర్యముగ ఉన్నప్పటికీ, దేవుని ఎడల భక్తిగ ఉన్నది మాయ అని చెప్పవచ్చును. అందరికంటే మించిన భక్తియేకాక, అందరి కంటే ఎక్కువ మాటతప్పని విధానము కూడ మాయవద్దగలదు. ఆ పద్ధతి ప్రకారమే జగన్నాటకమను ఆటలో దేవుని ఆజ్ఞప్రకారము దేవునికి వ్యతిరేకముగ ఆడుచున్నది. దేవుడు భర్త అయితే భర్త ఎడల వినయముగ ప్రవర్తించు భార్యగ మాయగలదు. అందువలన ఆధ్యాత్మికములో పరమాత్మను ప్రకృతిని "పతిసతుల"ని అన్నారు. పతికంటే సతి కొంత తక్కువదనియే చెప్పవచ్చును. పతి చేతనే సతి తయారుచేయబడినది. పరమాత్మ చేతనే ప్రకృతి తయారుచేయబడినది. పతికంటే సతి తక్కువదే అన్నట్లు తెలుగు భాషలో 'ప' అను అక్షరమునకు 'స' అను అక్షరము కొంత తక్కువగ కనిపిస్తున్నది. 'ప' మొదట క్రింద సున్నతో మొదలవగ 'స' మాత్రము మొదట క్రింద అరసున్నతో మొదలగుచున్నది. దీనిని బట్టి ప్రకృతి పరమాత్మకు లోబడియున్నదని తెలియుచున్నది. దేవుని మార్గములో మాయ ఎంతో ఆటంకపరచినప్పటికీ, దేవుని ఒప్పుదల పొందినవానిని మాయ ఆటంకపరచదనీ, వాడు మోక్షము చెందునని తెలియుచున్నది. అందువలన నన్ను శరణుజొచ్చిన వాడు మాయను దాటి పోగలడని గీతయందు "మా మేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తితే" అని భగవంతుడన్నాడు. అంతేకాక వేమనయోగి తన పద్యములో **"పతియొప్పిన సతియొప్పును"** అని కూడ అన్నాడు. దేవుడే తయారు చేసి పెట్టినది దేవునికి దాదాపు సమముగ ఉన్నది మాయ.

మాయ గుణరూపమై మనిషిని ఆవహించియున్నప్పటికీ కనిపించు ప్రకృతిగా కూడ గలదు. మాయ బయట పంచభూతముల రూపమై, లోపల గుణములరూపమై మనిషిని ఆడించుచున్నది. కొందరు మేము మాయను జయించామంటుంటారు. మాయను జయించుట దుస్సాధ్యమని దేవుడే గీతయందు చెప్పాడు. కావున మాయ ఎంతో బలమైనదని తెలియుచున్నది. మాయ ఎంత బలమైనది? మనకెంత బలము కలదు? దానిని జయించుటకు మనబలము సరిపోవునా? అని ఆలోచిస్తే ఈ విధముగ తెలియుచున్నది. పంచభూతములలో గాలికి ఎంత బలమున్న దని చూస్తే దాని బలమునకు ఏ దానిని సరిపోల్చలేము. గాలి బలమును కొలుచుటకు ఏ మీటర్లు పనికిరావు. ఏ శాస్త్రజ్ఞుల అంచనాకు అందనంత బలము గాలికి కలదు. అడ్డమున్న దేనినైన త్రోసివేయగల శక్తి గాలికున్నది. ఆ విధముగనే నీరు అపరిమితమైన శక్తి కలది. కొద్దిసేపటిలోనే భూమినంతటిని ముంచి జీవరాసులన్నింటిని చంపివేయ గలదు. భూమి మీదున్న ప్రతిదానిని పడత్రోసి చదునుచేయగలదు. అలాగే అగ్ని అన్నిటిని కాల్చి బూడిద చేయగలదు. ఈ విధముగ ప్రకృతి లోని ఐదు భాగములకు ఐదు విపరీతమైన శక్తులు గలవు. ఏ ఒక్క భాగముతో కూడ మానవుని శక్తి సరికాదు. మానవుని శారీరక మానసిక శక్తులకంటే పెద్దశక్తులుగ ప్రకృతి శక్తులు గలవు. ప్రకృతిలోని ఐదు శక్తులను కలిపితే ఎంత శక్తి ఉండునో అంతశక్తి మాయకు కలదని చెప్పవచ్చును. ప్రకృతి నుండి పుట్టినదే మాయ. కావున ప్రకృతి శక్తితో సమానమైన శక్తి మాయకు కలదు. ప్రకృతిలోని పంచభూతముల శక్తులు కనిపించును. కాని మాయశక్తి కనిపించదు. అలాగే ప్రకృతి కంటికి కనిపిస్తున్నది. మాయ కనిపించకుండ ఉన్నది. దేవుడు ఉండి కనిపించనట్లే, మాయకూడ మనుషులలోనే ఉండి కనిపించకున్నది.

ఒక వస్తువు ఎక్కడైన కనిపించకుండ పోయినపుడు మాయమై పోయింది అంటుంటాము. మాయమై పోవడము అంటే కనిపించకుండ పోయినదని అర్థము. దీని ప్రకారము మాయ అనగ కనిపించనిదని అర్థము. పూర్వము మాయ అని పలుకుచున్నప్పటికీ ఆ పదము కాలక్రమమున కొద్దిగ మారి "మాయం" అనుపదముగ కూడ పలుకబడుచున్నది. మాయమై పోయినదనినా, మాయం అయిపోయిన దనినా ఒకే అర్థమని తెలియాలి. ఉండి తెలియబడనివాడు దేవుడు. ఉండి కనిపించనిది మాయ. **దేవున్ని చిక్కడు అంటే మాయను దొరకదు అనాలి.** దేవుడు మాయ రెండు దాదాపు సమానమే అయినవి, కావున ఒకటి చిక్కడు రెండవది దొరకదు.

కనిపించని మాయను జయించితే ఎవరికి తెలియని దేవుడు తెలియబడుతాడు. ఎప్పుడు దేవుడు తెలియబడినాడో అప్పుడు వాడు మోక్షము పొందియుండును. వాస్తవముగ చెప్పితే దాదాపు దేవుడంతటిది మాయ. అందువలన దానిని జయించవలెననిన మానవుని శక్తియుక్తులు చాలవు. అలాంటపుడు ఎలా జయించాలను ప్రశ్నరాగలదు. ఈ ప్రశ్నకు జవాబుగ **'నన్ను శరణుజొచ్చినపుడు మాయను సులభముగ జయించవచ్చునని గీతలో దేవుడన్నాడు'.** దేవున్ని శరణుజొచ్చుటకు ఆయన మీద విశ్వాసముండాలి, ఆయన వివరమూ విధానమూ కొంత తెలియాలి. **దేవుని విధానములు ధర్మములు, దేవుని వివరము జ్ఞానము.** మానవుడు జ్ఞానమును సంపూర్ణముగ తెలిసి ధర్మములను ఆచరించినపుడు అతనికి జ్ఞానశక్తి ఏర్పడుతుంది. జ్ఞానశక్తి కొంతస్థాయివరకు సంపాదించుకొన్న తర్వాత మాయను జయించుటకు వీలగును. ఒక్క జ్ఞానశక్తి ఉన్న వానిని తప్ప, కొంత జ్ఞానమున్నవానిని, జ్ఞానమార్గములో

నున్న వానిని మాయ వదలక వేధించును. మాయ వేధింపులకు సంపూర్ణ జ్ఞానశక్తిలేనివాడు విసుగుచెందును. విసుగు చెందినవాడు జ్ఞాన మార్గమును తప్పిపోవుటకు అవకాశము గలదు.

మనిషిని అసలైన దేవుని మార్గమునుండి వదిలించుటకు మాయ అనేకమైన విధానములను అనుసరించుచున్నది. అందులో కొన్ని ముఖ్యమైనవి దేవుని మార్గములుగానే కనిపించు అనేక విధానములు. విచిత్రమేమంటే దేవుని మార్గములు కాకపోయినప్పటికీ వాటిని దేవుని మార్గములుగ చూపడమే మాయ యొక్క ముఖ్య ఉద్ధేశ్యము. అలా చూపడము వలన దేవుని మీద కొంత విశ్వాసమున్న వారందరూ మాయ మార్గములో చిక్కుకొని ఇదియే అసలైన దైవమార్గమనుకొనుచుందురు. నేడు ఒక్క పరమాత్మ భక్తులుతప్ప **అనేక విధానముల జ్ఞానములలో నున్నవారూ, అనేక దేవతాభక్తులూ, దృశ్యములైన రూపముల మీద, వినికిడి అయిన మంత్రము మీద శ్రద్ధగల్గిన వారందరూ మాయ మార్గములోని వారేనని చెప్పకతప్పదు.** ఇంద్రియములు ప్రకృతితో తయారైన శరీరభాగములు. ఇంద్రియములైన కన్ను, చెవి, యొక్క విషయములైన దృశ్య, వినికిడిల మీద గల జ్ఞానము ప్రకృతి యొక్క మాయా విధానమేనని తెలియాలి. **'ఇంద్రియ గోచరమైనవి మాయ సంబంధమైన విధానములనీ, ఇంద్రియాతీతమైన విధానములు దైవసంబంధ విధానములని తెలియాలి.** నేడు మాయా కలుషితమైన జ్ఞానమే భూమిమీద తొంభైతొమ్మిదిపాల్లు కనిపిస్తున్నది. కావున కనిపించని మాయను గుర్తెరిగి జయించి దొరకని దేవున్ని దొరికించుకోవాలని తెలుపుచున్నాము.

# ఆదిలోని రహస్యము

సృష్ఠి మొదటి కాలములో కృతయుగమునందు మానవులందరూ ఒకే సమాజముగా ఉండేవారు. ఆనాటి మానవులందు ఏ కులము, ఏ మతము లేదు. కుల మత వ్యత్యాసములు లేని మానవులందరు సమానముగ ఉంటూ, తమకంటే అతీతమైన దైవ మొక్కటున్నదని ఆరాధించెడివారు. అందరు బ్రహ్మవిద్యను తెలిసియుండెడివారు. యోగశాస్త్రమును తప్పనిసరిగ అందరూ ఆచరించుచుండిరి. ఇట్లున్న ఒకే సంఘీభావముగల నాటి మానవులలో వివాహములు చేసుకొను నిమిత్తము, ఆనాటి పెద్దలు వావి వరుసల కొరకు ఏర్పరచబడిన ఇంటిపేరు, గోత్రము తప్ప ఏమి లేవు. ఆనాడు ఏర్పరచిన ఇంటిపేరు గోత్రములు ఈనాటికి గలవు. ఆనాడు మేము ఫలానా ఇంటిపేరు గలవారమను భావము తప్ప మాది ఫలానా కులము, ఫలానా మతము అనుట ఏమాత్రము లేదు.

ఇట్లు కొన్ని వందల సంవత్సరములు జరుగగ, జ్ఞానమున్న స్థానములో అజ్ఞానము చోటు చేసుకొన్నది. కొందరు జ్ఞానులుగా మరికొందరు అజ్ఞానులుగా నిలిచిపోయారు. ఈ విధముగా జ్ఞాన, అజ్ఞానమను రెండు తెగలు మొట్టమొదటిగ మనుషులలో ఏర్పడినవి. రెండు భాగములుగ ఏర్పడిన మానవ జాతిలో జ్ఞానులు గొప్పవారుగ, అజ్ఞానులు తగ్గువారుగ పరిగణింప బడుచుండిరి. బ్రహ్మజ్ఞానము తెలిసిన వారందరు బ్రాహ్మణులుగ పేరుకొచ్చిరి. ఇట్లు మొట్టమొదటిగ ఒక కులము పేరు వచ్చినది. ఆనాటి బ్రహ్మజ్ఞానులు అనగ బ్రాహ్మణులు మిగత అజ్ఞాన తెగవారిని గూర్చి మాకు దిగువనుండెడివారనీ, వారికంటే హెచ్చు జాతివారము మేమని పలుకుచుండిరి. ఈ విధముగ మొదటి భాగమైన బ్రాహ్మణులందరు రెండవ భాగమైన అజ్ఞానులను

మాదిగువవారని పల్కుచూ, అజ్ఞానులను వేరు కులముగ పరిగణించిరి. తమకంటే క్రింది జాతి అను ఉద్దేశ్యముతో మాదిగువవారని పల్కెడివారు. కాలక్రమమున **'మాదిగువ'** అను పదము **'మాదిగ'** అనుచు పల్కబడెను. ఈ విధముగ పూర్వము బ్రహ్మజ్ఞానము తెలిసిన వారు బ్రాహ్మణులనీ, వారి మినహా జ్ఞానము తెలియని వారందరు **'మాదిగ'** వారని రెండే రెండు తెగలు ఉండెడివి.

కృతయుగము మొదటి కాలములో అయితే బ్రాహ్మణులు వారికంటే దిగువవారు అను రెండు జాతులు లేవు. అందరూ జ్ఞానులుగానే ఉండెడివారనుకున్నాము. ఆ కాలమును కుల, మతరహిత కాలమనవచ్చును. మతమను ప్రసక్తే లేని ఆ కాలములో, కులము అను మాటలేని ఆ కాలములో, ఒకరికొకరు వివాహములు చేసుకొను నిమిత్తము వావి వరుసలు మాత్రము పెద్దల చేత ఏర్పరచబడియుండెడివి. ఆనాడు ఒకే తెగగయున్న మనుషులలో వివాహముల నిమిత్తము 108 ఇంటి పేర్లూ, 108 గోత్రముల పేర్లలను నియమించి, వాటి ద్వారా 54 ఇంటి పేర్లుగలవారు ఒక రకము తెగయనీ, వారందరు అన్నదమ్ముల వరుస అగుదురనీ తెలిపారు. మరియొక 54 ఇంటి పేర్లు గలవారందరు మరియొక రకమనీ, వారు కూడా అన్నదమ్ముల వరుసకల్గియున్నారని తెలిపారు. ఈ విధముగ రెండు గుంపులుగా ఇంటిపేర్లను బట్టి నియమించి ఒక గుంపువారు రెండవ గుంపుతో, రెండవ గుంపువారు మొదటి గుంపుతో వివాహ సంబంధములు ఏర్పరచుకోవచ్చని తెలిపారు. ఎప్పుడైనా మనిషి ఇంటి పేరును మరిచిపోతే గోత్రము పేరైనా మతికివుండుననీ, గోత్రమును బట్టి ఇంటిపేరు తెలుసుకోవచ్చునీ, ప్రతి ఇంటిపేరుకు ఒక గోత్రము పేరు అతికించియుండెడివారు. అలాగే

గోత్రమును మరిచిపోయినా ఇంటిపేరును బట్టి తెలుసుకోవచ్చునీ, గోత్రముకు ఇంటిపేరు అతికించారనీ అయినా అనుకోవచ్చును. సమాజములో బయటికి చెప్పుకొనే దానికి ఇంటి పేరునూ, పెళ్ళిలో, దేవుని ఆరాధనలో దేవునికి చెప్పుకోడానికి గోత్రమును ఉపయోగించెడి వారు. ఎన్ని యుగములు మారినా ఈనాటికీ ఆ పద్ధతి అలాగే ఉన్నదని చెప్పవచ్చును. దైవపూజలలో గోత్రమునూ, సమాజ వ్యవహారములో ఇంటి పేరునూ ఇప్పటికీ చెప్పుచున్నారు. అయినప్పటికీ మొదట పెట్టిన 108 ఇంటి పేర్లు మాత్రమేకాక, పూర్వము నివసించిన ఊరును వదలి మరియొక ఊరిలోనికి వచ్చి స్థిరపడినపుడు, పలానా ఊరువారని చెప్పుచూ కొంత కాలమునకు ఆ పేరునే ఇంటి పేరుగా చెప్పుకొనుట జరుగుచున్నది. ఉదాహరణకు చల్లా అను ఇంటి పేరు గలవారు మాలపాడు అను ఊరిలో నివాసముంటూ, కొంతకాలమునకు ఆ ఊరు వదలి మరియొక ఊరులో నివాసము ఏర్పరుచున్నారనుకొందాము, అపుడు వారు పలానావారని గుర్తింపుకోసరము మాలపాటి వాల్లమని ఊరు పేరును చెప్పుకొనెడివారు. కొంతకాలమునకు ఇంటిలోని పెద్ద చనిపోగా పిల్లలకు అసలైన ఇంటిపేరు తెలియక పోవుటవలన, మాలపాటి అనేదే ఇంటి పేరనుకొనుట వలన, అప్పటినుండి వారి ఇంటి పేరును మాలపాటి వారనియే చెప్పుచుందురు. ఈ విధముగా ఎన్నో ఇంటి పేర్లను మార్చుకొన్నవారు కలరు. దీనినిబట్టి ఇంటి పేర్ల సంఖ్య 108 మారిపోయినది. ఈ విధముగ నిత్యము వ్యవహారములోనున్న ఇంటిపేరు మరచిపోయినవారు ఎల్లప్పుడూ వ్యవహరములో లేని గోత్రమును మరచిపోకుందురా? దీనిని బట్టి ఇంటి పేరు, గోత్రము పేరు మారినవారు కూడా చాలామంది ఉన్నారని తెలియుచున్నది. వాస్తము చెప్పితే నా ఇంటి పేరు నాకు తెలిసినా గోత్రము పేరు మాత్రము తెలియదు.

అవసరానికి ఏదో ఒకటి చెప్పవలసి వస్తున్నది. నాలాంటివారు ఎందరున్నారో.

కృతయుగములోనే కొంత కాలము గడువగా అందరూ జ్ఞానులైనా, ఆ సమయములో వారినుండి జ్ఞానులు 95 శాతమునకు దిగిపోయారు. 5 శాతము అజ్ఞానులేర్పడినారు. అపుడు జ్ఞానులు, అజ్ఞానులను రెండు వర్గములేర్పడినవి. రెండు వర్గములలో జ్ఞానము తెలిసినవారు జ్ఞానము తెలియనివారికంటే గొప్పయనీ, తెలియని వారికి క్రింద ఆసనములూ, తెలిసినవారికి ఉన్నత ఆసనములూ ఏర్పాటు చేసిరి. అప్పటినుండి ఏ సభలోనైనా అజ్ఞానులు క్రింద కూర్చొనగా జ్ఞానులు పైన కూర్చోనెడివారు. అప్పటినుండి ఉచ్ఛ నీచ అను వర్గ భేదములు ఏర్పడినవి. జ్ఞానులందరినీ పైవారనీ అజ్ఞానులందరినీ దిగువవారని అనెడివారు. ఇప్పటి కాలములో కూడా జ్ఞానము తెలిసిన స్వామిజీకి పై స్థానములో ఆసనము ఏర్పాటు చేసి, జ్ఞానము తెలియని వారందరూ క్రింద కూర్చోవడము జరుగుచున్నది. అలా తెలిసిన గురువులనుగానీ, స్వాములనుగానీ పైన కూర్చోబెట్టి మిగతావారు క్రింద కూర్చోవడము గౌరవప్రదమైన మన సాంప్రదాయమను చుందురు. అలాపైన కూర్చోన్నవారు క్రింద కూర్చొన్నవారిని మా దిగువవారని అనుట ఈ నాటికి గలదు. ఒక ఉపన్యాస వేదిక మీద ఒక స్వామిజీ కూర్చొని ఉన్నపుడు, ఒక వ్యక్తి స్వామిజీ దగ్గరకు పోయి స్వామిజీ మీరు ఈ పూట ఎవరి ఇంటిలో భోంచేస్తారన్నాడు. దానికి స్వామిజీ "ఆ విషయము మా దిగువవారిని అడుగు తెలుస్తుంది" అన్నాడు. ఇట్లు ఎగువవారూ, దిగువవారూ అను మాటలు కృతయుగములోనే ప్రారంభమైనాయి. అప్పటి నుండి మాయ ప్రభావము పెరుగుచూ, దానిప్రకారమే అజ్ఞానుల సంఖ్య కూడ పెరుగుచూ, కృతయుగములోనే

అజ్ఞానుల సంఖ్య 90 శాతము పెరిగి, జ్ఞానుల సంఖ్య కేవలము పది శాతమునకు పడిపోయినది. అప్పుడు బ్రహ్మజ్ఞానులైన బ్రాహ్మణులు “మా సంఖ్య తగ్గిపోయినది, మా దిగువవారి సంఖ్య పెరిగి పోయినది” అని అనెడివారు. ఆనాడు బ్రాహ్మణులు పెట్టిన మా దిగువవారనుమాట నేటికినీ ఒక కులము పేరుతో ఉన్న విషయము అందరికి తెలిసిన విషయమే.

నూటికి 90 మంది గల అజ్ఞానవర్గము మరియొక ఐదు శాతము పెరిగి కృతయుగములోనే 95 శాతమైనది. ఆ సమయములో అజ్ఞాన వర్గమువారు బ్రాహ్మణులు పెట్టిన మా దిగువవారను పేరు నీచమైనదనీ తలచి, ఆ పేరును లేకుండ చేసుకొనుటకు తెలివినుపయోగించి **“చేయు పనులను బట్టి కులము”** అను మాటను బయటకు తెచ్చారు. ప్రత్యేకమైన పనులు చేయువారు వారి పనినిబట్టి ప్రత్యేకమైన కులము నేర్పరుచు కొన్నారు. ఉదాహరణకు గుడ్డలుతుకువారు చాకలియనీ, గుడ్డలునేయు వాడు సాలెవాడనీ, నేసేవాడనీ, గ్రామ పరిపాలకున్ని రెడ్డియనీ, భూమిని కవులుకు చేయువారిని కమ్మయనీ, ఆవులు, గొర్లుకాయువానిని గొల్లవాడనీ, పొలములకు కాపలా ఉన్నవారిని బోయవారనీ, నాటకాలాడువానిని భోగమువాడనీ, సర్కస్ ఆట ఆడువానిని దొమ్మరియనీ, వ్యాపారము చేయువారిని కోమటియనీ, రాజ్యమేలువానిని క్షత్రియుడనీ, మాంసము అమ్మువానిని కటికవాడనీ ఇట్లు ఎన్నో కులములు తయారైనవి. అన్ని కులములు మాదిగువ అను వర్గమునుండి పుట్టినవే. అనగా అన్ని కులములకు పుట్టినిల్లు పూర్వము మాదిగువ అని బ్రాహ్మణుల చేత పేరు పెట్టబడిన వర్గమేనని తెలియాలి. ఆ విధముగా మా దిగువ అనబడు వర్గమునుండి ఎన్నో కులములు చీలిపోగా చివరకు ఏ కులము

క్రిందికి పోకుండ కొందరు ఆవర్గములోనే మిగిలియున్నారు. వారు నేటికిని మాదిగువవారని పిలువబడుచున్నారు. వాస్తవానికి "మా దిగువ" అనునది అన్ని కులములలాగ ఒక కులమా? అని యోచిస్తే అందరికి పుట్టినిల్లయిన దానిని ఒక కులముగా లెక్కించడము తప్పే. అంతేకాక అది నీచ కులమనడము మరీతప్పు. ఇక్కడొక ప్రశ్నరావచ్చును. మీరే చెప్పారుగా దిగువవారనీ, దిగువ అనినా నీచమనినా రెండు ఒకే అర్థము కదా! అటువంటపుడు నీచకులమంటే తప్పేమి? అని అడుగవచ్చును. దానికి మా జవాబు ఏమనగా! పూర్వము బ్రహ్మజ్ఞానులు ఉండేవారు కనుక వారు అజ్ఞానులను దిగువవారని అనెడివారు. నేటికాలములో బ్రహ్మజ్ఞానము తెలిసినవారే లేనపుడు అందరూ దిగువవారేనని గుర్తుంచుకోవలెను. ద్వాపరయుగము చివరికాలమునకే నూటికి నూరు శాతము అజ్ఞానులు తయారైనారు. దానిని గ్రహించిన పరమాత్మ భూమి మీద జ్ఞాన బీజమును నాటుటకు ద్వాపరయుగములోనే కృష్ణునిగ వచ్చి భగవద్గీతను చెప్పిపోయాడు. అది ఇంతవరకు అర్థము కాలేదు. గీతను ప్రమాణ గ్రంథముగా మనుషులు ఒప్పుకోవడములేదు. మాకు వేదాలే ముఖ్యమంటున్నారు. అంతటితో ప్రయోజనములేదనుకొన్న దేవుడు కలియుగములోనే మరియొక మారు పుట్టి గీతలోని సారాంశమునే బోధించాడు. దానిని కూడ ప్రజలు అర్థము చేసుకోలేరని మరియొక మారు నేనే వచ్చి కొన్ని సంవత్సరములు వివరించి చెప్పితేనే అర్థమౌతుందని దేవుడే మరియొకమారు వస్తానన్నాడు. ఆ బోధనా కర్త అయిన దేవుడు ఎపుడు వస్తాడో మనకు తెలియదు. కానీ మనమందరము అజ్ఞానదశలోనే ఉన్నామని తెలియుచున్నది. జ్ఞానము తెలియని మనము నేడు ఏ కులములో ఉండినా కృతయుగములోని బ్రహ్మజ్ఞానులు చెప్పినట్లు దిగువవారమే. నేడు కలియుగములో చూస్తే మాదిగువవర్గము నుండి

ఎందరో ఎన్నో కులములుగా కృతయుగమునుంచి చీలిపోతూ వచ్చి, ఇప్పటికి మచ్చుకు మాదిగువవర్గము మిగిలియుంది. మనము అక్కడినుండి వచ్చినవారమే కాబట్టి మా దిగువవర్గమును ఒక తగ్గు కులముగా వర్ణించకూడదు. నేడు ఎవరు ఏ కులము పేరుతోయుండినా, జ్ఞానము లేనపుడు మనము కూడా దిగువవారమేనని జ్ఞప్తికల్గి, నేటినుండి బ్రహ్మజ్ఞానమునకు ఆధారమైన భగవద్గీతను చదివి తెలుసుకొని ఎగువవారిగా మారుటకు ప్రయత్నిద్దాము. మీకు చెప్పడమే కాదు బ్రహ్మజ్ఞానము పూర్తిగ తెలియనంతవరకు నేను కూడా దిగువవాడినే. నేను కూడ ఎగువవాడిని కావలెనని ప్రయత్నించు చున్నాను. ఇదంతయు ఆదినుండి వచ్చిన తతంగము. ఈ తతంగము ఎవరికి తెలియదు కావున దీనిని ఆదిలోని రహస్యమంటున్నాము.

మొదటనున్న ఒక తెగనుండియే నేడుగల కులములన్నియు వచ్చినవని చెప్పుటకు ఒక పెద్ద ఆధారముగలదు. అది ఏమనగా! మొదటనున్న ఒకే ఇంటిపేరుతో ఎన్నో కులములు నేడు గలవు. ఉదాహరణకు గుత్తా అను ఇంటి పేరు రెడ్డి కులములోనున్నది. అదే గుత్తా అను ఇంటి పేరు కమ్మకులములోనూ ఉన్నది. అట్లే మిగత కొన్ని కులములలో కూడ గలదు. దీనినిబట్టి చూస్తే మొదటనున్న గుత్తా అను ఇంటిపేరుగల ఒక తెగనుండియే అదే పేరుమీదున్న ఎన్నో కులములు పుట్టినవని తెలియుచున్నది. ఈ విధముగా అనేక కులములుగా చీలిపోయిన ఈ మనుషులంతా పూర్వము ఒకే తెగగా యుండిరనీ, ఆనాడు కులములే లేవని తెలియుచున్నది.

# నీ సంసారము

సంసారము అంటే తెలియనివారెవరు ఉండరు. భార్య పిల్లలతో కలిసి జీవించడము సంసారమని అందరూ అనుచుండగా వినియున్నాము. కొందరు సంసారము సముద్రములాంటిదని తెలియునట్లు సంసార సాగరమని అనుచుందురు. సముద్రముకంటే సంసారమే పెద్దదన్నట్లు సముద్రమునైనా ఈదవచ్చును, సంసారమును ఈదలేమని అనుచుందురు. కొందరు ఆధ్యాత్మికమును బోధించు బోధకులు సంసారమును మోక్ష బంధకమనీ, మోక్షసాధనలో సంసారము చాలా ఆటంకమైనదనీ చెప్పుచుందురు. దైవజ్ఞానమును తెలుసుకొని మోక్షమును పొందుటకు గౌతమబుద్ధుడు యుక్తవయస్సున్న భార్యను, ఒక సంవత్సరములోపు వయస్సున్న కొడుకును వదలి అడవికి పోయాడు. ఈ విధముగా ఎందరో ఎన్నో విధముల సంసారమును గురించి చెప్పుచు అదేదో పెద్ద పీడ అయినట్లు వర్ణించారు. ఇంకా కొందరు నేను తెలియనపుడు పెళ్లి చేసుకొన్నాను, ఇపుడైతే చేసుకొనేవాన్ని కాదని చెప్పుచుందురు. ఇందతయు చూచిన తర్వాత సంసారము అంటే ఏమిటనీ, దానిమీద చాలామంది చెడు ఉద్దేశ్యమును ఎందుకు కల్గియున్నారని ఆలోచింపక తప్పదు. కొంత యోచిస్తే హిందూ (ఇందూ) మతమునకు తల మాణిక్యమైనటువంటి భగవద్గీతను బోధించిన శ్రీకృష్ణుడు తన గీతలో ఎక్కడా సంసారము చెడుదని చెప్పలేదు. సంసారము చెడుదని చెప్పక పోవడమేకాక, శ్రీకృష్ణుడే ఎనిమిది మంది భార్యలను పెళ్ళాడి పెద్ద సంసారమును పెట్టుకొన్నాడు. ఎంతో మందికి చెడుగా కనిపించిన సంసారమును గురించి శ్రీకృష్ణుని ఉద్దేశ్యము ఏముంటుందో మనము తెలుసుకోవలసియున్నది. పెళ్లి కానివానిని బ్రహ్మచారి అని కూడ అనుచుందురు. కృష్ణుడు పెళ్లి చేసుకొనినా కూడ బ్రహ్మచారి అని

పేరెట్లుగాంచాడో తెలుసుకోవలసియున్నది. ఇట్లు అన్ని యోచిస్తే ఈ విధముగా మనకు తెలియుచున్నది. అదేమనగా!

**"సారము"** అనగా రుచియనియు, **"సం"** అనగా మంచి అనియు, సంసారము అనగా మంచి రుచిగలదని తెలియుచున్నది. సంసారము అనబడు పదము మంచి సారమును సూచించుచుండగా అందరికి చెడు సారముగా ఎందుకర్థమైనదో? యోచించి చూచితే మనుషులు అర్థహీనులూ, ఆలోచనారహితులూ అయిపోయారు. తమకు నచ్చినవాడు అసత్యమును చెప్పినా దానిని గ్రుడ్డిగ నమ్మడమూ, తమకు నచ్చనివాడు సత్యమును చెప్పినా నమ్మకపోవడము పరిపాటైనది. చెప్పేవానిని బట్టి సత్యమైనా అసత్యమైనా ప్రచారము కాగలదు. జనులకు నచ్చేటట్లు చెప్పితే ఎంతటి అసత్యమైన సులభముగా ప్రచారము కాగలదు. జనులకు నచ్చని విధముగా చెప్పితే అది ఎంత సత్యమైనా ప్రచారము కాదు. ఈ సూత్రమును తెలిసిన కొందరు బోధకులు ప్రజల మెప్పు పొందుటకూ, వారినుంచి లాభమును పొందుటకూ వినేవారికి నచ్చేటట్లు చెప్పుచున్నారు. నిజమును చెప్పితే నిష్టూరమని, తాము నిష్టూరము కాకుండ తియ్యటి మాటలను వినేవారికి చెప్పుచుండుట వలన అసత్యము ఎక్కువ ప్రచారమై పోయినది. ఇక్కడ కొందరికొక ప్రశ్నరావచ్చును. సత్యాసత్యములను ఎలా గుర్తించవచ్చును? సత్యమునకుగానీ, అసత్యమునకుగానీ ఏదైనా గుర్తింపుగానీ, ప్రమాణముగానీ ఉంటుందా? అని అడుగవచ్చును. ఇది ప్రశ్నే కాబట్టి జవాబును చూడవలసిందే.

శాస్త్రమూ, అశాస్త్రము అనునవి వినియేయుందుము. దీనినిబట్టి శాస్త్రసమ్మత విషయములూ, శాస్త్రసమ్మతముగాని విషయములని చెప్పుకొన వచ్చును. శాస్త్రసమ్మత విషయములనగా సత్యములనీ, శాస్త్రసంబంధము

గానీ అశాస్త్రవిషయములనగా అసత్యములని చెప్పవచ్చును. సత్యము శాస్త్రబద్ధమైనది, కావున ఒక సత్యమును ఒక శాసనము మీదనే ఆధారపడి చెప్పవలసియుండును. చెప్పెడు విషయము శాస్త్రబద్ధమైన సత్యమైనపుడు అది వినేవారికి నచ్చవచ్చును నచ్చకపోవచ్చును. నచ్చడము, నచ్చక పోవడము వినేవారి యొక్క విచక్షణా బుద్ధిమీద ఆధారపడియుండును. వినెడివాడు బుద్ధిహీనుడై, యోచనారహితుడై వినినదానిని అవగాహన చేసుకోలేకపోతే సత్యమును చెప్పినవాడు కూడా అసత్యపరుడుగా, అధర్మపరుడుగా కనిపించును. అసత్యమును బోధించువానికి శాస్త్రబద్ధతంటూ ఏమీ ఉండదు. కావున అటువంటివాడు ఎదుటివానికి నచ్చేటట్లు చెప్పవచ్చును. అసత్యబోధకులు శాస్త్రమును అనుసరించ వలసిన పనిలేదు, కావున వారు, వారి ఇష్టమొచ్చినట్లు చెప్పవచ్చును, వినేవారి మెప్పు పొందవచ్చును. ఈ విషయమునే భగవద్గీతా శాస్త్రములో సాంఖ్యయోగమందు 41శ్లోకములలో భగవంతుడు కూడా చెప్పియున్నాడు.

*1) శ్లో ॥ 41 : వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునన్దన !*
*బహుశాఖా హ్యనన్తాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్ ॥*

ఈ శ్లోకములో మొదటనే “వ్యవసాయా” అను పదము వచ్చినది. అలాగే చివరిలో “అవ్యవసాయా” అనుపదము వచ్చినది. వ్యవసాయా అనగా పండునదనీ, జరిగితీరునదనీ, శాస్త్రబద్ధమైనదనీ, సత్యమనీ అర్థము గలదు. అవ్యవసాయా అనగా పండునది కాదనీ, జరగనిదనీ, అశాస్త్రీయమైనదనీ, అసత్యమనీ అర్థముగలదు. దీనిప్రకారము శ్లోకములో ఏమి చెప్పి యున్నదనగా! శాస్త్రబద్ధమైన సత్యమును పలుకువాడు ఒకే విధముగా చెప్పుచుండును. అశాస్త్రీయమైన అసత్యమును మాట్లాడువాడు అనేక విధములుగా చెప్పుచుండును. “వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునందన”

అనగా శాస్త్రబద్ధమైన బుద్ధిగలవాడు ఒకే విధముగా మాట్లాడును అని అర్థమునూ గలదు. "బహుశాఖా హ్యనన్తాశ్చ బుద్ధయోవ్యవసాయినామ్" అనగా అనేక శాఖలుగా, అసంఖ్యాకములుగా మాట్లాడువాని బుద్ధి అశాస్త్రమైనది అని అర్థమునూ గలదు. దీనినిబట్టి శాస్త్రమును వదలి మాట్లాడువాడు ఎన్ని విధముల మాట్లాడినా అవి అసత్యములనియే చెప్పవచ్చును. అందువలన చెప్పబడునది ఏ విషయమైనా శాస్త్రబద్ధమా, కాదా అని చూడవలసిన అవసరమున్నది. ఇపుడు ఇక్కడ కూడ కొందరు ప్రశ్నడుగుటకు అవకాశము గలదు. అదేమనగా! మనము వినుచున్న విషయము శాస్త్రబద్ధమైనదా కాదా అని ఎలా తెలియవచ్చును? అని అడుగవచ్చును. దానికి మా సమాధానము ఏమనగా!

మనము నిత్యమూ వినే సర్వసాధారణ విషయములలో అలా చూడవలసిన పనిలేదు. చూడవలసింది ఏదైన క్రొత్త విషయము మనకు తెలిసినపుడే, అది నిశ్చయమైనదా కాదా అని చూడవలయును. ఉదాహరణకు మనిషి శరీరము గర్భమునుండి పుట్టలేదు, కుండనుండి పుట్టినదని ఎవరైనా చెప్పితే అపుడది క్రొత్త విషయమగును. అది సత్యమా కాదా అని యోచించవలసిన అవసరమున్నది. అలాగే గర్భమునుండి పుట్టు మనిషి శరీరము గర్భములో సజీవముగా లేదు. బయటికి వచ్చిన తర్వాత గాలిని మొదటి శ్వాసగా పీల్చినపుడు మాత్రమే సజీవమగుచున్నదనీ, గాలిని మొదటి శ్వాసగ పీల్చుటకు ప్రసవించిన తర్వాత ఎంత సమయము పట్టితే అంతవరకు అది సజీవముకాదు, ఆ శిశువుకు ప్రాణములేదు అని ఎవరైన చెప్పినపుడు, ఆ విషయము సత్యమా అసత్యమా అని చూచుటకు శాస్త్రమును ఆధారము చేసుకోవలెను. శాస్త్రములంటే ఏమిటి? శాస్త్రములెన్ని అని తెలియనివారు

ప్రస్తుతకాలములో ఎందరో ఉన్నారు. ఉదాహరణకు మేము ఒక స్వామి చెప్పు బోధను వినుచు ఆయన నోటి వెంట శాస్త్రములనేకములున్నాయి అను మాటను విన్నాము. ఒక పెద్దస్వామిజీ టి.వి.లో ఎన్నో లక్షలమంది ప్రేక్షకులుగా చూస్తుండగా ఆ విధముగా చెప్పడము విన్న మేము ఆ మాట సత్యమా కాదా అని వెనుతిరిగి చూడవలసివచ్చినది. అపుడు బ్రహ్మవిద్యాశాస్త్రమైన భగవద్గీత తెరిచి చూడవలసివచ్చినది. అందులో సాంఖ్యయోగమునందు

*1)శ్లో॥42 : యామిమాం పుష్పితాం వాచం ప్రవద న్త్యవిపశ్చితః।*
*వేద వాదరతాః పార్థ ! నాన్య దస్తీతి వాదినః ॥*

*1)శ్లో ॥ 43 : కామాత్మాన స్స్వర్గ పరా జన్మకర్మ ఫల ప్రదామ్ ।*
*క్రియావిశేష బహుళాం భోగైశ్వర్యగతిం ప్రతి ॥*

*(1)శ్లో ॥ 44 : భోగైశ్వర్య ప్రసక్తానాం తయాஉపహృత చేతసామ్ ।*
*వ్యవసాయాత్మికా బుద్ధి స్సమాధౌ న విధీయతే ॥*

ఈ శ్లోకములను పరిశీలిస్తే ఎన్నో తెలియని విషయములు తెలియుచున్నవి. శాస్త్రములు వేదములకంటే విభిన్నమైనవనీ, వేదములు అశాస్త్రీములని తెలియుచున్నవి. వేదవాదరతాః అను 42వ శ్లోకమును చూచి చివరకు 44వ శ్లోకములో **"వ్యవసాయాత్మికా బుద్ధిస్సమాధౌ నవిధీయతే"** అను వాక్యమును చూచితే వేదములు శాస్త్రములు కాదని తెలియుచున్నది. తర్వాత ప్రక్కనేయున్న

*1)శ్లో ॥45: త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవాஉర్జున !।*
*నిర్ద్వంద్వో నిత్య సత్త్వస్థో నిర్యోగ క్షేమ ఆత్మవాన్ ॥*

శ్లోకములో "త్రైగుణ్య విషయా వేదా" అను వాక్యమును చూస్తే వేదములు

మూడు గుణ విషయములతో నిండుకొన్నవని తెలియుచున్నది. అక్కడేయున్న "నిస్త్రైగుణ్యో" అను పదమును చూస్తే గుణములైన వాటిని వదిలివేయి అను విషయము కూడ అర్థము కాగలదు.

ఇవన్నియు విశదముగా వివరించుకొని చూస్తే శాస్త్రములు కొన్ని యుండగా, శాస్త్రములుకానివి కొన్నియున్నవని తెలియుచున్నది. శాస్త్రములుగా ఉన్నవి షట్‌శాస్త్రములనీ, శాస్త్రములు కానివి చతుర్ వేదములనీ తెలియుచున్నవి. భూమి మీద ఆరుశాస్త్రముల మినహా ఉన్నవి ఏవి అయినా అవి అన్నియు వేదముల క్రిందనే జమ అగును. దీనిని బట్టి అష్టాదశ పురాణములు కూడ వేదముల కోవకు చెందినవనియే తెలియనగును. బావిలో నీరు ఎంతవుండినా దాహము నిమిత్తము అవసరమునకు కొంత వాడుకొన్నట్లు వేదములను కూడ వాడుకొమ్మనీ, అంతేకానీ ఎక్కువగా వేదములను చెప్పుకోవద్దని భగవంతుడు చెప్పాడు. భగవంతుడు భగవద్గీతయందు ఏ సందర్భములో కూడ వేదములను సమర్థించలేదు. వేదముల వలన ఆత్మజ్ఞానము తెలియదన్నాడు, వేదముల వలన దైవప్రాప్తి అయిన మోక్షము దొరకదన్నాడు. అందువలన ఆరుశాస్త్రములో గొప్పది, చివరిదైన బ్రహ్మ విద్యాశాస్త్రముగా పేరుగాంచిన **భగవద్గీత** ఆధారముతో సంసారము అంటే ఏమిటో, దానిలో నిజమైన సారము ఏమిటో, సంసారము ఎక్కడున్నదో తెలుసుకొందాము. కొందరు హిందువులు అజ్ఞానవశమున మాయ ప్రభావముతో నిండినవారై హిందువులకు ప్రమాణ గ్రంథములు వేదములని అంటున్నారు. మేము చెప్పునదేమనగా! సృష్టి ఆదిలోనే సూర్యునికి చెప్పబడిన భగవద్గీతయే హిందువులకు ప్రమాణ గ్రంథమని తెలుపుచున్నాము. భగవద్గీతను ద్వాపరయుగములో శ్రీకృష్ణుడు చెప్పాడని దానిని కొందరు చిన్న చూపు

చూస్తూ వేదములే గొప్పవని అనుకొంటున్నారు. ద్వాపరయుగములో చెప్పబడిన గీతయే సృష్టి ఆదిలో దేవుని చేత చెప్పబడినదనీ, దాని వెనుక పుట్టినవే వేదములని తెలియవలెను.

సృష్టి మొదలైనపుడే పరమాత్మనుండి చెప్పబడినది బ్రహ్మావిద్యా శాస్త్రమైన భగవద్గీత. సృష్టి తర్వాత మనుషులచే చెప్పబడినవి వేదములు. విశ్వమును తయారు చేసిన దేవున్ని గురించి చెప్పునది బ్రహ్మవిద్య, ప్రకృతిని గురించి చెప్పునవి వేదములు. విశ్వములో కనిపించెడి ప్రకృతి మరియు కనిపించని పరమాత్మ వ్యాపించియున్నవి. కనిపించెడి ప్రకృతిని కనిపించని దేవుడు తయారు చేశాడు. ప్రకృతి ఎట్లు తయారైనది ఎప్పుడు తయారైనది మనిషికి తెలియదు. అందువలన ప్రకృతి పరమాత్మల యొక్క ఆది మనుషులకు తెలియదని “ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాది ఉభావపి” అని భగవద్గీత క్షేత్రక్షేత్రజ్ఞ యోగములో 20వ శ్లోకములో అన్నారు. అదే శ్లోకములోనే ప్రకృతి నుండియే గుణములు పుట్టినవని తెల్పుచూ “వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతి సంభవాన్” అని కూడ అన్నారు. అక్కడే 22వ శ్లోకములో ప్రకృతినుండి పుట్టినవే గుణములని తెల్పుచూ “ప్రకృతి జాన్ గుణాన్” అన్నారు. అంతేకాక విజ్ఞాన యోగములో 14వ శ్లోకమునందు గుణములతో కూడుకొన్నదే మాయ అని తెల్పుచూ “గుణమయీ మమ మాయా” అన్నారు. సాంఖ్య యోగములో 45వ శ్లోకమునందు వేదములనగా మూడు గుణముల విషయములేనని తెల్పుచూ “త్రైగుణ్య విషయా వేదా” అన్నారు. ఇవన్నియు క్రోడికరించి చూస్తే ప్రకృతినుండి పుట్టినవి గుణములనీ, గుణములే మాయయనీ, మాయకు ప్రతిరూపమైన గుణముల విషయములే వేదములనీ తెలియుచున్నది. మనిషి పుట్టినది మొదలు మాయలోనే చిక్కుకొని

దేవున్ని తెలియలేకున్నాడు. మనిషి మాయా ప్రభావముతోనే దేవున్ని తెలుపు బ్రహ్మవిద్యను వదిలి మాయతో కూడుకొన్న వేదములను ఆశ్రయించాడు. వేదములు చెప్పినట్లు చేయుచున్నాడు. వేదములను ప్రమాణముగా చెప్పుకొనుచున్నాడు. మాయను వదలి దేవున్ని తెలుసు కోవాలనుకొన్న మనిషి ఎవడైనగానీ, మాయకు ప్రతిరూపమైన వేదములను వదలి దైవమునకు ప్రతిరూపమైన బ్రహ్మవిద్యా శాస్త్రముగా పేరుగాంచిన భగవద్గీతను ఆశ్రయించవలసినదే! ఇపుడు మనకు సత్యాసత్యముల సమస్య వచ్చినది కావున సంసారమను దానిని వేదములనుండి కాక భగవద్గీత ఆధారముతో సత్యమును తెలుసుకొందాము.

సంసారమనునది ఒక మనిషికి సంబంధించినదా, లేక ఒక జీవునకు సంబంధిచినదా? అని యోచిస్తే భగవద్గీత ప్రకారము జీవునకు సంబంధించిన విషయమని తెలియుచున్నది. ఆధ్యాత్మికము కేవలము మనుషులకే గాక సర్వజీవరాసులకు వర్తించును. కనుక సంసారమనునది జీవునకు సంబంధించిన విషయమని తెలియవలెను. ఒక మనిషికి బయట సంసారముండవచ్చును, లేకుండవచ్చును. కానీ ప్రతి జీవునికి లోపలి సంసారమున్నది. చాలామంది అనుకొన్నట్లు బయటి భార్యాపిల్లలు సంసారముకాదు. బయటి భార్యాపిల్లలతో కలిసి జీవించడమును కుటుంబముతో కలిసియున్నట్లగును. ప్రతి కుటుంబములోను నిరాశ, నిస్పృహకల్గి సారములేనిదైయుండును కావున కుటుంబము సంసారము కాదు. కుటుంబములో అశాంతియే ఉండును కనుక కుటుంబమును నిస్సారముగా చెప్పవచ్చును గానీ సంసారముగా చెప్పకూడదు. భూమిమీద ప్రతి కుటుంబము సాఫీగా సాగక మానసికముగనో, ఆర్థికముగనో, అనారోగ్యముగనో మరి ఎన్నో సమస్యలవలయములో ఆటంకములతో

నడుస్తుండును. పూర్వము తెలిసిన పెద్దలు భార్యాపిల్లలతో గడుపు జీవితమును కుంటుతూ గెంటుతూ సమస్యలతో సాగునదని, దానిని గూర్చి ఆ విషయము అందరికి తెలియునట్లు "కుంటుంబము" అన్నారు. కుంటు అనగా సరిగా నడువనిదని అర్థము. సరిగా నడవని వానిని కుంటుచున్నాడు అంటాము కదా! అలాగే భార్యాపిల్లలతో గడుపు జీవితము సమస్యలమయము కావున దానిని కుంటుంబము అన్నారు. కాలక్రమమున "కుంటుంబము" అను పదములో "కు" ప్రక్కన సున్న పోయినదై నేడు కుటుంబముగా పేరుగాంచియున్నది. నేడు కూడ కుంటుతూనే నడుస్తున్న కుటుంబమును సంసారమని కొందరు వేదవాదులనినా వాస్తవానికి కుటుంబము సారములేని నిస్సారమేగానీ సంసారముకాదు. కుటుంబము సంసారము కాకపోతే నిజమైన సంసారమేది? అని కొందరడుగవచ్చును. దానికి మా సమాధానమేమనగా!

ఒక జీవుడు ఒక శరీరములో నివాసముంటున్నాడు. శరీరములో జీవుడు ఒక్కడే నివాసముండుటలేదు. జీవునితోపాటు ఆత్మకూడ ఉంటున్నది. చావులోనూ, పుట్టుకలోనూ, చావుపుట్టుకల మధ్యలోగల జీవితములోనూ జీవునికి తోడుగానున్న ఆత్మకూడా జీవునితో పాటు శరీరములోనే నివాసమున్నది. ఆత్మలేని జీవాత్మగానీ, జీవాత్మలేని ఆత్మగాని ఎక్కడా ఉండవు. అందువలన శరీరములో జీవముందీ అంటే అందులో జీవాత్మ, ఆత్మ రెండూ నివాసముంటాయని తెలియవలెను. కనిపించు బయటి గృహములో ఒక భార్య, భర్తనే కాక మిగతావారు కూడ కొందరు నివాసమున్నట్లు, శరీరమను గృహములో జీవాత్మ, ఆత్మనేకాక ప్రకృతితో తయారైన 24 భాగములు కూడా నివసిస్తున్నవి. దీనినిబట్టి చూస్తే శరీరగృహములో మొత్తము 26 మంది నివసిస్తున్నారని అర్థమగుచున్నది.

బయటి కుటుంబములో 26 మంది గల ఇంటిని పెద్ద కుటుంబము అంటారు. బహుశ అంతమంది గల కుటుంబములు బహు అరుదుగా ఉండును. కానీ ప్రతి శరీరగృహములో మాత్రము ఖచ్ఛితముగా 26 మంది ఉంటారు. శరీరగృహములో 26 మందికీ ప్రత్యేకముగా ఒక్కొక్కరికి ఒక్కొక్క పని గలదు. 26 మందిలో ఏ ఒక్కరు తక్కువైనా వానికి సంబంధించిన పని నిలిచిపోవును. జీవున్ని ప్రక్కన పెట్టి చూస్తే మిగత వారు మొత్తము 25 మంది అగుదురు కదా! ఆ 25 మంది సమన్వయముతో పని చేయుచుండగా జీవుడు శరీరములో మనగలుగు చున్నాడు. శరీరములో నివసించు జీవుడు పుట్టుకతో జ్ఞాని అయినా అయి ఉండవచ్చును, అజ్ఞాని అయినా అయి ఉండవచ్చును. అజ్ఞాని అయిన జీవుడు తన శరీరములో తానొక్కడే ఉన్నట్లు తలచుచుండును. తన ప్రక్కన ఎవరున్నదీ, ఎంతమంది ఉన్నదీ, వారు ఏమి చేయుచున్నదీ తెలియని గ్రుడ్డితనముతో ప్రక్కవారిని చూడలేని స్థితిలోయుండి, శరీరములో జరుగు పనులన్నిటిని తానే చేసినట్లూ, తన మినహా ఎవరూ లేనట్లు అనుకొనుచుండును. ఒకవేళ వెనుకటి జన్మలో జ్ఞాని అయినా, లేక ఈ జన్మలో జ్ఞానమును తెలుసుకొన్న వానికైనా తన శరీరమును గూర్చి పూర్తిగ తెలిసి అందులో ఎవరున్నది, ఏమి చేయుచున్నది తెలిసియుండును. ఈ విధముగా శరీరములోపలనున్న సంసారమును గురించి తెలియాలంటే ప్రస్తుతకాలములో అటువంటి జ్ఞానము బహు అరుదుగా దొరుకుచున్నది. అట్లు ఎందుకు చెప్పుచున్నామనగా! చాలామంది జ్ఞానమును చెప్పు స్వామీజీలు సహితము మనస్సును, బుద్ధిని, చిత్తమును, అహమును వేరువేరుగా ఉన్నట్లు చెప్పడము లేదు. మనస్సు ఒకటే ఉన్నదని, సందర్భానుసారము మనుస్సునే బుద్ధి అనియూ, చిత్తము అనియూ

చెప్పుచున్నామనుచున్నారు. దీనితో వారి దృష్టిలో మనస్సు, బుద్ధి, చిత్తము మూడు కలిసి ఒకే మనస్సుగా లెక్కింపబడుచున్నది. అంతఃకరణము లైన మనస్సు, బుద్ధి, చిత్తములు ఏకము చేసినవారు అహమును, శరీరములో భాగముకానటువంటి గుణములలో కలిపివేశారు. అహమును గుణము అంటున్నారు. మనో, బుద్ధి, చిత్త, అహంకారములను నాలుగింటిలో ఒక అహమును గుణలలోనికి నెట్టివేసి లెక్కకులేనట్లు చేశారు. మిగతా మూడు అయిన మనో, బుద్ధి, చిత్తములను ఒకే మనస్సుగా చేశారు. అందువలన నాలుగు అంతఃకరణముల సంఖ్య ఒకటిగా మారిపోయినది. జీవాత్మ, ఆత్మలు రెండైతే అందులో ఆత్మ, జీవాత్మ రెండూ ఒకటేనని, సందర్భానుసారము ఆత్మ అనీ, జీవాత్మ అనీ పిలుస్తున్నామని చెప్పుచున్నారు. అలా చెప్పడమేకాక పుస్తకములలో కూడ అలాగే వ్రాసి పెట్టారు. ఈ విధముగా జీవాత్మ, ఆత్మ రెండిటి సంఖ్యను ఒకటిగా చేయడము వలన శరీరములోని భాగముల సంఖ్య 26 నుండి 22 కు పడిపోయినది.

ఇంకనూ కొందరు వేదాంతులు, శరీరములోని ఆత్మను వదిలి దానిని పూర్తి మరచిపోయి, అది లేనట్లు దానిని తీసివేసుకొని జీవాత్మతోపాటు మొత్తము 25 భాగములుగా చెప్పుచున్నారు. ఆ విధముగా చెప్పినప్పటికీ వాస్తవానికి కనిపించెడి శరీరము పై భాగములు 10 ఉన్నవి. శరీరము లోపల కనిపించనివి 15 భాగములున్నవి. కనిపించెడి 10 శరీర పై భాగములను స్థూలశరీరమనీ, కనిపించని 15 శరీర లోపలి భాగములను సూక్ష్మశరీరమనీ అనడము జరుగుచున్నది. ఇక్కడ చెప్పుకోతగ్గ విచిత్రమేమంటే మన వేదాంతులైన బోధకులు అశాస్త్రీయ పద్ధతిలో కనిపించెడి కొన్ని అవయవములను కనిపించని సూక్ష్మశరీరము

గానూ, కనిపించని కొన్ని భాగములను కనిపించెడి స్థూలశరీరముగానూ చెప్పుచున్నారు. ఈ విషయము పచ్చి అబద్ధముగా కనిపిస్తున్ననూ వేదముల అంత్యములోనున్న ఉపనిషత్ పేరును నిరూపణగా చూపిస్తూ చెప్పడము ఎంతటి అక్రమమార్గమో చూడండి. **"యోగ చూడామణి"** అని పేరుగల ఒక ఉపనిషత్‌లో కనిపించని సూక్ష్మశరీరమును గురించి అది 17 భాగములుగా ఉన్నదని చెప్పుచూ "జ్ఞాన కర్మేంద్రియైః ప్రాణాది పంచవాయు మనో బుద్ధిశ్చ సూక్ష్మలింగ మిత్యుచ్యతే" అని అన్నారు. ఈ శ్లోకమును వివరించి చూచితే జ్ఞాన కర్మేంద్రియైః అనగా జ్ఞానేంద్రియములు ఐదు మరియు కర్మేంద్రియములు ఐదు అని అర్థము. ప్రాణాది పంచవాయు అనగా ప్రాణవాయువు మొదలగు ఐదు వాయువులు అని అర్థము. మనో బుద్ధిశ్చ అనగా మనస్సు, బుద్ధి అనునవని రెండని అర్థము. సూక్ష్మలింగమిత్యుచ్యతే అనగా కనిపించని సూక్ష్మశరీరమని చెప్పుచున్నాము అని అర్థము. దీని పూర్తి వివరము చెప్పుకుంటే ఐదు జ్ఞానేంద్రియములూ, ఐదు కర్మేంద్రియములూ, ఐదు ప్రాణవాయువు మొదలగు వాయువులూ, మనస్సు బుద్ధి రెండు కనిపించని శరీరమని చెప్పుచున్నాము అని గలదు. ఇక్కడ యోచించు ప్రతి ఒక్కనికి ఈ మాట అసత్యమని తెలియుచున్నది. కన్ను, చెవు, ముక్కు, నాలుక, చర్మము అనబడు ఐదు జ్ఞానేంద్రియములు అందరికి కనిపిస్తున్నవి. అలాగే కాళ్ళు, చేతులు, నోరు, గుదము, లింగము అనబడు కర్మేంద్రియములు ఐదు అందరికి కనిపిస్తూనే ఉన్నవి. వీటిని కనిపించని వాటిగా చెప్పడము ఘోరమైన అసత్యము కాదా! మిగతా ప్రాణవాయువులు మొదలగు ఐదు వాయువులూ, మనస్సు బుద్ధి రెండు కలిసి మొత్తము ఏడు కనిపించని భాగములేనని మనము కూడా ఒప్పుకుంటున్నాము.

శ్లోకములోని 17 భాగములనూ కనిపించని సూక్ష్మశరీరముగా లెక్కించితే శరీరములోని 25లో మిగిలిన 8 భాగములు కనిపించు భాగములుగా లెక్కించవలసియుండును. అంతఃకరణములలో మనస్సు బుద్ధి పోగా మిగిలిన చిత్తము, అహము, జీవుడు కంటికి కనిపించు భాగములా? అలాగే చూపు, వినికిడి, స్పర్శ, వాసన, రుచి కంటికి కనిపించు స్థూల భాగములా? ఇంతవరకు ఎవరికీ ఈ ఎనిమిది భాగములు కనిపించలేదు. ఎవరూ చూడని ఎనిమిది భాగములను స్థూలమనడము విచిత్రము కాదా! ఘోరమైన అసత్యము కాదా! సంస్కృతములో ఏమి చెప్పినా సరిపోతుందనీ, వేదములని చెప్పితే ఎవరూ ఎదురు మాట్లాడరనీ, ఉపనిషత్తుల పేరు చెప్పితే ఊరక వింటారనీ అనుకోవడము పొరపాటు. సత్యాన్వేషణ చేయువారికీ, శాస్త్రబద్ధతను చూచువారికి వాస్తవము కనిపించును. వాస్తవము తెలిసిన తర్వాత వేదములనైనా ఖండించక తప్పదు. వేదములను అశాస్త్రములని చెప్పక తప్పదు.

బ్రహ్మవిద్యాశాస్త్రము ప్రకారము వాస్తవ జ్ఞానమును బట్టి చూస్తే శరీరములో ఆత్మతో సహా మొత్తము 26 భాగములున్నవని తెలియుచున్నది. ఆత్మ జీవాత్మ మినహా ప్రకృతి చేత తయారైన 24 భాగములకు ఆత్మ అధిపతిగాయుండి 24 భాగముల చేత పని చేయిస్తున్నది. 24 భాగములు చేసిన పనిలోని సుఖదుఃఖములను మాత్రము జీవుడు అనుభవిస్తున్నాడు. దీనినే ఒక విధముగా చెప్పుకొంటే శరీరమను ఇంటిలో 24 మంది పని చేయుచుండగా, ఆత్మ చేయిస్తూయుండగా, జీవాత్మ ఏమీ చేయక ప్రక్కనయుండి ఫలితమును మాత్రమును అనుభవిస్తున్నది. శరీర గృహములో చేయించేవారు గానీ, చేచేవారు గానీ ఎవరూ ఏ ఫలితమునూ అనుభవించడములేదు. కానీ చేయక చేయించక ప్రక్కనుండి కేవలము

చూచేవాడే సారమును పొందుచున్నాడు. ఎంతో ఔన్నత్యమైన ఆత్మ ప్రకృతిలో తయారైన 24 మంది అవయవములనబడు పనివారిచేత కర్మ అను పనిని చేయించగా జీవుని దగ్గరున్న కర్మ అయిపోవుచున్నది. జీవునికి ఉన్న కర్మ అయిపోవుటయే మంచి ఫలితము. జీవునికి తలమీదున్న కర్మ దిగిపోవడము మంచి సారమగుచున్నది. కావున జీవునికది సంసారమగుచున్నది. తనకున్న కర్మను ఎవరో ప్రక్కవారు చేయగా, ఇంకొకరు చేయించగా, తనకు కర్మ పోవుచూ మంచి ఫలితము దక్కుచున్నది. కావున జీవునకది సంసారమగును. జీవునకది సంసారము కాగా జీవునికి తెలియకనే సంపాదన కూడా కలదు. సంసారములోనే కనిపించక అనిగియుండి వచ్చునది ఏదైతే ఉందో అది సంపాదన అగును. దీనిని బట్టి చూస్తే సంసారమునుండి పుట్టినదే సంపాదన అని తెలియవలెను. ప్రతి మనిషికి సంసారమున్నదని తెలుసు మరియు సంపాదన కూడ ఉన్నదని తెలుసు. కానీ సంసారము సంపాదన రెండు బయట ఉన్నాయని మనిషి అనుకొంటున్నాడు. సంసారమూ, సంపాదన లోపల ఉన్నాయను యదార్థము చాలామందికి తెలియదు.

ఎవడైనా ఆత్మ జ్ఞానమును తెలిసినవాడైతే ఎల్లపుడు సంసారమును పొందియున్ననూ, సంపాదన కల్గియున్ననూ సన్న్యాసమును కూడ కల్గియుండును. శరీరముతోయుండి శరీరములోపల సంసారమును చేయనివాడు, సంపాదనను పొందనివాడు ఎప్పటికీ సన్న్యాసికాలేడు. సంసారమూ సంపాదన ఉన్నపుడే ఎవడైన జ్ఞానమును తెలిసినపుడు సన్న్యాసమును పొందగలడు. ఈ విషయమునే భగవద్గీతయందు ఆత్మ సంయమ యోగము 1వ శ్లోకములో ఇట్లు చెప్పాడు.

ఆనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతియః
సనన్యాసీచ యోగీచ ననిరగ్ని ర్నచాక్రియః

క్రొతగావచ్చు కర్మ ఫలమైనటువంటి సంపాదనమీద ధ్యాసలేకుండా, పాత కర్మప్రకారము పనులు చేయుచున్నవాడు నిజమైన సన్యాసియనియూ, జ్ఞానాగ్ని లేనటువంటి వాడుగానీ, పనులు చేయకుండ మానుకొన్నవాడు గానీ, సన్న్యాసి కాదనియు తెలియుచున్నది. దీనిప్రకారము పాతకర్మ ప్రకారము పనులు చేయడము సంసారమనీ, సంసారములో వచ్చు కర్మను సంపాదన అనీ, సంపాదనలేని వాడు అనగా పనులు చేయనివాడు జ్ఞానము అను అగ్ని లేనివాడు సన్న్యాసిగానీ యోగిగాని కాలేడు అని చెప్పియున్నారు. దీనినిబట్టి ప్రతి మనిషికి శరీరములోనే జీవునికి 25 మంది సభ్యులతో కూడిన సంసారమున్నదని తెలియుచున్నది. శరీరము లోపలే సంసారమున్నదని తెలియనివారు చాలామంది పేరుగాంచిన వ్యక్తులైయుండి బయటి కుటుంబమును సంసారమనుకొని దానిని వదలుట మంచిదనుకొని, బయటి సంసారమును వదలడము సన్న్యాసమనుకొని, అటువంటి సన్న్యాసము కొరకు కుటుంబమును వదలిపోయివారు ఎందరో గలరు. అటువంటి వారిలో గౌతమబుద్ధుడు కూడ గలడు. మొదట గౌతమునికి జ్ఞానము తెలియదు కావున ఇతరులను అనుసరించి తాను కూడ కుటుంబమును వదలిపెట్టితే సన్న్యాసమవుతుందను ఉద్దేశ్యముతో అలా భార్యా పిల్లలను వదిలిపోయాడు. ఈ విధముగా ఎందరో తెలియని తనముతో బయటి కుటుంబమును సంసారమనుకొంటున్నారు. వాస్తవముగ సంసారము శరీరములోపల యున్నదనీ, అడివికి పోయినా అది తమను వదలదనీ తెలియకున్నారు. బయటి ఆటంకములతో కష్టముగా సాగునది కుటుంబమనీ, బయటి

కుటుంబమును ఎవరైనా వదులుకోవచ్చును. కానీ లోపలయున్న సంసారమును ఎవడు వదలలేడని తెలియవలెను. సంసారమున్నపుడే, సంసారమును చేస్తున్నపుడే జ్ఞానమును సంపాదించుకొంటే, సన్న్యాసమును పొందవచ్చునని తెలియవలెను. అట్లుకాక కుటుంబమును సంసారమని భ్రమించి దానిని వదలుకోవడము సంసారముకాదని తెలియవలెను. దీనినిబట్టి భగవద్గీతలో చెప్పినట్లు పనులు చేయుచున్నపుడే సంసారమూ సంపాదన ఉన్నపుడే సన్న్యాసము ఉండునని తెలియుచున్నది. జ్ఞానికైనా అజ్ఞానికైనా లోపల సంసారమున్నది. కానీ జ్ఞాని అయిన వాడు లోపలే సన్న్యాసికాగలడు.



# మా చివరిమాట

ప్రస్తుతకాలములో విజ్ఞానము ఎంతో పెరిగి పోయినది. ప్రపంచము పుట్టినప్పటినుండి 50 సంవత్సరముల క్రిందటవరకు పది శాతము మాత్రమే పెరిగిన విజ్ఞానము ఈ 50 సంవత్సరములలో 90 శాతము పెరిగి పోయినది. విజ్ఞానము పెరిగిపోవుకొద్దీ మనుషులలో దైవజ్ఞానము మీద ధ్యాస లేకుండా పోయినది. విజ్ఞానము లేక సైన్సువలననే అన్నీ కనుగొనగలుచున్నాము, సైన్సు వలననే అన్నీ నెరవేరుచున్నాయి, మధ్యలో దేవుని పాత్రేమిటి వాని అద్రసేమిటి అని కొందరు విజ్ఞానులు ప్రశ్నిస్తున్నారు. దేవుడనే వాడు ప్రజల మూఢ నమ్మకమేగాని వాస్తవము కాదంటున్నారు. ఏమాత్రము సైన్సు తెలియనివారే దేవుడున్నాడని వాదిస్తున్నారు, దానిని మేము ఒప్పుకోము అంటున్నారు. ప్రయోగశాలలో నిరూపింపబడని దానిని మూఢనమ్మకమనీ,

దేవుడు ప్రయోగములకు నిరూపణకు రానివాడు కావున దేవుడను మాట నీటిమూట అంటున్నారు. ఈ విధముగా విజ్ఞానమనబడు సైన్సు పెరిగి పోవుట వలన అజ్ఞానమనబడు నాస్తికవాదము పెరిగి పోయినది. 50 సంవత్సరముల క్రితము లేని క్రొత్తవాదములతో కొన్ని హేతువాద సంఘములు పుట్టుకొచ్చినవి. మా ప్రశ్నకు ఎవరైన జవాబు చెప్పితే మేము కూడ ఆస్తికులుగా మారిపోతామనీ, చెప్పలేకపోతే మీరు కూడా మా హేతువాద సంఘములో చేరిపోవాలని ప్రకటించుచున్నారు. మొదటికే వారి ప్రశ్నలలో హేతువుండదు. హేతువాదమను పేరుతో ఉన్నప్పటికీ వారు నాస్తికకోవకు చెందినవారే, కావున వారి ప్రశ్నలకు జవాబు చెప్పాలని చూచినా, ఎదుటివాడు చెప్పేది అంతా అసత్యమేనని గోడకట్టుకొని కూర్చొన్నట్లు ఎంతటి సత్యమును చెప్పినా ఖండించడమే మావృత్తి అన్నట్లు వినకుండ అన్నిటిని కాదనుచుందురు. మాకు తెలిసినది తప్ప మిగతాది ఏది అయినా అంతా అసత్యమే అను నిర్ణయములో ఉందురు. కావున అటువంటి వారిని హేతువాదులు అనకూడదు. వారిని నాస్తికవాదులనే అనాలి. ఇట్లు హేతువాదమను ముసుగులో నాస్తికవాదము పెరిగిపోయినది. మేము నాస్తికులము కాదు సత్యాన్వేషులమనీ, కనిపించే భౌతికమును ఒప్పుకొంటాము, కనిపించని అభౌతికమును ఒప్పుకోము అని చెప్పెడివారు కొందరు గలరు. దేవుడు కనిపించని అభౌతికము కావున దానిని ఎవరైనా నిరూపించగలరా? అనీ అట్లు నిరూపించగలము అనువారు ఎవరైనా ఉంటే, నిరూపించగలిగితే, మేము కూడ మీవలె ఆస్తికులుగా మారిపోతామనీ, అట్లు మీరు నిరూపించలేకపోతే మీరు మా సంఘములో చేరిపోయి దేవుడు లేడని ప్రచారము చేయాలను నియమమును ఒప్పుకొన్నట్లు వ్రాతరూపములో వ్రాసుకొందామనుచుందురు. అటువంటి వారితో ఎవడైనా మాట్లాడి సమాధానము చెప్పచూస్తే, సైన్సు అనుమాటను

అడ్డము పెట్టి అసత్యవాదన చేయుచు ఏంతటి సత్యమునైనా అసత్యముగా ప్రకటించుచు తామే నిజమైన సత్యవాదులమనుచుందురు. ఈ విధముగా నాగరికత విజ్ఞానము ఎంతగానో పెరిగిన గత 50 సంవత్సరములలో అజ్ఞానము విజ్ఞానరూపములో పెరిగి, అది అనేక సంఘములుగా వ్యాపించి దైవత్వమునకు అడ్రసేలేదంటున్నవి. విజ్ఞాన వేదికలనీ, సత్యాన్వేషులనీ అనేకరకముల పేర్లు ఎన్నియుండినా అవి అన్నియు వివిధ ముసుగులు తగిలించుకొనిన నాస్తికత్వములని తెలియవలెను.

ఇక ఆస్తికుల విషయానికి వస్తే, 50 సంవత్సరముల క్రిందట ఉండిన భక్తిని ఇప్పటి భక్తిని పోల్చుకొని చూస్తే, ఎన్నో రెట్లు భక్తి ఇప్పటికాలములో పెరిగినదని చెప్పవచ్చును. 50 సంవత్సరముల క్రితము లేని క్రొత్త దేవాలయములు ఎన్నో ఇపుడు తయారైనవి. క్రొత్త భక్తీ, క్రొత్త ఆరాధనలూ తయారైనవి. శివమాల, అయ్యప్పమాల అను పేర్లుగల పోటీ భక్తి, పోటీ వేషధారణలు ఎన్నో తయారైనవి. పాత దేవాలయములు పాడుపడిపోయినా ఎందరో క్రొత్త దేవుళ్ళు, ఎన్నో క్రొత్త ఆలయములు తయారైనవి. పూర్వ కాలపు రంగడూ, రాముడే కాకుండ నేడు నవీనముగా సాయిబాబా, అయ్యప్పవంటి అదనపు దేవుళ్ళూ తయారైనారు. ఒక విధముగా చెప్పితే నాస్తికత్వము అనేక రూపములలో పెరిగినట్లే ఆస్తికత్వము కూడ అనేకరూపములుగా ప్రజలలో పెరిగినదనియే చెప్పవచ్చును. ఇక స్వామిజీల విషయానికి వస్తే అనేక రకముల భక్తిని ప్రజలలో వ్యాపింపజేసిన స్వామిజీలు కూడ చాలామంది గలరు. 50 సంవత్సరముల క్రితము కేవలము గురువులను పేర్లు కల్గినవారు మాత్రము కొంతమంది అక్కడక్కడ ఉండేవారు. ప్రస్తుతకాలములో గురువులు, స్వామిజీలు, బాబాలు, భగవాన్‌లు, భవానీలు, అవ్వలు, తాతలు అను

పేరుకల్గిన వారు ప్రజలచే ఆదరణ పొందుచున్నారు. వీరు ఒక్కొక్కరు ఒక్కొక్క దేవున్ని ఆరాధిస్తూ, ప్రజలను ఆరాధింపచేస్తూ ప్రజలను ఆ దేవతా భక్తులుగా మార్చుచున్నారు. ప్రత్యేక వేషధారణతో ప్రత్యేక ఆరాధనలతో ప్రత్యేకమైన స్వామీజీగానో, బాబాగానో, భగవాన్‌గానో పేరు పొందుచున్నారు. ఈ విధముగా బయటి సమాజములో ఎందరో బోధకులు అనేక హోదాలు కల్గియున్నారు. ఇదంతయు 50 సంవత్సముల నుండి కల్గిన స్వామీజీల అభివృద్ధికాగా, మత విషయాలకు వస్తే 50 సంవత్సరముల క్రితములేని మతద్వేషము, మతహింస, మతప్రచారము, మత ప్రలోభములు అన్ని పెరిగి పోయాయనియే చెప్పవచ్చును. పూర్వమున్న మత ప్రచారముకంటే ఈ కాలములోనే మతముల ప్రచారము ఎక్కువై పోయినది. మతములోని దైవత్వమును వదలి కేవలము మా పని మతప్రచారమే అన్నట్లు క్రైస్తవులు బోధిస్తూ మతవ్యాప్తిని చేయాలని చూస్తుండగా, క్షీణించిపోవుచున్న హిందూమతమును రక్షించడమే మా పనియని కొన్ని హిందూసంస్థలు తయారైనవి. ఉద్దేశ్యము మంచిదే అయినా స్వమత రక్షణలో పడిపోయిన హిందూసంస్థలు హిందూమతము లోని జ్ఞానమేది, హిందువుల ధర్మములేవి అను విషయము తెలియని స్థితిలో ఉన్నాయి. **దైవ జ్ఞానమును ఏమాత్రము తెలియని దానివలన భగవద్గీత తమ జాతి గ్రంథమని గుర్తించలేని స్థితిలో ఉన్నాయి.** దైవజ్ఞానమును అర్థము చేసుకొను స్థితిలోలేరు. సృష్టికర్త అను పదమును క్రైస్తవులకు లీజుకిచ్చినట్లు, **సృష్టికర్త అను పదము సనాతనముగానున్నదనీ అది భగవద్గీతలోనున్నదనీ తెలియక అ పదము క్రైస్తవులదే అంటున్నారు.** మేము ఈ మధ్య భగవద్గీతలోని మూడు శ్లోకములకు అర్థము చెప్పితే చెప్పబడినది భగవద్గీతయనీ, చెప్పినవాడు అద్వైత సిద్ధాంతమును తెల్పిన

ఆది శంకరాచార్యునివలె, త్రైతసిద్ధాంతమును తెల్పిన ఒక ఆచార్యుడని యోచించక, మమ్ములను కూడ క్రైస్తవుల క్రిందికి జమకట్టి, మేము చెప్పు ధర్మబోధ పరమత బోధ అన్నారంటే హిందువుల రక్షణ సంస్థలు ఎంత అజ్ఞాన గ్రుడ్డిదశలో ఉన్నవో చెప్పకనే తెలుస్తున్నది. స్వధర్మమేదో పరధర్మమేదో తెలియని స్థితిలో కొందరు హిందువులుండి పోయారు. మతద్వేషము, మతహింస ప్రతిమతములోను అంటువ్యాధిగా వ్యాపించినవి. ప్రతి మతములోను అజ్ఞానము చోటు చేసుకొన్నది. అందువలన మనిషి అయిన ప్రతివాడు దైవత్వమును తెలియలేక పోవుచున్నాడు. అజ్ఞానము ప్రతి మనిషిలోను వ్యాపించిన జాడ్యమైపోయినది. ఇదంతయు గత 50 సంవత్సరములనుండి పెరిగి పోయినది. ఇటువంటి ప్రమాదకరమైన కాలములో, పరమతములకంటే స్వమతమైన హిందూమతములోనివారే మేము చెప్పు జ్ఞానమును అర్థము చేసుకోలేక మమ్ములను శత్రువుగా చూచు ఈ కాలములో, మాకు విసుగువచ్చి బయటికి జ్ఞానమునే చెప్పకూడదను నిరుత్సాహముతో ఉన్నపుడు, 400 సంవత్సరముల క్రితమే ఒక తాటి ఆకుల గ్రంథములో మా ఆశ్రమము పేరు ఉన్నట్లు, మా బోధలు గొప్పవని వ్రాసినట్లు తెలిసినది. ఆ గ్రంథములను స్వయాన చూచినవారు మా అడ్రస్‌కొరకు వెదకి చివరకు మాకు ఆ విషయమును తెలిపారు. నాలుగువందల సంవత్సరముల పూర్వమే మా బోధ గొప్పదని వ్రాసిన వారున్నారంటే ఇప్పుడు మా బోధను గుర్తించలేని వారున్నా లోపమేమీ లేదనుకొన్నాము. ఇప్పటికే ఎన్నో ఆధ్యాత్మిక రహస్యములను తెలియజేసిన మేము ఇంకా కొన్ని రహస్యములను తెలపాలను ఉద్దేశ్యముతో ఇంకా కొన్ని గ్రంథములను వ్రాయాలనుకొన్నాము. ఇప్పటికే మేము పురాణ రహితముగా, శాస్త్రసహితముగా ఎక్కువ గ్రంథములు వ్రాసినవారిగా ఉన్నాము. ఎవరెన్ని ఆధ్యాత్మిక పుస్తకములు వ్రాసినా

అందులో పురాణము తప్పనిసరిగా ఉంటుంది. పురాణము కూరలలోని ఉప్పులాంటిది. అది లేనిది ఏ పుస్తకము రుచించదు. కానీ మా రచనలు పురాణరహితముగా ఉండి చప్పిడిగా రుచిలేనివిగా కనిపించినా, పోషకములు గల బలమైన ఆహారముగా ఎందరో గుర్తించారు. ఇప్పటికే 52 గ్రంథములకు పైగా మేము వ్రాశాము. కొద్ది కాలములోనే ఇంకా కొన్ని గ్రంథములు తయారుకాగలవని అనుకుంటున్నాము. ఇప్పటికే మా గ్రంథములు **సంచలనాత్మక** రచనలుగా పేరుగాంచియున్నవి. తర్వాత కూడ ఇంతవరకు భూమిమీద ఎవరూ చెప్పని, ఎవరూ వ్రాయని, ఎవరికీ తెలియని రహస్యములనే మీకు తెలియజేస్తామనీ, మా ప్రతి గ్రంథము మీకు ఒక క్రొత్తదనాన్ని చేకూర్చగలదనీ తెల్పుచున్నాము. మా రచనలు కుల, మతములకు అతీతముగా దేవుని భావమును తెల్పునవై ఉండవలెనని దేవున్ని కోరుచూ ముగిస్తున్నాను.

ఇట్లు

**అర్ధ శతాధిక గ్రంథకర్త, ఇందూ (హిందూ) ధర్మప్రదాత,**

**సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త**

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**



**అసత్యమును వేయిమంది చెప్పినా అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా అది అసత్యము కాదు.**

